# తెలుగులో గేయనాటికలు



సిద్ధాంత వ్యాసము



డా॥ తిరుమల శ్రీనివాసాచార్య

ప్రచురణ




రిజిస్టర్డ్ నెం. 1/64

యువభారతి
సాహితీ సాంస్కృతిక సంస్థ
5 కింగ్స్‌వే, సికిందరాబాదు-3.

TELUGULO GEYA NATIKALU (OPERAS IN TELUGU)
A Doctoral Thesis by Dr. Tirumala Srinivasa Charya. Head, Department of Telugu. Sardar Patel College, Secunderabad, A.P.



యువభారతి

ప్రచురణ : 122

ప్రథమ ముద్రణ : 1988

ప్రతులు 1,200

ముఖచిత్రాలంకృతి : శీలా వీర్రాజు

ముద్రణ : చార్మినార్ ఆర్ట్ ప్రింటర్స్,
గంజ్ బజార్, సికంద్రాబాద్-500 003

ముఖచిత్ర ముద్రణ : బాలాజీ ఆర్ట్ ప్రింటర్స్,
చిక్కడపల్లి, హైదరాబాద్ - 500 020

ప్రతులకు :

యువభారతి
5, కింగ్స్‌వే, సికిందరాబాదు - 500003 లేదా
యువభారతి కార్యాలయం
ఆంధ్ర సారస్వత పరిషత్ భవనములు
తిలక్ రోడ్డు, హైదరాబాదు - 500001

వెల : రూ. 80-00




# యువభారతి పరిచయం

ఉత్తమ అధ్యయనంవల్ల వ్యక్తిత్వానికి సమగ్రత చేకూరుతుంది. ఉత్తమ భావప్రసరణానికి పుస్తకాలు చక్కనిసాధనాలు. అందరికీ అందుబాటులో ఉండే విధంగా మంచి పుస్తకాలను అందించే ప్రయత్నానికి యువభారతి పూనుకొని కడచిన ఇరువది మూడేండ్లుగా పాతకొత్తల మేలుకలయికను ప్రాతిపదికగా పెట్టుకొని 121 పుస్తకాలను ప్రచురించింది. ఉపన్యాసమంజరీ కార్యక్రమాలను, సదస్సులను నిర్వహించింది.

సహృదయుల సహకారంతో పుస్తకాల అమ్మకంవల్ల వస్తున్న ద్రవ్యంతో పుస్తకాలను ప్రచురిస్తూ తక్కువ వెలకు ఎక్కువ విలువవున్న సాహిత్యాన్ని అందించడానికి యువభారతి ఉద్యమిస్తున్నది. ఉత్తమ సాహిత్య ప్రచారాన్ని ధ్యేయంగా పెట్టుకొని ప్రచురణలను వెలువరిస్తున్నదే కాని మా సంస్థ వ్యాపార సంస్థ కాదు.

భారతదేశంలో ఎక్కడున్నాసరే యువభారతి నిర్వహిస్తున్న సాహిత్యోద్యమంలో పాల పంచుకునేందుకు ప్రారంభింపబడిన సాహితీ మిత్ర పథకంలో 10218 మంది సహృదయులు చేరి ప్రణాళి ను విజయవంతం చేసినారు. యువభారతి భవిష్యన్నిర్మాణంలో సహకరించేందుకు ఆరంభింపబడిన సభ్యత్వపథకాలలో భారతీ మిత్రులుగా 1530 మంది, భారతీ భూషణులుగా 138 మంది చేరినారు.

ఉదుతాభక్తితో మేము చేస్తున్న భాషాసేవకు అండదండలుగా నిలచినారు ప్రజలు. వారి సౌహార్దం, భాషా ప్రియత్వం–ఇవే మా పెట్టుబడి. మా తపస్సు ఫలించి, దేశీయుల్లో అధ్యయనశీలత, సౌజన్యం పెంపొందాలని ఆకాంక్షిస్తున్నాము

సహృదయుల సహకారాన్ని ఆకాంక్షిస్తూ—

అధ్యక్షుడు

**ఇరివెంటి కృష్ణమూర్తి**



# మా మా ట

ప్రపంచంలోని అనేకదేశాలు నాగరకతాగంధం పులుముకొనకముందే తాత్త్విక శాస్త్రీయ సాహిత్య కళారంగాలలో మహోన్నత ప్రమాణాలను అందుకున్నారు పురాభారతీయులు. నేటికాలంలో వికసించిన అనేక శాస్త్రీయాంశాలు నాటి భారతీయులు సూత్రప్రాయంగా చెప్పినవాటికి వ్యాఖ్యాన ప్రాయములని చెప్పడానికి సందేహించవలసిన అవసరం లేదు.

సర్వకళా సమాహారంగా ఆదరాన్ని పొందిన నాట్యకళ పలుపోకడలు పోయింది క్రీస్తుకు పూర్వం ఎన్నో శతాబ్దాల కింద. నృత్య సంగీత ప్రధానాలైన రూపకాలు ఉపరూపకాల పేరుతో అలనాడే ప్రచారంలో ఉండేవని తెలుస్తున్నది. రాజకీయ కారణాలవల్ల జాతివర్చస్సు ఛిన్నాభిన్నమై వికసించిన కళలు వెలవెలబోయి ఉత్తరోత్తరాభివృద్ధికి నోచుకోక మృగ్యములై పోయినవి; లుప్తములై పోయినవి. పాశ్చాత్యభావప్రపంచంతో మనకు సంబంధం కలిగిన తరువాత కొన్ని కళారూపాలు అక్కడినుంచి మనకు సంక్రమించినవి. అందులో గేయనాటిక కూడా ఒకటి. కేవలం పాశ్చాత్యుల ప్రభావంవల్ల ఈ గేయరూపకాలు మన భారతదేశంలో, విశేషించి తెలుగునాట వెలసినవని పలువురి తలపోత. ఈ గేయనాటికల ప్రదర్శనంలో కొంత పాశ్చాత్య స్పర్శ ఉన్నమాట నిజమే. కాని గేయనాటికలలో ప్రతిపాదింపబడిన వస్తువులో కాని, సందేశంలోకాని, సంగీత నృత్యాదులలో కాని పశ్చిమ వాసనలు లేనేలేవు. ఈ గేయనాటికలు మొన్న ఉండి, నిన్న లేక, నేడుమళ్లీ పశ్చిమప్రభావంతో వెల్లివిరిసినవన్న యాథార్థ్యాన్ని డా॥ తిరుమల శ్రీనివాసాచార్యులు తమ సిద్ధాంత గ్రంథంలో నిరూపించడానికి సఫల ప్రయత్నం చేసినారు. శతాధికంగా లభ్యమైన తెలుగు గేయనాటికలను ఉదాహరించి వాటిలోని ఛందో అందాలను, భావాల గభీరతలను, అవి వ్యంజిస్తున్న రమణీయార్థాలను సరళసుందర భాషలో ఇమిడ్చి పఠితృలోకానికి అందించినారు.

ఆధునికాంధ్ర సాహితిలోని ఒక అపురూపమైన ప్రక్రియ స్వరూప స్వభావాలను లాక్షణికులు చెప్పిన పద్ధతిలో విడమర్చి చెప్పి, తమ పరిశోధనా

ఫలితాన్ని పుస్తకంగా మలిచి అందించినారు. సాహిత్యాభిమానులందరు చదువదగిన ఈ సిద్ధాంతవ్యాసాన్ని ఉస్మానియా విశ్వవిద్యాలయానికి పిహెచ్.డి. పట్టాకోసం సమర్పించి కృతార్థులైనారు.

ఈ సిద్ధాంతవ్యాసాన్ని ప్రచురించుకునే అవకాశాన్ని యువభారతికి కల్పించిన డా॥ శ్రీనివాసాచార్యులుగారి ఔదార్యానికి విలువకట్టే సాహసం మాకు లేదు.

సంస్కృత ఆంధ్ర ఆంగ్ల హిందీ భాషా సాహిత్యాలతో చక్కని పరిచయం సంపాదించుకుని, తెలుగులో ఛందోమయ కవితలను వెలయించిన సత్కవులు శ్రీ ఆచార్యులుగారు. ఉర్దూ ఫారసీలలో ప్రచురమైన ప్రక్రియ రుబాయీని చేపట్టి సహస్రాధికంగా రుబాయీలను రచించి తమ ప్రయోగ శీలతను చాటుకున్నారు. ఉత్తమకవిగా యావద్భారతకీర్తి నార్జించిన డా॥ సి. నారాయణరెడ్డి సాహిత్య వ్యక్తిత్వాలను సవిమర్శకంగా వ్యాఖ్యానించి 'నారాయణరెడ్డి సాహితీమూర్తి' అన్న గ్రంథంగా మలచి, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ఉత్తమ సాహిత్య విమర్శకు ఇచ్చే బహుమతిని అందుకున్నారు.

శ్రీ ఆచార్యులుగారు స్ఫూర్తిమంతంగా సభా వేదికలపై ప్రసంగించ గలిగిన వక్తలు. గద్యాన్నీ పద్యాన్నీ ఇష్టం వచ్చినట్లుగా సృష్టించగల రచయితలు అనేక సాహిత్యాంశాలను గూర్చి ఆయన వ్రాసిన వ్యాసాలు అనేకం. ఆకాశవాణిలో ప్రసారం చేసిన ప్రసంగాలు అనేకం. పాండిత్యం సౌజన్యం సమతూకంగా ఏర్పడిన వ్యక్తిత్వం ఆయనది. కడచిన పదేళ్లుగా మా యువభారతికి ఉపాధ్యక్షులుగా వ్యవహరిస్తూ మా సంస్థ పురోగతికి పలు తీరులుగా తోడ్పడుతున్న సహృదయులు.

ఈ పుస్తకాన్ని ప్రచురించడానికి మేము ఉద్యుక్తులమైనాము. ఆచార్యుల వ్యక్తిత్వమే ఈ ప్రచురణ చేపట్టడానికి మమ్మల్ని పురికొల్పింది.

ఈ పుస్తకాన్ని ప్రచురించుకునే అవకాశాన్ని మాకు కల్పించిన డా॥ తిరుమల శ్రీనివాసాచార్యులవారికి మా ధన్యవాదపరంపరలు.

హైదరాబాదు,
25, డిసెంబరు 1987.

అధ్యక్షులు
**ఇరివెంటి కృష్ణమూర్తి**

**ఆచార్య సి. నారాయణరెడ్డి**
ఉపాధ్యక్షులు
ఆంధ్రప్రదేశ్ సార్వత్రిక విశ్వవిద్యాలయం
హైదరాబాదు

# అభినందన

ఈ గ్రంథం నా పర్యవేక్షణలో డాక్టరేట్ పట్టంకోసం రూపొందిన సిద్ధాంత వ్యాసం. అందువల్ల అధికంగా రాస్తే ఆత్మస్తుతి అవుతుంది తక్కువగా రాస్తే సత్యావిష్కరణం మొక్కవోతుంది. అందుకే ఆచితూచి ఈ నాలుగు మాటలు రాస్తున్నాను.

పరిశోధకునికి కావలసిన విషయ సమీకరణం, నిశిత విశ్లేషణం, నిష్పాక్షిక ఆవిష్కరణం డా॥ తిరుమల శ్రీనివాసాచార్యలో సమృద్ధిగా ఉన్నాయి. గేయనాటిక. గేయరూపంలో వున్న రూపకవిశేషం అందువల్ల శ్రీనివాసాచార్యగారు గేయలక్షణాలను, రూపకవిశేషాలను వివరంగా చర్చించారు. వివిధ రూపాల్లో వెలువడిన గేయనాటికల గురించి సమీక్షించారు. గేయనాటికల వైవిధ్యాన్ని స్వరూప స్వభావాలను, ఛందోభాషా విశేషాలను పరమపఠనీయంగా ప్రదర్శించారు. గేయనాటికల భవితవ్యాన్ని గురించి సంగ్రహంగానైనా సమీక్షించడం బాగుంది. ఆధునికాంధ్రకవిత్వంలో వెలువడిన సమస్త గేయనాటికలకు పట్టిన నిలువెత్తు అద్దం ఈ గ్రంథం. సాధారణ పాఠకుణ్ణి కూడా చవులూరేటట్లు చదివించే గుణమున్న ఈ పరిశోధన గ్రంథం రచించిన డా॥ తిరుమల శ్రీనివాసాచార్యకు నా అభినందన.

హైదరాబాదు,
14-8-1987.

**Prof. K. Veerabhadra Rao**
Professor of Telugu
Centre of Regional Studies
MEMBER: Official Language Commission
Government of Andhra Pradesh

## AN APPRECIATION

The Ph. D thesis of Dr. T. Srinivasa Chary on "Tel ugulo Geyanatikalu" (Operas in Telugu) is an important contribution to the scanty literature on the subject. Dr. Srinivasa Chary has put scholars and students of Telugu studies under a deep debt of gratitude by fulfilling a long felt want in writing this book as not much is available by way of critical assessment.

It is heartening to note that Dr. Srinivasa Chary approached the subject in a scientific manner and executed it systematically befitting a scholarly work of this kind. The language is both clear and precise To serve as a background to a study of the growth and development of Opera in Telugu, Dr. Chary has given a historical survey of the subject beginning from early Sanskrit works and extending it to a study of the same genre in other important Modern Indian and foreign languages. His elaborate discussion on the different dramatic forms in Sanskrit is both lucid and instructive. He has also given a brief survey of the fore-runners of Modern Telugu Opera, from classical and Medieval Telugu Literature. Treatment of thse two has served as an excellent back-drop to the gradual unfolding of the main topic in the rest of the work.

While writing on the subject, Operas in Telugu, the author has divided the available source material basing his division on their content into puranic, Historical, Social, Cultural and Imitative writings. By giving copius examples for each, he has substantiated his statements. He has also written with depth and understanding on the prosodial and linguistic pecularities of these Operas. He has even written a chapter by way of conclusion on the future of this literary

form. Thus this book is a complete study of the Opera in Telugu.

In the Appendices of this book, he has given his discussions with late Sri Siva Sankara Swamy, one of the greatest Opera Writers in Modern Telugu and also names of all the Operas and their writers. These Appendices also help in bringing about a completeness to the entire work.

I very much like to see the book in print as this would enable more and more people to go through it and understand the subject in the proper perspective. I wish him every success in his endeavour to get the book printed.

Sd.

July 20, 1983 K. Veerabhadra Rao

శ్రీ దేవులపల్లి రామానుజరావు
అధ్యక్షులు,
ఆంధ్రసారస్వత పరిషత్తు,
హైదరాబాదు.

# శుభాకాంక్షలు

డా॥ తిరుమల శ్రీనివాసాచార్యులు నాకు చిరకాల మిత్రులు. వారి అభివృద్ధిని కాంక్షించేవారిలో నేనొకడిని. యువభారతి కార్యక్రమాలలోను ఇతర సాహిత్య కార్యక్రమాలలోను వారు నాకు సన్నిహితులైనారు. వారు మంచి రచయితలు. చక్కని వక్తలు. వైదుష్యంతో పాటు కార్యదక్షతకల సజ్జనులు వారు. తెలుగు విమర్శకు ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి ఇచ్చిన బహుమతి వారి యోగ్యతకు ప్రామాణికతను చేకూర్చినది.

డా॥ శ్రీనివాసాచార్యులు సుమారు పదిసంవత్సరాల క్రింద ఉస్మానియా విశ్వవిద్యాలయం నుండి డాక్టరేటు పొందినారు. తెలుగులో గేయనాటిక లను గూర్చి విశేషపరిశోధనచేసి వారు ప్రామాణికమైన సిద్ధాంతవ్యాసము వ్రాసినారు. సంగీత సాహిత్యములు రెండింటిలోను వారికి లోతైన పాండిత్య మున్నందువలన ఈ గ్రంథానికి ప్రత్యేక ప్రాధాన్యము కలుగుతున్నది. ఆధుని కులలో శ్రీ శివశంకర స్వామి, శ్రీ నోరినరసింహశాస్త్రి, శ్రీ విశ్వనాథ, శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావు, శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి, డా॥ దాశరథి, డా॥ సి. నారాయణరెడ్డి మొదలగు వారి మేటి గేయనాటికలను వీరు ప్రతిభా వంతముగ సమీక్షించినారు.

ఈనాటి సిద్ధాంతవ్యాసములలో శ్రీ శ్రీనివాసాచార్యుల ప్రస్తుత సిద్ధాంతవ్యాసము విశిష్టమైనదని నిస్సందేహముగా చెప్పవచ్చును. శ్రీ శ్రీనివాసాచార్యుల వారికి నా శుభాకాంక్షలు.

**ఆచార్య ఎం. కులశేఖరరావు**
ఆంధ్రశాఖాధ్యక్షులు,
ఉస్మానియా విశ్వవిద్యాలయం.

# ఆకాంక్ష

డాక్టరు శ్రీనివాసాచార్యులు రచించిన 'తెలుగులో గేయనాటికలు' అనే సిద్ధాంత గ్రంథం ఆసక్తితో చదివినాను మంచి గ్రంథం చదివిన సంతృప్తి కలిగించి. వారికి నా అభినందినలు.

డా॥ శ్రీనివాసాచార్యులు ప్రధానంగా తెలుగు గేయనాటికలను గురించి పంశోధించి వ్రాసినప్పటికీ మన సాహిత్యానికి మౌలిక సామగ్రిని సమకూర్చిన సంస్కృత భాషలో ఉండే నాటక సాహిత్యాన్ని గురించి, దాని స్వరూప స్వభావాల గురించి చక్కగా చర్చచేసినారు. ఈ చర్చ ఈ గ్రంథానికి నేపథ్యంగా ఉండి చాల ఉపయోగకరంగా ఉన్నది.

తెలుగు గేయనాటిక ఆంగ్ల సాహిత్యచ్ఛాయల్లో నడిచిందని విజ్ఞులు భావిస్తారు. 'ఆపెరా' అనబడే ఈ ప్రక్రియ కొంతవరకు ఆధునికాంధ్ర గేయ నాటికా కర్తలను ప్రభావితం చేసినమాట యథార్థమే. అందుచేతనే కాబోలు ఈ సిద్ధాంత గ్రంథకర్త 'పాశ్చాత్య భాషలలో గేయనాటికలు' అనే శీర్షికలో కొన్ని విశేషాలను ఉల్లేఖించినారు.

పాశ్చాత్య ప్రభావం లేనపుడు తెలుగు గేయనాటికాసదృశమైన ప్రక్రియ లేదని చెప్పడం న్యాయం కాదు. ఎందుచేతనంటే జాతి అనేది ఉన్నప్పుడు, దానికి సంస్కృతి, సభ్యత ఏర్పడినపుడు దృశ్యకళలు లేకపోవడం అస్వాభావికం కాబట్టి. ఈ దృష్టితో చూస్తే చాలాకాలంగా తెలుగుదేశంలో ప్రచారంలో ఉన్న బుర్రకథలు, యక్షగానాలు, హరికథలు దృశ్య కావ్య సదృశము లేనని చెప్పవలసి ఉంటుంది. వీటి ప్రశంస మన ప్రాచీన కావ్యాల్లోనూ కనిపిస్తుంది. మన సంస్కృతిలో ఒక భాగంగా ఉండిపోయింది కూడ. డా॥ ఆచార్యులవారు ఈ ప్రక్రియల తీరుతెన్నుల గురించి కూడ వివరించినారు.

ఇక ఆధునికయుగంలో వెలువడ్డ తెలుగు గేయనాటికల తీరుతెన్నుల విశేషాలు ఈ సిద్ధాంత గ్రంథంలో విపులంగానే ఉన్నాయి. ఈ నాటికలు ఎన్ని విధాలుగా రూపొందినాయో వివరింపబడింది. ఈ నాటికల్లో ఉండే సామాజిక ప్రయోజనాన్ని చర్చించి ప్రదర్శించడంలో డా॥ శ్రీనివాసాచార్యగారు కృతకృత్యులైనారు. లోకంలో అధ్యయన అధ్యాపనాదుల చేత ప్రఖ్యాతమైన గేయనాటికలే గాక ఈ పరిశోధకుడు అజ్ఞాతంగా ఉండి మారుమూల పడివుండిన నాటికలను కూడ వివరించినారు. ఈ వివరణ చాల ఉపయోగకరంగా ఉన్నది

శ్రీ శివశంకర స్వామిగారు తెలుగు గేయనాటికా సాహిత్యానికి ఎనలేని సేవ చేసినారు. వారు అనేకానేకనాటికలను రచించడమే కాక వాటి ప్రచారానికి ప్రయోగానికి చాల కృషిచేసినారు. శ్రీ శ్రీనివాసాచార్యులు వారిని దర్శించడమే కాక వారితో ఇంటర్వ్యూ చేసి, అమూల్య విషయాలను సేకరించినారు. ఈ ఆచార్యస్వాముల గోష్ఠి ఈ సిద్ధాంత గ్రంథానికి అలంకార ప్రాయంగా ఉన్నది

ఉన్నతదశకు చెందిన పరిశ్రమ, చక్కని విశ్లేషణ, నూతన విషయ ప్రదర్శన కలిగిన ఈ గ్రంథం ఉత్తమ ప్రమాణంలో వెలువడింది. డా॥ శ్రీనివాసాచార్యుల వారు చేసిన ఈ కృషికి తగిన ప్రచారము. పరిగణన కలుగవలెనని ఆకాంక్షిస్తున్నాను.

హైదరాబాదు,
17-11-87.

ఆచార్య వేటూరి ఆనందమూర్తి
తెలుగుశాఖ
ఉస్మానియా విశ్వవిద్యాలయం,
హైదరాబాదు.

# పరితోషం

ఆధునిక వాఙ్మయ ప్రక్రియలలో నవ్యములుగా భావింపబడే వాటిలో అనేకములకు మూలద్రవ్యం భారతీయవాఙ్మయంలోనూ ఇతరత్రానూ వెదికితే కానరాకపోదు. అది వ్యాసమో, కథానికో, గేయనాటికో - ఏదైనా సరే. ఉదాహరణకు వ్యాసప్రక్రియ నవ్యమే అనుకొన్నా వ్యాస నామమూ వ్యాసబీజాలూ ప్రాచీన భారతీయ వాఙ్మయంలో కానరాకపోలేదు. అందుకే **"The word Essay is new but the thing is ancient"** అనీ, **"The germs of essay are found in the upanishads..."** అనీ ప్రాచ్య పాశ్చాత్య సాహిత్యజ్ఞులనడం కద్దు. మన వాఙ్మయంలో వ్యాసం అంటే విరివి అనే అర్థాన్నిచ్చే లక్షణాన్ని చెప్పి వ్యాస నామంతో వ్యాసోదాహరణాన్ని వామనుడు పేర్కొన్నా అందులో మనం నేటి వ్యాస సామాన్య లక్షణాల నభ్యూహించవచ్చునే గానీ అదే యీనాటి పానుగంటి వారి సాక్షి వ్యాసంగా సహజ పరిణామమంది స్ఫూర్తి నిచ్చిందని గానీ ఈ నవ్య వ్యాసంలో పాశ్చాత్య ప్రభావం లేదనిగానీ అనలేము. అలాగే కథానికా ప్రక్రియ కూడాను పేరు పాతదే అయినా రూపం మాత్రం సరికొత్తదని విమర్శకులు భావిస్తారు. అలాగే కథాసారస్వతానికి ప్రాచీన భరతవర్షం జన్మస్థానమైనా, "గద్యకావ్యంచ పంచధా" అని ఆఖ్యాయికా కథాని కాదుల్ని అగ్నిపురాణం పేర్కొన్నా విమర్శకు లలా భావించడానికి కారణం మనం గుర్తించవచ్చు. ఆ ప్రక్రియలకు పేర్లున్నా వాటి లక్షణాలలోని సందిగ్ధత; ఒకవేళ లక్షణం అవగాహన కందినా లక్ష్యాలు కానరామి; పరిణామగతిలో భావింపదగిన ఇతరేతర ప్రభావాలు; కారణంగా 'పూర్వకథానికా సహజ పరిణామరూపమే నేటి కథానిక ఎట్లా అవుతుంది?' అని అడుగుతారు పరిశోధక విమర్శకులు. గురజాడవారి 'దిద్దుబాటు' కథకు సమకాలిక సమాజ

వాఙ్మయం ఇచ్చినంత స్ఫూర్తి ప్రాచీనుల కథానికాలక్షణ మివ్వలేదంటే తప్పులేదు. లక్ష్యాలు నశించిన ఆ లక్షణాలలో కనపడేది దాని 'నీడలే' గాని అసలు వస్తువు కాదన్న విమర్శను మనం అర్థం చేసుకోవచ్చు. గేయనాటికల విషయమూ అంతే.

లోకంలో అన్నింటివలెనే వాఙ్మయ ప్రక్రియలూ పరిణామ శీలంగలవే కాబట్టి మూలద్రవ్య మనదగిన ప్రాచీన వస్తువే కాలాంతరంలో అనేకానేక ప్రభావాలకు లోగి రూపాంతరాలను పొందుతూ, కొత్తకొత్త పేర్లను కూర్చు కొంటూ కొత్తపాతల మేలికలయిక లనదగినట్లుగా ఎదుగుతూ వుంటాయనడం తగును అర్వాచీన గేయనాటిక కూడా ఇలాగే ఎన్నో ప్రభావాల పరిణామాల ఫలితంగా రూపుదిద్దుకొన్నట్టిది. ఇందులో సంగీతం, నాట్యధర్మం రెండూ వుండడంచేత దీనికి మూలం దేశి ప్రక్రియకు చెందిన యక్షగానమన్నా. కురవంజి మేళమన్నా. హరికథలన్నా, బుఱ్ఱకథలన్నా, కోహలాదులు నాట్యశాస్త్రాని కుత్తరతంత్రంగా 'క్రోడీ' రించిన ఉపరూపక జాతులే అన్నా; భరతముని పేర్కొన్నవీ అంతకంటే పూర్వం నుండి ఉన్నట్లుగా భావింపబడేవీ అయిన మార్గ ప్రక్రియకు చెందిన దశరూపకాలే అన్నా ఆ అభిప్రాయాలన్నీ కూడా ఒక దృష్టితో పాక్షిక సత్యాలే కాగలవు ఏలంటే అవి అన్నీ ఎప్పటికప్పుడు స్వతంత్ర కళా రూపాలుగా ఆవిష్కరింపబడుతూ సహజంగానో పరప్రభావ ఫలితంగానో పరిణామ మందినట్టివే. కనుక ఈ దృష్టితో ప్రాచీన ఉపరూపకాలు యక్షగానాల 'కాదర్శప్రాయము' లనీ, నృత్యాభినయ ప్రధానాలైన యక్ష గానాలకూ నేటి సంగీత రూపకాలకూ ఉన్న 'సాదృశ్యం' చేత జన్యజనకభావం కాకపోయినా 'కొద్దియో గొప్పయో ప్రభావం' గుర్తించలేక పోలేమని భావించి, వీటికవి పూర్వతరరూపాలేమోనని ఈ సిద్ధాంత గ్రంథ రచయిత ఊహ సేయడంలో అసందర్భమేమీ ఉండక పోవచ్చు. ఇంతకూ అవి మార్గ మైనా దేసి అయినా ఆ కళారూపాలన్నీ సంగీతం, నృత్యం, సంభాషణం, రూపారోపం, కలిగినవే కాబట్టి అవకాశము, సాదృశ్యము ఉన్నచోట జన్య జనక భావాన్నీ; భేదించినచోట పరప్రభావాన్నీ పరిణామ ధర్మాన్నీ సంభా వించుకోవడంలో దొసగేమీ ఉండదు.

కనుక మన గేయనాటికల మూలద్రవ్యాలను వాటి పరిణామ వికాసా లను అన్వేషించే నెపాన, ఇంకా తుణ్ణంగా పరిశీలింపదగిన ప్రాచీన ఉపరూప

కాలను గూర్చి పునర్విచారం సాగించడం ఆ ప్రాతిపదిక మీద పరిశోధింపదగిన తెలుగు గేయనాటికలను సమగ్రంగా సమీక్షించడం ఎంతో ఉచితంగా ఉంది. ఇది డాక్టరేట్ పట్టానికర్హమైన సిద్ధాంత గ్రంథం. ఇందులో పరిశోధన విషయ వివేచనం ప్రణాళికాబద్ధంగా సాగింది. రచయిత సుకుమార ప్రవృత్తిగల కవి కుమారుడు కావడంవలన కుసుమపేశలమయిన రచనాశైలి దీనికి వన్నె తెచ్చింది. మొత్తం పధ్నాలుగు ప్రకరణాలలో, ఆవశ్యకములైన అనుబంధాలతో గ్రంథవిషయం సువిధిపూర్వకంగా ప్రదర్శింపబడినది. తొలిమూడు ప్రకరణాలలో గ్రంథ విషయాని కనుగుణంగా నాటికా స్వరూపము. గేయ సాహితి, సంగీత శాస్త్రము ప్రస్తావనా ప్రాయంగా సమీక్షింపబడినవి

మరి మూడు ప్రకరణాలలో రూపకములలోని సంగీత నృత్యములను గూర్చి, ఉపరూపకములను గూర్చి, దేశి దృశ్య కళారూపములను గూర్చి విస్తరించడం జరిగింది. ఇందులో ఈ విషయమై ఆలంకారికులు చెప్పిన ఆయా శాస్త్ర విషయాలను మూలానువాదాలతో క్రోడీకరించి ప్రదర్శించారు రచయిత. ఈ సందర్భంలో ఉద్ధరింపబడిన గ్రంథభాగాలు సుదీర్ఘములే అనిపించినా శాస్త్ర విషయాలు కావడంవలన పండితులు సాధికారంగా అనువదించిన ఆయా అంశాల నల్లే ఉదాహరించడంలో ఔచిత్యం ఉంది. ఈ అర్వాచీన ప్రక్రియా పరిశీలనలో తులనాత్మక పరిశీలన మవసరమన్న దృష్టితో ఏడో ప్రకరణంలో వివిధ భాషల్లో గేయనాటికల వికాసాన్ని గూర్చిన సంగ్రహ సమీక్షలు కూడా జతచేయబడినవి. తులనాత్మక లక్ష్య సమన్వయ మిందులో అంతగా లేకపోయినా ఈ సమీక్ష ఆసక్తికరంగానే సాగింది ఇక తరువాతి నాలుగు ప్రకరణాల్లో సిద్ధాంత గ్రంథానికి ప్రాణభూతమైన అంశం విస్తరింపబడింది. గేయనాటికల అవతరణము అన్న ప్రకరణ మీ సిద్ధాంత గ్రంథాని కవతరణికా ప్రాయము. ఇందులో రచయిత ప్రకటించిన అభిప్రాయాలివి. 1. పాశ్చాత్య సాహిత్య ప్రభావముచేతనే గేయనాటికలు ప్రభవిల్లిన వను అభిప్రాయము స్థూలముగా ప్రచలితమైనదే. (పుట 85) 2. రూపకాలలో గేయాలు లేకనే ఉపరూపకాలలో గేయనృత్య ప్రాధాన్యం పెరిగింది (పుట 87). 3. శివశంకరస్వామివారి గేయనాటికలలో 'పలిత కేశము' (1930) రచనా కాలమునుబట్టి 'వరపరీక్ష' (1936) కన్నా ముందుది (పుట 97). ఈ ప్రకరణం లోని మూలశక్తి "ప్రాచీన దృశ్య రూపకముల చరితను వెలికితీసి, తగిన ఉపపత్తులను సంపాదించి తెలుపవలసిన అగత్య మెంతేని యున్నది. ఈ పట్టున

పరిశోధనము జరుగవలసి యున్నది...ఇప్పుడు లభ్యమగుచున్న సామగ్రితో కష్టసాధ్యమగునేమో కాని ఉత్తరోత్తరము అసంభవము మాత్రము కాదని నా నమ్మకము" (పుట 96) అన్న భావమే. ఈ భావాన్ని సంభావిస్తూనే పాశ్చాత్య ప్రభావాన్ని భావించే దృష్టి భేదంలోని పాక్షిక సత్యాన్ని అవకాశముంది కాబట్టి పరిణామక్రమంతోనే సమన్వయించుకోవలసి ఉంది ఎందుకంటే రంగ ప్రదర్శన విధు (Stage Presentations) లైన తాండవం, లాస్యం, దశరూపకాలు అనే మూడింటి గురించీ ఉపరూపకాల గురించీ; సంగీతానికీ, రూపకాలకూ సంబంధించిన లాస్యాంగాలను గురించీ; ఆక్షిప్తికా ధ్రువాగానాలను గురించీ అలంకార గ్రంథాలలో అనేకవిషయాలు కనపడుతున్నా అవి అన్నీ-అసందిగ్ధమైన లక్ష్యలక్షణ సమన్వయ పరిజ్ఞానాన్ని కలిగించేవిగా ఉన్నవని నేటికి లభించిన సామగ్రినిబట్టి చెప్ప సాధ్యం కావడం లేదన్నది పెద్దలు చెప్పిన మాటే వీటి విషయమై ఆలంకారికుల మధ్యనే ఎన్నో సందిగ్ధతలు తడబాటులు కనిపిస్తున్నట్లున్నవి ఇలాంటి విషయాలలో మౌలిక కృషి సల్పిన మానవల్లివారి వేటూరి వారి రచనలను, డా॥ రాఘవన్ గారి కృషిని కూడా తక్కిన రచనలతో పాటు పరిశీలించడం అవసరం భోజుని శృంగార ప్రకాశం మీది తమ సిద్ధాంతం గ్రంథంలోని "Bhoja and Natya sastra" అనే (pp 533-607) బృహత్ప్రకరణంలో డా॥ రాఘవన్ గారు ఎన్నో విషయాలను పరిశోధించి సమన్వయించి వ్రాశారు. వారి ఈ వచన పంక్తులు పరికింపదగినవి

The uparupaka chapter of the sanskrit Natyasastra treatises is very important for students of the history and development of Indian dance and minor representations belonging to the vast indegenous Indian theatre. The uparupakas are, as distinguished by Bhoja and Dhananjaya, emotional fragmenss, compared to the Rupakas which present a major theme with the unity of a single Rasa running through and fed by other subsidary Rasas. Although ancient Indian drama or sanskrit drama as envisaged by Bharata is of the nature of a dance drama with music and dance movements it is the uparupaka class of performances that is so par excellence; for in them music and dance predominate; most of them are merely dances accompanied by songs, intrepreting through Abhinaya or gesture the emotional contents of the song. Many are like the Bhana among Dasarupakas, done by one person, Eka Patraharya; in fact, the verse cited in the

Dasarupakavaloka (1. 8) makes all the seven varieties, Dombi etc. 'ekaharya.' Whatever definitions early works like that of Kohala might have given to each of the forms in this class, we do not have now; and except fof stray references and discussions in the Abhinavabharati as at the end of Chapter IV the Sr Pra. of Bhoja is the earliest treatise availtble to us now which fully deseribes them ......' (P. 546). "Saradatanaya's Bhavaprakasa is no doubt interesting for the student of the Natyasastra but its use is cnsiderably diminished by the method of Saradatanaya's writing which is most confused. The author calls matter from four main sources, Dhananjaya, Abhinavagupta, Bhoja, and a fourth unknown writer...." (569).

'Saradatanaya calls the Natika. Totaka, and Sattaka both as Rupaka and uparupaka......" (570)

'Saaradatanaya says that he himself saw actually all the thirty types, that is ten rupakas, and twenty uparupakas played by the Natyacharya named Divakara in a Saraswati temple during a festival (P. 2). But the chapters on Rupakas and uparupakas, 8th and 9th, do not justify this claim. These chapters show the author's indebtedness to certain earlier texts from which widely differing descriptions are simply pulled out and heaped together in a haphazard manner......." (570).

"many writers have mistaken the text of Bharata and have considered the lasyangas as the characterising features of Bhana. Besides old writers, modern scholars have also mistaken... (578).

"Of these subjects, Bhoja must have spoken at length in his treatise on sangeetha which has not yet come to light. All subjects connected with dance proper, Abhinaya, Dhruvagana and other kinds of music in drama, uparupakas etc. the lost work of Bhoja on music must have dealt with elaborately. Its discovery will help the study of Natya and Sangita to a great extent......" (606).

కనుక ఈ విషయంలో పరిశోధన మింకా జరుగవలసిన పట్టున, లక్షణాల లోనే నిలిచిన అట్టి ఉపరూపకాలు నేటి రేడియో, టి వీ. రూపాలకు సరాసరి స్ఫూర్తినిచ్చిన సహజ పరిణామాలని నిర్ణయించలేము. అనేక ఇతర ప్రభావా

లతో పాటు ఉపరూపకాల పరోక్ష ప్రభావం కూడా నేటి గేయనాటికల మీద ఉన్నదంటే కాదనలేము. అందుకే సిద్ధాంతగ్రంథరచయిత పుట 68 తుది పేరాలో జాగరూకత వహించి వ్రాశారు.

ప్రాచీనములు, మనోరంజన ప్రధానములు అయిన భగవదజ్జుకము, మత్తవిలాసము అనే ప్రహసనాల్ని అనువదిస్తూ పితృపాదులు వేటూరి ప్రభాకరశాస్త్రిగారు వ్యావహారికవచనంతో కూడిన పద్యగేయ మిశ్ర రచన చేశారనడానికి మచ్చునకు వారి గేయాలివి ఉదాహరిస్తున్నాను. భగవదజ్జుకం (1913) లో చేటి పరభృతిక, గణిక అజ్జుక కలసి పాడిన గేయం.

"పరభృత మధుకర రుతశింజితములు
మెరయు చూత శరముల్ – మునిజన
విరాగ పరిహారముల్ – విడుచుచు
పరాక్రమము చెలగన్ – మదనుడు
బలే! యిందు మెలగున్"

మరొకటి –

వసంత సమయ ప్రాభవదర్పం
బెసగ విషమశరుడు – అశోక
ప్రసవబాణధరుడు – ముని మా
నసములైన బెదరన్ – జేయన్
గసిక్కుమన నేయున్

ఆరంభంలో మరో పద్యకం –

తల్లి తండ్రీ లేరు తమ్ములన్నల్లేరు
దైవానుగ్రహముత్తదే వొంట్రిగాణ్ణి
పొట్టకూటికోస మిట్లావస్తిని గాని
ధర్మలోభము నాకింతైనా లేదండి

మత్తవిలాస ప్రహసనం (1935) లో ఉన్మత్తకుడి పాట –

శూలాలు పట్టుకోని
చాలా వేషాల్ వేసికోని

వేలకొద్ది పిశాచాలు
వెళ్తూ ఉంటై నా పొట్టన్
పెద్దపుల్లూ వందలకొద్దీ
దద్దరిల్తూ ఉంటై నాలో
గద్దరితాచుల్ చిట్టుల్ బుట్టుల్
కావిస్తుంటై నా నోట్లో

ఈ సిద్ధాంత గ్రంథంలో అవతరణికాప్రాయమైన ప్రకరణం తర్వాత గేయ నాటికా వైవిధ్యాన్ని పరిశీలించే విస్తృత ప్రకరణం ప్రధానమైనది. ఛందస్సుని బట్టి గేయనాటికలు, పద్యగేయ నాటికలు, పద్య గేయ వచన మిశ్ర నాటికలు అనే విభాగాల క్రిందను; వస్తువునుబట్టి పౌరాణికములు, చరిత్రాత్మకములు, సాంఘికములు, సాంస్కృతికములు, అను సరణాత్మకములు, ప్రకృతి సంబంధ ములు, ప్రబోధాత్మకములు అనే విభాగాల క్రిందను తమ దృష్టికి వచ్చిన గేయనాటికల్ని మూడునందలకుపైగానే రేడియోలో ప్రసారమైనవాటినీ, రంగంమీద ప్రదర్శింపబడినవాటినీ, అచ్చయినవాటినీ కానివాటినీ రచయిత సమీక్షించారిందులో వీటిల్లో చేరనివి కూడా మరికొన్ని ఉండవచ్చు. రచయిత లివ్వకనో, తమ దృష్టికి రాకనో, ఆ రచనాకాలం తర్వాత వచ్చిన కారణం చేతనో అవి యిందులో చేరి యుండకపోవచ్చును.

ఉదాహరణకు వేటూరి ప్రభాకరశాస్త్రిగారి "గౌరీ కల్యాణము" (1948 రేడియోలో ప్రసారితము); నావే-సంక్రాంతి, రసాలము, పారిజాతాప హారణము రేడియో గేయనాటికలు ఇందులో చేరలేదు. పరిధి పెద్దది కావడం వల్లనూ విస్తరభీతిచేతనూ ఎంత కుదించి వ్రాసినా ఈ ప్రకరణం పుష్టిగానే రూపొందింది. రమ్యమైన వీరి యీ పరిశ్రమను వర్ణించడం కన్నా చదివి ఆనందించడమే తగును. ఈ ప్రకరణాన్ని కనుబంధంగా బాలలనాటికలను సినిమా గేయనాటికలు కొన్నిటని చేర్చడం సమగ్రతకు దోహదం చేస్తున్నది. తర్వాతి రెండు ప్రకరణాల్లో గేయనాటికల స్వరూప స్వభావాలను ప్రయోగ విషయాన్ని పరిశీలిస్తూ రచయిత వాటిని 'మెలోడ్రామా' లనడం కన్నా 'ఆపెరా' లనుట సమంజసమని భావించారు. పాత్యేగేయేచ మధురంగా సాగిన గేయనాటికలు డా॥ పి. ఎస్. ఆర్. అప్పారావుగారు ఆంగ్ల ఆకరాలు ఆధారంగా పేర్కొన్నట్లు, పుట్టుకలో మెలో (Melosgk song Drama Fr)

డ్రామాకే సన్నిహిత మనదగు ననుకొందును. A F. Scott ఆపేరాను వివరిస్తూ "Musical plays and the like are not covered by the term" అని పేర్కొనడం గమనార్హం. గేయనాటికల్లోని కావ్యత్వాన్ని సంగ్రహంగా సమీక్షించిన ప్రకరణం వన్నెందోది. Ezra pound అన్నట్లు —"Poetry beyond its meaning may be energised in three ways -1) Melopocia - emphasias the musical qualities, 2) Phanopocia - the Visual images; 3) Logo pocia - the dance of the intellect among words - the play upon the mind upon all aspects of Verbal manifestations". ఈ మూడింటితోనూ ఉత్తేజితమైన కవితయే సాహిత్య పరమావధి అనదగిన రూపక ప్రక్రియలో ప్రవ్యక్తమైనప్పుడు పుడుతుంది గేయనాటిక. కనుక గేయనాటికల్లో కావ్యత్వసిద్ధికి కొదువ ఉండదు. గేయనాటికల్లోని ఛందోభాషా విశేషాలను గూర్చి, వాటి కవితత్వాన్ని గూర్చి ఇందులో వ్రాసిన చివరి ప్రకరణాలు విశ్లేషణాత్మకంగా ఆసక్తిదాయకంగా ఉన్నవి.

మార్గదేశి ప్రక్రియా సమన్వయ రూపాలనదగిన మన గేయనాటికలు పురుషార్థోపదేశకాలైన మన నాటకాల కోవకు చెందకపోయినా రంజనా ప్రధానమైన ఉపరూపకాలను పోలినవై మనోరంజనంతో పాటు సమకాలిక ప్రపంచంలో సామాజిక ప్రయోజనాన్ని సాధించడంలో కృతకృత్యత చెందినవనవచ్చు.

ఈ సిద్ధాంత గ్రంథ రచయిత డా॥ శ్రీనివాసాచార్య గారికి, పర్యవేక్షకులైన గేయకవితావిశారదులు ఆచార్య సి. నారాయణరెడ్డిగారికి హార్దాభినందనలు. ఈ గ్రంథాన్ని సంపూర్ణంగా చదివి నా పరితోషాన్ని తెల్పే అవకాశమిచ్చినందుకు డా॥ శ్రీనివాసాచార్యకు, సహృదయ మిత్రులు డా॥ ఇరివెంటి కృష్ణమూర్తి గారికి ధన్యవాదములు.

**ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యం**
ఆంధ్ర శాఖాధ్యక్షులు,
హైదరాబాదు విశ్వవిద్యాలయం

# ప్రక్రియ కెత్తిన పతాక

తెలుగులో వెలువడిన పరిశోధనలను స్థూలంగా మూడు విధాలుగా వివేచించవచ్చు ఒకటి – సాహితీ యుగాలను సమీక్షించేవి; రెండు – సాహితీ ప్రక్రియలను సమాలోచించేవి; మూడు – సాహిత్యానికి సంబంధించిన సమస్యలను పరిశీలించేవి.

'తెలుగులో గేయనాటికలు' ఒక శక్తిమంతమైన సాహితీ ప్రక్రియను గురించి, దాని పుట్టుపూర్వోత్తరాలను గురించి, ప్రయోగ విశేషాలను గురించి, కావ్య కళా మర్మాలను గురించి ప్రామాణికంగా వివేచనాత్మకంగా సాగించిన పరిశోధన. తెలుగులో నాటకవికాసం మీద ఏకాంకికలమీద ప్రహసనాలమీద సిద్ధాంత వ్యాసాలు ఇదివరకే వచ్చాయి. గేయ కావ్యాలను గురించి కూడా సిద్ధాంత వ్యాసం వచ్చింది.

తెలుగులో పద్య గేయనాటికలను గురించి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారు బహుమతికొరకు గ్రంథ రచనలను ఆహ్వానించారు. శ్రీమతి మంగళగిరి ప్రమీలాదేవి గారి గ్రంథం ఆ బహుమతికొరకై వ్రాసింది. డా॥ శ్రీనివాసాచార్యగారు రచించిన ఈ సిద్ధాంత వ్యాసం ఆ పుస్తకం తరువాత వెలువడినా, తన ప్రత్యేక ప్రతిపత్తినీ అవసరాన్నీ నిలుపుకుంటున్నది. నాటికలలో ఛందో వైవిధ్యాన్నిబట్టి పద్యగేయవచన మిశ్ర రూపకాలని విభజించవచ్చు. అందులో శుద్ధ గేయనాటికలు, మిశ్ర నాటికలు ఈ పరిశోధన పరిధిలోకి వచ్చాయి. ఈ గ్రంథం చదివిన తర్వాత గేయనాటికలను గురించి కూడా ఒక ప్రత్యేక పరిశోధన చేయగలిగినంత సామగ్రి ఉన్నది అని చూపిన శ్రీనివాసాచార్యగారి సామర్థ్యం స్పష్ట మవుతుంది. ఒక ప్రక్రియలోని ఒక శాఖ ఎంత విస్తృతినీ ఎంత వైశిష్ట్యాన్నీ సాధించిందో నిరూపించే నికషోపలం లాంటి గ్రంథం ఈ సిద్ధాంత వ్యాసం.

డా॥ తిరుమల శ్రీనివాసాచార్య కవిగా ఇప్పటికే ఎంతో గుర్తింపును పొందారు. ఈ సిద్ధాంతవ్యాసం వారిని ఉత్తమపరిశోధకునిగా కూడా సాహితీలోకం గుర్తించే అవకాశాన్ని కలిగిస్తున్నది. డా॥ శ్రీనివాసాచార్య గారు నాకు సన్నిహిత మిత్రులు. మా యువభారతికి శ్వాసకోశం. ఈ సాన్నిహిత్యం ఈ సమీక్షలో ప్రతిఫలిస్తున్నది అని అనుకోకుండా ఉంటే నేను చెపుతున్న నిజాన్ని గ్రహించవచ్చు. ఆచార్యులుగారితో మాటాడుతున్నప్పుడు కాని కలిసి సాహితీవ్యాసంగాలు నిర్వహిస్తున్నప్పుడు కాని నాకు ఆయనలో మూడు గుణాలు ముచ్చటగా కనపడుతుంటాయి. ఒకటి - ఏదైనా ఒక అంశాన్ని గురించి ఆలోచించేటప్పుడు దాని వాస్తవ స్థితిని గురించి కూలంకషంగా తెలుసుకునే ఆసక్తి, ఆసక్తిని ఆచరణలో పెట్టేశక్తి ఆయనలో కొట్టవచ్చినట్టుగా కనపడుతుంది. రెండు - ఆయన వాస్తవ పరిజ్ఞానానికి ఎంత ప్రాముఖ్యాన్ని ఇస్తారో దాన్ని కాల్పనికచైతన్యంతో కళామయం చేసి సూక్తి సుందరంగా ఆవిష్కరించటానికీ అంతగా ప్రయత్నం చేస్తారు. వాస్తవిక కాల్పనిక చైతన్యాలు చెట్టపట్టాలు పట్టుకొని చెంగలిస్తున్నట్లుగా ఉంటాయి శ్రీనివాసాచార్యగారి సాహితీవ్యాసంగాలు. ఈ రెండూ ఉంటే కవిగా మాత్రమే రాణించేవారేమో, ఈ రెండింటికి మూలశక్తి మూడోది ఉంది. అది - తత్త్వదృష్టి. దర్శనమూలమైన సాహిత్యానికి మూలం తత్త్వమని గాఢంగా విశ్వసించేవారు శ్రీనివాసాచార్యగారు. ఒక ప్రక్రియ యొక్క నిర్వచనానికీ విశ్లేషణానికీ పనికివచ్చేది వాస్తవిక ప్రవృత్తి ప్రయోగంలోని కవితాశక్తిని ఆవిష్కరింపగలిగేది కాల్పనిక ప్రవృత్తి. ప్రక్రియాజన్మ వికాసాలకూ ప్రయోగ వైవిధ్యాలకూ ఒక సమన్వయ సూత్రాన్ని అందించేది తాత్త్విక ప్రవృత్తి. ఈ మూడింటిని ముప్పేటగా సాధించిన డా॥ శ్రీనివాసాచార్యగారి సాహితీ వ్యక్తిత్వం ఈ పరిశోధనవ్యాసాన్ని సమగ్రసుందరంగా రూపొందించటానికి తోడ్పడింది. ఈ సిద్ధాంత వ్యాస రచనా ప్రణాళికను స్థూలంగా పరిశీలించిన ఏ సహృదయునికైనా ఈ సత్యం ప్రత్యక్షం కాక మానదు.

ఈ సిద్ధాంతవ్యాసాన్ని మరెవరైనా వ్రాసి ఉన్నట్లైతే ఆ రచన విశ్లేషణ ప్రధానమే అయినట్లైతే ఎనిమిదవ అధ్యాయంనుండి మొదలుపెట్టి

తొమ్మిది పది పన్నెండు పదమూడు అధ్యాయాలతో ముగించేవారు కాని శ్రీనివాసాచార్యగారు పట్టి విశ్లేషణ విమర్శకులు కారు. విశ్లేషణాత్మకమైన పరిశోధన తాత్త్వికానుశీలనం వైపు సాగకపోతే జీవచైతన్యం లేని శరీరంలా భాసిస్తుంది.

డా॥ శ్రీనివాసాచార్య గారు మొదటి ఏడు అధ్యాయాల్లో సాగించిన పరిశోధన గమనిస్తే నాటిక గేయరూపక స్వభావాన్ని ధరించటంలో గల తత్త్వం ద్యోతమాన మవుతుంది. పదకవితలాగా గేయరూపక స్వభావం కూడా విశిష్టమైనది. అందులోని సంగీతపు విలువలు సాహిత్యపు విలువలను పరిపోషిస్తూ ఉండే స్వభావం కనపడుతుంది. సంగీత సాహిత్యాలకు అభినయానికీ ప్రయోగానికీ మధ్య ఏర్పడ్డ తాత్త్వికానుబంధాన్ని వివేచించకపోతే గేయ నాటికా తత్త్వం అర్థంకాదు. అందులోనూ దేశీ రూపక మర్యాదలను తులనాత్మకఅధ్యయనం ద్వారా వివేచించటం వలన గేయనాటికా తత్త్వం సుస్థాపిత మవుతుంది. తులనాత్మక పరిశీలనం ఆధునిక పరిశోధన ప్రక్రియల్లో బలమైనదిగా ఆధునికమైనదిగా భావింపబడుతున్నది ప్రక్రియ పుట్టుపూర్వోత్తరాలు ఆ ప్రక్రియ పుట్టిన సాహిత్య చరిత్రను మాత్రమే పరిశీలిస్తే దొరకవు. ప్రక్రియా పరిణామంలో వివిధ దేశీయ ప్రక్రియల స్వభావాలు ప్రయోగంలో సంపదించి రచయితలు ఎలా ప్రయోగిస్తారో పరిశీలించటం ఒక భాగమైతే, ఇతర భాషా సాహిత్య ప్రక్రియల నుండి ప్రయోక్తలు ఎలా నూత్న లక్షణాలను సంపదిస్తారో పరిశోధించటం మరొక భాగమవుతుంది. ఈ సిద్ధాంత వ్యాసంలో ఆరు ఏడు అధ్యాయాలు ఈ రెండు విధాల పరిశీలనను సమగ్రం చేస్తున్నాయి.

'తెలుగు గేయనాటిక – అవతరణము' చారిత్రకానుశీలన దృక్పథానికీ 'గేయనాటికా వైవిధ్యము' విశ్లేషణ వివేచనానికీ, గేయనాటికల స్వరూప స్వభావములు' ప్రక్రియా పర్యాలోచనానికీ, 'గేయనాటికా ప్రయోగము' దృశ్య కావ్య లక్షణాల ధ్రువీకరణకూ, 'గేయనాటికలలో కావ్యత్వము' నాటికలలోని అంతశ్శక్తుల అభివ్యక్తీకరణ నిరూపణకూ, 'ఛందోభాషా విశేషములు' ఛందస్సు రసభావ వ్యంజకత్వానికి తోడ్పడే విధానాన్ని వ్యాఖ్యా

నించడానికి ఉదాహరణాలుగా చెప్పుకోవచ్చు మొత్తంగా చూస్తే పరిశోధనలో పరిశోధకుడు ప్రదర్శించవలసిన ప్రజ్ఞా విశేషాలకన్నింటికి ఈ ప్రణాళిక ప్రాతినిధ్యం వహిస్తుందనీ, ప్రాతిపాద్య వస్తువును ప్రపంచించిన పద్ధతి పరిశోధనలోని ప్రామాణికతను భజిస్తుందని నిస్సంశయంగా చెప్పవచ్చు.

కవి పరిశోధన చేస్తే శైలిలో స్పష్టతకు బదులు సౌందర్యం జాలువార వచ్చునని ఒక అపప్రథ లోకంలో ఉంది. ఈ సిద్ధాంత వ్యాసంలోని విశేషమేమంటే డా॥ శ్రీనివాసాచార్యగారు గ్రంథరచనలో కవితా ధోరణిని మచ్చుకైన ప్రకటించలేదు. అది వారి సంయమన శీలానికీ, పరిశోధన ప్రవృత్తికీ దృష్టాంతం.

శ్రీనివాసాచార్యగారు భావించినట్లు భవిష్యత్తులో గేయం ఒక విశిష్ట పాత్రను నిర్వహించవలసిన అవసరమున్నది. ఇప్పుడది ప్రచారసాధనంగా వాడబడుతున్నా సాహితీస్పృహతో ప్రసరించవలసిన అవసరం ఉంది. గేయ కవిత ముందడుగువేస్తే గేయనాటిక దాన్ని అనుసరిస్తుంది. భవిష్యత్తులో మరికొన్ని గొప్ప ప్రయోగాలు వెలువడడానికి వీలుంది. వాటిని అనుశీలించడానికి ఈ సిద్ధాంత వ్యాసం ఒక నమూనగా పనికివస్తుందని నిస్సంశయంగా చెప్పవచ్చు.

సిద్ధాంత వ్యాసమంతా చదివితే పరిశోధనలో శ్రీనివాసాచార్యగారికి ఉన్న చిత్తశుద్ధి స్పష్టమవుతుంది పూర్వులు చెప్పిన అభిప్రాయాలను తాను అంగీకరించనప్పుడు నిర్భయంగా నిస్సంశయంగా నిశ్చితంగా చెప్పే నేర్పు ఆయనకు ఉన్నది. సత్యం చెప్తున్నా సౌమ్యతను వీడని శైలి వారి రచనకు అలంకారం. ఈ పరిశోధన ప్రణాళికకు ఆచార్య డా॥ సి. నారాయణరెడ్డిగారు పర్యవేక్షకులు కావడం బంగారానికి తావి అబ్బినట్లుగా ఉంది. పర్యవేక్షకులు ప్రథమ శ్రోతలు. ప్రథమ పరీక్షకులు. గేయ రూపక రచనలో సిద్ధహస్తులైన ఆచార్య నారాయణరెడ్డిగారి పర్యవేక్షణ ప్రామాణికతకు గీటురాయి.

శ్రీనివాసాచార్యగారి ఈ సిద్ధాంతవ్యాసం ఆయన గ్రంథ రచనలో మొదటి ప్రయోగమే కాదు. మొదట ఒక కవియొక్క సాహిత్యాన్ని గురించి

సాహిత్య అకాడమీ బహుమతి పొందగలిగిన గ్రంథాన్ని వ్రాసి విమర్శకులుగా కీర్తి నార్జించారు. అది వ్రాయడానికి పూర్వమే ఆరంభించినా ఈనాడు ప్రచురింపబడుతున్న ఈ గ్రంథం వారి అభ్యాసానికీ పరిణతికీ కూడా అక్షరోదాహరణంగా ఉంది. పరిశోధన పట్టం పొందిన తరువాత ఎంత పరిశోధన చేశారు అన్నదే పరిశోధకులకు గీటురాయి. మిత్రులు డా॥ శ్రీనివాసాచార్య కలం నుండి కవితలే కాక పరిశోధన గ్రంథాలు కూడా వెలువడి సాహితీ విజ్ఞాన పరిధిని సమాజంలో విస్తరింపజేస్తాయని ఆశిస్తున్నాను. శక్తి కలవాని మీదనే లోకం ఆశలు కూడా పెట్టుకుంటుంది.

డా॥ శ్రీనివాసాచార్యులవారికి హృదయపూర్వకాభినందనలు.

హైదరాబాదు,
1-11-87.

# ధన్యవాదం

'తెలుగులో గేయనాటికలు' అన్న అంశాన్ని గూర్చి పిహెచ్. డి. పట్టాకోసం పరిశోధన చేసే అవకాశాన్ని కల్పించి, పట్టాను ప్రసాదించి, సిద్ధాంత వ్యాసాన్ని ప్రచురించుకునేందుకు అనుమతించిన ఉస్మానియా విశ్వ విద్యాలయం వారికి ధన్యవాదాలు.

పరిశోధనాంశాన్ని సూచించి, నా పరిశోధన కృషిని పర్యవేక్షించి, అనుక్షణం అనేకవిధాలుగా ప్రోత్సహించిన సహృదయులూ శబ్దసౌందర్యాన్నీ అర్థగాంభీర్యాన్నీ సమగ్రంగా అవగతం చేసుకున్న కవితాకళాపారీణులూ ఉత్తమదేశికులూ సౌజన్యమూర్తులూ ఆంధ్రప్రదేశ్ సార్వత్రిక విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులూ ఆచార్య సి. నారాయణరెడ్డి గారికి హార్దికకృతజ్ఞతాభి వందనాలు.

పరిశోధనకు అనుమతి నిచ్చిన సందర్భంగా ఉస్మానియా విశ్వవిద్యా లయ ఆంధ్రశాఖకు అధ్యక్షులుగా ఉండి, తమ విద్వద్గరిమతో శిష్యవాత్స ల్యంతో అమోఘాశీస్సులందజేసి నన్ను ధన్యుణ్ణిచేసిన వాఙ్మయదివాకరులు ఆచార్య దివాకర్ల వేంకటావధాని గారి దివ్యసంస్మృతికి నా నమోవాకాలు.

ఈ సిద్ధాంత వ్యాసానికి పరీక్షకులుగా వ్యవహరించి తమ ఆమో దాన్ని ప్రకటించిన విద్వద్వర్యులు మైసూరు విశ్వవిద్యాలయం ఆచార్యులు శ్రీ కాడాల రామయ్య గారికీ, భరతముని నాట్యశాస్త్రాన్ని తెలుగుల కందించి, తెలుగునాటకవికాసాన్ని గూర్చి ప్రామాణిక పరిశోధనచేసి, ఉత్తమ దేశికులుగా పేరుపొందిన డా॥ పోణంగి శ్రీరామ అప్పారావు గారికీ హృదయ పూర్వక అభివందనాలు.

నా ఈ సిద్ధాంత వ్యాసాన్ని పరిశీలించి, తమ అమూల్యాభిప్రాయాన్ని తెలిపి దీవించిన విద్వాంసులూ బహుభాషాకోవిదులూ ఆచార్య కొత్తపల్లి వీరభద్ర రావుగారికి నమస్సులు.

సిద్ధాంత వ్యాస ప్రచురణను హర్షించి శుభాకాంక్షలను అందజేసిన ఆంధ్రసాహిత్యోద్యమ మూర్తులూ బహుభాషావేత్తలూ సహృదయులూ ఆంధ్ర

సారస్వత పరిషత్తు అధ్యక్షులూ శ్రీ దేవులపల్లి రామానుజరావు గారికి హార్దిక ధన్యవాదాలు.

ఈ సిద్ధాంతవ్యాసాన్ని సమగ్రంగా అవలోకించి, తమ శుభాకాంక్షలను అందించిన విద్వాంసులూ కవులూ ఉస్మానియా విశ్వవిద్యాలయ ఆంధ్ర శాఖాధ్యక్షులూ సహృదయకులశేఖరులూ ఆచార్య ఎం. కులశేఖరరావు గారికి అభివందనాలు.

నేను ప్రతిపాదించిన అనేకాంశాలలోని సామంజస్యాన్ని 'పరితోషం'తో విపులంగా పత్రికాలోకానికి తెలిపి నన్ను ప్రోత్సహించిన విద్వన్మూర్తులూ వైష్ణవాంధ్ర వాఙ్మయాన్ని మథించిన పరిశోధకులూ అమృత హృదయులూ సత్కవులూ ఆచార్య వేటూరి ఆనందమూర్తి గారికి కృతజ్ఞతాపూర్వకాభివందనాలు.

గేయనాటికాప్రక్రియను గూర్చి నేను చేసిన ఈ పరిశోధనను హర్షించి, "ప్రక్రియకెత్తిన పతాక"గా గుర్తించి, సిద్ధాంత వ్యాసంలో నేను వ్రాసిన ప్రత్యంశాన్ని సునిశితంగా చదివి నన్ను వెన్నుతట్టిన సహృదయులూ యావద్భారత ప్రశస్తిని అందుకున్న విమర్శకులూ ఉన్నత ప్రమాణాలందుకన్న దేశికులూ ఉత్తమపరిశోధకులూ వాగ్మివతంసులూ హైదరాబాదు విశ్వవిద్యాలయ ఆంధ్రశాఖాధ్యక్షులూ మా యువభారతి ప్రచురణ ప్రధాన సంపాదకులూ ఆచార్య జి వి. సుబ్రహ్మణ్యం గారికి వినమ్రనమస్కృతులు.

ఇరివెంటివారు విరివంటివారు. వారి మధురమైత్రీపరిమళతరంగాలలో ఓలలాడే అదృష్టం కలగడం నా పూర్వజన్మ పుణ్యఫలం. సౌజన్యానికి సంకేతం వారు. ఆప్యాయతకు ఆమ్రేడితం వారు. చుట్టూ చీకట్లు ఆవరించినప్పుడల్లా సుధాదీపిక లెత్తిన జ్యోత్స్నామూర్తులు వారు. సంకటాలు నాకు సంకెళ్ళు వేసినప్పుడల్లా సహకార ఖడ్గంతో వాటిని ఛేదించిన దయాస్ఫూర్తులు వారు. మాటల్లో తెలుపలేని మనోజ్ఞ స్నేహామరందాన్ని అందించే సుమనో హృదయులూ నిర్వ్యాజ్యులూ 'యువభారతి' అధ్యక్షులూ డా॥ ఇరివెంటి కృష్ణమూర్తిగారికి నా హార్దికాభివందనా లర్పించుకుంటున్నాను.

శ్రీ ఇరివెంటి వారి ఆదర్శం మార్గదర్శనం కాగా, శ్రీ వంగపల్లి విశ్వనాథం గారి సంస్కార సంపన్నమైన సేవానిరతి 'యువభారతి'కి భవ్య

జీవనమై భాసించింది. నా వంటి 'యువభారతీ'యులకు నవోత్సాహాన్ని అందించింది. విశ్వశ్రేయస్సును ఆకాంక్షించే విశ్వనాథం గారు గరళాన్ని గళంలో నొక్కిపట్టి అమృతాన్ని అందుకునే అవకాశాన్ని కలిగించిన విశ్వనాథులే. తమ ఉదార హృదయంతో నా ప్రగతికి దోహదం చేసిన ఆప్తమిత్రులు ఆచార్య వంగపల్లి విశ్వనాథం గారికి నా హృదయపూర్వక ధన్యవాదాలు.

అక్షరాలతో పాటు అంతరంగాన్ని అందంగా దిద్దుకున్న మనస్వులు ప్రసిద్ధ కళాకారులు నవలారచయితలు సహృదయకవి మిత్రులు శ్రీ శీలా వీర్రాజుగారు. ఈ గ్రంథానికి ముఖచిత్రాన్ని ముద్దుగా సమకూర్చిన వారి స్నిగ్ధకళా హృదయానికి కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను.

ఒకవైపు ఉద్యోగభారాన్ని మోస్తూ, మరోవైపు సాహితీ సేవా భావంతో అనేక రాత్రులు 'యువభారతి' ఆశయసిద్ధికి కృషిచేస్తూ ఈ గ్రంథ ప్రచురణలో సర్వధా సహకరించిన ప్రవిమలచిత్తులు యువభారతి ప్రధాన కార్యదర్శి శ్రీ ఎస్వీ. ప్రభాకరరావు గారికి నా కృతజ్ఞతలు.

ఈ గ్రంథాన్ని తన ప్రచురణగా ప్రకటిస్తున్నందుకు 'యువభారతి' సంస్థకు నా సుమనోఽంజలి.

'యువభారతి' సంస్థ కార్యకలాపాలలో యథాశక్తి పాలుపంచుకుంటున్న పెద్దలు శ్రీ శ్రీరామమూర్తిగారికి నా నమస్సులు. యువభారతి మిత్రులు శ్రీయుతులు ఎ. నాగేశ్వరరావు, ఎస్. వెంకటేశ్వరరావు, తాళ్ళపల్లి మురళీధర గౌడు, కుమారస్వామినాయుడు, రెడ్డిరాఘవయ్య, అశ్వినీకుమార్, శ్రీమతి లక్ష్మి, కామేశ్వరరావు, సుధామ గారల సహృదయతనూ, సహకారాన్నీ మరువలేను. శ్రీ జహాంగీర్, జగదీశ్ నన్ను ఆదుకున్నవారే. ఇలా ఎందరి పేర్లు చెప్పను? 'యువభారతీయు' లంతా ప్రత్యక్షంగానో, పరోక్షంగానో నాకు తోడ్పినవాళ్ళే. అందరికీ నా వందనాలు.

నాకు దర్శనమిచ్చి, నాపై వాత్సల్యామృతాన్ని వర్షించి, నాకు కలిగిన అనేక సందేహాలను నివృత్తిచేసి మార్గదర్శనం చేసిన బహుభాషావేత్తలూ స్వాతంత్ర్యోద్యమయోధులూ విద్వత్కవులూ తెలుగులో తొలిగేయనాటికా కర్తలు శ్రీ స్వామి శివశంకరస్వామి (శ్రీ తల్లావజ్ఝల శివశంకరశాస్త్రి) సంస్మృతికి నా శ్రద్ధాంజలులు సమర్పిస్తున్నాను.

ఈ సిద్ధాంతవ్యాసాన్ని ప్రచురిస్తున్న సందర్భంగా కవిసమ్రాట్ నోరి నరసింహశాస్త్రిగారు, ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనం గారు, అభినవపోతన వానమామలై వరదాచార్యుల వారు, ఆచార్య కె. గోపాలకృష్ణారావు, మహాకవి దాశరథి నా స్మృతి పథంలో కదలాడుతున్నారు. నన్నెంతో ప్రోత్సహించిన సాహితీమూర్తులు వారు. వారి స్మృతికి నా సమస్కృతి

గేయనాటికలకు సంబంధించిన అనేక సాంకేతిక సాహిత్యవివరాలను నాకు తెలిపి. నా కృషికి దోహదం కల్పించిన గేయనాటికా కర్తలూ, ప్రయోక్తలూ సంగీత సాహిత్యకళాకోవిదులూ శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావు గారికి, శ్రీ పాలగుమ్మి విశ్వనాథం గారికి ఈ సందర్భంగా ధన్యవాదాలు సమర్పించుకుంటున్నాను. నన్ను ఎల్లవేళలా ప్రోత్సహిస్తున్న జానపద గేయ వాఙ్మయ మర్మజ్ఞులు ఆచార్య బి. రామరాజుగారికి నా సమస్సులు.

సిద్ధాంత వ్యాసరచనా సందర్భంగా వివరాలు సేకరించడానికి నేను గుంటూరు వెళ్ళినప్పుడు ఎంతో ఆప్యాయంగా అతిథ్యమిచ్చి, అతివేలమైన వాత్సల్యంతో నన్ను ఆశీర్వదించి సమాచారాన్ని అందజేసిన ప్రసిద్ధనాటికా కర్తలూ విద్వత్కవులూ విమర్శకులూ శ్రీ వావిలాల సోమయాజులు గారిని నేను మరువలేను. వారికి నా వినమ్ర నమస్సు లర్పిస్తున్నాను.

గుంటూరులోనే నాకు దర్శనమిచ్చి, తమ రచనలను కొన్నింటిని నాకు అనుగ్రహించిన సుప్రసిద్ధకవులు కరుణశ్రీ గారికి శేముషీ సంపన్నులూ విద్వత్కవులూ ఉత్తమదేశికులూ ఆచార్య యస్వీ. జోగారావుగారికీ భక్తి పూర్వకాభివందనాలు.

గుంటూరు మిత్రులూ విద్వాంసులూ డా॥ జంధ్యాల జయకృష్ణ ప్రసాద్‌గారు, సిద్ధిపేట మిత్రులూ సుప్రసిద్ధ విద్వత్కవులూ శ్రీమాన్ వేము గంటి నరసింహాచార్యుల వారు నాకెంతగానో తోడ్పడినారు. ఈ సందర్భంగా వారి మధుర స్నేహాన్ని జ్ఞప్తికి తెచ్చుకుంటున్నాను.

వివిధ భాషలలోని గేయనాటికల వికాసాన్ని గూర్చి నాకు అనేక విషయాలను తెలిపి, నన్ను కృతజ్ఞతా బద్ధునిగా చేసిన ఉస్మానియా విశ్వవిద్యా

లయం తమిళ శాఖాధ్యక్షులు ఆచార్య సింగార వేలుగారికీ, కన్నడ శాఖాధ్యక్షులు ఆచార్య కె. యం. కృష్ణారావు గారికీ, మరాఠీ శాఖాధ్యక్షులు ఆచార్య వసంతదామోదర్ కులకర్ణి గారికీ, హిందీ శాఖలో ఆచార్య డా॥ భీమ్‌సేన్ 'నిర్మల్' గారికీ, ఉర్దూ శాఖాధ్యక్షురాలు ఆచార్య శ్రీమతి రఫియా సుల్తానా గారికీ, ఆంగ్లభాషా కోవిదులూ మిత్రులూ శ్రీ డి. హనుమంతరావు గారికీ కృతజ్ఞతాపూర్వక నమస్కారాలు సమర్పిస్తున్నాను.

నా సాహితీ ప్రస్థానంలో సహకరించిన మహాకవులూ ఆప్తమిత్రులూ శ్రీమాన్ ఉత్పల సత్యనారాయణాచార్యగారికీ, పండిత మిత్రులు శ్రీ జి. శ్రీనివాసాచార్య గారికీ, అమృత హృదయులు శ్రీ రాజారాం గారికీ నా హార్దిక ధన్యవాదాలు.

పరిశోధన సందర్భంగానే గాక, నా జీవితంలో అన్ని సందర్భాలలోనూ నాకు అండగా నిలిచి నన్ను ప్రోత్సహిస్తున్న విద్వన్మణులూ అమృత హృదయులూ శ్రీమాన్ కె.వి. రాఘవాచార్య, పార్థసారథి స్వామి, నరసింహాచార్య గార్లకు సభక్తి ప్రణతులు. నాకు ఆరోగ్యాన్ని కలిగిస్తూ, నా పరిశోధన సఫలం కావడానికి సాయపడిన తమ్ముడు డా॥ వెంకటరమణాచార్యకు నా శుభాకాంక్షలు. సంసారభారాన్ని తాను భరిస్తూ, సాహితీ సౌందర్య దర్శనావకాశాన్ని నాకు కలిగిస్తూ, నా పరిశోధన విజయవంతం కావడంలో సంపూర్ణంగా సహకరించిన అర్ధాంగి శ్రీమతి స్వరాజ్యలక్ష్మికి నా అభినందనలు. గ్రంథప్రచురణ సందర్భంగా ఉడతాభక్తితో తోడ్పడిన నా కూతుళ్లు చి॥ అరవింద, రాధిక, జ్యోతిర్మయి, శిరీషలకు నా ఆశీస్సులు.

సికింద్రాబాదులోని సర్దార్ పటేల్ కళాశాలలో నేను ఆంధ్రభాషాధ్యాపకుడను. ఆ కళాశాల పాలక వర్గం వారు, ప్రధానాచార్యులూ, సహాధ్యాపకులూ, బోధనేతరసిబ్బంది మిత్రులూ నాకు అనేక విధాలుగా తోడ్పడి, చేయూతనిచ్చి సిద్ధాంత రచనకు అనువైన వాతావరణాన్ని కల్పించినారు. వారికి నా కృతజ్ఞతలు చెప్పుకుంటున్నాను.

ఈ పుస్తకాన్ని ముద్రిస్తున్న తరుణంలో నాకు ఎదురైన లెక్కలేని చిక్కులకు తట్టుకునే శక్తిని అందించిన సాహితీమిత్రులూ కార్యదక్షులూ స్నేహమూర్తులూ శ్రీ పాండురంగయ్య గారికి నా కృతజ్ఞతలు.

ఈ గ్రంథముద్రణకు ఆర్థికసాహాయ్యాన్ని అందించి ప్రోత్సహించిన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సాంస్కృతిక వ్యవహారాల శాఖవారికి కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను.

ఎందరో సాహిత్యాభిమానులు నాకు తమ ముద్రితాముద్రిత గేయ నాటికలను అందజేసి నాకెంతో ఉత్సాహాన్ని కలుగజేసినారు. సిద్ధాంత వ్యాస రచనకు ఆధారంగా నిలిచిన గ్రంథకర్తలు పలువురు; పత్రికలు అనేకం. గేయ నాటికా ప్రతులను అందజేసిన మిత్రులకూ ఆధారగ్రంథకర్తలకూ పత్రికా నిర్వాహకులకూ నా హార్దిక కృతజ్ఞతలు.

ఈ గ్రంథాన్ని ఎంతో ఓపికతో అందంగా ముద్రించిన చార్‌మినార్ ఆర్ట్ ప్రింటర్స్ యజమాని శ్రీ బడేసాహెబ్ గారికి నా కృతజ్ఞతలు.

**తిరుమల శ్రీనివాసాచార్య**

# అంకితం

మల్లియ పూవుదోటలను మానసమందున పెంచినావొ; జా
బిల్లిని లోనదాచితివొ; వెల్లుగ చందనగంధవీచికల్
ఉల్లమునందు నింపితివొ; ఊహాలకందుటలేదు తల్లి! నీ
చల్లని దీవెనల్ కురిసి సల్పుము నన్ను రసాభిషిక్తునిన్

పరుగులుదీయు బాల్యమున పాటలు పాడుచు యక్షగానపుం
దరువులు పెక్కు చూపితివి; ద్రావిడపాశురముల్ మరింత సుం
దరముగ పాడినేర్పితివి తండ్రి! ప్రబంధమనోజ్ఞ పద్య మా
ధురి నెదలోన నింపితివి స్తుత్యములౌను భవత్ప్రబోధముల్.

బ్రతుకుతోపాటు జ్ఞానసంపదనొసగిన
విమలరాగస్వరూపిణీ! వేంకటమ్మ!
సౌమ్యమూర్తి! మనోహరాచార్య! కొనుడు
అక్షరమైన ఈ కృతి నంకితముగ



తల్లిదండ్రులు :

కీ॥ శే॥ తిరుమల మనోహరాచార్యులు, వేంకటమ్మ.

# అనుక్రమణిక

**PRESENTED**
**BY**
**Prof. KORLAPATI**
**SRIRAMAMURTHY, D.Litt.**

# ప్రస్తావన

చిన్ననాటి నుండియు నాకు సంగీతమనిన చాల ఇష్టము. రాగతరంగము చెవి సోకగానే నా అంతరంగములో ఆనంద మంకురించెడిది. పల్లవి వినగానే నా ఉల్లములో ప్రమోదము పల్లవించెడిది. తీయతీయగా గేయచరణాలు తీవెలుసాగినకొలది నా స్వాంతములో సంతోషము కుట్మలించి కుసుమించి పరిమళమై పరవశమై పరుగులు తీసెడిది. సంగీతమునకు ఇంతటి శక్తి ఎక్కడిదో ఆ తరుణవయస్సులో నాకు అర్థము కాలేదు. ఆ తరువాత గ్రహింప గలిగి నాను సంగీతము అంతటి మహిమను ఛందము వలననే పొందినదని.

విశ్వరూపమువలె పరివ్యాప్తమైన ఛందములో ఒక విశేష స్వరూపము గేయమనియు, రాగతాళములతోను సాహిత్య నృత్యాలతోను దానికిగల అనుబంధము అమేయమనియు తెలిసికొన్న తరువాత గేయముపట్ల నాకు మరింత ఆదరాభిమానము లేర్పడినవి వానితోపాటు గేయసాహిత్య సౌందర్య మును సమగ్రముగా దర్శింపవలెనను ఒక అభినివేశము నాలో శిరసెత్తినది. ఆ క్షణమునుండి గేయ సాహిత్యాలోకము సాగించినాను. ఆ ప్రయత్నములో గేయ సరస్వతిని తమ ప్రతిభాపాండిత్యములతో సమలంకరించిన ఆధునిక కవివతంసుల గేయకావ్య రత్నముల నొక ప్రత్యేక దృక్పథముతో పరిశీలించి నాను. వానిలో నన్ను మిక్కిలి ఆకర్షించినవి విద్వత్కవులు శ్రీ తల్లావజ్ఝల శివశంకరస్వామి, డా॥ సి. నారాయణరెడ్డి గారల గేయకృతులు. వీరి ఇతర కావ్యములతో పాటు గేయనాటికలను కూడ అధ్యయనము చేసినాను.

ఇది ఇట్లుండగా డాక్టరేటు పట్టము పొందుటకై తెలుగు సాహిత్యము లోని ఒక సురుచిరాంశమును గూర్చి పరిశోధన చేయవలెనను అభిలాష నాలో ఉదయించినది. ఒకనాటి ఉదయము పరిశోధనాంశము నెన్నుకొనుటకై ఉస్మానియావిశ్వవిద్యాలయమునకు వెళ్లి ఆచార్య డా॥ సి. నారాయణరెడ్డి గారిని దర్శించినాను. గేయ వాఙ్మయముపట్ల నాకు గల అభిరుచిని, అభిని వేశమును ఎరిగిన శ్రీ నారాయణరెడ్డిగారు 'తెలుగులో గేయనాటికలు' అను అంశమును గూర్చి పరిశోధనచేసిన బాగుగ నుండునని సూచించినారు. వారి

సూచన నా మనస్సునకు నచ్చినది. ఆనాటినుండి గేయనాటికల సేకరణను అధ్యయనమును సాగించినాను.

అధ్యయనానంతరము ఒకనాడు తెలుగులో గేయనాటికాప్రక్రియకు ఆద్యులైన శ్రీ తల్లావజ్ఝల శివశంకరస్వామివారిని ఒంగోలులో దర్శించుకొని గేయనాటికలకు సంబంధించిన వివిధాంశములను గూర్చి వారి అభిప్రాయములను గ్రహించినాను. ఆ చర్చాగోష్ఠిలో నే నడిగిన అనేక ప్రశ్నలకు అమృత హృదయులు శ్రీ స్వామివారు సమాధానము లిచ్చి నన్ను ప్రోత్సహించి ఆశీర్వదించినారు. వారితో చర్చాగోష్ఠి సలుపు సందర్భములో నేటి గేయ నాటికలకు ప్రాచీనభారతీయరూపకమర్యాదలతో ఏదేని సంబంధము బీజ భూతముగనైనను ఉన్నదా యను నా ప్రశ్నకు శ్రీ స్వామివారు మౌనము వహించినారు. వారి మౌనము నాలో జిజ్ఞాసను రేకెత్తించి, ప్రాచీన సంస్కృత ఉపరూపకములను వాని లక్షణములను హేతుబద్ధముగ పరిశీలించుట కుద్యుక్తుని చేసినది వీనితోపాటు నేటి తెలుగు గేయనాటికల స్వరూప స్వభావములను వాని తొలిదశలను, వస్తుచ్ఛందోరసాద్యంశములను పరిశీలించి. ఈ సిద్ధాంత వ్యాసము వ్రాసినాను.

ఈ సిద్ధాంత వ్యాస రచనలో అనేక కవి పండిత విమర్శకుల గ్రంథములను ఉపయోగించుకొన్నాను. గేయనాటికాకర్తల నాటికలను, ఎడనెడ వారి పీఠికలను వాడుకొన్నాను. వారందరికి నా హార్దిక కృతజ్ఞతానతు లర్పించు కొనుచున్నాను.

నన్నెంతయో ఆదరించి, నేనడిగిన ప్రశ్నలకు సమాధానములిచ్చి, సందేహములను దీర్చి తమ ఆశీరమృతము నందించిన కీ॥ శే॥ శ్రీ తల్లావజ్ఝల శివశంకరస్వామివారికి సభక్తి ప్రణామము లర్పించుకొనుచున్నాను. ఇచట ఒక విషయమును ప్రస్తావించకుండ ఉండలేను. పరిశోధన సందర్భముగా నేను వ్రాసిన ఒక లేఖకు ఆదరముతో సమాధానము వ్రాయుచు శ్రీ శివశంకర స్వామివారు తాము కొన్ని రోజులలో హైదరాబాదుకు రాగలమనియు, అప్పుడు తప్పక మీ సిద్ధాంత వ్యాసమును వినిపించవచ్చుననియు ఆత్మీయతతో తెలిపినారు. కాని నా దురదృష్టవశమున నాకు ఆ అవకాశము లభించలేదు. యావదాంధ్ర సాహితీ ప్రియులందరిని శోకతప్తులను చేసి శ్రీ స్వామివారు ఇటీవలనే శివసాయుజ్యము నందినారు.

పరిశోధనాంశమును సూచించిన నాటినుండి ఈ సిద్ధాంత వ్యాస రచనా పరిపూర్తివరకు నాకు అడుగడుగున అనేకములైన అమూల్యసూచనల నొసగుచు నాకు మార్గదర్శనముచేసి ప్రోత్సహించిన ఆచార్య డా॥ సి. నారాయణరెడ్డి గారికి నా అభివందనములు.

నేను ఈ సిద్ధాంత వ్యాస రచనము చేయుచున్న సందర్భమునందు నాకు కొన్ని ముద్రితాముద్రిత గేయనాటికా ప్రతులు లభ్యముకాలేదు. విశ్వవిద్యాలయము వారికి 1978 లో నేనీ సిద్ధాంత వ్యాసమును సమర్పించిన తరువాత కొన్ని నా కంటబడినవి. గ్రంథాంతమున వానిని సూచించియున్నాను. అవి పరిశీలనమునకు యోగ్యమైనవనియే నా ప్రత్యయము. మునుముందు నాకు అవకాశము లభించినప్పుడు వానిని కూడ పరిశీలించి, వాని విశేషములను తెలుపగలనని సవినయముగా పరిశోధకలోకమునకు మనవి చేసుకొనుచున్నాను.

పుస్తకసేకరణము చాల దుస్తరమైన ప్రయత్నమని నాకు తోచుచున్నది. కొందరు రచయితలు వ్రాతప్రతులను అందజేసెదమని పలుమారులు త్రిప్పించుకొని, చివరకు నైరాశ్యమునే అందించినారు. ఈ విధముగా నా దృష్టికిరాని రచనలు అనేకము లుండవచ్చును. నాకున్న పరిమితులకు లోబడి నేను ఈ కృషిని కొనసాగించినాను. ఇదియే నిర్దుష్టమనియును అన్ని గేయనాటికలను నేను సంపాదించి పరిశీలించితిననియును చెప్పుట సాహసమే. సహృదయులు ఇది గమనింతురని ఆశించుచున్నాను.

# 1. నాటికా స్వరూపము

"ఆంగికం భువనం యస్య
వాచికం సర్వ వాఙ్మయమ్ ।
ఆహార్యం చంద్ర తారాది
తం వందే సాత్త్వికం శివమ్ ॥"

పరమేశ్వరుడు నటరాజమూర్తి. సృష్టిలోని ప్రత్యణువూ అతని చైతన్యమునకు ప్రతీక. సకల భువన పరివ్యాప్తమైన అతని నాదమే సంగీత సాహిత్యామోదము. అతని సమలంకృతసౌందర్యస్వరూపమే ఈ ప్రకృతి విలాసము. అతని సాత్త్వికభావోదయమే జీవకోటికి వినోదయము. అట్టి మాత్మునే అభినయమూర్తిగా ఆరాధించి భారతీయులు రూపకమునే ఇహపరసుఖసాధనముగా సంభావించిన సంవిధానము, వారు తమ జీవితవృత్తమునందు రూపకమునకు ప్రసాదించిన ప్రాధాన్యమును భంగ్యంతరముగా నిరూపించుచున్నది. దృశ్యకావ్యమైన రూపకము కవిత్వ సంగీత నృత్య చిత్రలేఖనాద్యనేక కళల మధుర సమ్మేళనము. ఆ కారణముచేతనే ఇది భిన్నాభిరుచులున్న విశ్వజనమునకు విశేష సమారాధన పాత్రమగుచున్నది.

రూపకము వేదసంజనితము. బ్రహ్మ ఋగ్యజుస్సామాథర్వ వేదముల నుండి పాఠ్యాభినయగీతరసములను గ్రహించి నాట్యవేదమును సృజించినాడు.[1] బ్రహ్మోపదేశానుసారము రూపకమర్యాదలను వస్తునాయకరసాద్యనేకలక్షణములను సూత్రీకరించి ప్రయోగించిన మనీషి భరతర్షి. అతని గ్రంథము నాట్యశాస్త్రము. నాట్యశాస్త్రము రూపకములకు సంబంధించినదే యైనను క్రమక్రమముగా సాహిత్యశాస్త్రసిద్ధాంతప్రతిపాదనమునకును సమాలోచనమునకు ఆద్య గ్రంథముగా పరిగణ్యమైనది. బ్రహ్మ భరతునకుపదే

1. "జగ్రాహ పాఠ్యమృగ్వేదాత్సామభ్యో గీతమేవచ
యజుర్వేదాదభినయాన్ రసానాథర్వణాదపి'' – నాట్యశాస్త్రము. ఒకటవ అధ్యాయము. శ్లో. 17. (నిర్ణయ సాగర ముద్రణ : బొంబాయి 1943)

శించిన నాట్య వేదోత్పత్తికథనము ఎట్లున్నను, ఏ శాస్త్రమునకైనను లక్ష్యము లేనిది లక్షణ మేర్పడుట ఊహకందని అంశము. కనుక భరతుని నాట్యశాస్త్రము అవతరించిన కాలమునాటికే రూపక ప్రక్రియ భారతదేశమున పరిణతావస్థను అందుకొన్నదని నిశ్చయముగా చెప్పవచ్చును. నాట్యశాస్త్రము ఈ సుస్థితికి అక్షరసాక్ష్యము.

రూపకరచనా ప్రయోగ విజ్ఞానమునకు మార్గదర్శకముగానున్న నాట్యశాస్త్రమున భరతుడు వస్తునాయకరసాది భేదములనుబట్టిరూపకములను పది విధములుగా పేర్కొనెను. అవి ఇవి — నాటకము, ప్రకరణము, అంకము, వ్యాయోగము, భాణము సమవకారము, వీథి, ప్రహసనము, డిమము, ఈహామృగము.[1] వీనినే కాక భరతుడు 'నాటి' (నాటిక) అను ఒక ప్రత్యేక రూపకమును పేర్కొన్నాడు.[2] దాని లక్షణమిది—

“నాటక - ప్రకరణముల లక్షణ సమ్మేళనమువలన ప్రసిద్ధమైన ఇంకొక భేదము (అనగా నాటిక అనెడి జన్య రూపకము) సంభవమగుచున్నది. ప్రకరణ నాటకములకంటె భిన్నమైన ఈ నాటికయందు వస్తువు ఉత్పాద్యమును, నాయకుడు రాజును కావలయును. నాయిక అంతఃపురకన్యకాని, సంగీతశాలా

---

1. “నాటకం సప్రకరణ మంకో వ్యాయోగ ఏవచ
భాణః సమవకారశ్చ వీథీ ప్రహసనం డిమః
ఈహామృగశ్చ విజ్ఞేయో దశమో నాట్యలక్షణే
...................................” – (నాట్యశాస్త్రము. అధ్యాయము 18. శ్లో. 2, 3. నిర్ణయ సాగర ముద్రణ. బొంబాయి 1943)

2. “...................................
ప్రఖ్యాత స్త్వితరో వా నాటీ సంజ్ఞాశ్రితే కావ్యే
[ప్రత్యాఖ్యాత స్త్వితరోవా నాటకయోగే ప్రకరణేచ] [పాఠ్య భేదము]
స్త్రీప్రాయా చతురఙ్కా లలితాభినయాత్మికా సువిహితాఙ్గీ
బహుగీత నృత్యవాద్య రతిసంభోగాత్మికా చైవ
రాజోపచారయుక్తా ప్రసాదన క్రోధ దమ్భసంయుక్తా
[నాయక దూతీ చాపి దేవీ సంబద్ధ నాటికాజ్ఞేయా
అంతర్భాగవతా హ్యేషా భావయోరు భయోరపి
అథ దశైతాని రూపాణి ఇత్యుదితాని తు]” – (నాట్యశాస్త్రము. అధ్యాయము 18. శ్లో. 109-112. నిర్ణయ సాగర ముద్రణ: బొంబాయి 1943)

కన్య కాని కావలయును. ఇందు నాలుగు అంకములుండును, స్త్రీలు అధికముగా ఉందురు. మఱియు ఇది లలితాభినయాత్మకమును (కైశికీ వృత్తి ప్రధానమును), సర్వాంగ సంపన్నమును (నాలుగు కైశికీ వృత్త్యంగములతో కూడినదియును), బృహన్నృత్త - గీత - పాఠ్య యుక్తమును, రతిపుష్కలమగు రాజ్యప్రాప్త్యాదిఫలసంయుక్తమును, రాజ స్నానహాసయుక్తమును, క్రోధ-ప్రసాదన-దంభ (వంచనా) సంయుక్తమును (ఇవి పూర్వనాయికాగతవిషయము), నాయక - దేవీ - దూతీ - పరిజనయుక్తమును కావలయును. ఇట్టిది 'నాటిక' అనబడును. ఈ నాటిక ప్రకరణ - నాటకముల లక్షణము లందంతర్గతమై ఉండుటచే వేరుగా గణింపబడలేదు; కావున రూపకములు పది అనుట సత్యదూరము కాదు". (నాట్యశాస్త్రము, అనువాదము - డా॥ పి. ఎస్. ఆర్. అప్పారావు గారు పుటలు : 522 - 523)

నాటిక లక్షణమును ధనంజయుడింక ను స్పష్టముగా ఇట్లు చెప్పినాడు—

"నాటికకు వస్తువు ప్రకరణమునకువలె కల్పితము. నాయకుడు నాటకమునకువలె ప్రఖ్యాతుడు ధీరలలితుడయిన నృపాలుడు. అంగి - ముఖ్యరసము సలక్షణమయిన శృంగారము. నాటికయందు పలువురు స్త్రీలు, నాలుగు అంకములు, ఇట్లన్నను ఒకటి, రెండు, మూడు, అంకములతో నాటికలుండుట వలనను, పాత్రల కలయిక వలనను నాటికలలో భేదము లనంతములు. తొలుదొల్త వివాహమాడిన ఆమెయే రాణి జ్యేష్ఠ, ఉత్తమరాజవంశజ, గంభీర, అభిమానవతి, చిక్కులుపడ జిన్నురాలగును. చిక్కులనగా నాయకునకు ఇతర ప్రియురాండ్రతో కలయిక రయినను, వివాహమగుటయినను జ్యేష్ఠురాలి అనుమతి కావలయును కనుక. రాణివలెనే రాజు ప్రేమించిన నాయిక ఉత్తమరాజవంశమున జన్మించినది కావలయును. అనుభవము కలది కాదు (ముగ్ధ), నాయకుని హృదయమును రంజింపజేయుజాలునది, చక్కదనమున రాణిని మించినది, గుణవతి అయి ఉండవలెను ఆ ప్రియురాలు (ముగ్ధ) అంతఃపురముతో సన్నిహితసంబంధము కలది, సదా నాయకునికి సమీపవర్తిని, ఆమెను చూచుట, ఆమె వాక్కులు వినుట ఇత్యాది కారణములవలన నాయకునికి ఆమెయందనురాగమతిశయించును. కాని ఆతడస్వతంత్రుడు. (రాణివలని భయము) ఆమె ఆగ్రహమునకు పాత్రుడగుట కిష్టపడడు. నాటికయందలి నాలుగు అంకములతో క్రమముగా సంబంధము కలదా అన్నట్లు

ఇందు కైశికీవృత్తి నాలుగు విభాగములతో ప్రవర్తించును".[1] (ధనంజయుని దశరూపకము - విద్వాన్ శ్రీసరిపెల్ల విశ్వనాథశాస్త్రి వ్యాఖ్యానము. పుటలు - 49 - 50 (1967).

శారదా తనయుడు తన భావప్రకాశనమున పైన చెప్పబడిన లక్షణములతో పాటు మరికొన్ని నాటికా విశేషములను ఇట్లు పేర్కొన్నాడు—

"నాటికలో ముఖప్రతిముఖగర్భనిర్వహణసంధులు నాలుగే యుండును. అవమర్శసంధి యుండదు. ఇందెచ్చటను విటుడు కాని పీఠమర్దుడు కాని సహాయముగా నుండడు. నాయకునకు నర్మసచివు డొకడుండును. అతడు విరూపుడు. వాడె విదూషకుడు. ఈ చెప్పిన యంశముల కవిరుద్ధముగా నుండుకొన్ని నాటకధర్మములు నిందుండును. ......... దేశవర్ణనము ఋతువర్ణనములతో నిది శోభితమై యుండును........"[2] (భావప్రకాశనమునకు

---

1. "...................................
తత్ర వస్తు ప్రకరణా న్నాటకా న్నాయకో నృపః ॥
ప్రఖ్యాతో ధీరలలితః శృంగారోంగే సలక్షణః
స్త్రీప్రాయ చతురంకాది భేదకం యది చేష్యతే ॥
ఏకద్విత్ర్యంక పాత్రాది భేదే నానంత రూపతా
దేవీ తత్ర భవేజ్జ్యేష్ఠా ప్రగల్భా నృపవంశజా
గంభీరా మానినీ కృచ్ఛ్రాత్ తద్వశాన్నేతృ సంగమః
నాయికా తాదృశీముగ్ధా దివ్యాచాతి మనోహరా
అంతఃపురాది సంబంధా దాసన్నా శ్రుతిదర్శనైః
అనురాగోనవావస్థో నేతు స్తస్యాం యథోత్తరం
నేతా తత్ర ప్రవర్తేత దేవీత్రాసేన శంకితః
కైశిక్యం గైశ్చతుర్భిశ్చ యుక్తాంకైరివ నాటికా" - (ధనంజయుని దశరూపకము
మూడవ ప్రకాశము. శ్లోకములు - 43 నుండి 48 వరకు)

2. "...................................
చత్వారః సంధయో లోపో౽ వమర్శస్య భవిష్యతి
న విటః పీఠమర్దశ్చ సహాయౌ భవతః క్వచిత్
నేతుః స్యాన్నర్మ సచివో విరూపస్తు విదూషకః
కైశ్చిన్నాటక ధర్మైస్తద విరోధి భిరాశ్రితం
..............దేశర్తు వర్ణనా కల్ప శోభితమ్
..............................." - (భావప్రకాశనము. అష్టమాధికారము.
శ్లో. 245-247. సంగీత నాటక అకాడమీ ప్రచురణ)

(శ్రీ జమ్ములమడక మాధవరామశర్మగారి 'భావాలోకము' (అనువాదము) పుటలు - 584-585. ప్రచురణ : ఆంధ్రప్రదేశ్ సంగీతనాటక అకాడమీ ఏప్రిల్ 1973)

శారదా తనయుడే కాక ప్రామాణికులైన ఇతర లాక్షణికులు - హేమచంద్ర సర్వజ్ఞసింగభూపాల విశ్వనాథకవిరాజాదులు నాటికాలక్షణమును ఒకే విధముగా పేర్కొన్నారు. వీరి నాటికాలక్షణ నిర్వచనములందు వివరింపదగిన విశేషాంశము లెవ్వియు లేనికారణమున వానినిచట పేర్కొనుట లేదు. నాటికకు లక్ష్యములుగా శ్రీహర్షుని రత్నావళిని ప్రియదర్శికను ఉదాహరింపవచ్చును. తెలుగులో మొట్టమొదట వెలసిన రూపకము నాటికయే అగుట ఒక విశేషము. ఈ నాటిక కీ॥ శే॥ శ్రీ కోరాడ రామచంద్రశాస్త్రిగారి మంజరీమధుకరీయము. ఈ నాటికను గూర్చి వ్రాయుచు డా॥ పి. ఎస్. ఆర్ అప్పారావుగారు "అచ్చటచ్చట కొన్ని కల్పనలను విడిచినచో, మొత్తము మీద కథయంతయును సంస్కృత నాటికా సామాన్యమైనదే"[1] అని తమ సిద్ధాంత గ్రంథమున తెలిపియున్నారు.

భరతాదులు ప్రతిపాదించిన దశవిధ రూపకములలో కాలక్రమేణ నాటకమే ప్రాధాన్యము వహించినది. అందుకు దాని ఉదాత్తలక్షణసమగ్రతయే కారణము. ఇక ఆధునికకాలమునందలి 'నాటకము' ప్రాచీనాలంకారికులు చెప్పిన లక్షణములను అనుసరించుటలేదు. నాటకమనగా నేడు "బహుపాత్రకము, సప్రాసంగికము, రంగబాహుళ్యము కలదై, ప్రదర్శనము రెండు మూడు గంటలలోపల ముగియునది."[2] అదే విధముగా "నాటికకు ప్రదర్శన కాలపరిమితి సుమారు గంట; ఇదియును ఏకనాయకము, ఏకవస్తుకమును కావలసినదే. కాని ఇందు, రెండు మొదలు ఐదారు అంగములుండవచ్చును. ఇతివృత్తమున స్థల-కాలైక్యములను విధిగా పాటింప నక్కరలేదు."[3] 1957 కంటె ముందున్న

1. తెలుగు నాటక వికాసము - పుట : 104.

2. తెలుగు నాటక వికాసము - డా॥ పి. ఎస్. ఆర్. అప్పారావుగారు. పుట : 489. ప్రచురణ (1967)

3. తెలుగు నాటక వికాసము - డా॥ పి. ఎస్. ఆర్. అప్పారావుగారు. పుట : 489.

లక్ష్యములను దృష్టియందుంచుకొని డా॥ పి. ఎస్. ఆర్. అప్పారావుగారు నిర్వచించిన తీరు ఇది. కాని ఆ తరువాత వెలువడిన నాటక – నాటికల ఆ స్వరూపమే మారిపోయినది. ఈనాడు నాటకమునకును నాటికకును అంతగా భేదము కనిపించుటలేదు. రెండును పర్యాయపదములుగానే ప్రయుక్తములగు చున్నవి. ఇపుడు కనిపించుచున్న భేదమంతయు ప్రదర్శనా కాలమునకు సంబంధించినదే. అనగా ప్రదర్శనమునకు ఎక్కువకాలము పట్టినచో నాటకమనియు తక్కువకాలము పట్టినచో నాటికయనియు సాధారణ సంకేతములేర్పడినవి.

ఈ సందర్భమున ఏకాంకికలను గూర్చి కూడ కొంచెము పరిశీలించవలసి యున్నది. దశరూపకములలో ఈహామృగము, వ్యాయోగము, అంకము (ఉత్సృష్టికాంకము), ప్రహసనము, భాణము, వీథి ఏకాంకపరిమితములు. భరతుడు అంకలక్షణమునిట్లు తెలిపియున్నాడు.[1]

1. "అఙ్కావస్థోపేతం కార్యం ప్రసమీక్ష్య బిందు విస్తారాత్
కర్తవ్యోఽఙ్కస్తజ్ఞైః సతు సమ్యఙ్ నాటకే విధివత్
అఙ్క ఇతి రూఢిశబ్దో భావైశ్చ రసైశ్చ రోహయత్యర్థాన్
నానా విధానుయుక్తో యస్మాత్తస్మాద్భవే దఙ్కః
[అఙ్క సమాప్తిః కావ్యచ్ఛేదో న బీజ సంహారః
వస్తు వ్యాపీ బిందుః కావ్య సముత్థోఽత్ర నిత్యంస్యాత్
యత్రార్థస్య సమాప్తిర్యత్ర చ బీజస్య భవతి సంహారః
కించిదవలగ్నబిందుః సోఽఙ్క ఇతి సదావగన్తవ్యః
యే నాయకా నిగదితాస్తేషాం ప్రత్యక్ష చరిత సంయోగః
నానావస్థాంతరితః కార్యస్త్వఙ్కో వికృషస్తు
నాయకదేవీ పరిజన పురోహితామాత్య సార్థవాహనామ్
నైకరసాంతరవిహితో హ్యఙ్క ఇతి స వేదితవ్యస్తు
పఞ్చావరా దశపరా హ్యఙ్కా [:] స్యుర్నాటకే ప్రకరణేచ
నిష్క్రామః సర్వేషాం యస్మిన్నఙ్కః సవిజ్ఞేయః]
క్రోధ ప్రమాదశోకాః శాపోత్సర్గోఽథ్వ విద్రవోద్వాహౌ
అద్భుత సంశ్రయ దర్శనమఙ్కే ప్రత్యక్షజానిస్యుః
యుద్ధం రాజ్య భ్రంశో మరణం నగరో పరోధనం చైవ
ప్రత్యక్షాణితునాఙ్కే ప్రవేశకైః సంవిధేయాని
అఙ్కే ప్రవేశకైర్వా ప్రకరణ మాశ్రిత్య నాటకేవాపి
నవధః కర్తవ్యః స్యాద్యస్తత్ర సనాయకః ఖ్యాతః

"ప్రారంభాది పంచావస్థలతో కూడిన నాటిక కార్యము బిందువుచే విస్తృతము చేయబడుచుండును. అందు బీజనిష్పత్తి సహితమగు ప్రారంభావస్థ పరిపూర్ణమైన వెంటనే మొదటి అంకమును ముగించవలెను. ఇట్లు నాట్య తత్త్వజ్ఞులు అవస్థానుగుణముగా తక్కిన అంకములను కూడ కల్పించవలెను. 'అంక' మనునది రూఢి శబ్దము. రస-భావయుక్తములగు అర్థములను అనేక విధములుగా ప్రరోహింపజేయును. (ప్రత్యక్ష భావనా యోగ్యములనుగా చేయును) కాన ఇది 'అంక' మనబడినది. ప్రారంభాద్యవస్థా రూపమగు అర్థ సమాప్తియును, బీజసంహారమును ఎచ్చట జరుగునో అచ్చట అంకమును ముగించవలెను; కాని కావ్యమందలి బిందువు మాత్రము కథయందంతటను వ్యాపించి ఉండవలెను. ఇట్లు అర్థ సమాప్తియును బీజ సంహారమును కలపియును, కించిదవలగ్న బిందువు అగునదియును 'అంక' మనబడునని తెలియవలెను. నాయకులని పేర్కొనబడు వారియొక్క చరితమును, సంభోగమును అంకము

అవతరణమేవ కార్యం సంధిర్వా గ్రహణమేవవా నిత్యమ్
బహుభిః కార్యవిశేషైః ప్రవేశకైః సూచయేద్వాపి
ఏక దివస ప్రవృత్తః కార్యస్త్వఙ్కోఽథ బీజమాశ్రిత్య
ఆవశ్యక కార్యాణామవిరోధేన ప్రయోగేషు
ఏకాఙ్కేన కదాచిద్బహూని కార్యాణి యోజయేద్ధీమాన్
అవశ్యకావిరోధేన తత్ర కావ్యాని కార్యాణి
రఙ్గంతుయే ప్రవిష్టాః సర్వేషాం భవతి తత్ర నిష్క్రామః
బీజార్థ యుక్తిముక్తం కృత్వా కావ్యం యథార్థ రసమ్
జ్ఞాత్వా దివసావస్థాం క్షణయామ ముహూర్త లక్షణోపేతామ్
విభజేత్సర్వమశేషం పృథక్పృథక్కావ్య మఙ్కేషు
దివసావసానకార్యం యద్యఙ్కేనోప పద్యతే సర్వమ్
అఙ్కచ్ఛేదం కృత్వా ప్రవేశకైస్త ద్విధేయం హి
సన్నిహిత నాయకోఽఙ్కః కర్తవ్యో నాటకే ప్రకరణేవా
పరిజన కథానుబంధః ప్రవేశకోనామ విజ్ఞేయః
ప్రకరణ విషయే పఞ్చాద్యా... దశపరాస్తథా చైవ
అఙ్కాః కర్తవ్యాః స్యుర్నానా రసభావ సంయుక్తాః
అనయోరన్తర విహితః ప్రవేశకో యత్క్రియాం సమభివీక్ష్య
సంక్షేపార్థః సంధిస్త్వర్థానాం సంవిధాతవ్యః" – (నాట్యశాస్త్రము – అధ్యాయము 58.
శ్లో. 13 నుండి 31 వరకు నిర్ణయ సాగర ముద్రణ, బొంబాయి 1943)

నందు ప్రత్యక్షముగా ప్రదర్శితములు కావలెను. ఇట్లు నానావస్థోపేతమైనను అంకము సుదీర్ఘముకారాదు. నాయక-దేవీ-గురుజన - పురోహిత - అమాత్య-సార్థవాహుల వృత్తములకు సంబంధించినదై విచిత్రరసవిశేషయుక్తమగునది 'అంక' మనబడునని తెలియవలెను. కేవలచరిత - సంభోగములు ప్రత్యక్షములగుటయే కాక రంజనాతిశయముగల క్రోధ - ప్రసాద - శోక - శాపోత్సర్గ (శాపకృతమైన అనర్థము నశించుట) - విద్రవ (శంకా - భయ-త్రాస కృతమైనది) - ఉద్వాహ (వివాహము) - అద్భుతసంభవదర్శనములు కూడ అంకమునందు ప్రత్యక్షములుగా ప్రదర్శితములు కావలెను. అంకకాల పరిమితి: ఆవశ్యక కార్యములకు (సంధ్యావందన-భోజనాదులకు) విరోధము లేకుండునట్లుగా ఒక దినములో జరిగిన వృత్తమును ప్రయోజన - బీజానుసారముగా ఒక అంకమునందు నిబంధించవలెను ధీమంతు డెన్నడును ఒకే అంకమునందు బహుకార్యములను కూర్చరాదు. ఆవశ్యకకార్యములకు విరోధము కలుగకుండ కార్యములను (సన్నివేశములను) కూర్చవలెను. అంకమునందు రంగమున ప్రవేశించిన వారందరును బీజార్థ యుక్తియుక్తముగా, అర్థ-రసానుగుణముగా కార్యమును (ప్రయోజనమును) నిర్వర్తించి అంకాంతమునందు నిష్క్రమించవలెను. క్షణ-యామ - ముహూర్తములచే దినము విభక్తమై ఉండును. అట్లే ఆయా కార్యములును (సంధ్యావందన-భోజనాదులును) కాలనియమముతో కూడి ఉండును. అట్టి దిన విభాగమును గుర్తెరింగి సర్వకార్యములను ప్రత్యేకముగా, పరిపూర్ణముగా, ఏ కాలమందే కార్యము నెరవేర్పదగినదో అట్లే వాని వాని విభాగములతో ప్రదర్శించవలెను.

ఒకనాడు జరిగిన కార్యమును సర్వమును అంకమునందు కూర్చుటకు వీలు పడనిచో అంకమును ముగించి పిమ్మట మిగిలిన దానిని ప్రవేశకములచే సూచింపవలెను. నాటక-ప్రకరణములలో ప్రతి అంకమునందును నాయకుడు సన్నిహితుడు కావలయును. ఇంక ప్రవేశకాదులు వాని పరిజనుల ప్రసంగములతో కూడి ఉండును. నాటక-ప్రకరణములందు ఐదు మొదలుకొని పదివరకును అంకములుండును. అంకమునకును అంకమునకును మధ్య కథాసంధానమొనర్చుచు ఈ ప్రవేశకములను కూర్చవలెను." (నాట్యశాస్త్రము - డా॥ పి. ఎస్. ఆర్. అప్పారావుగారి అనువాదము - పుటలు 518 నుండు 517 వరకు).

ధనంజయాది లాక్షణికులును చెప్పిన అంక లక్షణము లిట్లే యున్నవి.

ఏకాంకికలని ఇపుడు ప్రచారమందున్న రూపక విశేషములకును, భరతాది లాక్షణికుల అంకలక్షణములకును ఏమాత్రమును సంబంధము లేదు. ఏకాంకికల స్వభావమును వివరించుచు డా॥ పి. ఎస్. ఆర్. అప్పారావుగారు "ఏకనాయకమును, ఏకవస్తుకమును విధిగా ఏకరంగమును అయి, స్థల - కాలైక్యములు పాటింపబడి, ప్రదర్శనము 30 నిమిషములు లేదా 45 నిమిషములలోపల ముగిసినచో దానిని 'ఏకాంకిక' అనవచ్చును-" అని వ్రాసినారు.[1] ఈ లక్షణము 1957 కంటె ముందున్న లక్ష్యములను ముందుంచుకొని చెప్పినట్టిది. ఇటీవలి రెండు దశాబ్దములలో ఏకాంకిక యను మాటకు అంతగా ప్రాచుర్యము లేదు. ఈ ఏకాంకికలలో రంగవిభజనము కూడ ప్రవేశించి అంకమునకున్న పాత కట్టుబాట్లను త్రెంచివేసినది. ఇట్లు అంకము పోయినది. తత్ఫలముగా ఏకాంకిక యను మాటున బడినది. అందువలన ఇప్పుడు నాటికలను పేరుతోనే ఏకాంకికలు మనగలుగుచున్నవి. ఈ విధముగా ఈనాడు రూపకమనగా నాటకమో లేదా నాటికయో. అంతే.

---

1. తెలుగు నాటక వికాసము - పుట: 489. (ప్రథమ ముద్రణ: 1967)

# 2. గేయసాహితి

గీతము, గీతి, గానము, గాంధర్వము, పదము, పాట గేయమునకు పర్యాయపదములు. 'గాతుం యోగ్యమ్ గేయమ్' పాడుటకు తగినది లేక పాడుటకు అనువైనది గేయము. గీత - గానములను అమరకోశము సమానార్థకములుగా పేర్కొన్నది.[1]

ఈ జగత్సర్వము నాదమయము. ఆకాశములో మేఘారావము, అంభోధులలో తరంగఘోష. ప్రకృతిలో ఎటుచూచినను నదీనదాల జలపాతాల కోలాహలము. పక్షుల కిలకిలారావాలు పశువుల అంభారావాలు. వనాంతరాలలో సింహవ్యాఘ్రమత్తేభాల గర్జనలు, గాండ్రింపులు, ఘీంకారాలు. ప్రచండముగా విజృంభించు ప్రభంజనార్భటులు. నవ్వు పువ్వులలోని నవమకరందమును పానము చేయు భ్రమరముల గీతాలు; మామిడి చిగుళ్లను మెక్కి మత్తిల్లిన కోకిలల మధుర సంగీతాలు; పసిపాపల జిలిబిలి పలుకులు; బాల బాలికల ఆటపాటలు; తరుణుల శృంగార గీతికలు; దేశికుల దివ్య వచస్సులు; మహాకవుల అమృతాతరాలు; నాదబ్రహ్మోపాసకుని ప్రణవగంగాతరంగాలు. ఇవి అన్నియు విశ్వవ్యాప్తమైన నాదమునకు సువ్యక్తానంతరూపాలే. నాదమే చైతన్యము. నాదమే జగత్తు. నాదమే ఆనందము. నాదమే కదా భావమును ఆశ్రయించి వర్ణమై పదమై వాక్యమై విశాలవాఙ్మయముగా రూపుదాల్చినది! జగద్వ్యాపారమునకు, నవ్యనాగరకతావిలసనమునకు ప్రాణాధారము ఈ వాఙ్మయమే అనుటలో అతిశయోక్తి ఏమున్నది? వాఙ్మయము రసాశ్రయమైనపుడు సాహిత్యముగా భాసించును. ఈ విధముగా నాదము సాహితీ సృష్టికి ఉపస్కారకమగుచున్నది. ఆ సాహిత్యము రాగలయతాళబద్ధమైనప్పుడు గేయమనిపించుకొనుచున్నది. మరి ఆ నాదము మధురమై శ్రవణసుఖదమై ప్రవర్తిల్లునపుడు గానమగుచున్నది. ఈ గానమే సంగీతమునకు మూలము. కనుకనే సంగీత రత్నాకరకారుడు శార్ఙ్గదేవుడు గీతము నాదాత్మకమనియు, నాదము వలననే వీణాది వాద్యములు

1. గీతం గానమిమే సమే - గీయత ఇతిగీతమ్, గానంచ - గై శబ్దే - (లింగాభట్టీయ గురుబాల ప్రబోధిక. పుట: 140. (1953 ముద్రణ)

శ్రవణపేయములగుచున్నవనియు, గీతవాద్యముల ననుసరించియే నృత్తముండుననియు చెప్పియున్నాడు.[1] గీతవాద్యనృత్తములే సంగీతమని శార్ఙ్గదేవుని మతము.[2] గీతమును అనుసరించి వాద్యము, వాద్యమును అనుసరించి నృత్తము ప్రవర్తిల్లుచుండుటచేత ఈ మూడింటిలో గీతమునకే ప్రాధాన్యమున్నదని చెప్పుట నిర్హేతుకముకాదు. ఈ దృష్టితో పరిశీలించితిమేని సాహిత్యసంగీతములను కలబోసికొని గేయము అవతరించినదని చెప్పనొప్పును.

మానవుని హృదయము రాగద్వేషములకు నిలయము. ఆతని జీవితవికాసమునకును పతనమునకును అవియే మూలములు. తన అభీష్టము సఫలమైనపుడు, తాను ఊహించని పరిస్థితి తనకు ఎదురైనపుడు ఆతని మనస్సు ఉత్కటహర్షమునకో ఉద్విగ్నతకో వశీభూతమగును. అట్టి స్థితిలో వాగ్రూపమున ఆతని భావములు ఛందోబద్ధముగా బహిర్గతములగును. కవితాసృష్టికి ఇదియే నాంది. ఛందస్సుందరమైన ఈ కవిత్వము గేయమనియు పద్యమనియు ఇరు తెరగులు. ఈ రెండింటిలో గేయమే ముందు పుట్టినదని సాహిత్యతత్త్వవేత్త లందరును ఏకగ్రీవముగా ప్రకటించిన సత్యము. గేయములు మాత్రాచ్ఛందములు. అతి ప్రాచీనములైన వేదములలో సామవేదము గేయము. ఆదివేదమైన ఋగ్వేదమందలి కొన్ని మంత్రములు కూడ గేయములే. "వేదచ్ఛందస్సు లన్నియును స్వర సంగీతముపై అధికముగా ఆధారపడియున్నవి. అక్షరములయొక్క హ్రస్వదీర్ఘత్వములతో వీనికి సంబంధము తక్కువ. మాత్రాపద్ధతియే అధికము."[3] గాన ప్రాశస్త్యముచేతనే సామవేదమునకు ప్రత్యేక స్థానమేర్పడినది. సామవేదమే సామగానమై సంగీతశాస్త్రమునకు పునాదియైనది.

---

1. "గీతం నాదాత్మకం వాద్యం నాదవ్యక్త్యా ప్రకాశ్యతే
తద్ద్వయానుగతం నృత్యం నాదాధీన మతస్త్రయమ్" — సంగీత రత్నాకరము, స్వగతాధ్యాయము, పిండోత్పత్తి ప్రకరణము. శ్లో. 1.
ప్రచురణ : ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమి (1966)

2. "గీతం వాద్యం తథా నృత్తం త్రయం సంగీత ముచ్యతే"
(సంగీత రత్నాకరము, స్వరగతాధ్యాయము — పదార్థ సంగ్రహ ప్రకరణము. శ్లో. 21.

3. తెలుగు ఛందో వికాసము — కోవెల సంపత్కుమారాచార్య అధ్యాయము 2. పుట : 10.
ప్రచురణ : కులపతి సమితి, ఓరుగల్లు (మే 1962)

"సామవేదేతు వక్ష్యామి - స్వరాణాం చరితం యథా
తాన రాగ స్వర గ్రామ మూర్ఛనానాంతు లక్షణం"

"సప్తస్వరాస్త్రయోగ్రామా । మూర్ఛనా స్త్వేక వింశతిః ।
తానా ఏకోన పంచాశ దిత్యేతత్స్వర మండలం ।
షడ్జశ్చ ఋషభశ్చైవ । గాంధారో మధ్యమ స్తథా
పంచమో ధైవతశ్చైవ । నిషాద స్సప్తమస్స్వరః ॥"[1]

అను నారదశిక్షలోని శ్లోకములు సంగీతశాస్త్రప్రాతిపదికలను సామవేదమే సమకూర్చుచున్నదని వ్యక్తము చేయుచున్నవి. ఈ కారణముచేతనే సంగీత శాస్త్రము గాంధర్వమను ఉపవేదముగా గుర్తింపబడినది.

ఆదికావ్యమైన శ్రీమద్రామాయణముకూడ గానయోగ్యమైనదే. తంత్రీలయసమన్వితముగా మధురాతిమధురముగా లవకుశులు రామాయణమును రాముని ముందు గానము చేసిరని వాల్మీకియే వక్కాణించియున్నాడు [2] అందువలననే రామాయణము గీతమైనది.[3] ఇక భారత భాగవతములలోని భగవద్గీత, భ్రమరగీతలు, గోపికా గీతలు గానయోగ్యములే యని వాని పేర్లే తెలుపుచున్నవి. భరతుని నాట్యశాస్త్రమునందు సంగీతమునుగూర్చియు ధ్రువాగానాది గేయభణితులను గూర్చియు అనేకాంశములు సూత్రీకరింపబడియున్నవి.

వైదికలౌకికచ్ఛందో విశేషములనుగూర్చి వివరించినవారిలో పింగళుడు ఆద్యుడు. ఈతడు లౌకికచ్ఛందస్సులలో మాత్రాచ్ఛందస్సులను ముందుగా

---

1. వినయాశ్రమము వారి 'ఆంధ్ర వేదములు' 'సామవేదము' - ప్రథమ సంపుటము' ఉపోద్ఘాతము - పుట 1. అనువాదకులు బంకుపల్లె మల్లయ్యశాస్త్రి (మొదటి కూర్పు 1941)

2. "పాఠ్యే గేయేచ మధురం ప్రమాణై స్త్రిభిరన్వితమ్
జాతిభి స్సప్తభిర్యుక్తం తంత్రీలయ సమన్వితమ్
రసైః శృంగార కరుణ హాస్య రౌద్ర భయానకైః
వీరాదిభీ రసై ర్యుక్తం కావ్యమేత దగాయతామ్"—శ్రీమద్రామాయణము. బాలకాండ. సర్గ 4: శ్లో. 8, 9.

3. "అహిగీత మిదం గీతమ్ సర్వగీతిషు కోవిదౌ — శ్రీమద్రామాయణము. బాలకాండ. సర్గ 4: శ్లో. 27.

పేర్కొని, అక్షర చ్ఛందస్సులను తర్వాత పేర్కొనుట విశేషము. లక్ష్యములేని లక్షణముండదుగదా' జయదేవుని 'గీత గోవిందము', 'భానుదత్తుని గీతగౌరీశము', నారాయణ తీర్థుల 'కృష్ణలీలా తరంగిణి' మున్నగు గేయకృతులు గీర్వాణ భారతికి పట్టిన మధురనాదమంగళహారతులు. ప్రాకృతకవితావల్లరులు తీయని గేయాల పందిరులకు అల్లుకొన్నవే. హిందీ మరాఠీ ఉర్దూ కర్ణాటాది భారతీయభాషలలో గేయసాహిత్యమునకున్న ప్రాధాన్యమును జనప్రియత్వమును ఇంతింతనరానివి.

తెలుగులో ఆదికవి నన్నయకు పూర్వమే గేయరచనలు అనేకములున్నట్లు చెప్పుట కాధారములున్నవి. దేశిచ్ఛందస్సునకు చెందిన తరువోజలు, సీసములు, మధ్యాక్కరలు ప్రాఙ్నన్నయయుగశాసనములలో కనిపించుచున్నవి. తరువోజలు ద్విపదకు అర్వాచీనరూపములనివిమర్శకుల అభిప్రాయము. ఖండగతిలో సాగెడు ద్విపదలు గానయోగ్యములు గదా! సీసమునకు మధ్యాక్కరకు ద్విపదకో సంబంధ సంధానము. పాల్కురికి సోమనాథుడు పండితారాధ్య చరిత్రమున భక్తులు తుమ్మెద పదములు, వెన్నెల పదములు, ప్రభాత పదములు, గొబ్బి పదములు మున్నగు దేశిపద్ధతికి చెందిన పలురకముల పదములు పాడుచుండిరని వ్రాసియున్నాడు. ఆతడు తన బసవ పురాణమునకు "ఆతత సకల పురాతన భక్త గీతార్థ సమితి రమే మాతృక" అని చెప్పియున్నాడు. అందువలన నన్నయ కంటె పూర్వమే దేశిచ్ఛందమునకు ప్రజా బాహుళ్యమున ప్రాచుర్య ముండెనని స్పష్టమగుచున్నది. గానయోగ్యమై సామాన్యప్రజాజిహ్వారంగములపై తాండవము సేయగలుగు ద్విపదచ్ఛందస్సునే శివకవు లాశ్రయించుట వారి దృష్టిలో గేయమునకున్న ప్రాధాన్యమును భంగ్యంతరముగా ప్రకటించుచున్నది. తోలుబొమ్మలాటలవారు రంగనాథ రామాయణ ద్విపద ప్రబంధమును భద్రపరచుకొన్నారు. శ్రీనాథుని పలనాటివీరచరిత్ర ప్రజా హృదయాలను అలరెత్తించిన వీరగీతము తాళ్ళపాకవారి కీర్తనలు, తంజావూరు నాయక రాజుల కాలములో జనతాహృదయప్రాంగణాలే నాటకశాలలుగా ప్రవర్తిల్లిన యక్షగానాలు, త్యాగయ్య క్షేత్రయ్య కంచెర్ల గోపయ్యల కృతులు, పదాలు, భజన కీర్తనలు అన్నియు గేయసాహితికెత్తిన వైజయంతికలు. అభినయముతో శ్రుతికలిపి, జంత్ర వాద్యములతో జతగూడి, జనసామాన్యమునకు పారమార్థికతతోపాటు వినోదవిజ్ఞానామృతమును అందించిన హరికథలలో

బుర్రకథలలో గేయమే అంతర్వాహినిగా ప్రవహించినది. ప్రజల కింత సన్నిహిత ముగానున్న ఈ గేయకవితా రీతులు శిష్టుల ఆదరణమునకు అవనీపతుల ఆశ్రయమునకు నోచుకోలేకపోయినవి. నిరాదరణనిదాఘములో నిట్టూర్పుచున్న ఈ గేయ వాఙ్మయము నాయకరాజుల కాలములో గజ్జెకట్టి గద్దెనెక్కినది; హర్ష శీతలచ్ఛాయలలో హాయిగా విహరించినది. ఇక ఆ తరువాత - పండితులకే దిక్కు దివాణములేని పారతంత్ర్యదశలో - పామరుల అండదండలతో బ్రతుకు గేయములకు నిలువ నీడలేకపోయినది. ఆ విపత్కరావస్థయందును కొందరు మనీషులు ఆంగ్ల సాహిత్య ప్రభావముతో ఉద్బుద్ధులై ప్రజాసాహితీవిశేషములను, అందలి విలువలను వెలుపలికి తీయుటకు ప్రయత్నించినారు. అక్షరచ్ఛందస్సులను వదలి మాత్రాచ్ఛందస్సులను పట్టుకొన్నారు. గురజాడ ముత్యాల సరాలు, రాయప్రోలు ప్రబోధగేయాలు, ఆదిభట్ల హరికథా గీతికలు, విశ్వనాథ కిన్నెరసాని పాటలు, నండూరి యెంకి పాటలు, బసవరాజు, దేవులపల్లి కొండల, కృష్ణశాస్త్రి ప్రభృతుల స్వేచ్ఛాగాన ఝురులు గేయకవితకు కొత్త కొత్త పుంతలను చూపుచు, వింతవింత రంగులను సంతరించుచు నవ్యగేయ కవితోద్యమరూపకమునకు నాందీ ప్రస్తావనలు పలికినవి; నవరసాల నొలికించినవి. ఇటీవలి కాలములో గేయకవిత విశ్వరూపము దాల్చినది. శ్రీశ్రీ, ఆరుద్ర, దాశరథి, నారాయణరెడ్డి, పుట్టపర్తి నారాయణాచార్యు, కాళోజి, వానమామలై వరదాచార్య, ఉత్పల సత్యనారాయణాచార్య ప్రముఖులు గేయ కవితా విహాయసములో సరికొత్త పాలవెల్లులను సృష్టించినారు. గేయము ఖండ కావ్యముల దశను దాటి సమగ్ర కథాకావ్యరమణీయావరణములోనికి ప్రవేశించినది.[1] అంతటితో ఆగలేదు. అనేకసాహితీప్రక్రియలకు ఆలంబన మైనది. ఇది శ్రవ్యకావ్యముల మాట. గేయకవిత దృశ్యకావ్యప్రపంచమున కూడ అడుగిడి తన ఉనికిని స్థిరపరచుకొని "నాటకాంతం హి సాహిత్యమ్మ"ను ఆభాణకమునకు ఆదర్శమై నిలిచినది.

ఇంతవరకు మన సాహిత్యమున గేయమునకున్న ప్రమేయమును గూర్చి విహంగదృష్టితో పరిశీలించితిని.

---

1. ఆచార్య డా॥ సి. నారాయణరెడ్డిగారి 'నాగార్జున సాగరము', 'కర్పూర వసంతరాయలు', 'విశ్వనాథనాయడు' వంటి వానిని సమగ్ర గేయ కథా కావ్యములుగా పేర్కొనవచ్చును. మరికొందరు కవులు ఈ ప్రక్రియను చేపట్టి సఫలీకృతు లగుచున్నారు.

# 3. సంగీత ప్రాశస్త్యము

ప్రణవము శబ్దమే; నాదరూపవిశేషమే. ప్రణవము వేదములకు ఆది. ప్రణవమే భగవత్స్వరూపము. నలువ నలుమోములనుండి ప్రసరించు నాలుగు వేదములు, విష్ణుమూర్తి చేతిలోని శంఖము, హరుని కరమునందలి డమరుకము సృష్టి స్థితిలయకారకులు నాదస్వరూపులని నాదప్రియులని నాదాలంకారులని సంగీతమునకు మూలహేతువైన నాదప్రాశస్త్యమును పురాణములు ఘోషించుచున్నవి. 'భావాంబరవీథిప్రశుస విహారిణి' వాగ్దేవి వీణాపాణి. సహస్రశీర్షుడయిన ఆదిశేషుడు నాదమాధుర్యముచేత పరవశించువాడే. సకలలోక నిస్తారకమైన భగవద్గీతను ఉపదేశించిన శ్రీకృష్ణపరమాత్ముడు మురళీగానలోలుడే. దేవగణకిన్నరకింపురుషవిద్యాధరగరుడగంధర్వాప్సరలగానమే మనస్మృతి పథమున తారాడునది సంగీతప్రాశస్త్యములే. సంగీతము దేవతల భాష అని కార్లైల్ పండితుని ఉద్ఘోష.[1] నారదతుంబురులు సంగీతస్వరూపులే కదా! రాక్షసుడైన రావణుడు వీణావాదనకుశలుడట.

ఆదిమానవుని ఆటపాటలే ఆతనిలోని కళాజిజ్ఞాసను అంకురింపజేసి ఆతనిని కళావిదునిగ తీర్చిదిద్దినవి. పలుకలేని, పలికిన పలుకులను అర్థముచేసికొనలేని పసిపాప సైతము పాట విన్నంతనే ఏడుపుమాని కిలకిలనవ్వును. ఉదయన మహారాజు వీణావాదనముతో అడవిఏనుగులను వశపరచుకొనినట్లు భాసుని 'స్వప్నవాసవదత్త' ప్రకటించుచున్నది. విషధరముకూడ నాగస్వరము విన్నంతనే పడగెత్తి నాట్యముచేయుననుట ప్రసిద్ధవిషయము. ఆడ-మగ తేడా లేకుండ, శిశువు-పశువు అను విభేదము లేకుండ సమస్త జీవలోకమును సంతోషాంతరంగులను కావించునది గానకళ. కావుననే "శిశుర్వేత్తి పశుర్వేత్తి వేత్తిగానరసంఫణిః" అను ఆభాణకము ప్రచారమందున్నది. సంగీతము విశ్వమానవ భాష అని మహాకవి - లాంగ్ ఫెల్లో అభియుక్తోక్తి.[2]

---

1. 'Music is well said to be the Speech of anglels' —Carlyle.
2. "Music is the universal language of mankind" – Longfellow 'Outre-Mart'

సంగీతమును, భక్తిని మోక్షసాధనములుగా భావించి తరించిన పవిత్ర చరిత్రుల గాథలెన్నియో ఉన్నవి. పదకవితాపితామహుడైన అన్నమయ్య "ఆడిన మాటెల్ల అమృతకావ్యముగ-పాడిన పాటెల్ల పరమగానముగ" జీవితమునే సంగీతముగా మలచుకొని జీవన్ముక్తుడైన కళాతపస్వి. "సంగీత జ్ఞానము భక్తివినా సన్మార్గము గలదే మనసా" "నీ సద్భక్తి సంగీత జ్ఞానవిహీనులకు మోక్షము కలదా" అని త్యాగరాజు సంగీత మాహాత్మ్యమును ఉగ్గడించినాడు; నాదబ్రహ్మోపాసనచేసి తరించినాడు. వీణావాదన తత్త్వజ్ఞుడును, శ్రుతిజాతి విశారదుడును తాళజ్ఞుడును అయిన సంగీతకళాకోవిదుడు అవలీలగా మోక్షమును సాధించునని వేదర్షియైన యాజ్ఞవల్క్యుడు సంగీతమును మోక్షసాధకముగా పేర్కొన్నాడు.[1] సంగీతశాస్త్ర రహస్యములను సూత్రబద్ధము చేసిన మొట్టమొదటి గ్రంథము సంగీతరత్నాకరము. చతుర్విధపురుషార్థములైన ధర్మార్థకామ మోక్షములకు సంగీతమే పరమసాధనమని ఆ గ్రంథము బోధించుచున్నది.[2]

రామరాజభూషణుడు సంగీతకళారహస్యనిధి. తన వసుచరిత్ర ప్రబంధములోని పద్యముల నెన్నింటినో లయతాళ బద్ధములుగా రచించి సంగీత సాహిత్యముల సరససమ్మేళనమును సాక్షాత్కరింప జేసినాడు. విద్యలలో సంగీతవిద్య అత్యుత్తమమని పింగళి సూరన హృదయము.[3] పదమునకు సొగసును సవదరించునది శ్రుతియని వీరగాథాగాయకుని మతము.[4] అంతర్వాహి

1. "వీణావాదన తత్త్వజ్ఞః శ్రుతిజాతి విశారదః
తాళజ్ఞ శ్చాప్రయాసేన మోక్షమార్గం సగచ్ఛతి" – ఆంధ్రుల సంగీత కళ, మంచాళ జగన్నాథరావు పుట: 41. ప్రచురణ: ఆం. ప్ర. సంగీత నాటక అకాడమి (1975)

2. "తస్య గీతస్య మాహాత్మ్యంకే ప్రశంసితు మీశతే
ధర్మార్థ కామమోక్షాణా మిదమేవైక సాధనమ్" – శార్ఙ్గదేవుని సంగీత రత్నాకరము
స్వరగతాధ్యాయము – పదార్థ సంగ్రహ ప్రకరణము శ్లో. 30.
ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమి ప్రచురణ (1966)

3. "విద్యలందెల్ల సంగీత విద్య మిగుల
ఉత్తమముగాదె యది పురుషోత్తమునకు
నర్పితం బగునేని యేమని నుతింతు" —సూరన కళా పూర్ణోదయము.
అశ్వా. 2: పద్యము 63

4. కాటమరాజు కథ – గంగుల పినయెల్లయ.

రింద్రియములనే కాక ఆత్మకు సైతము శాంతిని ప్రసాదింపగజాలు గానకళ సర్వకళలలో శ్రేష్ఠమైనదని పానుగంటి లక్ష్మీనరసింహారావుగారు సువ్యక్త పరచినారు.[1] స్వాంతమునందు సంగీతము లేనివాడు, మధురనాద తరంగములకు స్పందించనివాడు, కుట్రలకు, కూహకాలకు, దౌష్ట్యాలకు, దౌర్జన్యాలకు సైదోడని మహాకవి షేక్స్పియరు సంగీత మాహాత్మ్యమును ఆవిష్కరించినాడు.[2] భువిలోని మానవాంతరంగములను రసార్ద్రపునీతముచేసి దివికి తీసికొనిపోగల శక్తి సంగీతమునకున్నదని అమెరికా మహాకవి లాంగ్ ఫెల్లో గానము చేసినాడు.[3]

ఇంతవరకు మనీషిసత్తములు వెలిబుచ్చిన అభిప్రాయములను ఊతగాగొని సంగీతము మోక్షసాధనముగను అతీంద్రియ శక్తి సమన్వితముగను మానవ జీవితమునందు నిలిచిపోయిన తీరుతెన్నులను గూర్చి నిరూపించుటకు ప్రయత్నించితిని. ఐహిక జీవితమునందు కూడ సంగీతమునకున్న ప్రాచుర్యము అనన్య సామాన్యమైనది. అంతస్సులను ఆకట్టుకొను శక్తి సంగీతమునకు ఉన్నందువలననే మతాలను, స్వీయాభిమతాలను జనబాహుళ్యములో ప్రచారము చేయుటకు దానిని ఎప్పటినుండియో మానవులు ఉపయోగించుకొనుచునే ఉన్నారు. గానయోగ్యమైన ద్విపదను చేపట్టి పాల్కురికిసోమనాథుడు వీరశైవమత ప్రచారమును గావించియున్నాడు. వీరగాథా గానము లెన్నియో వీరభటులలో

---

1. "కన్నులకుఁ జల్వ చెవులకుఁ గ్రమతయును
శ్వాస సంస్తంభనమున నాసకును బలిమి,
గాత్రమున రోమహర్షణ కలన మఱియు
మనసునకుఁ దాండవంబు నాత్మకును శాంతి
సర్వరోగ సంహరణము జనులకిచ్చు
గానకళ సర్వ కళలలో మానితంబు' — (పానుగంటి - మాలతీమాల)

2. "The man that hath no music in himself
Nor is not moved with concord of sweet sounds
Is fit for treasons – Stratagems and Spoils"
Shakespeare 'The Merchant of Venice' Act v - Sc. 1.

3. "God sent his singers upon earth
With songs of sadness and of mirth
That they might touch the hearts of men
And bring them back to heaven again." —"The Singers"
H. M. Long fellow.

సమరోత్సాహమును జ్వలింపజేసినవే. ముత్తుస్వామి దీక్షితుల 'అమృత వర్షిణి' రాగాలాపన వలన కుంభవృష్టి కురిసినదట. అక్బరు సార్వభౌముని ఆస్థాన గాయకుడు తాన్‌సేనుడు దీపకరాగమాలపించి దివ్వెలను వెలిగించెనట. సంగీత ప్రసరణము వలన సమధికములైన పంటలను పండించవచ్చునని ఆధునిక శాస్త్ర పరిశోధనలు నిరూపించుచున్నవి. సంగీత శ్రవణముచే కొన్ని వ్యాధులను ఉపశమింప జేయవచ్చునని విజ్ఞులు చెప్పగా వినియుంటిని. ఇట్టి అంశములు సంగీత కళకున్న సముజ్జ్వలశక్తి సామర్థ్యములను నిరూపింప గలుగుచున్నవి. ఈ శక్తి సామర్థ్యముల స్వరూప స్వభావములను వివరించుటకు ప్రయత్నింతును.

లలితకళలలో శ్రవ్య కళలైన కవిత్వ సంగీతములందు వర్ణ్యవస్తువు చిత్ర విచిత్ర గతులతో చలించిపోవుచుండును. అందుచేతనే ఇవి చరకళలుగా పేర్కొనబడినవి. సంగీతమునందలి ఈ చరత్వమును కీ॥ శే॥ ఆచార్య సింగళి లక్ష్మీకాంతము గారు ఇట్లు వివరించినారు— "చరకళలలో సంగీతమునందు, ఆ చలనము ప్రవాహగతిగా సాగును. గానమునకు ద్రవ్యము నాదము. మంచి గాత్ర సంపదగల గాయకునినోట అది వెలువడినప్పుడు తాల్చెడి మాధుర్యగుణమే అందలి సౌందర్యము. ఆ నాదము రాగాలాపన, స్వరప్రస్తర, విలంబద్రుతతాళ గతులతో వెల్లివిరియుట దాని చలనము. ఈ చలనమే ఆ నాదమాధుర్యమునకు మోహనత్వమును కలిగించును".[1] నాదమునందలి ఈ చలనమాధుర్యముతే హృదయమును ద్రవింపజేసి ఆనందపారవశ్యములను కలిగించును. అమోఘమైన రసానందసంధానశక్తి సంగీతమునకున్నట్లుగా మరొక్క కళకు లేదు. అందువలననే "సంగీతమపి సాహిత్యం సరస్వత్యాః స్తనద్వయమ్ - ఏకమాపాత మధుర మన్యదాలోచనామృతమ్" అను ఉభియుక్తోక్తి ప్రాచుర్యమునందినది. కవిత్వమును ఆస్వాదించుటకు సహృదయత, వ్యుత్పన్నత అత్యావశ్యకములు. కాని సంగీతమును ఆస్వాదించుటకు కేవలము వినగలిగిన చెవులుండిన చాలు. సంగీతమును విని సస్యములు ఫలించుట లేదా ? శిశువులు ఆనందరసాంబుధిలో ఓలలాడుటలేదా ? పూత్కరించు ఫణి ఫణమెత్తి నాట్యము సేయుట లేదా ? మేఘములు వర్షించుటలేదా ? జ్యోతులు వెలుగుటలేదా ?- ఇవన్నియు ఆలోచనాపరవశములై ప్రవర్తిల్లి యుండెనా ?- కాదనియే సమాధానము. కనుకనే సంగీతము ఆపాతమధురమనియును, కవిత్వము ఆలోచనామృత

---

1. సాహిత్య శిల్ప సమీక్ష: పుట. 16: ప్రచురణ (1966)

మనియును ప్రచారకునందున్న అంశము అక్షరసత్యము. ఇంద్రియములలో తాను మనస్సు అయినట్లు గీతాచార్యుని వచస్సు.[1] అట్టి మనస్సును చలింపజేసి మాధుర్యానుభూతికి గురిచేసి వెలుగొందునది సంగీతము. పరమాత్ముని సైతము కదిలింపగాజాలిన శక్తి సంగీతమునకెట్లు కలిగినది ?– సంగీతము నాదాత్మకమని ఇతఃపూర్వమే చెప్పియుంటిని. నాదోత్పత్తిని గూర్చి శార్ఙ్గదేవుని అభిప్రాయమును ఇట పొందుపరచి స్పష్టీకరించుటకు యత్నింతును. శార్ఙ్గదేవుడు నాదమునకిచ్చిన నిర్వచనమిది :

"నకారం ప్రాణనామానం దకారమనలంవిదుః
జాతః ప్రాణాగ్ని సంయోగాత్తేన నాదోఽభిధీయతే"[2]

"నకారము ప్రాణముగను దకారము నగ్నిగను బుధులెఱింగిరి. ప్రాణాగ్ని సంయోగమున బుట్టినది యగుటంజేసి యది నాదమని చెప్పఁబడుచున్నది." ఈ విషయమునే సుప్రసిద్ధ వాగ్గేయకారులు, సంగీతసాహిత్య కళాపారీణులు, బహుభాషాకోవిదులు, ప్రామాణికవిమర్శకులు శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యుల వారు ఈ విధముగా వ్యాఖ్యానించినారు— "ఆత్మకు సంకల్పము కలుగును. అప్పుడది మనస్సు నుద్బోధించును. ఆ మనస్సు నాభియందున్న యగ్నిని గొట్టును. అగ్ని - వాయువును ప్రేరేచును. ఈ కార్యతంత్రమే నాదమునకు - "పురుడు" దీర్చుట."[3]

అగ్ని తేజస్స్వరూపము. అది శక్తికి ప్రతీక. వాయువు చలనస్వరూపము. అది ప్రాణమునకు (జీవమునకు) ప్రతీక. కనుక అనలము అనిలము కలిసి ఒక్కటియై మహోద్భుతశక్తిని సంతరించుకొని రసపానమధురసంగీతరూపముతో విశ్వమును వశీభూతమొనర్చుకొనుచున్నది.

---

1. "ఇంద్రియాణాం మనశ్చాస్మి" —భగవద్గీత - విభూతి యోగము. శ్లో. 22.
2. సంగీత రత్నాకరము - స్వరగతాధ్యాయము - నాదస్థాన శ్రుతి స్వరజాతికుల దైవతర్షి చ్ఛందోరస ప్రకరణము : శ్లో. 6; పుట 31. తెలుగు అనువాదము - శ్రీ గంధం శ్రీరామమూర్తి. ప్రచురణ : ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ (1966)
3. వాగ్గేయ కారులు - పదకృతి సాహిత్యం. పుట. 1. ప్రచురణ ఆం. ప్ర. సంగీత నాటక అకాడమీ 1975.

# 4. రూపకములు - సంగీతనృత్యములు

సంస్కృతమునందలి రచనాప్రక్రియలన్నియు తెలుగులో ప్రవేశించినను రూపకము మాత్రము 19వ శతాబ్దము ఉత్తరార్ధమున గాని అవతరించలేదు. ఇట్లవతరింపకపోవుటకుగల కారణములు ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు ఇట్లూహించియున్నారు. "సంస్కృత నాటకములలోఁగానవచ్చు పాత్రానుగుణ భాషా ప్రయోగము తెలుఁగున నప్పుడు సాధ్యము కాకపోవుటయు, లాక్షణికు లెవ్వరును రూపకలక్షణములను వివరింపకపోవుటయు, నాటక ప్రదర్శనమునకుఁ దగిన రంగపరికరాదులు లేకపోవుటయు, నటులు సంఘబాహ్యులుగాఁబరిగ ణింపఁబడుటయు నందుకుఁగారణములై యుండునని యూహింపవచ్చును."[1] ప్రయోగదృష్టితో పరిశీలించినపుడు సంగీతరూపకనిర్వహణము సామాన్య రూపకనిర్వహణము కంటె కష్టతరము. ఈ కారణముచేతనే సంగీతరూపకములు తొలినాళ్లలో ఎక్కువగా శ్రవ్యరూపకములుగనే వెలువడినవి. అందుకు ఆకాశవాణి వారి ప్రోత్సాహము కూడ వానికి లభించినది. ఈ గేయరూపక ప్రక్రియ అత్యాధునికమైనదనియు, పాశ్చాత్య ప్రభావముచేత వెలసినదనియు కొందరు విమర్శకులు ఊహించియున్నారు ఈ ఊహ పూర్తిగా సరియైనది కాదని నేను ముందు ముందు నిరూపించుటకు యత్నింతును. ప్రస్తుతము గేయ నాటికయందలి ప్రధానాంగములైన గీతనృత్యములు భరతుని కాలమునుండి రూపకములలో చోటుచేసికొనిన తీరు తెన్నులను గూర్చియు ఈనాటి గేయ నాటికారూపకల్పనకు ప్రత్యక్షముగనో పరోక్షముగనో దోహదముచేసిన రూపక విశేషములను గూర్చియు పరిశీలింతును. సంస్కృతరూపకములనేకాక, సంగీతాభినయములను ఆధారముగా చేసికొని ప్రజా బాహుళ్యమును ఉర్రూతలూగించిన హరికథ, బుర్రకథ, జముకులకథ, యక్షగానము, వీధి భాగవతము మున్నగు దేశీయదృశ్య కళావిశేషములను గూర్చియు వివరించుచు నేటి

1. ఆంధ్ర వాఙ్మయచరిత్రము – పుట 134. 1971 ప్రచురణ.

గేయనాటికావతరణకు ఈ కళా రూపాలు క్రమముగా దారితీసిన విధానమును స్పష్టపరతును.

గీతనృత్యములు గేయనాటికా నిర్మాణ ప్రాతిపదికలు. ఇవి ఏ రూపకమునకైనను లాలిత్యమును రంజకత్వమును అధిక్యమును ఆపాదించి రూపక సౌందర్య సమగ్రతకు సౌష్ఠవమునకు సర్వవిధముల సాహాయ్యపడును. ఇవి లేని రూపకము రసానందసంధాయకము కాదు. ఈ అభిప్రాయమే నాట్య శాస్త్రములో నాట్యోత్పత్తి అధ్యాయమున కైశికీవృత్తి ప్రయోజన సందర్భమున భరతుడు ప్రపంచించియున్నాడు. ఇక రూపకమునందు సంగీతనృత్యము లకు సంబంధించిన అంశములను వివరింతును.

## (1) కైశికీవృత్తి :

బ్రహ్మ ఉపదేశించిన నాట్యవేదమును - భారతి, సాత్త్వతి, ఆరభటి వృత్తులతో కూడిన ప్రయోగమును - ఒకసారి భరతుడు బ్రహ్మసన్నిధిలో ప్రదర్శించి చూపగా అతడు భారత్యాది వృత్తులతోపాటు కైశికీవృత్తినికూడ చేర్చవలసినదిగా ఆదేశించి, అందుకు తగినట్లుగా నాట్యాలంకారచతురలైన అనగా కైశికీవృత్తి ప్రయోగమునందు నిపుణలైన అప్సరసలను సంకల్ప మాత్రమున సృజించి భరతున కిచ్చినాడు. ఈ అప్సరసలనేకాక వాద్య నిర్వహణార్థమై సశిష్యుడైన 'స్వాతి' మునిని, గీతగానముకొరకు నారద గంధర్వులను నియమించినాడు. వీరి సహకారముతో కైశికీవృత్తినికూడ చేర్చి భరతుడు నాట్యవేదమును సమగ్రముగను ఫలప్రదముగను ప్రయోగించినాడు. ఈ విషయము నంతయు భరతుడు నాట్యశాస్త్రమున ప్రథమాధ్యాయమునందే తెలిపియున్నాడు. అతడు ఇరువదవ అధ్యాయమున వృత్తులను గూర్చి వివరించుచు ఈ కైశికీవృత్తిని తాను బ్రహ్మ ఆజ్ఞను అనుసరించి సామవేదము నుండి సంగ్రహించినట్లు పేర్కొన్నాడు. కావున కైశికీవృత్తి గేయ బంధురము.

కైశికీవృత్తికి నాట్యశాస్త్ర మందున్న లక్షణమిది. "సుకుమార వస్త్ర మాల్యాదులచే చిత్రమైనదియును, గీతనృత్తబహుళమును, స్త్రీలచే ప్రయోగింప బడునదియును, కామోపభోగముచే (రతిచే) జనించునదియును అగు వ్యాపారము

'కైశికీవృత్తి' అనబడును."[1] (నాట్యశాస్త్రము-అనువాదము-డా॥ పి. ఎస్.ఆర్ అప్పారావుగారు - పుట 617)

ఈ కైశికీవృత్తిలోని గీత నృత్తములు నేటి గేయనాటికకు ప్రధానాంగములుగ వర్తిల్లుచున్నవి. వీనులకును కనులకును విందు ఒనగూర్చుచు మనసును ఆనందింపజేయు సంగీతనృత్త సంయుక్తమైన ఈ కైశికీవృత్తి రూపకమునకు ఒక ఆకర్షణను రమణీయతను ఆపాదించి భిన్న భిన్న రుచులున్న పండితపామరులను పరమానందభరితులను చేయుననుట అత్యుక్తి కాదు.

## (2) పూర్వ రంగాంగములు :

పూర్వ రంగమునందలి ప్రత్యాహార, అవతరణ, ఆరంభ, ఆశ్రావణ, వక్త్రపాణి, పరిఘట్టన, సంఘోటన, మార్గాసారిత, ఆసారితము అను తొమ్మిది అంగములు గీతవాద్యములకు సంబంధించినవే. యవనికలోపల నిర్వర్తింప బడుటచే ఇవి అంతర్యవనికాంగములనియు అనబడును. ఇవియేగాక, యవనిక వెలుపల నిర్వర్తింప వలసిన అంగములు గీతవిధి, ఉత్థాపనము, చారి, మహాచారి అవకృష్టధ్రువ మున్నగునవి గీతనృత్యవాద్యములతో ప్రవర్తిల్లునవే.[2]

## (3) లాస్యాంగములు :

రూపకములలో నృత్యగీతముల ప్రసక్తి లాస్యాంగములయందు కనిపించుచున్నది. పార్వతిచేయు సుకుమారాభినయము లాస్యము. లాస్యము అంగముగా కలిగినది లాస్యాంగము. లాస్యము కైశికీవృత్తిలోని అంశమే. లాస్యాంగములు పది అవి - గేయపదము, స్థితపాఠ్యము, ఆసీనము, పుష్పగండిక, ప్రచ్ఛేదకము, త్రిమూఢకము, సైంధవకము, ద్విమూఢకము, ఉత్తమోత్తమకము, ఉక్తప్రత్యుక్తము; వీనిలో గేయపదము, పుష్పగండిక,

---

1. "యాశ్లక్ష్ణనేపథ్య విశేష చిత్రా
స్త్రీ సంయుతా యా బహునృత్తగీతా
కామోపభోగ ప్రభవోపచారా
తాం కైశికీం వృత్తి ముదాహరన్తి" - నాట్యశాస్త్రము, అధ్యాయము 20. శ్లో. 46.
(నిర్ణయ సాగర ముద్రణ : బొంబాయి 1943)

2. నాట్యశాస్త్రము - 5వ అధ్యాయము.

త్రిమూఢకము, సైంధవకము ద్విమూఢకము, ఉక్తప్రత్యుక్తము అనునవి నృత్యగేయబంధురములు. వాని స్వరూపమిది.

"**గేయపదము :** ఆసనములందుపవిష్టులైన గాయనులు తంత్రీభాండవాద్య సహితముగా శుష్క (అభినయ శూన్యముగా) గానముచేయుట 'గేయపద'మన బడును. (ఉదా : నాగానందమునందు ప్రథమాంకమున మలయవతి వీణపై పాడుట). ప్రియగుణాన్వితమైన గేయమును సాంగోపాంగవిధానముచే అభి యించుటయును 'గేయపద' మనబడును.

**పుష్ప గండిక :** గానాశ్రితమగు గేయమును వివిధ నృత్తములతో, పురుష చేష్టలతో ప్రదర్శించుట 'పుష్ప గండిక' అనబడును. (ఉదా : 'రత్నావళి' యందలి ద్వితీయాంకమందు దీని కుదాహరణము కలదు) వివిధములైన నృత్తములు, ఆతోద్యసంయుతమగు గేయము, స్త్రీ, పురుష వేషమున చరించుట అను ఈ మూడును ఎచ్చట ఉండునో అది 'పుష్ప గండిక' అనబడును.

**త్రిమూఢకము :** పరుషములును తీవ్రములునుకాని పదములచేతను, సమవృత్తములచేతను అలంకృతమైనదియును, పురుషభావాఢ్యమును అయిన నాట్యము 'త్రిమూఢక' మనబడును. ('రత్నావళి' యందలి ద్వితీయాంకమందు దీని కుదాహరణము కలదు).

**సైంధవకము :** వీణావాద్యాది క్రియాన్వితమును, ప్రాకృతవచన యుక్త మును అగుచు విభ్రష్ట సంకేతముగల పాత్రతో కూడిన నాట్యము 'సైంధవక' మనబడును. ('రత్నావళి' యందలి ద్వితీయాంక మిందులకుదాహరణము.)

**ద్విమూఢకము :** గీతాంగకములైన ముఖ - ప్రతిముఖములతో ఉపేత మును, చతురశ్ర పదక్రమమును, శ్లిష్టభావరసోపేతమును, వైచిత్ర్యార్థ మును అగు నాట్యము 'ద్విమూఢక' మనబడును. ('రత్నావళి' యందలి ద్వితీయాంక మిందులకుదాహరణము).

**ఉక్తప్రత్యుక్తము :** కోపప్రసాదజనితమును, సాధిక్షేపపదాశ్రయమును, చిత్రగీతార్థయోజితమును అగునది 'ఉక్తప్రత్యుక్త' మనబడును.[1] ('రత్నావళి'

1. ఈ లాస్యాంగములు బొంబాయి (నిర్ణయ సాగర ముద్రణ) వారి నాట్యశాస్త్రములో 18వ అధ్యాయాంతమున 182 నుండి 193 వరకు గల శ్లోకములలో పేర్కొన బడినవి.

యందలి తృతీయాంకమునందు దీనికుదాహరణము కలదు)." (భరతుని నాట్యశాస్త్రము - అనువాదము డా॥ పి. ఎస్. ఆర్. అప్పారావు. 19వ అధ్యాయము - పుటలు 581 నుండి 583 వరకు).

రూపకములలో నృత్యగేయములున్న సన్నివేశములను లాస్యాంగములనుటలో విప్రతిపత్తి ఉండదు. రమ్యములైన ఈ నృత్యగేయముల కూర్పుతోనే రూపకమును వినిర్మించుట గేయనాటికా రచనమనిపించుకొనును.

## (4) ధ్రువాగానము :

రూపక ప్రయోగమునందు సంగీతమునకున్న ప్రమేయమును పరిశీలించిన ఎడల స్పష్టముగా తెలియవచ్చునది కైశికీవృత్తియని ఇదివరకే వివరించితిని. ఈ కైశికీవృత్తి నిర్వహణమునకు బ్రహ్మ నారదతుంబురులను అప్సరసలను నియోగించినాడు. భరతుడు వీరి సాహాయ్యమున రూపకమును సుఖదముగను, రసప్రదముగను ప్రయోగించినాడు. నారదాదులు రూపకమునందు గానమును ప్రయోగించు సందర్భములను యోజించి గీతాంగముల వైవిధ్యమును కూడ నిర్దేశించినారు. ఆ గానవిశేషములనే 'ధ్రువాగాన' మందురు. నిజమునకు ఈ గానములు చతుర్విధాభినయములవలన ఉదయించు రసమునకు అనువైన వాతావరణమును ఏర్పరచి సామాజికుని హృదయమున తాదాత్మ్యమును సంఘటింపజేయును. ఈ ధ్రువాగాన ప్రయోజనమును గూర్చి భరతుడు ఇట్లు వివరించినాడు-

"వర్ణ సంయోగములేని చిత్రము శోభాజనకము కానట్లే ధ్రువాగానములేనిదే నాట్యము రక్తికట్టదు"[1] (నాట్యశాస్త్రము - డా॥ పి. ఎస్. ఆర్. అప్పారావుగారి అనువాదము. పుట - 824)

ధ్రువల స్వరూప స్వభావములను, వానిని ప్రయోగించు సందర్భములను, -వాని వలన సాధింపనగు ప్రయోజనములను, వాని భేదములను భరతుడు విపులముగా వివరించియున్నాడు. అతడు 'ధ్రువ' శబ్దమునకు సార్థక్యమును ఇట్లు వివరించినాడు.

1. "యథా వర్ణాదృతే శోభతే న నివేశనమ్
ఏవమేనం వినాగానం నాట్యం రాగం నగచ్ఛతి" నాట్యశాస్త్రము 32వ అధ్యాయము.

"వాక్యములు, వర్ణములు, అలంకారములు, యతులు, పాణులు, లయలు అనునవి ఇందు అన్యోన్య సంబద్ధములగుచు స్థిరత్వమునందుచున్నవి కాన ఇది ధ్రువ అనబడెను"[1] (నాట్యశాస్త్రము-డా॥ పి. ఎస్. ఆర్. అప్పారావు గారి అనువాదము - పుట 807)

సంగీత సాహిత్యాభినయముల సరసమైన సమన్వయము ఈ ధ్రువలలో ధ్వనించుచున్నది. ఇక ధ్రువాప్రయోగవిషయమున గమనింపవలసిన అంశములను గూర్చి భరతుడిట్లు సూచించినాడు-

"వస్తువును, ప్రయోగమును, ప్రకృతిని, రసమును, భావమును, ఋతువును, దేశమును, కాలమును, అవస్థను, వయస్సును ఎరింగి ధ్రువను ప్రయోగించవలెను"[2] (నాట్యశాస్త్రము - డా॥ పి. ఎస్. ఆర్. అప్పారావు గారి అనువాదము - పుట 818).

"**ధ్రువాభేదములు :** 'వివిధవృత్తములకు సంబంధించినవై ఉత్తమ - మధ్యమ - అధమ ప్రకృతులు కలిగినవై యథాస్థానరసోపేతములై ధ్రువలు ఐదు విధములుగా నుండును.

**1. ప్రావేశికి :** నానారసార్థముల ననుసరించి పాత్రల ప్రవేశ సమయమున చేయబడు ధ్రువాగానము 'ప్రావేశికీ ధ్రువాగానము' అనబడును.

**2. నైష్క్రామికి ;** ప్రస్తుత విషయస్తుతి పరముగ అంకాంతమున పాత్రల నిష్క్రమణసమయమున చేయబడు గానము 'నైష్క్రామికీగానము' అనబడును.

**3. ఆక్షేపికి :** ద్రుతతాలముతోపాటు నృత్త విధియందు క్రమమును విడిచినపుడు చేయబడు ధ్రువాగానము 'ఆక్షేపికీ ధ్రువాగానము' అనబడును. ఈ ధ్రువకు ద్రుతధ్రువ, స్థితధ్రువ అనియు పేర్లు కలవు.

---

1. "వాక్యవర్ణాహ్యలంకారా యతయః పాణయోలయాః
ధ్రువ మన్యోన్య సంబద్ధా యస్మాత్త స్మాద్ధ్రువా స్మృతాః"
నాట్యశాస్త్రము - 32 వ అధ్యాయము.

2. "వస్తుప్రయోగం ప్రకృతం రసభావాశ్రితం చ యత్
దేశం కాలమవస్థాం చ జ్ఞాత్వా యోజ్యా ధ్రువా బుధైః"
నాట్యశాస్త్రము - 32 వ అధ్యాయము.

**4. ప్రాసాదికి :** రసాంతరోపగతమగు సామాజిక హృదయమున ప్రకృత రసానుభవమునకు తగిన ప్రసాదమును కల్గించు ధ్రువాగానము 'ప్రాసాదికీ ధ్రువాగాన' మనబడును

**5. అంతర :** ఎక్కువభారముచే క్రుంగినపుడు, మూర్ఛనందినపుడు, పతనము చెందినపుడు, దోష ప్రచ్ఛాదనము చేయవలసిన సమయమున, విషాదము చెందినపుడు, విస్మృతి చెందినపుడు, క్రోధము కల్గినపుడు, నిద్రపోయినపుడు, మత్తత కల్గినపుడు చేయబడు ధ్రువాగానము 'అంతరా ధ్రువాగానము' అనబడును."[1] (నాట్యశాస్త్రము - డా॥ పి. ఎస్ ఆర్. అప్పారావుగారి అనువాదము 32వ అధ్యాయము. పుటలు - 808, 816, 817)

వివిధములైన ఈ ధ్రువలను ప్రయోగించునపుడు దేశకాల పాత్రముల ననుసరించి లయతాళగతి స్వరములను, భాషాచ్ఛందస్సులను, ఉపమానములను భరతుడు విపులముగా సూత్రీకరించి యున్నాడు.

గేయనాటికారచనాప్రయోగదక్షులైన శ్రీ బాలాంత్రపు రజనీకాంత రావుగారు 'ప్రాచీన ఆధునిక సంగీత నాటకాలు' అను వ్యాసమునందు ధ్రువల ప్రాధాన్యమునుగ్గడించుచు అవి యక్షగానము నందలి దరువులేయనియు,

---

1. "నానారసార్థయుక్తా నృణాం యానీ (గీ?) యతే ప్రవేశేషు
ప్రావేశికీ తు నామ్నా విజ్ఞేయాసా ధ్రువాతజ్ఞైః
అంకాంతే నిష్క్రమణే పత్రాణాం గీయతే ప్రయోగేషు
నిష్క్రామోప గతగుణం విద్యాన్నై (న్నై?) ష్క్రామికీం తాంతు
క్రమముల్లంఘ్య విధిజ్ఞైః క్రియ న్తేయా ద్రుతలయేన నాట్య విధౌ
ఆక్షేపికీ ధ్రువాసౌ ద్రుతాస్థితా వాపి విజ్ఞేయా
యాచ రసాన్తర ముపగత మాక్షేప వశాద్ధ్రుతం ప్రసాద యతి
రాగ ప్రసాద జననీం విద్యాత్ప్రాసాదికీం తాంతు
విష సంమూర్ఛితే భ్రాన్తే వస్త్రాభరణ సంయమే
దోషప్రచ్ఛాదనే యాచ గీయతే సాన్తరాచ్ఛదా"
["విషణ్ణే విస్మృతే క్రుద్ధే సుప్తే మత్తేఽథ సంగతే
గురుభారా వసన్నే చ మూర్ఛితే పతితే తథా" కాశీ పాఠము - (పాఠాంతరము)
[నాట్యశాస్త్రము-32వ అధ్యా. శ్లో. 318 నుండి 322 వరకు
బొంబాయి (నిర్ణయ సాగర) ముద్రణ : 1943. పుట 589.]

అందువలన సర్వలక్షణలక్షితములైన సంగీతనాటకములు మనదేశములో పాశ్చాత్యుల ఆపెరాలకన్న ఇరువది శతాబ్దములకు ముందే వెలసినట్లు అభిప్రాయపడి యున్నారు.[1]

ధ్రువాగాన ప్రయోజనమును గూర్చి చెప్పుచు భరతుడు- "వాక్యములచే వాచ్యము చేయరాని విషయమును మాత్రమే ధ్రువాగీతులచే చెప్పవలెను"[2] అని వివరించెను. ఇప్పటి గేయనాటికలందు కూడ ఇతివృత్తమునందలి అనేకాంశములను వాచ్యముగా గాక గీతముల ద్వారమును, వాద్య సంగీతము ద్వారమునను ప్రయోగించుచున్నారు. నేటి చలనచిత్రములందును, రంగస్థల నాటకములందును పాత్రల సంభాషణములందలి భావములకు, పాత్రల అభినయములకు ఆయా సన్నివేశములకు సంబంధించిన రసములకు అనుకూలముగను వాద్యసంగీతమును ఉపయోగించుటనునది సర్వసాధారణము. ఈ విధముగా గీతవాద్యనృత్యములకు రూపక ప్రయోగమునందు కైశికీవృత్తి ధ్రువాగానాదుల ద్వారమున విశేష ప్రాముఖ్యమును భరతుడు కల్పించి, రూపకములకు లాలిత్య రామణీయకములను సమకూర్చు ప్రధాన సాధనములు సంగీతనృత్యములే అను యాథార్థ్యమును ప్రకటించినాడు.

**దశవిధరూపకములు - కైశికీవృత్తి :** దశవిధరూపకములలో సంగీత నృత్యాంశములున్న కైశికీవృత్తి, భారతీ, సాత్త్వతీ ఆరభటీ వృత్తులతో పాటు

---

1. "12 వ శతాబ్ది మాట అటుంచి, క్రీస్తుకు పూర్వం సుమారు 10 వ శతాబ్దినుంచి 4 వ శతాబ్ది వరకూ ఎప్పటివాడో స్పష్టంగా తెలియని భరతాచార్యుని నాట్యశాస్త్రంలోనే నాటకాలలోని ప్రావేశికీ, నైష్క్రామికీ ధ్రువాగానాలు - మన తెలుగు యక్షగానాల్లో అనాదిగా వినవస్తూ పాత్రలు ప్రవేశించేటప్పుడూ, నిష్క్రమించేటప్పుడూ గానంచేసే దరువులే అని పరిశోధకులు స్పష్టపరిచారు. దీనినిబట్టి పాశ్చాత్య దేశాలలో ఆపెరాలు బయలుదేరడానికి సుమారు 20 శతాబ్దాలు ముందే మనదేశంలో సంగీత నాటకాలు సర్వలక్షణలక్షితాలై పరిఢవిల్లినట్లు తేటతెల్ల మవుతోంది' - తెలుగు నాటకరంగం - పుట 94; ప్రత్యేక సంచిక - ప్రచురణ : కళావని, హైదరాబాదు (1966)
2. నాట్యశాస్త్రము-32 వ అధ్యాయము. అనువాదము డా॥ పి. యస్. ఆర్. అప్పారావుగారు. పుట - 819.

మూలము : "యాని వాక్యైస్తు న బ్రూయాత్తాని గీతై రుదాహరేత్"
(నాట్యశాస్త్రము - 32 వ అధ్యా. శ్లో. 357. బొంబాయి (నిర్ణయ సాగర) ముద్రణ 1943).

నాటక ప్రకరణములలో సంపూర్ణముగను, వీథిలో స్వల్పముగను ప్రయుక్త మగుచున్నది. భాణములో గేయపదాదిదశవిధలాస్యాంగములు చోటు చేసికొన్నవి.

భరతుడు దశవిధరూపకములను పేర్కొని నాటికను ప్రత్యేకముగా పేర్కొన్నాడు దీనిలో ఒకే ఒక వృత్తి - అది కైశికి. మనోహరమైన ఈ వృత్తికి ప్రాముఖ్యము నీయదలంచియే భరతుడు నాటక ప్రకరణముల మేలి కలయికతో నాటికను సృష్టించినట్లు ఊహింపవచ్చును.

కైశికీవృత్తి నృత్య గేయాత్మకము. ఈ కారణముచేతనే భరతుని తరువాత వెలసిన రూపకలాక్షణికులు నృత్యగేయ ప్రధానములైన ఉపరూపకములలో నాటికను గూడ చేర్చుకొని యున్నారు. భరతుడు ఉపరూపకములను గూర్చి తెలుపకపోయినను, ఆతడు సూచించిన నాటికాలక్షణములను దృష్టి యందుంచుకొని, నాటికను ఒక ఉపరూపకముగా గుర్తించి, మరికొన్ని ఉపరూపకములను సోదాహరణముగా ఈ లాక్షణికులు వివరించినారు. ఈ విధముగా ఉపరూపకప్రక్రియకు పరోక్షముగా భరతుడే మార్గదర్శకుడు. ఆతని నాటిక ఉపరూపకావతరణమునకు అనువైన భూమిక.

—o—

# 5. ఉపరూపకములు

ఉపరూపకములు నృత్య గేయ ప్రధానములని ఇదః పూర్వము చెప్పి యున్నాను. ఈ ఉపరూపకములను సంకేతమును మొట్టమొదట ఉపయోగించినవాడు పదునాల్గవ శతాబ్దమునకు చెందిన విశ్వనాథ కవిరాజు. ఇతనికి ముందు కోహలుడు, అభినవగుప్తుడు, హేమచంద్రుడు, శారదా తనయుడు, భోజుడు ఉపరూపకములను పేర్కొనిరే కాని వానికి ఆ సంకేతము నీయలేదు. వానిని అభినవగుప్తుడు గేయరూపకములనియు నృత్తప్రకారములనియు రాగ కావ్యములనియు పేర్కొనినాడు.[1] ఆతడు చెప్పిన గేయరూపకములు-- డోంబికా-భాణ-ప్రస్థాన- షిద్గక - భాణికా - ప్రేరణ - రామాక్రీడ - హల్లీసక - రాసకములు.[2]

అగ్ని పురాణము భరతుని దశరూపకములనే కాక మరి పదునేడు ఉపరూపకములను పేర్కొన్నది. అవి-తోటక - నాటికా - సట్టక - శిల్పక - కర్ణ-దుర్మల్లికా - ప్రస్థాన - బాణికా - భాణీ - గోష్ఠి - హల్లీశక - కావ్య - శ్రీగదిత - నాట్యరాసక - రాసక - ఉల్లోప్యక - ప్రేరణములు.[3]

కోహలుడు పేర్కొన్న ఉపరూపకములను గూర్చి డా॥ పి. ఎస్. ఆర్. అప్పారావుగారు ఇట్లు వివరించినారు— "ఉపరూపకములను పెంపొందించిన ఖ్యాతి కోహలునికి దక్కినది. ఆతడు ఉపరూపకములందు మార్గదేశి భేదము

1. నాట్యశాస్త్రమ్ - శ్రీమదభినవగుప్త విరచిత వివృతిసమేతమ్ - ప్రథమ సంపుటము - చతుర్థాధ్యాయము - పుటలు 173 నుండి 183 వరకు (సెంట్రల్ లైబ్రరి - బరోడా ముద్రణ 1926)

2. నాట్యశాస్త్రమ్ - శ్రీమదభినవగుప్త విరచిత వివృతిసమేతమ్ - ప్రథమ సంపుటము - చతుర్థాధ్యాయము. పుట 183. (సెంట్రల్ లైబ్రరి బరోడా ముద్రణ 1926)

3. అగ్ని పురాణము - నాట్య నిరూపణము. పుట 369-370. (ప్రథమ ఖండము) ప్రచురణ: సంస్కృతి సంస్థాన్ బరేలీ - ఉత్తర ప్రదేశ్ (1974)

లను చెప్పియున్నాడు— నాటిక, ప్రకరణిక, భాణిక, హాసిక, వ్యాయోగిని, డిమిక, కలోత్సాహవతి, చిత్ర, జుగుప్సిత, చిత్రతాల అను పదియును మార్గ భేదములు. వీటియందు నృత్త - గానము లుండవు; ఇవి రూపకతుల్యములే. ఇంక డోంబిక, భాణము, ప్రస్థానము, షిద్గకము, భాణిక, ప్రేరణము, రామ క్రీడము, రాగకావ్యము, హల్లీసకము, రాసకము అను పదియును దేశిభేద ములు. ఇందులో చివరి ఆరును నృత్త ప్రకారములు.[1]

పన్నెండవ శతాబ్ది వాడగు హేమచంద్రుడు తన కావ్యానుశాసనమున ఉపరూపకములను 'గేయకావ్యము'లు[2]గా, 'గేయరూపకము'లు[3]గా సంకేతించి వివరించినాడు ఆతడు కావ్యానుశాసనము నందలి ఎనిమిదవ అధ్యాయము నందు కావ్యభేదములను వివరించినాడు. డా॥ పి. ఎస్. ఆర్. అప్పారావుగారు తమ 'తెలుగు నాటక వికాసము'నందు ఆ వివరణమునకు తెలుగుసేతను ఇట్లు సమకూర్చినారు—

"కావ్యము ప్రేక్ష్య - శ్రవ్య భేదములచే రెండు విధములు. ప్రేక్ష్యము అభినేయము; శ్రవ్యమనభినేయము. ప్రేక్ష్యము పాఠ్య గేయ భేదములచే రెండు విధములు. నాటక - ప్రకరణ - నాటికా - సమవకార - ఈహామృగ - డిమ - వ్యాయోగ - ఉత్సృష్టికాంక - ప్రహసన - భాణ - వీథీసట్టకాదులు పాఠ్యములు. ఆది శబ్దముచే కోహలాది లక్షిత తోటకాదులు గ్రాహ్యములు. నాటకాది వీథ్యంతములైన పదునొకండును వాక్యార్థాభినయ స్వభావములు. వీనిని భరతుడే నిర్దేశించెను. సట్టకము నింకొకరు పేర్కొనిరి. డోంబికా-భాణ-ప్రస్థాన-శింగక-భాణికా-ప్రేరణ-రామాక్రీడ-హల్లీసక-రాసక-గోష్ఠీ - శ్రీగదిత రాగకావ్యాదులు గేయములు ఆది గ్రహణముచే శంపా-ఛలిత-ద్విపద్యా దులు పరిగ్రాహ్యములు... మసృణ - ఉద్ధత - మిశ్ర భేదములచే గేయ కావ్యములు మూడు విధములు. పాఠ్యమునందు అంగ-గీతములు అనియత

1. నాట్యశాస్త్రము - అనువాదము, పుట 535.

2. "కావ్యం ప్రేక్ష్యం శ్రవ్యంచ.. ప్రేక్ష్యం విభజతే, ప్రేక్ష్యం పాఠ్యం గేయంచ'
—కావ్యానుశాసనము - అధ్యా. 8;

3. "పదార్థాభినయ స్వభావాని డోంబికాదీని గేయాని రూపకాణి చిరంతనై రుక్తాని''
—కావ్యానుశాసనము. అధ్యా. 8.

ములు; ఇతివృత్తము, సంభాషణము, రూపారోపణము, వ్యుత్పత్త్యభిసంధానమును ప్రధానములు. ఇంక గేయకావ్యమందు అంగ-గీతములు సుప్రతిష్ఠితములై యుండును; ఇతివృత్తాదులకు ప్రాధాన్యము లేదు. ఇందు కొన్నింటిలో గీతికి ప్రాధాన్యము, కొన్నింటిలో నృత్తమునకు ప్రాధాన్యము, మరికొన్నింటిలో రెండింటికిని ప్రాధాన్యము. తక్కిన వానిలో వాద్యములకు ప్రాధాన్యము" -(తెలుగు నాటక వికాసము - పుట 87)

పదమూడవ శతాబ్దము వాడైన శారదా తనయుడు తన 'భావప్రకాశనము'అను సాహిత్య శాస్త్ర గ్రంథము నందు దశరూప భిన్నములై నట్టియును పదార్థాభినయాత్మకములగునట్టియును అయిన ఇరువది నృత్య భేదములను (ఉపరూపకములు) పేర్కొనియున్నాడు ఆతడు సూచించిన నృత్య భేదములివి— తోటకము, నాటిక, గోష్ఠి, సల్లాపము, శిల్పకము, డోంబి, శ్రీగదితము, భాణము, భాణి, ప్రస్థానము, కావ్యము, ప్రేక్షణము, నాట్యరాసకము, రాసకము, ఉల్లోప్యకము, హల్లీసము, దుర్మల్లిక, కల్పవల్లి, మల్లిక, పారిజాతకను [1]

నృత్తగేయ ప్రధానములైన రూపకవిశేషములకు ఉపరూపకము అను సంకేతము నిచ్చిన ప్రథమలాక్షణికుడు - విశ్వనాథకవిరాజు పదునెనిమిది ఉపరూపకములను వివరించినాడు. అవి ఇవి - నాటిక, త్రోటకము, గోష్ఠి, సట్టకము, నాట్యరాసకము, ప్రస్థానకము, ఉల్లాప్యము, కావ్యము, ప్రేంఖణము, రాసకము, సంలాపకము, శ్రీగదితము, శిల్పకము, విలాసిక, దుర్మల్లిక, ప్రకరణిక, హల్లీశము, భాణిక.[2]

---

1. "దశరూపేణ భిన్నానాం రూపకాణామతిక్రమాత్
అవాంతరభిదాః కాశ్చిత్పదార్థాభి నయాత్మికాః
తే నృత్యభేదాః ప్రాయేణ సంఖ్యయా వింశతిర్మతాః
తో టకం నాటికాగోష్ఠీ సంలాపః శిల్పక స్తథా
డోంబీ శ్రీగదితం భాణోభాణీ ప్రస్థాన మేవచ
కావ్యంచ ప్రేక్షణం నాట్య రాసకం రాసకం తథా
ఉల్లోప్యకంచ హల్లీస మథ దుర్మల్లి కాఽపిచ
కల్పవల్లీ మల్లికా చ పారిజాతక మిత్యపి'
భావప్రకాశనము _ నవమాధికారము. శ్లోకములు 4. 5. 6. 7.

2. సాహిత్యదర్పణము _ ఆరవ పరిచ్ఛేదము _ శ్లో. 269 నుండి 312 వరకు.

ఉపరూపకముల సంఖ్యావిషయమున లాక్షణికుల అభిప్రాయములలో వైవిధ్యము కనిపించుచున్నది. నృత్యగేయరూపములైన ఈనాటి గేయ నాటికలకు తొలిరూపములనదగు ఈ ఉపరూపకములను గూర్చి వివరింపవలసిన అగత్యముండుటచేత వాని స్వరూప స్వభావములను గురించి లాక్షణికులు చెప్పిన తీరుతెన్నులను విశదీకరింతును. సాహిత్య దర్పణకారుడైన విశ్వనాథుడు నృత్యగేయ ప్రధానములైన రూపకములను ఉపరూపకములుగా సంకేతించిన వారిలో ఆద్యుడుగా కానిపించుచున్నాడు. కావున ఉపరూపకములకు అతడు చెప్పిన లక్షణములను ఇట పేర్కొందును

**1. నాటిక :** నాటికాలక్షణములను 'నాటిక' అను విభాగమున విపుల ముగా చర్చించియున్నాను.

**2. త్రోటకము :** త్రోటకమునందు ఐదుగాని, ఏడుగాని, ఎనిమిదిగాని, తొమ్మిదిగాని అంకములుండును. దివ్య మానవుల ఇతివృత్త మిందుండును. ప్రత్యంకమునందును విదూషకుడుండును. శృంగారము అంగిరసము. ఉదా హరణము - ఐదంకముల విక్రమోర్వశీయము, ఏడంకముల స్తంభితరంభము.[1]

**3. గోష్ఠి :** తొమ్మండుగురో లేక పదుగురో సాధారణపురుషులుందురు. ఉదాత్తవచనవుండదు. కైశికీవృత్తి ఉండును. గర్భవిమర్శ సంధులుండవు. ఐదుగురో ఆరుగురో స్త్రీలుందురు. కామశృంగారముండును. ఒకే ఒక అంకము. ఉదాహరణము - రైవతమదనిక.[2]

---

1. "సప్తాష్ట నవపఞ్చాఙ్కం దివ్యమానుష సంశ్రయమ్
త్రోటకం నామ తత్ప్రాహుః ప్రత్యఙ్కం సవిదూషకమ్''
—ప్రత్యంకసవిదూషకత్వాదత్ర శృఙ్గారోఽఙ్గీ. సప్తాఙ్కం యథా
స్తంభిత రంభమ్ - పఞ్చాఙ్కం యథా - విక్రమోర్వశీయమ్.
(సాహిత్య దర్పణము పరిచ్ఛేదము 6; శ్లో. 273)

2. "ప్రాకృతైర్నవభిః పుంభిర్దశభిర్వాప్యలం కృతా
నోదాత్త వచనా గోష్ఠీ కైశికీ వృత్తిశాలినీ
హీనాగర్భ విమర్శాభ్యాం పఞ్చ షడ్యోషి దన్వితా
కామ శృఙ్గార సంయుక్తా స్యాదేకాఙ్క వినిర్మితా
—యథా రైవతమదనికా.'' సాహిత్య దర్పణము.
ఆరవ పరిచ్ఛేదము - శ్లో. 274 నుండి 275.

**4. సట్టకము :** ఇందు ఆదినుండి అంతమువరకు ప్రాకృతభాష ప్రయోగింపబడును. ప్రవేశకముకాని విష్కంభకముకాని ఉండదు. రసము అద్భుతము. ఈ రూపకముసంగలి అంకములను జవనికలందురు. మిగిలిన లక్షణములందు ఇది నాటికతో సమానము.

ఉదాహరణము : కర్పూర మంజరి.[1]

**5. నాట్యరాసకము :** ఇది ఏకాంకము. ఇందు లయతాళములకు విశేష ప్రాధాన్యముండును. నాయకుడు ధీరోదాత్తుడు. పీఠమర్దుడు నాయక సహాయుడు. హాస్యము అంగరసము. శృంగారము. అంగిరసము. నాయిక వాసకసజ్జిక. ముఖనిర్వహణ సంధులును దశవిధలాస్యాంగములును ఉండును. ప్రతిముఖసంధికాక మిగిలిన నాలుగు సంధులుండునని కొందరి మతము.

ఉదా : నర్మవతినాట్యరాసకమునందు రెండు సంధులున్నవి. విలాసవతిలో నాలుగు సంధులున్నవి.[2]

విశ్వనాథుని సాహిత్య దర్పణమునకు హిందీవ్యాఖ్యానము వెలయించిన డా॥ సత్యవ్రతసింహగారు నాట్యరాసకమునకు సంబంధించిన వివేచనము కొంత చేసినారు. తమ వ్యాఖ్యానము నందు వారిట్లు పేర్కొనినారు.

---

1. "సట్టకం ప్రాకృతాశేష పాఠ్యం స్యాదప్రవేశకమ్
నచవిష్కమ్భకోఽ ప్యత్ర ప్రచురశ్చా దద్భుతోరసః
అఙ్కా జవనికాఖ్యాః స్యుః స్యాదన్య న్నాటికాసమమ్
—యథా కర్పూర మంజరీ" సాహిత్య దర్పణము.
ఆరవ పరిచ్ఛేదము శ్లో. 276.

2. "నాట్యరాసకమేకాఙ్కం బహుతాల లయస్థితి
ఉదాత్తనాయకం తద్వత్పీఠమర్దోప నాయకమ్
హాస్యోఽఙ్గ్యత్ర స శృంగారో నారీవాసక సజ్జికా
ముఖ నిర్వహణే సంధీ లాస్యాఙ్గాని దశాపిచ
కేచిత్ప్రతిముఖం సన్ధిమిహనేచ్ఛన్తి కేవలమ్
—తత్ర సన్ధిద్వయవతీ యథా – నర్మవతీ. సన్ధి చతుష్టయవతీ యథా – విలాసవతీ."
సాహిత్య దర్పణము – 6 వ పరిచ్ఛేదము. శ్లో. 277-79)

"నాట్య రాసకమునకు శారదాతనయసమ్మతమైన స్వరూపమిది.

'కామినీభిర్భువోభర్తుః చేష్టితం యత్ర నృత్యతే
రాగాద్వసన్త మాలోక్య సజ్ఞేయో నాట్యరాసకః'

(భావప్రకాశనము - 9వ అధికారము.)

విశ్వనాథ కవిరాజు తన నాట్య రాసకలక్షణమునందు ఏయే విశేషము లను నిర్దేశించియుండెనో అవి ప్రకాశనకారుని నాట్యరాసకలక్షణ మందులేవు. భావప్రకాశనకారుడును, అతని పూర్వుడైన శృంగార ప్రకాశకారు ననుసరించి స్త్రీ పాత్రలచే నాయకచరితమును నృత్యాభినయరూపమున ప్రయోగించుట - నాట్యరాసకము. కాని విశ్వనాథ కవిరాజు నాట్యరాసకలక్షణమున అంక రచనము, సంధియోజనము, రసాభివ్యంజనము మున్నగు విశేషములను కూడ ఉల్లేఖించియున్నాడు. విశ్వనాథ కవిరాజు ఉదాహరించిన నర్మావతీ విలాసవతీ నాట్యరాసకములు నేడు అనుపలబ్ధములు."[1]

నాట్యరాసకమును నిర్వచించు సందర్భమున భావప్రకాశనకారుడు వ్రాసిన సూత్రములను విషయసమగ్రతకై ఇట ఉదాహరించు చున్నాను.

"నాట్య రాసకమొక నృత్యరూపకము. దీని స్వరూపలక్షణవిస్తర మీ విధముగ నున్నది. దీనిలో నాయికలు పదునారుగురు కాని పండ్రెండుగురు కాని యెనిమిది మంది కాని నర్తనమొనరింతురు. పిండీబంధాదివిన్యాసములతో నర్తనమొనరింతురు. ఇట్టిదిది రాసకము. పిండీబంధాదులనుటచే నిందు పిండి - శృంఖల - భేద్యకము - లత. యనునవి గ్రాహ్యములు. పిండనమున పిండి యగును. గుంఫనమున శృంఖల యగును. భేదమున భేద్యకమగును. జాలముగా పంక్తిగా వరుసగా కూర్పు పొందుటవలన లత యగును. రంగ సంచారమొనరించు నాయిక లొకచో గుమికూడుట, పరస్పరసంబంధమున శృంఖలాకారమున నుండుట, ఒకరొకరు వేరువేరుగా విడిపోవుట, లతాకృతిగ దోచు జాలాత్మకముగ నుండుట యిందు గ్రాహ్యము. ఈ యంశ మిదివరలో కొంతగా సూచితమయినది. ఈ పిండీబంధాదివిన్యాసములను నృత్తాత్మక ముగా నిరూపింపవలెను. క్రియావిధానమున నివి నాట్యశోభాసుందరములగు

1. సాహిత్య దర్పణ హిందీ వ్యాఖ్యానము - పుట: 535-536.
ప్రచురణ: చౌఖంబ విద్యాభవన్ - వారణాసి (1957)

నట్లాచరింప వలెను. పిండాదికములయిన దృశ్యజాతులన్నియు నాట్యమున స్తవధిరూపములు. సుకుమారము లుద్ధతములు నయిన అంగవిన్యాసముల ప్రదర్శించి గాయికలు గాన మొనరించి లలితణన [illegible] విశేషములతో నీ దృశ్య జాతులను నాట్యసుందరముగ జేయవలెను. అనుకార్యానురాగ సమేతుడయిన భూప్రభువు చేష్టితమును కామినీమణులనుకరించి నర్తన మొనరింపదగును. దీని వలన నవనవవిధానము లనుగతములు కాగలవు. రాగమున వసంతమాలో [illegible]రించి నర్తకీమణులు భూపతిచరిత మనుకరించుచు నర్తనమొనరింతురు గావున నిది నాట్యరాసకమను వ్యవహారమునకు తగినయినది.

నాట్యరాసకమును చర్చరి యనియు నందురు. రాసకభేదములు మూడు కలవు - రాసకము - నాట్యరాసకము - చర్చరి యని. చర్చరీ రూపమీ విధముగ నుండును. రాసకమునందలి క్రమమునసే వినివేశితలయిన నర్తకీ మణులు వాద్యతాలాన్వితమయిన వాద్యమును వాదకులు వాదన మొనరించు నపుడు జంటలు జంటలుగా రంగము ప్రవేశింతురు. గానవస్తు చితపదోత్తర మయిన ద్విపదిగానము చేయుదురు. ఆ ద్విపది వసంతసమయోత్సవమున శృంగార వర్ణనోపేతమై యుండును. ఆ గీతానుసారమున వారు నర్తన మొన రింతురు. ఇట్లున్న నిది చర్చరి యగును. ఇట్టి చర్చరీ రూపధారణమున నిచటి చర్చరి నిట్లు భావింపవలెను.

కామినీయుగ్మము వర్ణతాలమున ప్రవేశింపవలెను. వర్ణతాలమనునది దేశితాలము. అది చతురశ్ర - త్ర్యశ్ర మిశ్ర ప్రభేదమున త్రివిధము. ఆ కామినీయుగ్మము సమచర్యాదివిధానములలో శిక్షితము కావలెను. వామ దక్షిణసంచారము కల యంగవిన్యాసములతో పరిష్కృతవిధానములతో నా కామినీయుగ్మ ముండదగును. ఆ కామిను లాలీఢ ప్రత్యాలీఢస్థాన సంస్థాన మున నుండి తత్తద్వర్ణాంతమున తాలమును చోలికాభిద్రుతముగా వాదకులకు నిర్దేశింపవలెను. అపుడు పంచఘాత మను దేశితాలమునకు సంబంధించిన సంజ్ఞా ర్థకమగు ఛేదము ప్రవర్తించును. ఛేదమనగా నొక వాద్య ప్రబంధము. వాద్య కారులు వాద్య వాదనమును "విచ్ఛిద్య విచ్ఛిద్య" ఆపి ఆపి హస్తతలా ఘాతములతో వేగముగ వాదనమొనరించుట వికృతముగ వాద్యవాదన మొనరించుట ఛేదమగును. అట్టి యా ఛేదమును మూడు నాలుగు ఖండము లుగా నృత్తమున విభాగ మొనరింప వలెను. అప్పు డా కన్యలు అన్యోన్యాంగిక

సంచారములతో మిథఃకృతములు-పరస్పరాచరితములయిన హస్తతాలములతో రంగ పరిక్రమ మొనరించి నిష్క్రమింప వలెను. ఆ పిమ్మట నన్య ద్వితీయము-ఇద్దరు కన్యలు ప్రవేశింపవలెను. వారి ప్రవేశముకాని నిర్గమముకాని ఏక కాలముగా నుండుటయు, రంగమున వారికి సంధి-కలయిక లేకుండుటయు నావశ్యకము. మాత్రాతాల యోగమున పుష్పాంజలి ప్రయోగింపవలెను. ఆ యిద్దరి పాత్రల యనంతరము పాత్రలు ప్రవేశింతురు. వారి ప్రవేశమున కొంత గ్రాహ్య విశేషమిట్లున్నది. ఆ పాత్రలు నానా వృత్తప్రదర్శన మొనరించుచు లతావేష్టనములతో ఛేద్యకవిధానములతో గుల్మశృంఖలారీతులతో నొక స్థలమున గూడుకొని పిండీబంధము నాచరింపవలెను. ఆ సమయముననె పణవతాలయుక్తముగా రథ్యావర్ణాది వర్ణకసంయుక్తముగా గాయకులు శుష్కగీత ప్రయోగమున గానమొనరింతురు. ఈ సమయముననే లతాఛేద్యకాది సంబంధమున పాత్రలు పిండీబంధమాచరించుట యుక్తము. ఇచట పణవతాల-రథ్యా - వర్ణ-శుష్క గీతములను సాంకేతిక పదములున్నవి. వాని భావార్థ మిట్లుండును. "పణవంతి స్తువంతీతి పణాః" స్తోత్ర మొనరించువారు. వారి యనుసారమున నుండునది పణవము. పణవధ్వని పురాణములందు నున్నది. ఇది హరప్రీతికరము. పణవమున శబ్దము విని శంకరుడు స్వయముగ నృత్త మొనరించును. కావున గీతకాసారితాదులలో పణవము నాయోజిత మొనరింప వలెను. పణవానుగతమయిన తాలము పణవతాలము. రథ్య యనునది దేశీతాల విశేషము. వర్ణము. వర్ణశబ్దమున గాన మభిహితమగును. వర్ణము గానక్రియ. ఇది స్థాయి - సంచారి - ఆరోహి - అవరోహి యని నాలుగు విధములు శుష్కగీతము. శుష్కాక్షరములతో నొనరించు ధ్రువాగీతము. ఇట్లు వీని యను సారమున పిండీబంధ మాచరించునది.

అనంతరము శుష్కవర్ణ ప్రయోగానుసారమున మల్లతాల మనుసరింప దగును. మల్లతాల మొక దేశీతాలము. ఇందు నాలుగు లఘువులు మూడు గురువు లుండును. మల్లతాలానుసరణముననె మురజాకరవాద్యము ననుసరింపవలెను. అప్పుడు మురజవాద్యమును దండ ద్వి దండకవిధానానుసారమున నాహత మొనర్పవలెను. దండ దండకములు వాద్యవిశేషములు. వీణావాదన ప్రాణరూపము. ఇట్టి రీతుల యనుసారమున నృత్తక్రమ మనుసరించి పాత్రలు మొదటి యవసానమును సమాప్తమొనరింపవలెను. అనంతర మవసాన

త్రయమునిట్లే కల్పింపవలెను. ఈ యుపసారకములందును పూర్వమువలె నృత్తక్రమ మనుసరణీయము. లయక్రమ మిందిచ్ఛానుసారమున నుండ వచ్చును. ఇట్లు రాసక మనుసరించి నిదంగమున శుభార్థ మొక పదక్రమమును నిరూపింపవలెను.

శ్రీసాగరముని సువ్యవస్థితము పొంది త్రాపి రాసకము ననుసరించిరి. ఈ రాసకము పిండీబంధములతో శృంఖలికా ప్రవేశములతో లతాభేద్యకము లతో కూడి యున్నది. చిత్రములయిన యాతోద్య విధానములతో విచిత్రితమై యున్నది. లయ యుక్తముగా నున్నది. నాట్యరాసకము రాసకము అను భేదద్వయమున నలంకృతమై యున్నది. చారీఖండ మండలములతో ననుగతముగా నున్నది. ఇట్లుండు నిది రాసకము నాట్యరాసకము"[1] (శారదా తనయుని భావప్రకాశనమునకు శ్రీ జమ్ములమడక మాధవరామశర్మగారి 'భావాలోకము' అను అనువాదము. పుట, 627-631 ప్రచురణ - ఆం. ప్ర. సంగీత నాటక అకాడమి (1973).

**6. ప్రస్థావకము (ప్రస్థావము)** : ఇందు నాయకుడు దాసుడు. ఉప నాయకుడు **హీనుడు**. దాసి నాయిక. కైశికీ భారతీ వృత్తులుండును. ఉద్దిష్టార్థము సురాపానవర్ణనముతో సమాప్తమగును. ఇందు రెండంకములు. లయ తాలాది సంగీతాత్మకమైన విలాస మధికముగా నుండును.

ఉదా : శృంగార తిలకము.[2]

**7. ఉల్లాప్యము** (ఉల్లాప్యకము - ఉల్లోప్యము - ఉల్లోప్యకము) :- నాయకుడు ధీరోదాత్తుడు. ఇతివృత్తము దివ్యము. ఏకాంకము. శిల్పకమను

---

1. భావప్రకాశనము - నవమాధికారము - శ్లో. 93 నుండి 109 వరకు.
ప్రచురణ : ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ (1973)

2. "ప్రస్థానే నాయకో దాసో హీనః స్యాదుపనాయకః
దాసీచ నాయికా వృత్తిః కైశికీ భారతీ తథా
సురాపాన సమాయోగా దుద్దిష్టార్థస్య సంహృతిః
అంకౌ ద్వౌ లయతాలాది ర్విలాసో బహుళస్తథా
—యథా - శృఙ్గారతిలకమ్.
సాహిత్య దర్పణము - పరిచ్ఛేదము 6. శ్లో. 280-281.

ఒక ఉపరూపకమునకు సంబంధించిన అంగము లిందుండును. శృంగార హాస్య కరుణరసాశ్రయమిది. బహుసంగ్రామవర్ణనాసహితమై అస్త్రగీత (ప్రస్తుత కథాంశమును సూచించు నేపథ్యగానము) మనోహరమై యుండును. కొందరు ఇందు నలుగురు నాయికలుందురనియు మూడంకములుండుననియు అభిప్రాయ పడినారు.

ఉదా : దేవీమహాదేవము[1]

**9. కావ్యము :** ఇందు ఆరభటీ వృత్తికాక మిగిలిన వృత్తులుండును. ఇది ఏకాంకము. హాస్యరసభరితము. ఖండమాత్రాద్విపదికాభగ్నతాలాది గీత భేదములుండును. శృంగార రసపోషకములైన వర్ణమాత్రాఛడ్డణికాచ్ఛందము లుండును. నాయికానాయకులు ఉదాత్తగుణాన్వితులు. ముఖ నిర్వహణ సంధులు మాత్రమే ఉండును.

ఉదా : యాదవోదయము.[2]

భావప్రకాశనమున శారదా తనయుడు కావ్యమను ఈ ఉపరూపకమును నిర్వచించిన తీరు మరొక విధముగా ఉన్నది. దాని నిట ఉటంకింతును.

"కావ్యమనునది యిచట నృత్యరూపకము. హాస్యశృంగారములుండుట సర్వవృత్తి సమన్వితమగుట, భగ్నతాలము, ద్విపదీఖండము అనువాని మాత్రావిశేషములతో పరిష్కృతమగుట, గర్భావమర్శ సంధిరహితమగుట,

---

1. "ఉదాత్త నాయకం దివ్యవృత్తమేకాఙ్క భూషితమ్
శిల్పకాఙ్గైర్యుతం హాస్యశృఙ్గార కరుణై రసైః
ఉల్లాప్యం బహు సంగ్రామ మస్త్ర గీత మనోహరమ్
చతస్రో నాయికా స్తత్ర త్రయోఽఙ్కా ఇతి కేచన
...... ........... ...యథా - దేవీ మహాదేవమ్''
సాహిత్య దర్పణము - పరి. 6. శ్లో. 282-283.

2. "కావ్య మారభటీహీన మేకాఙ్క హాస్యసఙ్కులమ్
ఖండమాత్రా ద్విపదికా భగ్నతాలై రలంకృతమ్
వర్ణమాత్రా ఛడ్డణికాయుతం శృఙ్గార భాషితమ్
నేతాస్త్రీ చాప్యుదాత్తాత్ర సన్ధీ ఆద్యౌ తథాన్తిమః
—యథా యాదవోదయమ్'' - సా. ద.- పరిచ్ఛేదము-6; శ్లో. 284-285.

ఏకాంకమున నుండుట, ఆవశ్యకతననుసరించి యొకచో లాస్యయుతమగుట, విటచేటీ సమన్వితముగా నుండుట, కులాంగనాయుతము వేశయుతమునగుట, లలితోదాత్త నాయకముగా నుండుట ఇది కావ్యమను నృత్యరూపక లక్షణము. ఇట్టికావ్యమును ప్రకల్పింపవలెను. గౌడవిజయమనునది కావ్యము. ఈ నృత్య కావ్యముననింకను విశేషములుండును. స్త్రామాత్యవణిక్పుత్రులతో నుండుట. నాయికా నాయకోజ్జ్వలమగుట, "అంతరాంతరా" సంతుష్టలయిన ప్రమదల భాషాచేష్టితములతో గ్రథితమగుట, అథవా విటచేటాదుల వేషభాషావిశేష ముల గూడియుండుట కావ్యకల్పనా రూపము. సుగ్రీవకేలన మనునది యిట్టి కావ్యము."[1] (శారదా తనయుని భావప్రకాశనమునకు శ్రీ జమ్ములమడక మాధవరామశర్మగారి భావాలోక మను అనువాదము పుట - 625 - 626- (ఆం. ప్ర. సం. నా. అ. ప్రచురణ).

**9. ప్రేంఖణము** (ప్రేక్షణకము) : ఇది హీననాయకము. గర్భావమర్శ సంధులుండవు. సూత్రధారుడు ఉండడు. ఏకాంకము. విష్కంభ ప్రవేశక ములుండవు. ఇందు నియుద్ధ (ద్వంద్వయుద్ధ) సంఫేట (సరోషభాషణ)ము లుండును. వృత్తులన్నియు నుండును. నేపథ్యమునందే నాందీగానమును ప్రరోచనమును ఉండును.



ఉదా : వాలివధము.[2]

శారదా తనయుడు విశ్వనాథుని ప్రేంఖణ సర్వ లక్షణములను వివరింపగ చెప్పక పోయినను అతడు 'ప్రేక్షణక' లక్షణమున కొన్ని విశేషాంశములను సూచించినాడు. వాని నిట ఉదాహరింతును.

"ప్రేక్షణకమను నృత్యరూపకమున నర్తకి నర్తకుడు లిద్దరు నుండురు అందు నర్తకి పదార్థాభినయమును లలితముగను లయాన్వితముగ నొనర్చును

1. భావప్రకాశనము - నవమాధికారము - శ్లో. 82 నుండి 86 వరకు.
ప్రచురణ : ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ (1973)

2. "గర్భావమర్శ రహితం ప్రేంఖణం హీననాయకమ్
అసూత్రధారమేకాఙ్క మవిష్కమ్భ ప్రవేశకమ్
నియుద్ధ సమ్ఫేటయుతం సర్వవృత్తి సమాశ్రితమ్
నేపథ్యే గీయతే నాందీ తథా తత్ర ప్రరోచనా
—యథా - వాలివధః" — సా. ద. పరిచ్ఛేదము 6 : శ్లో. 286-287.—

నర్తనకు దట్లాచరించును. ఇందు లాస్యము రెండు విధముల నుండవలెను. ఒక లాస్యము ఛలికరూపము. మరియొకటి సమరథ్యావిధానమున సమన్విత మగును. వీనిని సుతాలవిధానమున చతురశ్ర విధానమున నాచరించుటకు నర్తకి నర్తనకుడు ప్రవర్తించును. ఈ ప్రేక్షణకము గర్భసంధిరహితము అవమర్శసంధిరహితము నగును. సర్వవృత్తు లిందుండును. మాగధీభాషా యుతముగా శౌరసేనీభాషా బహుళముగా నిది యుండుట యుక్తము. ఇది రసభావయుతమునగును. ఇది ద్విసంధికముగా నుండునని కొందరందురు. ఉత్తమాధమనాయకముగా నుండుట, భారత్యారభటీ యుక్తమగుట, ఒకచో సాత్త్వతియునుండుట యుక్తము. వాలివధము నృసింహ విజయము అనునవి ప్రేక్షణకములు. ఇందు నాందియుండును. ఎప్పుడును సూత్రధారుడు నాందీ ప్రయోగమొనరించుట యుండును. పూర్ణముగా నేపథ్య పాఠములతో నాంది విధానముండదగును. ఒకచో గర్భావమర్శసంధులుండును. ఒకచో వృత్తి చతుష్టయము నుండును. ఒకచో నేపథ్యావాక్యార్థ్యము నగును. సూత్రధార ప్రయోగమిందెప్పుడు నుండదు. ఇట్టిది ప్రేక్షణకము. త్రిపురమర్దన మనునది ప్రేక్షణకము"[1] (భావ ప్రకాశనము-శ్రీ జమ్ములమడక మాధవరామశర్మగారి భావాలోకమను అనువాదము; పుట 626-627)

**10. రాసకము:** ఇందుండు పాత్రలు అయిదు. ముఖ నిర్వహణ సంధులు మాత్రమే ఉండును. భాషావిభాషల ప్రయోగమధికము. భారతీ కైశికీ వృత్తులుండును. సూత్రధారుడుండడు. ఇది ఏకాంకము. వీథ్యంగ సహితము. నృత్యగీతకళాసమన్వితము. నాందీగాయనము శ్లిష్టపదసమాయుక్తము. నాయిక ఖ్యాత. నాయకుడు. మూర్ఖుడు. ఉత్తరోత్తరము ఉదాత్తభావ సమన్వితము. ప్రతిముఖసంధి కూడ ఉండునని కొందరి మతము.

ఉదాహరణము. మేనకాహితము.[2]

---

1. భావప్రకాశనము - నవమాధికారము - శ్లో. 87 నుండి 92 వరకు.
ప్రచురణ: ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ. (ఏప్రిల్ 1978)

2. "రాసకం పఞ్చపాత్రం స్యాన్ముఖ నిర్వహణాన్వితమ్
భాషా విభాషా భూయిష్ఠం భారతీ కౌశికీయుతమ్
అసూత్రధార మేకాఙ్కం సవీథ్యఙ్గ కలాన్వితమ్
శ్లిష్టనాన్దీయుతం ఖ్యాతనాయికం మూర్ఖనాయకమ్
ఉదాత్తభావ విన్యాస సంశ్రితం చోత్తరోత్తరమ్
ఇహ ప్రతిముఖం సన్ధిమపి కేచిత్ప్రచక్షతే
—యథా - మేనకా హితమ్" —సా. ద. పరిచ్ఛేదము 6- శ్లో 288-290)

శారదా తనయుడు ప్రకారాంతరముగ కొందరు రాసకమును నిర్వచించిన తీరును సూచించెను. ఈ తీరునకు విశ్వనాథుని రాసకలక్షణమునకు భేదములేదు.[1] ప్రకారాంతరమును సూచించుటకు ముందు ఆతడు రాసక లక్షణము నిట్లు చెప్పియున్నాడు.

"మండలాకారముగా నృత్తము చేయుటను రాసకమందురు. గోపస్త్రీలకు ఒక్కడే హరి నాయకుడయినట్లు రాసకమునకు నొక్కడే నాయకుడగును. రాసక మనేక నర్తకీయోజ్యమగును చిత్రతాలలయాన్వితము అగును. మసృణముద్ధతముగా నుండు నీ రాసకము చతుష్షష్టియుగల పర్యంతము నర్తకీ గణమున ప్రయోజ్యమగును".[2] (భావప్రకాశనమునకు శ్రీ జమ్ములమడక మాధవరామశర్మగారి అనువాదము-పుట 632)

**11. సంలాపకము (సల్లాపము - సల్లాపకము)** : ఇందులో మూడు గాని నాలుగు గాని అంకములుండును. నాయకుడు పాషండుడు. శృంగార కరుణములు గాక మరియేదేని రసము అంగిరసముగా నుండును. ఇందు నగరోపరోధము, ఛలము, సంగ్రామము విద్రవము వర్ణ్యములు. భారతీకైశికీ వృత్తులుండవు.

ఉదాహరణము : మాయాకాపాలికము.[3]

శారదా తనయుడు సంలాపకమును సల్లాపమను పేరుతో మరికొంత విశదీకరించినాడు.

"...ఈ నృత్తరూపకమునందు కథా వస్తువు ప్రఖ్యాతము కావచ్చును. ఉత్పాద్యమును కావచ్చును. మిశ్రమమును కావచ్చును. దీనిలో వెచ్చుటను

1. భావప్రకాశనము - నవమాధికారము - శ్లో. 151 నుండి 154 వరకు (పుట 639)
2. భావప్రకాశనము - నవమాధికారము - శ్లో. 120-121.
(ప్రచురణ: ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ)
3. "సంలాపకేఽఙ్కాశ్చత్వారస్త్రయో వా నాయకః పునః
పాషండః స్యాద్రసస్తత్ర శృఙ్గార కరుణేతరః
భవేయుః పురసంరోధచ్ఛల సంగ్రామ విద్రవాః
న తత్రవృత్తిర్భవతి భారతీ న చ కైశికీ
—యథా - మాయాకాపాలికమ్" —సా. ద. 6 వ పరిచ్ఛేదము శ్లో. 291-292.

శృంగారహాస్యము లర్హములు కావు. వీర రౌద్రములతో నిది శబలమై యుండును. ఇతరరసము లంగములగుట యుక్తము. సామాన్యముగా నిందు విరోధము శాంతమగును. పాషండనాయకులిందు క్రుద్ధులై ప్రవర్తింతురు. దైవజన్య మరిజన్యమయిన కపటము యుద్ధముండును. యుద్ధ స్థానములం దుపరోధముండును. సాత్త్వతీవృత్తి యారభటీవృత్తి యిందు విద్రవ సహిత ముగా నుండును. ఇందు మూడే యంకములు. ప్రథమాంకము విద్రవముతో గూడి యుండును. రెండవ యంకమున తాలప్రాచుర్యము కల విద్రవము కపటము నుండుట గ్రాహ్యము. తృతీయాంకము కపటముతో కూడి యుండును. సల్లాపకమునందు ప్రతిముఖసంధిరహితముగా నాలుగు సంధు లుండదగును."[1] (భావప్రకాశనమునకు శ్రీ జమ్మలమడక మాధవశర్మగారి అనువాదము. పుట-613 ఆం. ప్ర. సం. నాటక అకాడమి ప్రచురణ)

**12. శ్రీగదితము :** ఇందు ఇతివృత్తము ప్రఖ్యాతము. ఏకాంకము. నాయకుడు ధీరోదాత్తుడు. నాయిక ప్రఖ్యాత గర్భవిమర్శసంధులుండవు. భారతీ వృత్తి బహుళము. శ్రీ శబ్ద ప్రయోగప్రచురము.

ఉదాహరణము : క్రీడారసాతలము.

శ్రీ గదితమును కొందరు మరొక విధముగా నిర్వచించియుండిరి. శ్రీ వేష ధారిణియయిన నటి రంగమందు ఆసీనయై పాడును. పదములు పఠించును. ఒకే అంకము. భారతీవృత్తి ప్రచురము. ఉదాహరణము ఊహ్యము.[2]

---

1. భావప్రకాశనము - నవమాధికారము - శ్లోకములు 15 నుండి 18 వరకు.
ప్రచురణ : ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ (1973)

2. "ప్రఖ్యాత వృత్తమేకాఙ్కం ప్రఖ్యాతోదాత్తనాయకమ్
ప్రసిద్ధనాయికం గర్భ విమర్శాభ్యాం వివర్జితమ్
భారతీవృత్తి బహులం శ్రీతిశబ్దేన సంకులమ్
మతం శ్రీగదితం నామ విద్వద్భిరుప రూపకమ్
—యథా - క్రీడా రసాతలమ్
శ్రీరాసీనా శ్రీగదితే గాయేత్కించిత్పఠే దపి
ఏకాఙ్కో భారతీప్రాయ ఇతికేచి త్ప్రచక్షతే
—ఊహ్య ముదాహరణమ్." సా. ద. 6వ పరిచ్ఛేదము శ్లో. 294-297

**13. శిల్పకము :** ఇందు నాలుగంకములు, నాలుగు వృత్తులు ఉండును. హాస్య శాంతరసములు గాక అన్యరసములుండును. నాయకుడు బ్రాహ్మణుడు. ఇందులో శ్మశానాది వర్ణనముండును. ఇది హీనోపనాయకము. ఇందు 27 అంగములుండును. అవి ఆశంస, తర్కము, సందేహము, తాపము, ఉద్వేగము, ప్రసక్తి, ప్రయత్నము, గ్రథనము, ఉత్కంఠ, అవహిత్థ, ప్రతిపత్తి, విలాసము, ఆలస్యము, బాష్పము, ప్రహర్షము, ఆశ్వాసము, మూఢత, సాధనానుగమము, ఉచ్ఛ్వాసము, విస్మయము, ప్రాప్తి, లాభము, విస్మృతి, సంఫేటము, వైశారద్యము, ప్రబోధనము, చమత్కృతి. ఈ అంగముల లక్షణము వీని పేర్ల వలననే స్పష్టమగుచున్నది.

ఉదాహరణము : కనకావతీ మాధవము.[1]

**14. విలాసిక :** ఇది శృంగారరసప్రచురము. ఏకాంకము. దశవిధ లాస్యాంగసమన్వితము. ఇందు విదూషక విట పీఠమర్దులుందురు. గర్భ విమర్శ సంధులుండవు. ఇది హీననాయకము. స్వల్పవృత్తము. ఇందు సునేపథ్యము (వేషభూషాద్యలంకారము) నకు విశేష ప్రాధాన్యముండును.

కొందరు ఈ విలాసికను వినాయికి అని యందురు. మరి కొందరు దీనిని దుర్మల్లి కాంతర్భావముగా గుర్తింతురు.[2]

---

1. "చత్వారః శిల్పకేఽఙ్కాః స్యుశ్చతస్రో వృత్తయస్తథా
అశాంతహాస్యాశ్చ రసా నాయకో బ్రాహ్మణో మతః
వర్ణనాత్ర శ్మశానాదేర్హీనః స్యాదుపనాయకః
సప్తవింశతి రఙ్గాని భవంత్యేతస్య తానితు
ఆశంసా తర్క సందేహ తాపోద్వేగ ప్రసక్తయః
ప్రయత్నగ్రథనోత్కంఠా వహిత్థా ప్రతిపత్తయః
విలాసాలస్య బాష్పాణి ప్రహర్షాశ్వాస మూఢతాః
సాధనానుగ మోచ్ఛ్వాస విస్మయ ప్రాప్తయస్తథా
లాభ విస్మృతి సంఫేటా వైశారద్యం ప్రబోధనమ్
చమత్కృతిశ్చేత్య మీషాం స్పష్టత్వాల్లక్ష్మనోచ్యతే
...............యథా - కనకావతీ మాధవః"
సాహిత్య దర్పణము. పరిచ్ఛేదము 6; శ్లో. 298-300.

2. "శృఙ్గార బహులైకాఙ్కా దశలాస్యాఙ్గ సంయుతా
విదూషక విటాభ్యాంచ పీఠమర్దేన భూషితా
హీనా గర్భవిమర్శాభ్యాం సంధిభ్యాం హీననాయకా
స్వల్ప వృత్తా సునేపథ్యా విఖ్యాతా సా విలాసికా
కేచిత్తుతత్ర విలాసికాస్థానే వినాయికేతి పఠన్తి. తస్యాస్తు 'దుర్మల్లికాయా మన్తర్భావః' ఇత్యన్యే"
సాహిత్య దర్పణము. 6 వ పరిచ్ఛేదము; శ్లో. 301-302.

**15. దుర్మల్లిక (దుర్మల్లి) :** ఇది చతురంకము. కైశికీ భారతీవృత్తి సహితము. గర్భసంధి రహితము. ఇందలి పాత్రములు నాగరులు(కళాకుశలురు). నాయకుడు హీన ప్రకృతిగలవాడు. ప్రథమాంక ప్రయోగమునకు మూడు నాడుల (6 గడియల) కాలము పట్టును విటుని [illegible] క్రీడలిందుండును. ద్వితీయాంక ప్రయోగకాలము ఐదునాడులు (పది గడియలు). విదూషకుని విలాసము ఇందు ప్రచురము. తృతీయాంక ప్రయోగమునకు ఆరునాడులు (12 గడియలు) పట్టును. ఇది పీఠమర్దుని భావభంగిమలతో నిండియుండును. చతుర్థాంక ప్రయోగకాలము పదినాడులు. నాయకుని క్రీడ లిందుండును.

ఉదా : బిందుమతి.[1]

దుర్మల్లికను నిర్వచించుచు శారదా తనయుడు ఈ లక్షణములనే కాక మరి కొన్నింటిని సూచించినాడు. తృతీయాంకమును ఇతడు సత్తనాడికా పరిమిత మనినాడు. చతుర్థాంకమున విటాది త్రితయ క్రీడ యుండును. "దూతిక యిందుచే సహాస్యముగా గ్రామ్యకథలతో చౌర్యరతిని చెప్పును. నాయికా నాయకుల ప్రతిభేదనమును యువతి యువకుల యనురాగ వర్ణనమును నిరూపించును. ఆ విషయముల విస్తరము మంత్రణము చేయును. అధమజాతి వనిత యయినందున ద్రవ్యమిమ్మని యడుగును. అట్టివార్తలు చెప్పినందులకై ద్రవ్యము కాంక్షించును. ధనము గైకొనియు మఱల ధనలాభమునకె యిష్టపడును. ఇట్టి కథావస్తు నిబంధనముండగా నిది దుర్మల్లిక యగును. ఈ దుర్మల్లికనె కొందరు మత్తల్లిక యందురు. తల్లక్షణము - దీనిలో పురోహితామాత్యతాపసాదుల ప్రారబ్ధానిర్వాహము - ప్రారంభించిన కార్యము నిర్వహింపకపోవుట - సముద్భావితము కావలెను... ఇందు క్షుద్రకథ యుండును.

1. "దుర్మల్లీ చతురఙ్కాస్యాత్ కైశికీ భారతీయుతా
అగర్భా నాగరనరా న్యూననాయకభూషితా
త్రినాలిః ప్రథమోఽఙ్కాస్యాం విటక్రీడా మయోభవేత్
పఞ్చనాలిర్ద్వితీయోఽఙ్కో విదూషక విలాసవాన్
షణ్ణాలిక స్తృతీయస్తు పీఠమర్ద విలాసవాన్
చతుర్థో దశనాలిః స్యాదఙ్కః క్రీడిత నాగరః
—యథా - బిందుమతీ"
(సాహిత్య దర్పణము. 6 వ పరిచ్ఛేదముః శ్లో. 303-306)

మహారాష్ట్ర భాషారీతితో నుండును. "గోరోచనేచ కార్యాఽనంగవతీ భావ రసవిద్ధా" భావములతో రసములతో నిది కూడుకొని యుండదగును."[1] (భావ ప్రకాశనము. శ్రీ జమ్ములమడక మాధవ రామశర్మగారి భావాలోకమను అనువాదము – పుటలు 635–636).

**16. ప్రకరణిక (ప్రకరణి) :** ఇది ఒక నాటికావిశేషము. ఇందు సార్థవాహాదులు నాయకులుగా ఉందురు. సజాతీయస్త్రీయే నాయిక. ఉదాహరణము మృగ్యము.[2]

**17. హల్లీశము (హల్లీసకము – హల్లీసము) :** ఇది ఏకాంకము. ఏడు లేక ఎనిమిది లేక పది స్త్రీ పాత్రలుండును. నాయకుడు ఉదాత్తవాక్సంపన్నుడు. కైశికీవృత్తి అతిప్రచురము. ముఖనిర్వహణసంధులు రెండు మాత్రమే ఉండును. రాగతాళలయాదులకు ఇందు ప్రాధాన్య మధికము.

ఉదాహరణము : కేలిరైవతకము.[3]

హల్లీశమునకు అభినవభారతీకారుడు ఇచ్చిన లక్షణమిందుకు భిన్నముగ ఉన్నది.

"మణ్డలేనతు యన్నృత్తం హల్లీసకమితిస్మృతమ్
ఏకస్తత్రతు నేతాస్యాత్ గోపస్త్రీణాంయథాహరిః"

(మండల నృత్తము హల్లీసకము, ఇందు గోపికలకు గోపాలుని (హరి) వలె ఒకే ఒక్క నాయకుడుండును.)

---

1. భావప్రకాశనము – నవమాధికారము – శ్లో. 129 నుండి 133 వరకు.
(ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ ప్రచురణ)

2. "నాటికైవ ప్రకరణీ సార్థవాహాది నాయకా
సమాన వంశజా నేతుర్భవేద్యత్ర చ నాయికా
—మృగ్య ముదాహరణమ్." (సా. ద. 6 వ పరిచ్ఛేదము; శ్లో. 306)

3. "హల్లీశ ఏక ఏవాఙ్కః సప్తాష్టౌ దశవాస్త్రియః
వాగుదాత్తైక పురుషః కైశికీ వృత్తిరుజ్జ్వలా
ముఖాన్తిమౌ తథా సన్ధి బహుతాల లయస్థితిః
—యథా కేలిరైవతకమ్." (సాహిత్య దర్పణము. 6–307)

శారదాతనయుని హల్లీసకనిర్వచనము విశ్వనాథుని కంటెను కొంచెము భిన్నముగ కనిపించుచున్నది.

"హల్లీసమె హల్లీసకము. ఇది సప్త - అష్ట - నవ - దశనాయికలతో నుండును. ఉదాత్తవచనము లిందుండవు. ఒక యంకమె యుండును. రెండంకములేని యుండును. ముఖసంధి విమర్శసంధి యుండును. గేయ లాస్యముండును. యతి యుండును. యతి - ఒక విధమగు వాద్యరీతి. హల్లీసకము ఖండతాలముతో లయవిధానముతో నుండును. విశ్రామ మొక్కటియె యిందుండును. కేళిరైవతమనునది హల్లీసము. ధీరలలితులు దక్షిణులు ప్రఖ్యాతులునగు నాయకు లయిదారుగురుందురు. బ్రాహ్మణ - క్షత్రియ - వైశ్య పుత్రులు సచివాయత్తసిద్ధులై యిందు గోచరింతురు. ఇందు రెండకంకములుండునేని ముఖసంధి విమర్శ సంధి యుండదగును. ఒక యంకమె యుండునేని 'గర్భనిర్గమః' దీని భావమాలోచనీయము."[1] (శారదా తనయుని భావప్రకాశమునకు శ్రీ జమ్ములమడక మాధవరామశర్మగారి భావా లోకమను అనువాదము. పుట - 634-635 (ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ ప్రచురణ.)

**18. భాణిక (భాణి)**: ఇందు సుందరమైన నేపథ్యరచన ముండును. ముఖ నిర్వహణ సంధులు మాత్రమే యుండును కైశికీభారతీ వృత్తులే ఉండును. ఒకే ఒక అంకము. నాయిక ఉదాత్త, నాయకుడు హీనుడు. భాణికలో ఏడు అంగములుండును, ఉపన్యాసము, విన్యాసము, విబోధము, సాధ్వసము, సమర్పణము, నివృత్తి, సంహారము. ప్రసంగవశమున కార్యమును కీర్తించుట ఉపన్యాసము. నిర్వేదద్యోతకమయిన వచన విన్యాసమే విన్యాసము. భ్రమనిరాకరణము విబోధము. మిథ్యాహంకార ప్రదర్శనము సాధ్వసము. కోపపూర్వకమైన నిందాబహుళమైన వచనము సమర్పణము. నిదర్శనమును లేక ఉదాహరణవచనమును నివృత్తి యందురు. కార్యసమాప్తియే సంహారము. అంగసప్తకమునకు ఉదాహరణములు స్పష్టము.

---

1. భావప్రకాశనము - నవమాధికారము - శ్లో. 125 నుండి 127 వరకు.
ప్రచురణ : ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ (1973)

ఉదాహరణము : కామదత్త.[1]

శారదా తనయుని భాణికాలక్షణము సాహిత్యదర్పణకారుని లక్షణము కంటె భిన్నముగ ఉన్నది—

"భాణికలో సామాన్యముగా హరిచరితమె యుండును. గాథాదులు వర్ణములు మాత్రలిందు స్వీకృతములగును. భాణమయినను సుకుమార ప్రయోగమున భాణికయగును. దివ్యచారీ విధానములిందుండవు. దివ్యచారి యనుట ఆకాశచారి యని భావము. దీనిచే భౌమచారులుండదగునని సూచితము. లలితములగు కరణములతో నిది సంయుక్తమగును. ఒక్కొక్కచో తాలాంతరాలములలో నృత్తములుండును. రథ్యాదితాలవిధానములతో సంశలిష్టమగును. అర్థోద్గ్రాహ-నివారణ-గాయన-వసంత-మత్తపాలీ విశేషము లుండును. భాణములో నిందు విశ్రామములుండవు. స్త్రీ ప్రయోజ్యమగును. ఉత్తాల వర్జితమగును. భాణికలో వస్తువులు తొమ్మిది కాని పది కాని నియమముగా విహితములు కావలెను. తొమ్మిది మొదలుగా నయిదు స్థానములలో భగ్నతాలముండును. స్థానాంతరములలో లయతాలము లిచ్ఛానుసారమున నుండదగును. వివిధములగు వచోవిన్యాసములచే సభ్యుల కుత్సాహ సంపత్తిని గూర్పవలెను. భాణమునందువలె భాణికయందును లాస్యాంగములను సంధులను తన్నియమ ప్రకారము కూర్చునది. ఈ విషయముననే కొందరి

1. "భాణికా శ్లక్ష్ణ నేపథ్యా ముఖ నిర్వహణాన్వితా
కైశికీ భారతీవృత్తి యుక్తైకాఙ్క వినిర్మితా
ఉదాత్త నాయికా మందనాయకాత్రాఙ్గ సప్తకమ్
ఉపన్యాసోఽథ విన్యాసో విబోధః సాధ్వసం తథా
సమర్పణం నివృత్తిశ్చ సంహార ఇతి సప్తమః
ఉపన్యాసః ప్రసంగేన భవేత్కార్యస్య కీర్తనమ్
నిర్వేదవాక్య వ్యుత్పత్తి ర్విన్యాస ఇతి స స్మృతః
భ్రాంతినాశో విబోధః స్యాన్మిథ్యాఖ్యానంతు సాధ్వసమ్
సోపాలమ్భవచః కోపపీడయేహ సమర్పణమ్
నిదర్శనస్యో పన్యాసో నివృత్తిరితి కథ్యతే
సంహార ఇతిచ ప్రాహుర్యత్కార్యస్య సమాపనమ్"
స్పష్టాన్యుదాహరణాని – యథా – కామదత్తా"
(సాహిత్య దర్పణము. 6 వ పరిచ్ఛేదము; శ్లో. 308–312)

విధముగాననిరి. భాణియను నీ భాణికలో శృంగారమంగిరసముగా నుండ దగును. శ్లక్ష్ణనైపథ్యము ధరించిన నాయిక యుండదగును. ఇందు గర్భావమర్శ సంధులుండవు. ముఖ ప్రతిముఖ నిర్వహణ సంధులుండును. స్వల్పములగు వృత్తములు నిబద్ధములగును. పీఠమర్దుడు, విటుడు దీనిలో కూడి యుందురు. విదూషకుడు నిందుండదగును. లాస్యాంగములు పదియు నిందాయోజితములు కావలెను. పాంచాలరీతితో నిది నియతమగును. వీణావతి యనునది భాణిక యగును."[1] (భావప్రకాశనమునకు శ్రీ జమ్మలమడక మాధవరామశర్మగారి భావాలోకనను అనువాదము పుటలు-623-624).

ఇంతవరకు సాహిత్య దర్పణకారుడు-విశ్వనాథుడు పేర్కొని నిర్వచించిన ఉపరూపకములను వివరించితిని. ఈ సందర్భమున విశ్వనాథుని నిర్వచనములతో ఏకీభవించని ఇతరాలంకారికు - ముఖ్యముగా శారదాతనయుని నిర్వచనములను కూడ ఉటంకించితిని. విశ్వనాథుడు సూచించిన పదునెనిమిది ఉపరూపకములేకాక మరి కొన్నింటిని అగ్నిపురాణము, కావ్యానుశాసనము, భావప్రకాశనము, అభినవభారతి పేర్కొనియున్నవి. ఈ వరుసలో కోహలుడు కూడ ఉన్నాడు. ఇతని గ్రంథమును గూర్చియు, ఉపరూపకములను ఇతడు వివరించిన విధానమును గూర్చియు విశేషము లెవ్వియును తెలియవచ్చుటలేదు. అయినను ఆలంకారికులు ఇతడు పేర్కొన్న ఉపరూపకములను ఉదాహరించియున్నారు. ఇతని గ్రంథముపలబ్ధము కాకపోవుట చేత ఉపరూపకములను గూర్చి ఇతడు చేసిన విభజనను చేయలేకపోవుచున్నాను. సాహిత్య దర్పణము నందులేని ఉపరూపకములు — 1. భాణము, 2 ప్రేంఖణము, 3. డోంబి, 4. రాగకావ్యము, 5 శింగ (శింగకము), 6. భాణి, 7. షిద్గకము, 8. పారిజాతము, 9. రామక్రీడము (రామాక్రీడము), 10. కల్పవల్లి, 11. మల్లిక (మణికుల్య) 12 కర్ణము. వీని స్వరూప స్వభావములను పేర్కొనుట అప్రస్తుతము కాదు. కావున ఒక్కొక్క దాని లక్షణమును ఇట వివరింతును.

---

1. భావప్రకాశనము - నవమాధికారము. శ్లో. 73 నుండి 79 వరకు.
ప్రచురణ: ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాదమీ (1973)

. **భాణము :** భాణమును ఒక రూపకముగ సంకేతించినవారు అభినవ గుప్తుడు, హేమచంద్రుడు, శారదాతనయుడు. భాణమునకు శారదాతనయుడిచ్చిన లక్షణ మిట్లున్నది.

"ఇందు హరి-హర - భాను - భవానీ - స్కంద ప్రమథాధిపతులస్తుతలుండును. వారిస్తుతులతో నిది నిబద్ధమగును. ఇందు ప్రయుక్తములగు కరణములుద్ధతములుగా నుండును. కావుననే స్త్రీవర్జ్యము ... ఈ భాణము నానా విధములగువర్ణనములతో గూడి యుండును. ఇట్లు కేవలము దేవస్తుతినిబద్ధమే కాదు. మానవులగు భూపాలకుల స్తుతినిబంధనమున గూడ భాణముండును వారి గుణకీర్తన ప్రకాశనములుకల గాథలతో నిది నిబద్ధమగును గాయన సహోక్తియుక్తమై యుదాత్తచరితముతో విభూషితప్రాయముగా నుండుట యుక్తము. త్రి-చతుః-పంచ వితాల విధానములతో గూడినదై సప్త విశ్రామములతో పరిచ్ఛిన్నమై యుండును. ఒక్కొక్కచో అర్ధోద్గ్రాహము నివారణములతో సంఖ్యాతములయిన విశ్రామములతో నియతము నగును. పంచమ వివరి వర్తనమునందు వివిధములయిన సమ విశ్రామములతో విభూషితమగును. భాణము గాథా మాత్రాలంకృతము. ద్విపథక పాఠ్యమున నలంకృతమునై లలితముగ నుండును. (గాథ యనునది ప్రాకృతభాషా నిబద్ధమయిన యార్య. పురాణాది కావ్య సంబధికథ గాథలో నుండును. ఇది త్రిపది, పంచపది షట్పదియగును. ప్రాకృతమునందలి మాత్రావృత్తము నకు ద్విపథకమని పేరు. గాన యోగ్యమగు ప్రబంధ మొకటి ద్విపదనామమున గాథా మాత్రావిశేషమున ద్విపథక పాఠ్యమున నిది యలంకృతము కావలె నని భావము. భాణరీతి యిట్లుండగా నిందుండదగిన విశ్రామసప్తకములో నుండవలయురీతి యిట్లుండును.)

ప్రథమవిశ్రామమునందు వర్ణము - మత్తపాలి - భగ్నతాలములు - గాథ - తదనుగత భగ్నతాలము - భగ్నతాలము ననువవి కూర్పుపొందదని యున్నవి. రెండవ విశ్రామమున గాథ - ద్విపథక - వసంతములు, మాత్రా విషమచ్ఛిన్నమయిన వృద్ధి సమేతమయిన భగ్నతాలవిధానము నుండును. (వసంత పదార్థమీవిధమున నున్నది. వీణపై వాదన క్రమాత్మకమయిన రాగాంగరాగమును వసంతమందురు. వేణువాదన క్రమమున నున్నరాగము వసంతము. వసంతమను దేశీతాలముకలదు. ఇందు తొమ్మిది మాత్రలు నియత

ములు. హిందోలరాగాంగమయిన వసంతరాగమున్నది. రాగమున్నది. రాగాంగరాగ మున్నది. భగ్నతాలము దేశీతాలము. ఈ రెండిటికి సంబంధమున్నది.) తృతీయ విశ్రామములో మాగధికఅను ప్రాకృత భాషా నిబద్ధమయిన మాత్రా వృత్తము కూర్పవలెను. చతుర్థ విశ్రామములో రథ్య - ద్విపథక - వసంతక - రథ్యాతాలములను గూర్పవలెను. (రథ్య యనునది దేశీతాలము) పంచమ విశ్రామమునందు రథ్య - భగ్నతాల - మార్గణిక - ద్విపథ విషమములుండును. (విషమ మనునది రంజన గుణము. అత్యుచ్చస్థానకమగు గీతము తాలపాతాలక్షితమై ప్రయోగబహులము రూక్షముకాగా విషమ మగును. ఇది వాది వల్లభము. విషమమనునది యొక హస్తపాటము. పతాకాహస్తచలనము మణిబంధ కంపనము పాదకంపము వలన విషమపాటము కలుగును. హస్తవైషమ్యఘాతమున విషమ ముదయించును. విషమ మనునది యొక దేశీతాలము.) షష్ఠవిశ్రామమునందు రథ్యాతాలము నవభగ్నతాలములు నుండును. సప్తమ విశ్రామమునందు ద్విపథక మార్గణికములుండును. రథ్యాతాలము భగ్నతాలములుండును. ఇది యంతయు శుద్ధభాణమున నుండదగు క్రమవిన్యాసమి ట్లుపదిష్టమయినది.

భాణకభేదములిందు లక్షితములగును. పైన నిరూపించిన భాణము సంకీర్ణభణితిభరితమయినచో నుభయసంయోగముండును గావున సంకర భాణమగును. కొంతగా ననుద్ధత భావముననున్నచో తాలక్రమ వర్జితమయినచో నిది చిత్రభాణమగును. కావున భాణము శుద్ధము సంకీర్ణము చిత్రమునని త్రివిధమగును. వేరొక విధమునను వీని లక్షింపవచ్చును. శుద్ధభాషతో నున్నచో శుద్ధభాణము, సంకీర్ణభాషతో నున్నచో సంకీర్ణభాణము, సర్వభాషలతో కూడుకొని చిత్రవిధానములతో విచేష్టితమగునేని చిత్రభాణమగును. భాణము ఉద్ధతము - లలితము - లలితోద్ధతమనియు భావింపవచ్చును. భాణమున గ్రథితములయిన యర్థము లుద్ధతములుగనున్నచో భాణముద్ధతమగును. లలితములుగ నున్నచో లలితమగును. ఉభయభావమున లలితోద్ధతమగును. చిత్రభాణమయినను దుష్కరాభిధేయముతో నుండగా నుద్ధతమగును. భాణకమునందుండదగు నభిధేయము అనుతాలములతో వితాలములతో నుండదగును. ఇట్లుండగా నిది నందిమాలి నామము కలదగును. ఈ నందిమాలికి ఈ భాణమున నంతర్భావము చెప్పదగును. (ఇట్లుపై నందిమాలి లక్షణము, సప్తవిశ్రామము లందుండదగు విధానము సూచితమగును. భాణాంతర్భావమును ప్రతిపాదితమగును.)

భరత మతమును సరిగ గుర్తింపక కొందరు భాణము కన్న నందిమాలి భిన్నమని యనిరి. ఆకాశపురుషోద్దేశమున పలికిపను ఆచరించిరను విశిష్టమగు నుద్భావ్యభావప్రయోగము కలది నందిమాలియగును. ఇందు కరణములన్నియు నుద్ధతప్రాయములుగా నుండును. స్త్రీ రహితమయిన వర్ణవమొకచో నుండును. గుణకీర్తిన పరములయిన రాజస్తుతిగాథలతో నిది నిబద్ధమై యుండును. శోభన గాన మొనరించువారి సహోక్తులతో గూడుకొనినదై యుదాత్తరీతి భూషితమై యుండును. బ్రహ్మ-రుద్ర - ఇంద్ర - స్కందాదుల స్తుతులతో నిబద్ధమువగును. అయిదు వితాలములతో నుండును. మూడు నాలుగు వితాలము లేని యుండును. అంతరాంతరా సప్తవిశ్రామములతో పరిచ్ఛిన్నమై యుండును. (ఇంక నీ నందిమాలిలో నుండు సప్తవిశ్రామములలో నీ విశేషములు కలవు)

ఒక్కొకచో నర్ధోద్గారిహాది సంఖ్యాసములతో నియతముగా నుండును. సమ విశ్రామములతో భూషితమగును. పంచమ పరివర్తనమునందు గాథా - మాత్రా - ద్విపథక పాఠ్యమున నలంకృతమగును. ప్రథమ విశ్రామము నందు వర్ణము కాని మత్తపాలికాని యుండును. అనంతరము రెండు భగ్నతాలము లుండును. గాథానుగతముగా భగ్నతాలములుకాని మాత్రకాని యుండును. ద్వితీయ విశ్రామమునందు భగ్నతాలములు - గాథ - ద్విపథకము - వసంతము నుండును. తృతీయ విశ్రామమున విషమస్థానమున ఛిన్నమయిన మాత్రా విధానము భగ్నతాలము రథ్యమాగధి యనునవి సంగతములగును. చతుర్థవిశ్రామమునందు రథ్య - ద్విపథకము - వసంతము- రథ్యాతాలము యథాక్రమముగా సంగతమగును. పంచమ విశ్రామమున రథ్య - భగ్నతాల - మార్గణిక - ద్విపథ- విషమములుండుట ప్రసిద్ధమగును. షష్ఠ విశ్రామమున రథ్యాతాలము భగ్న తాలము ద్విపథకము మార్గణిక యుండును. సప్తమ విశ్రామమున రథ్య-భగ్న తాలముండును, శుద్ధభాణము నందీక్రమమును నాట్యవిదు లుదాహరించిరి.

శుద్ధభాషతో కల్పితమయినచో భాణము శుద్ధమగును. భాషాసంకర కల్పితమయినచో సంకీర్ణభాణమగును. సర్వభాషా విచిత్రితమయినచో చిత్రభాణ మగును. ఇంతవఱకు నిరూపించిన తాలక్రమాశ్లిష్టమయినచో శుద్ధభాణమగును. రెండు మూడు తాలములతో సంకీర్ణమయినచో సంకరోద్భవభాణమగును. ఈ చెప్పిన తాలక్రమ వివర్జితమయినచో చిత్రభాణమగును. అర్థముల కౌద్ధత్య

మున్న నుద్ధభాణమని; అర్థములకు లాలిత్యమున్న లలితభాణమని, లాలిత్య మౌద్ధత్యమున్నచో లలితోద్ధతభాణమని యందురు. దుష్కరము ద్ధతమగునది చిత్రభాణవ్యవహారము కలదగును. భాణము నందలి యభిధేయము అనుతాలములతో వితాలములతో గూడియుండును. ఇట్లుండుట రూపక విశేషమయిన భాణమునకు సంబంధించిన లక్షణము. ఇందు నిరూపితములు కాని యంగములు సంధ్యాదులు అతిదేశ్యములు కాదగును. భాణరూపక లక్షణమునుండి నృత్తరూపక భాణమునలేని వానిని స్వీకరించుట యుక్తము. ఈ విధానమతిదేశము. ఇట్లున్న నందిమాలి యను భాణము ఇందంతర్భూతమగును. పాఠ్యమున గీతమున క్రియలో ఆకాశపురుషు నుద్దేశించి నిరూపించు ప్రయోగము సవిశేషముగా భావింపదగు భావముల స్వభావమున నుండును. ఇట్టి భావము నందిమాలి నామమున నుండు భాణమున నుండుటను కవులు నిరూపించిరి."[1] (భావప్రకాశమునకు శ్రీ జమ్ములమడక మాధవరామ శర్మగారి భావలోకమను అనువాదము - పుటలు 617-623)

ఈ విధముగా పైన చెప్పబడిన భాణమను నృత్యరూపక లక్షణమున ప్రతిపాద్యమైన విషయమంతయు సంగీతశాస్త్రమునకు సంబంధించిన తాల వాద్య విశేషములతో నిండియున్నది

**2. ప్రేరణము** : అభినవగుప్తుడు, హేమచంద్రుడు ప్రేరణమును నిర్వ చించియున్నారు

ప్రహేళికాన్వితముగను, హాస్యప్రాయముగను ఉండు నృత్తప్రబంధ విశే షము ప్రేరణమని అభినవగుప్తుడు నిర్వచించినాడు.[2]

హేమచంద్రుడు ఇదే నిర్వచనము నిచ్చి గేయరూపక విశేషముగా పేర్కొనినాడు [3]

**3. రామాక్రీడము (రామక్రీడము)** : ఋతువర్ణన సంయుక్తమైన నృత్త

1. భావప్రకాశనము - నవమాధికారము. శ్లో. 38 నుండి 72 వరకు.
ప్రచురణ : ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ (1973)

2. "హాస్యప్రాయం ప్రేరణంతు స్యాత్ప్రహేలికయాన్వితమ్"
—నాట్యశాస్త్రమ్- అభినవగుప్త విరచిత వివృతి సమేతమ్. ప్రథమ సంపుటము పుట 183 సెంట్రల్ లైబ్రరీ బరోడా ముద్రణ: (1926))

3. కావ్యానుశాసనము-ఎనిమిదవ అధ్యాయము.

ప్రబంధము రామాక్రీడము[1] అని అభినవగుప్తుడు పేర్కొనగా హేమచంద్రుడును ఇదే నిర్వచనమును చూపినాడు [2]

**4. డోంబిక (డోంబి) :** డోంబికను అభినవగుప్తుడు, హేమచంద్రుడు, శారదాతనయుడు పేర్కొనియుండిరి. శారదాతనయుడిట్లు చెప్పినాడు –

"డోంబియను నృత్యరూపకమునకు భాండిక యనియు పేరు. ఇందు నాయిక యుదాత్త. ఇందంకమొకటియే యుండును. కైశికీవృత్తిభారతీ వృత్తి యుండును. వీరశృంగారము లుండును. ఇందలి నేపథ్యము శ్లక్ష్ణముగా నుండును. ఉత్సాహము మందముగా నుండు నాయకుడుండును. భాణిక యవదగు నీ డోంబిలో నేడంగములుండును. "కామదత్త యనునది డోంబిరూపకము. విన్యాసము – ఉపన్యాసము – విబోధము – సాధ్వసము – అనువృత్తి – సంహారము – సమర్పణము అనునవి యిందలి యంగములు. క్రమముగా వీని లక్షణ మిట్లుండును

1. విన్యాసము. ఇష్టవిరహోత్థిజన్యమయిన నిర్వేద వాక్యమును విన్యాస మందురు. 2 ఉపన్యాసము తత్తదర్థ ప్రసాధనమున నుచితకార్యము నిరూపించుట యుపన్యాసము 3. విబోధము. సంశయభ్రాంతులు నివృత్తములగుట విబోధమందురు. 4 సాధ్వసము. భయమువలన నభూతార్థమును భూతార్థముగా నిరూపించుట సాధ్వసము. 5. అనువృత్తి. నిదర్శన రూపమగు నర్థము నుపన్యసించుట యనువృత్తియగును. 6 సంహారము. అభిలషించిన యర్థ ప్రాప్తికి సంహారమని పేరు 7. సమర్పణము విరహజన్యమయిన పీడా విశేషమున నుపాలంభించుటను సమర్పణ మందురు. ఇట్లు సప్తాంగములనిందు నిబంధింపదగును. ఈ డోంబిలో యథాయోగముగా లాస్యాంగ దశకము నిరూపించుటయునున్నది."[3] (భావప్రకాశమునకు శ్రీ జమ్ములమడక మాధవరామ శర్మగారి భావాలోకమను అనువాదము – పుట 615.)

---

1. "ఋతువర్ణన సంయుక్తం రామాక్రీడంతుభాష్యతే"

—నాట్యశాస్త్రము–అభినవగుప్త విరచిత వివృతి సమేతమ్ ప్రథమ సంపుటము పుట (183) బరోడా ముద్రణ : (1926)

2. కావ్యానుశాసనము–ఎనిమిదవ అధ్యాయము.

3. "డోమ్బ్యేవ భాండికోదాత్త నాయికైకాంకభూషితా
కైశికీ భారతీప్రాయా వీరశృంగారమేదురా
శ్లక్ష్ణనేపథ్యభాక్ మందోత్సాహపూరుషనాయికా

సాహిత్యదర్పణకర్త నిర్వచించిన భాణిక, శారదాతనయుడు నిర్వచించిన డోంబి ఒక్కటే. సాహిత్య దర్పణమునందు డోంబిని ఉపరూపక విశేషముగ పేర్కొనకపోవుటకు ఇదియే కారణము. ఇరువురి లక్ష్యలక్షణములు తుల్యము లుగా నుండుటవలననే కాబోలు (శ్రీ) జమ్ముమడక మాధవరామశర్మగారు భావ ప్రకాశన వ్యాఖ్యానములో "భాణిక యనదగు నీ డోంబి" అనియనిరి.

ప్రచ్ఛన్నానురాగగర్భములగు నుక్తులచే రాజుగారి మనసును వశము చేసికొనుటయు సుకుమార నృత్తమును డోంబికలో నుండునని అభినవగుప్తుడు పేర్కొన్నాడు.[1]

హేమచంద్రుడును ఈ నిర్వచనమునే పేర్కొనెను.[2]

**5. శింగకము (శింగము) :** హేమచంద్రుడు మాత్రమే దీనిని గేయరూపక విశేషముగ చెప్పినాడు.

---

అంగాని తస్యాః సప్తస్యుః కామదత్తా యథాకృతా
విన్యాసశ్చాప్యుపన్యాసో విబోధః సాధ్వసస్తథా
అనువృత్తిశ్చ సంహారః సమర్పణమితిక్రమాత్
నిర్వేదవాక్యం విన్యాస ఇష్టార్థవిరహోత్థితం
కార్యాఖ్యాన ముపన్యాసః తత్తదర్థప్రసాధనే
నివృత్తిస్సంశయభ్రాంత్యోః విబోధ ఇతికథ్యతే
సాధ్వసః స్యాదభూతస్య భూతోదాహరణంభయాత్
నిదర్శనోపన్యసనమను వృత్తిరితి స్మృతా
యథాభిలషితావ్యాప్తిః సంహార ఇతికథ్యతే
సమర్పణ ముపాలంభః పీడయావిరహోత్థయా
అస్యాంలాస్యాంగదశకం యథాయోగం ప్రయుజ్యతే"

—భావప్రకాశనము-నవమాధికారము-శ్లో-26 నుండి 33 వరకు
ప్రచురణ : (ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ 1973)

1. "ఛన్నానురాగగర్భాభిరుక్తిభిర్యత్రభూపతేః
ఆవర్జ్యతే మనఃసాతు మసృణా డోంబికామతా"
—నాట్యశాస్త్రమ్-అభినవగుప్త విరచిత వివృతి సమేతమ్. ప్రథమ సంపుటము చతుర్థాధ్యాయము సెంట్రల్ లైబ్రరీ బరోడా (1926).

2. కావ్యానుశాసనము-ఎనిమిదవ అధ్యాయము.

సఖీ సమక్షమున తన పతి ఉద్ధతమైన లేక మసృణమైన వృత్తమును వర్ణించి చెప్పినచో శింగకము. కొన్నిచోట్ల ధూర్తవృత్తము కూడ వర్ణింపబడును.[1]

**6. పారిజాతకము (పారిజాతలత) :** శారదాతనయుడు మాత్రమే దీనిని నృత్యభేద విశేషముగ పేర్కొన్నాడు -

"ఇది పారిజాతలత. ఇది పారిజాతకము. ఇందొకటియే యంకము. ముఖ సంధియుండును. వర్ణతాలము, మాత్రాతాలము, ఖండతాలముండును. గాథా సమన్వితమగును. వీర శృంగారభూయిష్ఠము. దేవక్షత్రాది నాయకము. ఇందలి నాయిక కలహాంతరితావస్థలోనుండుటయు నాయకుడుదాత్తుడుగా నుండుటయు కలదు. అథవా; భోగిని - స్వీయ - గణిక నాయికగా నుండుటయు సంభావ్యము. దండరాసక విధానమున వర్తించు పాత్రలెనిమిదిమంది కాని నలుగురు కాని యుందురు. ఇం దపసారత్రయముండును. ఇది చిత్రకథలతో గేయములతో సమన్వితమగును. ఇందొక్కక్కచో విదూషకుని క్రీడలుండును. పరిహాసములుండును. అందుచే నది మనోహరమునగును. ఇట్టిది పారిజాతలత. గంగాతరంగిక యనునది యిట్టిది. ఈ లతనే పారిజాతకమనియు నందురు "[2] (భావప్రకాశమునకు శ్రీ జమ్ములమడక మాధవ రామశర్మగారి భావాలోకమను అనువాదము పుట 638.)

---

1. "సఖ్యాః సమక్షం పత్యుర్యదుద్ధతం వృత్తముచ్యతే
మసృణం చ క్వచిద్ధూర్తచరితం శింగకస్తుసః" —కావ్యానుశాసనము-ఎనిమిదవ అధ్యాయము. (పుట-392) నిర్ణయసాగర ముద్రణ : (1934)

2. "పారిజాతలతైకాంక ముఖనిర్వహణాన్వితా
వర్ణమాత్రా ఖండతాలవతీగాథా సమన్వితా
వీరశృంగారభూయిష్ఠా దేవక్షత్రాదినాయకా
కలహాంతరితావస్థా నాయికోదాత్తనాయకా
అథవాభోగినీ స్వీయా గణికానాయికాన్వితా
తాఃస్యురష్టౌ చతస్రః స్యుర్దండరాసకవర్తనాః (?)
సాపసారత్రయా చిత్రకథాగేయ సమన్వితా
క్వచిద్విదూషకక్రీడా పరిహాస మనోహరా
పారిజాతలతానేయం యథాగంగాతరంగికా
పారిజాతక మిత్యేవ కైశ్చిదేషాఽభిధీయతే''
—భావప్రకాశనము-నవమాధికారము.శ్లో-141 నుండి 145 వరకు
ప్రచురణ: ఆం. ప్ర. సంగీతనాటక అకాడమి (1971)

**7. కల్పవల్లి :** శారదాతనయుడు మాత్రమే దీనిని నృత్యరూపక విశేషముగా పేర్కొన్నాడు. అతడు చెప్పిన లక్షణమిది –

"ఇది హాస్యరసముతో శృంగారరసముతో తదుచిత భావములతో నుండును. ఉదాత్త నాయకోపేతమగును. ఇందు పీఠమర్దుడుపనాయకుడుగా నుండును. ఇందు వాసకసజ్జిక నాయిక కాదగును. అభిసారికయేని నాయిక కాదగును. ద్విపదీఖండ గేయములతో నిది పూర్ణముగా నుండును. రథ్యా – వాసకములను తాలములతో నుండును. లయత్రయయుతము. లాస్యాంగ దశకసముపేతము. ఇట్టిది కల్పవల్లి. మాణిక్యవల్లిక యనునది కల్పవల్లి. ముఖసంధి ప్రతిముఖ సంధి నిర్వహణ సంధులలో నిది యుండును. ఉదాత్త నాయకోత్కర్ష కలదై లలితోదాత్త నాయకమై కల్పవల్లి యుండును."[1] (భావప్రకాశమునకు శ్రీ జమ్మలమడక మాధవరామశర్మగారి భావాలోకమను అనువాదము - పుట. 637. ఆం.ప్ర. సం నా.అ ప్రచురణ)

**8. మల్లిక (మణికుల్య) :** ఈ నృత్యభేదమును శారదాతనయు డొక్కడే పేర్కొన్నాడు. దాని లక్షణమిది–

"మల్లికారూపకము భోగశృంగారముతో గూడుకొనినదై మంథరముగా నుండును. ప్రథమాంకమున విదూషక క్రియలుండును. ద్వితీయాంకమున విట క్రియలుండును. ప్రథమ ద్వితీయాంకములందు విదూషకవిట క్రియలు క్రమాశ్లిష్టములై యుండుట యిట్టిది. గాథలతో ద్విపథకములతో నుండుట, రథ్యా-వాసకములను తాలవిధానముల నుండుట మల్లికాలక్షణము. ఇందలి కథ మొదట లక్ష్యము కాదు. అనంతరము బాగుగా నిందలి వస్తువు గోచరించును. గర్భావమర్శసంధులుండవు. మిగిలిన సంధిత్రయముతో నిదిసంగతమగును. మణిమయమగు

1. "కల్పవల్లీ భవేద్ధాస్య శృంగార రస భావయుక్
ఉదాత్తనాయకోపేతా పీఠమర్దోపనాయకా
అస్యాంవాసక సజ్జాస్యాన్నాయికా ఒథాభిసారికా
ద్విపదీఖండగేయాఢ్యా రథ్యావాసకతాలయుక్
లయత్రయయుతా లాస్యదశకేన సమన్వితా
ఈదృశీ కల్పవల్లీ స్యాద్యథా మాణిక్యవల్లికా
ముఖసంధి ప్రతిముఖసంధి నిర్వహణైర్యుతా
ఉదాత్తవర్ణనోత్కర్షా లలితోదాత్త నాయకా
—భావప్రకాశనము–నవమాధికారము శ్లో. 137–140 అకాడమీ ప్రచురణ.

కుల్యలో కాలువలో జలము గోచరింపదు. అట్లే యిందలి వస్తువు మొదట భాసింపదు. అనంతరము ప్రకాశించును. ఇట్టిది మణికుల్యయయినను మల్లిక[1] (భావ ప్రకాశనమునకు శ్రీ మాధవరామశర్మగారి వ్యాఖ్యానము పుట 636.)

**9. భాణి** : శారదాతనయుని మతమున భాణియన్నను భాణిక యన్నను ఒక్కటేయనునది. భాణికను వివరించు సందర్భమున తెలుపబడినది.

**10. కర్ణము** : ఈ ఉపరూపక భేదమును అగ్నిపురాణము పేర్కొన్నది. కాని అందు దీనికి లక్ష్యముగాని లక్షణముగాని వివరింపబడియుండలేదు.

సాహిత్యదర్పణకారుడు ఈ కర్ణమును ప్రకరణికగను, భాణిని సంలాపకము<sup></sup>ను గుర్తించినాడని అగ్నిపురాణానువాదము నందలి అధస్సూచికలో వివరింపబడియున్నది[2] కాని డా॥ సత్యవ్రతసింహ్ సాహిత్య దర్పణ వ్యాఖ్యానము నందు ఈ నామాంతరముల ప్రసక్తి లేనేలేదు. ఇది విచార్యము.

**11. రాగకావ్యము** : కోహలుడు, హేమచంద్రుడు దీనిని పేర్కొన్నారు. హేమచంద్రుడిట్లు నిర్వచించినాడు.

వివిధరాగముల లయాంతరప్రయోగముతో అనేక రసములతో నిర్వహింపబడునది రాగకావ్యము.[3]

**12. షిద్గకము (షిద్గికము)** : కోహలుడు అభినవగుప్తుడు దీనిని పేర్కొ

1. "మల్లికా భోగశృంగార కైశికీవృత్తి మంథరా
ఏకద్వ్యంక క్రమాశ్లిష్ట విదూషక విటక్రియా
గాథాద్విపథకోపేతా రథ్యావాసకతాలయుక్
అనాలక్ష్యకథా పూర్వం పశ్చాదలక్ష్యవస్తుకా
గర్భావమర్శహీనా చ సంధిత్రయ సమన్వితా
మణికుల్యాయాం జలమివ నలక్ష్యతే యత్రపూర్వతోవస్తు
పశ్చాత్ప్రకాశతే యాసా మణికుల్యాఽపిమల్లికాజ్ఞేయా"
—భావప్రకాశనము-9వ అధికారము శ్లో. 134-136.
ప్రచురణ : (ఆంధ్రప్రదేశ్ సంగీత అకాదమీ 1973)

2. అగ్నిపురాణ్ - గర్గసంహిత —"కల్యాణ్" ప్రత్యేక సంచిక-గోరఖ్‌పూర్. యు. పి. నాటకనిరూపణ్-338వ అధ్యాయము. పుట-(575)

3. "లయాంతర ప్రయోగేణ రాగైశ్చాపి వివేచితమ్"
నానారసం సునిర్వాహ్యకథం కావ్యమితి స్మృతమ్" —హేమచంద్రుని కావ్యానుశాసనము-ఎనిమిదవ అధ్యాయము. నిర్ణయసాగర ముద్రణాలయము (1934)

న్నారు. అభినవగుప్తుడు చెప్పిన షిద్గకము, హేమచంద్రుడు పేర్కొన్న శింగ కము ఒక్కటే[1] శింగకము ముందే పేర్కొనబడినది.

ఇక తెలుగు లాక్షణికులలో చిత్రకవి పెద్దన తప్ప ఎవరుగాని ఉపరూప కములను గూర్చి ప్రస్తావించి యుండలేదు. ఆతడైనను శారదాతనయాదులు పేర్కొన్న ఉపరూపకములలో పదునారు పేర్లను మాత్రము చెప్పెను కాని వాని లక్ష్యలక్షణములను వివరించియుండలేదు. ఆతడు తన లక్షణసార సంగ్ర హమున ఉపరూపకములను గూర్చి ఇట్లు వ్రాసినాడు—

నాటికా సట్టక ।తోటకో పేక్షణం
బునుగోష్ఠి భాణికల్ పొల్పుమీర
సల్లాపకంబు ప్రస్థానంబు కావ్యంబు
రహిమించు భల్లిసరాసకములు
శ్రీగదితంబు లాసికయు దుర్మల్లియు
నాట్యరాసకమును నటనమించు
నుల్లాప్యమనఁగను నుపరూపకంబుల
నామముల్ పదియాఱు నవ్యమయ్యె
వీనికిని లక్షణంబులు విశదమతులు
సంధులింగముల్ నాయకసంజ్ఞలాది
గాఁగగల్గిన సామగ్రి గనఁగలవలయుఁ
బూర్వ లసందలంకృతులలో శర్వతనయ"[2]

ఈ విధముగా ఆలంకారికులు వివరించిన ఈ ఉపరూపకములను పరిశీలించి నచో అందు - ఇతివృత్తము గౌణముగా నుండుట, గీతనృత్యవాద్యములకు విశేషప్రాధాన్యముండుట, జనసామాన్యమునకు ఆస్వాదనీయమైన, శృంగార రసానుకూలమైన శౌరసేనీ మాగధ్యాది ప్రాకృతభాషలను ప్రయోగించుట,

1. "సఖ్యాః సమక్షం భర్తుర్యదుద్ధతిం వృత్తముచ్యతే
మసృణంచ కచిద్ధూర్తచరితం షిద్గకస్తుసః"
—నాట్యశాస్త్రమ్-అభినవగుప్త విరచిత వివృతి సమేతమ్-ప్రథమ సంపుటము.
చతుర్థాధ్యాయము. పుట-183. బరోడా ముద్రణ (1926)

2. లక్షణ సారసంగ్రహము. తృతీయాశ్వాసము-పద్యము-94-పుట (105-106)
ప్రచురణ : ఆంధ్రసాహిత్య పరిషత్తు-కాకినాడ (1940)

స్త్రీ పాత్రలు బహుళముగా నుండుట, సామాన్యులు కూడ నాయికా నాయకులుగా నుండుట. నేపథ్యమునందు గానముండుట. పలురకములైన ఛందములను ప్రయోగించుట, కొన్నింట సూత్రధారుడుండక పోవుట, వివిధ రస సాక్షాత్కారముండుట, ప్రఖ్యాతోత్పాద్య మిశ్రమములలో ఇతివృత్తముండుట. ప్రాయికముగా ఏకాంక పరిమితమై యుండుట, ఎడనెడ వచనముండుట, ఋతువర్ణనముండుట మున్నగు లక్షణములు కనిపించుచున్నవి. సమకాలికాభిరుచులకు అనుగుణముగా కొన్ని మార్పులతో చేర్పులతో ఈ ఉపరూపకలక్షణము లన్నియు నేటి గేయనాటికలలో ప్రస్ఫుటముగా భాసించుచున్నవి.

పాశ్చాత్యదేశములందు వెలసిన ఓపెరా, బాలే, బర్లెటా, మెలోడ్రామా ఫార్సువంటి రూపక విశేషముల జాతికి సంస్కృత - ఉపరూపకములు చెందునని H. H. Wilson గారు 'The drematic systems of Hindus' అనువ్యాసమునందు అభిప్రాయపడినారు [1]

1. "We might also conveniently transfer to them the definitions of the European stage, and class them under the heads of Tragedy. Comedy, Opera, Ballet, Burletta, Melodrama and Farce"
'The Theatre of the Hindus' Page-19
Pub : Indological Book House
Varanasi --1972.

# 6. దేశిదృశ్య కళారూపములు

ఇంతవరకు లాక్షణికులు నిర్వచించిన ఉపరూపకముల లక్షణములను వివరించితిని. ఈ లక్షణములు పరిశీలించినచో నేటి గేయనాటికా స్వరూపమునకును ఈ ఉపరూపకములకును బహుధా సామ్యము కనిపించుచున్నది. అంత మాత్రముచేత ఈ ఉపరూపకములే నేటి గేయనాటికలకు మూలమని నా అభిప్రాయము కాదు. అవి ఒక విధముగా ఆనాటి గేయనాటికలుగా భాసించుచున్నవనుటలో అత్యుక్తి లేదు. దృశ్యకావ్యములందు నృత్యగీతములకు విశేష ప్రాధాన్యమునిచ్చు ఆచారము భరతుని కాలమునుండియే ఉన్నదను యాథార్థ్యమును గమనింపవలసి యున్నది. ఈ ఉపరూపకములు సంస్కృతమునందే యున్నవి. ఇవి దేశభాషలలోని దృశ్యకావ్యములను ఏ విధముగా ప్రభావితము చేసెనో తెలిసికొనుటకు ప్రయత్నములు జరుగవలసియున్నవి. దేశభాషలలో విభిన్న దృశ్యకావ్య ప్రక్రియలున్నవి. వానిలో ఈ ఉపరూపకములలోని గాన నృత్య భేదములు కొలది మార్పులతో కనిపించుచున్నవి. తెలుగుదేశమునందలి నృత్యగేయ ప్రధానములైన యక్షగానాది దృశ్యకళారూపములను పరిశీలించి అవి నేటి గేయనాటికకు ఏ విధముగా భూమికాప్రాయములైనవో నిరూపించుటకు యత్నింతును.

మార్గపద్ధతికి చెందిన నాటికాద్యుపరూపకములలోను సంగీత నృత్యములకు విశేష ప్రాముఖ్యమున్నట్లు తెలిపియుంటిని. ఇక దేశి పద్ధతికి చెందిన రూపకముల స్వరూప స్వభావములను వివరింతును.

**1. కొరవంజి:** శ్రీ మిక్కిలినేని రాధాకృష్ణమూర్తిగారు కొరవంజి దృశ్యకళారూపమును గూర్చి వివరించుచు "తెలుగువారి మొట్టమొదటి కళారూపం కొరవంజి ...... ఇది ఒక జానపద దృశ్యకావ్యం. కొరవంజి అంటే ఎరుకలసాని ...... ఈ ఎరుకలసాని వినోదకాలక్షేపానికై యథాలాపంగా ఆటపాటలు జోడించి ఆరంభించిన కళారూపం కొరవంజి"[1] అని పేర్కొన్నారు.

1. ఆంధ్రనాటకరంగ చరిత్ర —పుట-117, ప్రథమ ముద్రణ (1969 సెప్టెంబరు 20).

ఈ కళారూపమును మరింత వివరించుచు శ్రీ రాధాకృష్ణమూర్తిగారు అది ఒక నృత్య విశేషముతో కూడిన అడుగనియును అటవికులే దానిని సృష్టించి పోషించిరనియును, పవిత్ర పుణ్యక్షేత్రాలలో ఉత్సవసమయములతో ఆయా క్షేత్రాల మహాత్మ్యాల కథలను గేయఫణితిలో ఆడుచు పాడుచు యాత్రికులకు వినోదమును కల్పించుచుండిరనియును తెలిపి యున్నారు

**2 తోలుబొమ్మలాట** : తోలుబొమ్మలాట స్వరూపమును వివరించుచు శ్రీ మిక్కిలినేని రాధాకృష్ణమూర్తిగారు ఇందు సంగీత సాహిత్య చిత్రలేఖనాది లలితకళల సమ్మేళనను సమధికముగా ఉన్నదనియు, సూత్రధారుడు తెరముందు బొమ్మలను ఉంచి వెనుకనుండి వానిని ఆడించుచు తదనుగుణమైన పాటలను మాటలను ఇతర స్త్రీపురుషుల ద్వార పలికించునినియు, నాటకమునకు వలసిన హంగులన్నియును ఇందుండుననియు తెలిపియున్నారు ఈ కళ పాల్కురికి సోమనాథుని కాలమునుండి ప్రజాబాహుళ్యమునకు వినోదమును కలిగించుచున్న దనుటకు సాహిత్యాధారములున్నవి [1]

**3. జముకుల కథ** : "ఈ కథలు శృంగార లాలిత్యాలతోనూ, కరుణ రసాన్ని ప్రతిబింబించేవిగానూ వుంటాయి. ఈ కథల్లో అనేరకాలైన సంగీతపు మట్టులున్నాయి ...... ప్రదర్శనకారులు ముగ్గురు అందులో మధ్యవ్యక్తి కథకుడు. వంతదారుల్లో ఒకరు హాస్యం, రెండవవారు వ్యాఖ్యానం కథకుడు చక్కగా నృత్యంచేస్తూ కలియదిరుగుతాడు స్త్రీ పాత్రలు కథా విధానంలో వచ్చినపుడు అక్షరాలా స్త్రీ అభినయాన్నే ... చేస్తూ వుంటాడు. వంతదారులు రెండు జముకులను శ్రావ్యంగా వాయిస్తూ వుంటారు."[2]

**4 జంగము కథ** : సంగీతాభినయముల మేలికలయిక జంగము కథ. ఇందులో ఒక కథకుడు, ఇద్దరు వంతగాండ్రు నుందురు కథకుడు తంబురాను మీటుచు ఆయా కథా ఘట్టములకు అనుగుణముగా ఆడుచు పాడుచు ప్రేక్షకుల హృదయములను రసార్ద్రము చేయును ఇందలి వాద్య విశేషములైన తంబురా, అందెలు గజ్జెలు, గుమ్మెట్లు మున్నగువానితో కథా కథనము సంగీతాత్మకముగా సాగును ఒకే వ్యక్తి భిన్నపాత్రలు ప్రదర్శించుట ఇందలి

1. ఆంధ్ర నాటకరంగ చరిత్ర — పుట-183.

2. ఆంధ్రనాటకరంగ చరిత్ర —(శ్రీమిక్కిలినేని రాధాకృష్ణమూర్తి) పుటలు-269-271

విశేషము. భిన్నపాత్రలను అభినయించు వ్యక్తి ఒకడే అను అంశమును పృథక్కరించినచో ఇంచుమించుగా ఇది గేయనాటికగానే భాసించును. జానపద సంగీత కళా స్వరూపములైన ఈ జంగం కథలు క్రీ. శ 12వ శతాబ్దమునాటికే ప్రచారము నందుండెను

**5. యక్షగానము :** యక్షగాన వాఙ్మయమును గూర్చి ప్రామాణికమైన పర్యాలోచనముచేసిన ఆచార్య డా॥ యస్వీ. జోగరావుగారు తమ సిద్ధాంత గ్రంథములో యక్షగానము నిట్లు నిర్వచించినారు - "యక్షగానమునం దితి వృత్తమెట్టిదైనఁగా వచ్చును. రచనా ప్రక్రియ శ్రవ్యముగాని, దృశ్యముగాని కావచ్చును. ఏ ప్రక్రియయందైన గీతిధర్మము విహితము. అందురాగతాళము లలో నొకదానికిఁగాని రెండింటికిఁగాని తగు ప్రాధాన్యముగల రచనా విశేష ములు (రేకు, దరువు పదము, కీర్తన మొ) ద్విపద (మంజరియును), పద్యములు (జాత్యుపజాతి వృత్తములు, అర్థపద్యములు, సం. శ్లోకములును) వచనము (సంధి ప్రయోజనాత్మకముగాని సంవాదాత్మకముగాని, వర్ణనాత్మకమైనను గాఁదగును). చూర్ణికలు, విన్నపములు మొ॥ గద్యప్రభేదములు నుండదగును పలాదిగీత ప్రబంధ విశేషముల ప్రయోగ మైచ్ఛికము "1

ముద్రితాముద్రితములైన అనేక యక్షగానములను పరిశీలించి ఆచార్య జోగారావుగారు వాని పరిపూర్ణ స్వరూపమును ఈ నిర్వచనమునందు నిగ్గుదేల్చి చూపినారు. యక్షగాన శబ్దమునందే గానమున్నది. ఇక అభినయములేనిదే దృశ్యకావ్యమనుట పొసగదుకదా ! కావున యక్షగానమునందలి సంగీతాభినయ ములు నేటి గేయనాటికయందును ప్రధానముగా నుండుట గమనింపదగిన విషయము.

**6 వీధి నాటకములు :** యక్షగానములో వలెనే సంగీతాభినయములకు విశేషప్రాధాన్యమున్న ప్రక్రియ వీధినాటకము. ఈ ప్రక్రియను గూర్చి వివరిం చుచు శ్రీ నటరాజు రామకృష్ణగారు "వీధినాటకములో ఆట, పాట, అభినయ పద్ధతి యక్షగానముకంటే కొంతవరకు ఎక్కువ పాళ్లలో శాస్త్రీయ పద్ధతులలో పెంపొందినది. ప్రతిపాత్ర చక్కగా అభినయించుటకు అవకాశముండును ... ఈ పద్ధతిలో నృత్యములు కొంతవరకు తక్కువై ఆంగిక సాత్త్వికాభినయములు-

1. ఆంధ్రయక్షగాన వాఙ్మయచరిత్ర. పుట-215.

అభివృద్ధి గాంచినవి -"[1] అని అన్నారు. నృత్యము తక్కువై సంగీతాభినయము లెక్కువగుట నేటి గేయనాటికలో ప్రచురముగా కానిపించుచున్న అంశము.

**7. వీధి భాగవతములు :** శ్రీకృష్ణుని జీవితగాథ భాగవతము. ఆ భాగవతమును నృత్య సంగీతముల ద్వార వీధులందు ప్రదర్శించుట 'వీధి భాగవతము'. ఈ ప్రక్రియలో ఏకపాత్ర పరిమితమైన భామా కలాపము గొల్లకలాపము వంటివేగాక బహుపాత్రలతో గూడిన నృత్యనాటకములు కూడ ఉన్నవి. ఈ ప్రక్రియలోని విశేషము నృత్తనృత్యాభినయములు శాస్త్రీయ పద్ధతుల ననుసరించి యుండుట కనుక ఇవి మార్గపద్ధతికి చెందినవి. ఇదే ప్రక్రియను దేశి ప్రక్రియగా మార్చుకొన్న సందర్భములు కూడ ఉన్నవి. 'బోడిగానికలాపం' ఇందుకు నిదర్శనం. వీధిభాగవతములు 15వ శతాబ్దమునాటికే విశేషప్రాచుర్యము నందినట్లు చారిత్రికాధారములున్నవి.

ఈనాటి గేయనాటికల యందలి ప్రధానాంశములైన సంగీతము, అభినయము ఈ భాగవత సంప్రదాయమునందును ప్రస్ఫుటముగా గోచరించుచున్నవి.

**8. హరికథ :** ఒకే వ్యక్తి రంగస్థలముపైనెక్కి దృశ్యకావ్య వాతావరణమును సృష్టించుట అరుదైన అంశము. ఆంధ్రులు ఈ అంశమును సృజించి, పోషించి, ఉత్తమ ప్రక్రియగా రూపొందించిన ఖ్యాతిని గడించుకొన్నారు. సంగీత – సాహిత్య – అభినయములకు ఇది రసాత్మమైన త్రివేణీసంగమము. శ్రీ శ్రీనివాస చక్రవర్తిగారు హరికథా ప్రక్రియను నిర్వచించుచు యక్షగాన ప్రబంధమునకు ఇది రూపాంతరమనియును, హరికథా పితామహులైన శ్రీ ఆదిభట్ల నారాయణదాసుగారు యక్షగానమునకును హరికథకును అవినాభావ సంబంధమును చెప్పినారనియును, హరికథా ప్రక్రియ 19వ శతాబ్ది ఉత్తరార్ధమునందు తెలుగులో వెలసినదనియును, ఒకే వ్యక్తి యక్షగానములోవలె ఆడుచును పాడుచును కథను వినిపించు కళారూపమే హరికథ యనియును, హరిదాసు సంగీత – సాహిత్యాభినయములలో సర్వతోముఖ ప్రజ్ఞావంతుడై యుండవలెనని

---

1. ఆంధ్రుల నాట్యకళ – పుట-30. ప్రచురణ : ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ ఏప్రిల్ 1975.

మును వివరించినారు.[1] పురాణకాలక్షేపములోవలె కేవల కథా కథనము రక్తి కట్టదు. దానికి సంగీతాభినయములు తోడైనప్పుడు కథనము రసోదంచితమై వివిధ అభిరుచులు కలిగిన సామాజికులకు ఆనందమును కలిగించును. నేటి గేయనాటికలయందును ఈ అంశము అనివార్యమై ఉన్నది.

**9. బుర్రకథ.** అనన్య సామాన్య ప్రచారసాధనముగా పండిత పామర జనరంజకముగా ఆబాలగోపాలమును ఉర్రూతలూగించుచున్న జానపద కళా రూపము బుర్రకథ. జంగము కథంలోవలెనే ముగ్గురు వ్యక్తులు - ఒక కథకుడు, ఇద్దరు 'హాంగుదారులు' (వంతగాండ్రు) తంబురా, బుర్రలు (గుమ్మెటలు), గజ్జెలు, అందెలు వాద్య విశేషములుగా ప్రయోగించుచు, గీతములను ఆలపించుచు, తదనుగుణముగా అభినయించుచు కథా కథనముచేసి శ్రోతలకు ఆనందమును కల్గించు ప్రక్రియ బుర్రకథ. బుర్రకథలను గూర్చి 'నదీరా' అను బుర్రకథా కళానిష్ణాతుడు తమ గ్రంథములో దీనికి పునాది యక్షగానమనియును, అనేక జానపద ప్రక్రియలకు యక్షగానము తల్లి వంటిదనియును, జంగము కథలు బుర్రకథలు ఆ తల్లికి కవలపిల్లలవంటివనియును వివరించియున్నారు.[2]

దృశ్యకళా విజ్ఞానమునందు నిష్ణాతులైన శ్రీ శ్రీనివాస చక్రవర్తిగారు బుర్రకథను గూర్చి పర్యాలోచించుచు -"కాలప్రవాహంలో రూపాంతరం పొంది ప్రత్యేకపాయగా వర్ధిల్లుతున్న యక్షగాన విశేషమే బుఱ్ఱకథ. శ్రీనాథుని కాలంనాటికే బుఱ్ఱకథలు బాగా ప్రచారంలో ఉన్నాయని క్రీడాభిరామంలోని ఈ క్రింది పద్యంవల్ల తెలుస్తోంది

"ద్రుతతాళంబున వీరగుంభితక ధుంధుంధుం కిటాత్కారసం
గతివాయింపుమ నాంతరాళిక యతిగ్రామాభిరామంబుగా
యతిగూడం ద్విపదప్రబంధమున వీరానీకముంబాడె నో
క్కతె ప్రత్యక్షరముం గుమారకలు ఢీట్కారంబునందూలగన్"

......... శ్రీనాథునంతటివాడు సైతం వీటికిగల ప్రజాదరణమును గమనించి పల్నాటి వీరచరిత్ర ద్విపదలో బుఱ్ఱ కథగా వ్రాశాడు -"[3] అని వివరించినారు.

---

1. ఆంధ్రకేసరి ప్రకాశం శతజయంత్యుత్సవసంచిక. పుట_515. ప్రచురణ : 29_12_74.
2. 'బుర్రకథలు' —ప్రచురణ : ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ (ఏప్రిల్ 1975)
3. ఆంధ్రకేసరి ప్రకాశం శతజయంత్యుత్సవ సంచిక_పుట_554. (ప్రచురణ:29_12_74)

సుప్రసిద్ధ పరిశోధకులు శ్రీ తిరుమల రామచంద్రగారు ఇదే పద్యమును ఉదాహరించుచు – "బుఱ్ఱకథ – తెనుగువారి మౌలికసంగీతరూపకమ" ని పేర్కొన్నారు.[1] సంగీత నృత్యాభినయములకు వలసినంత ప్రాముఖ్యమున్నందు వలననే శ్రీ తిరుమల రామచంద్రగారు దీనిని సంగీత రూపకమనుట సముచిత ముగా నున్నది. సంగీతరూపకమన్నను గేయనాటిక యన్నను స్థూలముగ నొక్కటే గేయనాటికా స్వభావము బుర్రకథలలో తటిత్తువలె భాసించుననుటలో సాహసములేదు.

ఇంతవరకు నృత్యగీతాభినయ ప్రధానములైన – సంస్కృతమువందలి నాటికాతోటక సట్టకగోష్ఠి నాట్యరాసకాది ఉపరూపకముల లక్షణములను, తెలుగులోని సంగీతాభినయ ప్రచురములైన కొరవంజి, యక్షగాన–బుర్రకథాది దేశిదృశ్య కళారూపాల స్వరూప స్వభావములను వివరించుటకు యత్నించినాము. భరతుని తర్వాత వెలసిన కోహలుని కాలమునుండి విశ్వనాథ కవిరాజు వరకు లాక్షణికుల దృష్టిని ఆకట్టుకొన్న ఉపరూపకములు, 12వ శతాబ్దమునుండి తెలుగులో వెలసిన యక్షగానాది దేశిప్రక్రియలకు ప్రత్యక్షముగా కాకపోయినను పరోక్షముగా నయినను ఆదర్శప్రాయముగా నయినను మార్గదర్శకములైనవని ఊహించుటలో తప్పులేదు.

భాషకాని, కళకాని అకస్మాత్తుగా పుట్టుకొనిరాదు. క్రమవికాసమునకు అది పరిణామరూపముగా ఉండును మధ్యయుగమునందు ముసల్మానుల ధార్ష్ట్య మునకు, పరమత ద్వేషమునకు ఆహుతియైన గ్రంథభాండాగారము లెన్నో ! రాజుల కొలువులలో వారి ఆశ్రయముతో ప్రభవిల్లుచున్న కళారూపాలు వారి పతనముతో మృగ్యములై పోయినవి. తమకు అనువైన భాషలో తమకున్న సౌకర్యములతో ఆయా కళారూపాలను అనుకరించుటకు యత్నించిన జానపదులు ధన్యులు. లేనివారు ఉన్నవారిని అనుకరించుటయు, బానిసలు యజమానులను అనుకరించుటయు సంఘమునందు సర్వసామాన్యముగా కనిపించుచున్న వ్యవహారము. రాజాదరణమునకు నోచుకున్న సంస్కృత ప్రాకృత దృశ్యకావ్యాలను,

1. "తెలుగుజాతి ప్రాచీన సంగీతరూపకం – బుఱ్ఱకథ"– వ్యాసము. "సాహితీసుగతుని స్వగతం – పుట 1. ప్రచురణ : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్-విజయవాడ (1968)

జానపదులు తమకు తోచిన పద్ధతిలో అనుకరించు ప్రయత్నములో, సంస్కృత ప్రాకృత దృశ్య కావ్యములకు తమదైన ప్రవృత్తిని పులిమి వినూతన సాహిత్య ప్రక్రియకు శ్రీకారము చుట్టిరి. కొంతకాలము తరువాత ప్రజాబాహుళ్యము నకు కారణాంతరములవలన సన్నిహితులైన పండితులు కూడ ఈ దృశ్యకావ్య ములకు పాండితీస్పర్శను కలిగించుటకు యత్నించిరి. ఉపరూపకములకు, దేశి కళారూపములైన యక్షగానములకును ప్రత్యక్షసంబంధమును సూచించు అంశములను నిర్దుష్టముగ, నిర్ద్వంద్వముగ చెప్పలేము కాని జానపదులు వానిని భద్రపరచుకొనగలిగిరని చెప్పుట తర్కమునకు అతీతము కాదని నా మనవి. నేను ఇట్లూహించుటకు శ్రీమాన్ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారి అభిప్రాయము నాకు తోడ్పడినది. నాటకమునందలి నృత్తమునకున్న స్థానమును చర్చించుచు శ్రీ శర్మగారు హృదయమును నమ్మిన జానపదులు 'వివేక ప్రధానులగు విమర్శ కుల' దృష్టి నుండి తప్పుకొని –"మీ వివేకమెక్కడ కొల్లబోయిన మాకేమి యని పామరజనులు మాత్రము దాని నింకను వదలక పట్టుకొని యున్నారు"[1] అని తెలిపియున్నారు.

యక్షగానమను దేశిరూపకకళకు సంస్కృత-ఉపరూపకములే మూలములను అభిప్రాయమును వాఙ్మయ మహోధ్యక్ష శ్రీ వడ్లమూడి గోపాలకృష్ణయ్యగారు వెలిబుచ్చియున్నారు. వారు 'సీతాకల్యాణము' అను యక్షగాననాటకమునకు 'తొలిపలుకు' వ్రాయుచు – "ఏది యేమైనా తెలుగుయక్షగానకావ్యాలు నాటకాలు అత్యంత ప్రాచీన కాలంలోనే రచియింపబడినాయని విస్పష్టంగానే చెప్పవచ్చు – శ్రీ రాఘవన్‌గారన్నట్లు సంస్కృత ఉపరూపకాలు మూలంగా ఆదర్శంగా యీ యక్షగాన నాటకాలు తెలుగులో రచింపబడ్డాయనడంలో సందేహంలేదు – సంస్కృత ఉపరూపకాలు గేయ-నృత్యరూపకాలుగా ప్రాచీన కాలంలో రచింపబడేవి – అందువల్లనే కావ్యానుశాసన భావప్రకాశకాదులు ఉపరూపకాలను గేయరూపకాలనీ నృత్యప్రకారములనీ పేర్కొన్నారు. కొందరు ఆ కాలంలో వీటిని గేయ రూపకాలనీ నృత్యప్రకారాలనీ వ్యవహరించే వారు. అందువల్ల ప్రత్యేక లక్షణ ప్రమేయంలేకుండా కేవల ఆదర్శప్రాయ

1. నాటకోపన్యాసములు – పుట – 6 : తృతీయ ముద్రణ (1968) త్రివేణి ప్రెస్ మచిలీపట్టణము – మద్రాసు.

మైన అనుకరణలతో గేయనృత్య ఉపరూపకాలు ఆధారంగా తెలుగులో యక్షగాననాటకాలు క్రమంగా అవతరించాయని భావించవచ్చు -"[1] అని తెలిపినారు.

కలాపమను దృశ్యకావ్య స్వరూప స్వభావములను గూర్చి వివరించుచు శ్రీ శ్రీనివాస చక్రవర్తిగారు -"యక్షకన్యలా నృత్యాని కనువైన ఆహార్యం గాక ఏదో ఒక నాయిక పాత్ర ఆహార్యాన్ని ధరించి ఆడుతు పాడుతూ తన కథను తానే వినిపించే యక్షగాన రూపమే కలాపం......... ఈ రూపం ఇంచు మించు ఏకపాత్రాభినయరూపం. శ్రీగదితం భాణికలాంటిది -"[2] అని వ్రాసినారు. సంస్కృత ఉపరూపకములకును కలాపాది దేశిరూపకములకు గల సామ్యమును ఊహించియే వారిట్లు అభిప్రాడి యుందురు.

అనేక రసవత్తరములయిన గేయ నాటికలను రచించిన శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావుగారు యక్షగానమును ప్రాచీన గేయనాటిక రూపముగా గుర్తించినారు.[3]

జాయపసేనాని రచించిన 'నృత్తరత్నావళి'కి పీఠికను సమకూర్చుచు డా॥ పి. ఎస్. ఆర్. అప్పారావుగారు -"భారత - భాగవత - రామాయణాదులందలి కథలను స్వీకరించి, వాటికి నృత్యములను మేళవించి నాటకముగా ప్రదర్శించు వారిది 'నాట్యమేళము' అనబడును; ఈ ప్రదర్శనములను 'నృత్య నాటకములు' (ఉపరూపకములు : Dance dramas) అందురు. వీటిని యక్షగానములనుట కూడ పరిపాటి -''[4] అని వ్రాసినారు. ఉపరూపకములకును

---

1. సీతాకల్యాణము (యక్షగాననాటకము) పుటలు - (XX V . XXV) ప్రచురణ : ఆంధ్ర ప్రదేశ్ గవర్నమెంటు ఓరియంటల్ మాన్యుస్క్రిప్టు లైబ్రరీ అండ్ రీసర్చి ఇన్‌స్టిట్యూట్ హైదరాబాదు - (1971)
2. ఆంధ్రకేసరి ప్రకాశం శతజయంత్యుత్సవసంచిక - (1974) పుట - (513)
3. 'తెలుగు నాటకరంగం' 'ప్రాచీన ఆధునిక సంగీతనాటకాలు' - పుట - (100) (ప్రత్యేక సంచిక) ప్రచురణ : కళావని హైదరాబాదు (1966)
4. నృత్తరత్నావళి - పీఠిక - పుట - (32). ప్రచురణ : ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ (1969)

యక్షగానమునకును భేదములేదనియే శ్రీ అప్పారావుగారి హృదయమయినట్లు తోచుచున్నది.

డా॥ జి. వి. సుబ్రహ్మణ్యముగారు - "యక్షగానమనగా నృత్తనృత్య నాట్యాభినయ విశిష్టమైన గానమనియు, సంగీతరూపకసంప్రదాయమునకు మూలబీజమనియు మనము భావింపవచ్చున"ని[1] అభిప్రాయపడినారు.

ప్రాచీన ఉపరూపకములే యక్షగానములకు ఆదర్శప్రాయములుగా నుండెననియును, ఆ యక్షగానములందలి సంగీత నృత్యాభినయములు నేటి గేయనాటికల యందును ప్రధానాంశములుగా కనుపట్టు చుండుటచేతను, యక్షగానములే నేటి సంగీత రూపకములకు పూర్వరూపములని ఊహింపవచ్చును నేటికిని యక్షగానములు అత్యంతాధునికులైన కవులచే రచింపబడుచుండుట మన మెరిగినదే. యక్షగానములలో గేయము, పద్యము, వచనము, ఉండును. అట్లుగాక గేయమునకే ప్రాధాన్యము నిచ్చినచో అది గేయరూపకమగును. కనుక నాటి యక్షగానములకును నేటి గేయనాటికలకును జన్యజనకభావము లేకపోయినను ఈ రెంటికిని సాదృశ్యములనేకములుండుటవలన యక్షగాన ప్రభావము నేటి గేయనాటికలపైన కొద్దియో గొప్పయో లేకపోలేదనుట వాస్తవము. ప్రాచీన కళారూపముల ప్రభావము అర్వాచీన కళారూపములపై సంపూర్ణముగా కాకపోయినను కొంతవరకైనను ఉండకతప్పదుకదా. అందుకే ఈ రెంటిని సంగీత రూపకములని సంకేతించుట హేతుబద్ధము.

---

1. సుగ్రీవ విజయము (యక్షగానము) - ఆముఖము - పుట - (iii)
ప్రచురణ : మాధవీ బుక్ సెంటర్ - హైదరాబాదు (1973)

# 7. వివిధ భాషలలో గేయనాటికలు

**తమిళములో గేయనాటికలు :** భారతీయభాషలలో అతిప్రాచీనమైన భాషగా తమిళమునకు విశేష ప్రాధాన్యమున్నది. ద్రవిడ భాషా కుటుంబము నకు సంబంధించిన భాషలలో మూలద్రావిడమునుండి విడివడి స్వతంత్ర భాషగా రూపొందినవానిలో తమిళము మొట్టమొదటిది. చారిత్రికముగను, భౌగోళికముగను, సాంస్కృతికముగను తెలుగు తమిళ ప్రజలకు అత్యంత సాన్నిహిత్యమున్నది. అనేక కళారూపములు ఈ ఉభయప్రాంతములందును సమాన ప్రాచుర్యమునందుకొన్నవి. యక్షగానమువంటి రూపక ప్రక్రియలపై పరస్పర ప్రభావము కనిపించుచున్నది.

క్రీస్తు పూర్వమునాటికే సర్వలక్షణ లక్షితమైన 'మణిమేఖలై' అను ఉత్తమ కావ్యము తమిళములో వెలసినది. 'మణిమేఖలై' 'శిలప్పదికారం వంటి మహాకావ్యములలో నృత్య సంగీతములకు సంబంధించిన అనేకాంశములు సంగ్రథితములై యున్నవి. తమిళభాషకు ఆదివ్యాకరణముగా ప్రసిద్ధి వడసిన 'తొల్కాప్పియము' (క్రీ. పూ. 500) నందు ఎనిమిది విధములైన అభినయ విశేషములు పేర్కొనబడియుండుటచేత సంగీతమునకు కూడ ప్రాముఖ్యముండి యుండునని ఊహింపవచ్చును క్రీ. పూ. 2000 నుండి క్రీ శ. 150 వరకుగల కాలమును తమిళ సాహిత్య చరిత్రలో సంగయుగముగా గుర్తింతురు. ఈ యుగమునందలి సాహిత్యములో అనేకదృశ్యకావ్యముల ప్రసక్తి ఉన్నది. తట్టై, తడారి, పంబై, కర్దిపై, మొరుడు, యాళ్, కుళల్, ఉడుక్కై మున్నగు వాద్యవిశేషములను గూర్చి చెప్పబడియున్నది. 'పెరియాళ్' అను వాద్య విశేషమునందు 1008 తంత్రులుండెడివట. పాణం (సంగీతజ్ఞుడు), పాణిని (సంగీతజ్ఞురాలు). కుతన్ (నటుడు), కూలి (నటి) వంటి సంగీత నాటకములకు సంబంధించిన వారు నాటి కావ్యములలో తారసిల్లుదురు.

పన్నెండవ శతాబ్దమునుండి తమిళదేశమున సంగీత ప్రధానములైన దృశ్యకావ్యములు జనాదరణమును పొందుచున్నవి. ప్రాయికముగా జానపదులే

వీనిని ప్రయోగించుచుండిరి. 'తెరకూత్తు' (వీధినాటకము) అని వీనికి పేరు. నల్లతంగళ్, అల్లి అరసానిమాలై. పవళక్కొడి నాడకం, దేశింగ్‌రాజన్‌కథై, రామనాడకం, రాజరాజనాడకం, హరిశ్చంద్రనాడకం, సిరితొండనాయనార్ నాడకం, నందనార్ నాడకం నళదమయంతి చరితం, కోవలన్‌కణ్ణకి, సత్యవంత్ సావిత్రి, వళ్లీతిరుమణం ప్రామాణికమైన తమిళభాషయందు రచితములైనను గ్రామసీములలో అశేషప్రాచుర్యమును అందుకొన్నవి. ప్రకృతివర్ణనములకును, వీరశృంగార రసములకును, దేశభక్తికిని మహాత్ముల జీవితములకును ఈ రూపకములందలి ఇతివృత్తములు అంకితములై ఉన్నవి. 17, 18 శతాబ్దములలో తంజావూరును పాలించిన మహారాష్ట్ర ప్రభువులు తమిళ, మహారాష్ట్ర, తెలుగు, హిందీ భాషలలో యక్షగానములు వెలయుటకు విశేషముగా ప్రోత్సాహము నిచ్చినారు. వారిలో కొందరు స్వయముగా యక్షగానములను రచించినవారు. 16వ శతాబ్దమునందు వెలసిన 'ముక్కుడార్‌పల్లు', 18వ శతాబ్దమునందలి 'కుట్రకురవంజి' అను సంగీతరూపకములు మిక్కిలి ప్రసిద్ధములు.

ఆధునిక గేయనాటికా కర్తలలో మొదట పేర్కొనదగినవారు ఆచార్య సుందరం పిళ్లైగారు (19వ శతాబ్దము చివరిపాదము - 20వ శతాబ్దము మొదటి పాదము). వీరి 'మనోన్మనియం' సంపూర్ణ గేయనాటిక. ప్రసిద్ధాధునిక తమిళ కవి శ్రీ సుబ్రహ్మణ్యభారతి గారి 'పాంచాలీ శపదం' ప్రసిద్ధ గేయనాటిక.

తెలుగులోవలెనే తమిళమునందును ఆధునిక కాలమున సంగీతరూపకములకు రేడియో ద్వారముననే విశేష ప్రచారము కలిగినది.

ప్రాచీన సంగీత రూపకములైన వీధినాటక యక్షగానములు నేటి తమిళ గేయనాటికా రూపకల్పనమునకు తోడుపడినవనుటలో అత్యుక్తిలేదు [1]

**కన్నడములో గేయనాటికలు** : కన్నడము కూడ ద్రవిడభాషా కుటుంబములోనిదే. తెలుగుకంటె ముందే ఈ భాషలో సాహిత్య సృష్టి ఉన్నతప్రమాణమునందుకొన్నది. తమిళులవలెనే కన్నడులు తెలుగువారికి చారిత్రికముగా భౌగోళికముగా సాంస్కృతికముగా మిక్కిలి సన్నిహితులు. తెలుగువారికివలె

---

1. ఉస్మానియా విశ్వవిద్యాలయ తమిళ శాఖాధ్యక్షులు ఆచార్య సింగారవేలు గారి వలన తమిళ గేయనాటికలను గూర్చిన ఈ అంశములను సంపాదింప గల్గితిని.

వీరికిని శాలివాహనశకమే ప్రాచీన కన్నడ కవులలో 'రత్నత్రయము' గా ప్రసిద్ధి పొందిన కవులలో ఇరువురు పంపడు, పొన్నడు తెలుగు ప్రాంతమున పుట్టినవారే. పాల్కురికి సోమనాథుడు తెలుగుతోపాటు కన్నడభాషయందును పాండితీ ప్రాగల్భ్యము ను ప్రదర్శించిన వాడే. విజయనగర ప్రభువుల కాలమున ఆంధ్ర కన్నడ ప్రాంతములు ఒకే ఏలుబడి క్రిందనున్న కారణముచేత తెలుగు - కన్నడముల భాషాసాహిత్యములు కళారూపములు పరస్పర ప్రభావమును పొందినవి. తమిళములోవలె యక్షగాన ప్రక్రియ కన్నడమునందును విశేష ప్రాచుర్యము పొందినది.

అధునాతన యుగమునందు కన్నడములో వెలసిన గేయనాటికకు గీతా నాటక' అను సంకేతమున్నది ఈ గీతానాటకమునకు పూర్వరూపము యక్షగా గానమే అని విజ్ఞుల అభిప్రాయము ప్రాచీనాలంకారికులు పేర్కొన్న డోంబ్యాద్యుపరూపకముల ప్రభావము ఈ యక్షగానములపై లేకపోలేదని కన్నడ సాహిత్యకోవిదుల అభిమతము. జానపదులే వీనిని రూపొందించి పోషించు కొనుచువచ్చిరి. ఈ కారణముచేతనే యక్షగానములలో ఉత్తమ సాహిత్య లక్షణములు క్వాచిత్కముగనే ఉన్నవనియును విజ్ఞులు వక్కాణించుచున్నారు. 14వ శతాబ్దమునుండి ఈ యక్షగానములు అసంఖ్యాకముగా వెలసినవి.

19వ శతాబ్దపు ఉత్తరార్ధమున జన్మించిన బహుముఖ ప్రతిభాశాలి 'శ్రీ శివరామకారన్త్' గారు బుద్ధుని జీవితమును ఇతివృత్తముగా గ్రహించి 'కిసాగౌతమి' అను గీతానాటకమును 1930-40 ప్రాంతమున తొలిసారిగా ప్రకటించినారు. దాదాపు ఇదే దశాబ్దమునందు తొలి తెలుగు గేయనాటికను శ్రీ శివశంకర స్వామిగారు అవతరింపజేసినారు.

శ్రీ శివరామకారంత్ అడుగుజాడలలో పయనించిన శ్రీ పి టి నరసింహా చార్ గారు అహల్య, గోకుల నిర్గమన, శబరి, హరిణాభిసరణ అను గేయనాటిక లను వెలువరించిరి.

శ్రీ మాస్తి వేంకటేశ అయ్యంగార్ ముక్తచ్ఛందమున 'యశోధర' ను, పద్యగంధి వచనములో 'చిత్రాంగద'ను రచించినారు. 'రసికరంగ' యను కలము పేరుతో 'పావనపావక' అను ఒక గేయనాటిక వచ్చినది

జ్ఞాన పీఠబహుమతి గ్రహీతలు శ్రీ కె. వి. పుట్టప్ప చిత్రాంగద, యమనసోలు, వాల్మీకి యభాగ్య అను గేయనాటికలను ప్రకటించినారు. భారతి అను రచయిత్రి ముక్తచ్ఛందమునందు ఊర్మిళా జీవితమును ఇతివృత్త ముగా స్వీకరించి 'తపస్విని' అను గేయనాటికను రచించినది.

కన్నడమునందలి ఇప్పటి గేయనాటికలలో షట్పదులు ముక్తచ్ఛందము విశేషముగా ప్రయోగింపబడుచున్నవి. ఆధునిక కన్నడ భాష వృత్తములకు అంతగా వదిపడక పోవుటవలన మాత్రాచ్ఛందస్సులే ఈనాటికలందు చోటు చేసికొనుచున్నవి. త్రిశ్రగతి, చతురశ్రగతి, ఖండగతి, మిశ్రగతి విశేషముగా ప్రయుక్తములు. పంచమాత్రాబద్ధమైన ఖండగతిపై కన్నడ గేయనాటికా కర్తలకు ప్రీతి విశేషము.

తొలి గేయనాటికా కర్తలు శ్రీ శివరామకారంత్ గారు స్వయముగా యక్షగానవటులు. అనేకదేశములలో వీరు యక్షగానములను ప్రదర్శించి ఖండాంతరములందు ఆ కళకు విశేషఖ్యాతిని ఆర్జించిపెట్టినారు. పాశ్చాత్య ప్రభావము వీరి గేయనాటికలపై అంతగాలేదు. వస్తు రచనాభావములన్నియు దేశీయములే. ఈ విషయమున శ్రీ శివశంకర స్వామి గేయనాటికలకును శ్రీ శివ రామకారంత్ గేయనాటికలకును సాదృశ్యమున్నది. వీరిరువురును గేయనాటికను దేశీయకళగనే తీర్చిదిద్దినారు.[1]

**మరాఠీలో గేయనాటికలు :** తెలుగుదేశమునకు పశ్చిమమున మహారాష్ట్ర కన్నడ ప్రాంతములున్నవి. శాతవాహనుల కాలమునుండియు చారిత్రికముగా మహారాష్ట్ర ప్రాంతముతో తెలుగుప్రజలకు అతి సన్నిహితత్వమున్నది. తెలుగు-కన్నడ - మహారాష్ట్రులకు ఒకే శాలివాహన శకము ఆంధ్ర ద్రవిడ కర్ణాట మహారాష్ట్ర గుర్జరులు పంచద్రావిడులని సంప్రదాయము. తెలుగువారికి మహారాష్ట్రులకు ఆచార వ్యవహారములందును, ఆహారవిహారములందును, కళా మర్యాదలయందును సాజాత్యమున్నది. క్రీ శ. 17, 18 శతాబ్దములలో తంజా పూరును ఏలిన మహారాష్ట్ర ప్రభువులు తెలుగునందును పాండిత్యమును సంపా దించి. రచనలుచేసి తెలుగు కవి పండితుల నెందరినో ఆదరించిన కీర్తికి పాత్రు

1. ఉస్మానియా విశ్వవిద్యాలయ కన్నడ శాఖాధ్యక్షులు ఆచార్య డా॥ కె.యం. కృష్ణారావు గారి వలన కన్నడమునందలి గేయనాటికా విశేషములను సేకరింపగల్గినాము.

లైనారు. ఈ ప్రభువుల కాలములోనే తెలుగు కన్నడ ప్రాంతములలోవి కురవంజి. యక్షగానము, భాగవతమేళ వంటి కళారూపములు మహారాష్ట్ర ప్రాంతమునకు ప్రాకినవి.

మరాఠిభాషలో గేయనాటికలకు 'గేయనాట్య' అనియు, 'సంగీతిక' అనియును సంకేతములు. ఈ భాషలో నేడు వెలువడుచున్న గేయనాటిక లకు పూర్వరూపములు శాతవాహనకాలమునుండియు ప్రచారమునందున్నవి. లయబద్ధ సంగీతము ప్రధానముగా గలిగిన గోంధ్రా (నృత్యగానములు), లళిత్ (వినోదనృత్య గానరూపము), దశావతార (నృత్యగానయుక్త దశావతార ప్రదర్శనము) మున్నగునవి నేటికిని జానపదులలో కనిపించుచున్నవి. దశావతార ప్రక్రియ తమిళదేశ ప్రభావముచేత పలుమార్పులకు లోనైనది. 16వ శతాబ్దము నుండి దీని ప్రాచుర్యము అధికమైనది. ఇందులో సూత్రధారుడు మత్స్యాద్య వతారమూర్తులతో కవితాత్మకముగా లయబద్ధముగా సంభాషించుట విశేషము. తంజావూరునందు మహారాష్ట్ర ప్రభువులున్నప్పుడు మహారాష్ట్రమునుండి వలస పోయి కళాకారులనేకులు ఆ రాజులనాశ్రయించి, వారి మన్ననలను పొంది, అచటి యక్షగానాది కళా రూపములతో పరిచయమును సంపాదించుకొనిరి. 'భాగవతమేళ' ఇట్టి వానిలో ఒకటి. ఈ భాషలో 18వ శతాబ్దమునుండి 'భారూడ్' అను ఒక దృశ్య కళారూపము కనిపించుచున్నది. బ్రాహ్మణ మహమ్మదీయు లిరువురు పరస్పరము కవితా సంగీతయుక్తముగా సంవాదము సేయుట ఈ ప్రక్రియలోని విశేషము. 'వ్యాఘ్రముఖరళి' అనునది 'భారూడ్' అనుదానికి మారురూపముగా వెలసినది. మహమ్మదీయ బ్రాహ్మణులకు బదులుగా దీనిలో గ్రామాధికారి, పురోహితులు, ఖండోబా అను దేవత భక్తుడును భక్తురాలును లయాత్మకముగా ప్రశ్నోత్తరముల రూపమున భాషించుకొందురు. సమస్యలును సమాధానములును ఇతివృత్తముగా గలిగి శృంగార రసప్రధాన ముగా సాగు మరొక కళారూపము పొహిరి. ఇది మూడు విధములు. మొదటిది - నాయిక చెలికత్తెల సంభాషణము (పొహిరి) ఇరుపక్షములేర్పడి సంగీతాత్మకముగా సంభాషణము సాగురూపము తమాషా. ఇందులో సమస్యలు సమాధానములు రసస్ఫూర్తితో సంగీతముతో సాగును. ఇరుపక్షము లందును నర్తకులుందురు. ఇది రెండవది. ఆధ్యాత్మిక తత్త్వప్రధానముగా సాగు కళారూపము 'తుర - కలగి'. ఇది మూడవది.

ఆధునిత మరాఠి గేయనాటికా కర్తలలో ఆద్యులు శ్రీ గోవిందరావు టేంభేగారు. 1920-30 మధ్య వీరి 'మహాశ్వేత' యను గేయనాటిక వెలువడినది.

శ్రీ యశ్వంత్ దినకర్ ఫెండర్‌కర్‌గారి ఐదు గేయనాటికలు మిక్కిలి ప్రసిద్ధములైనవి. అవి ప్యాకాల ఏనవ, ప్రతాప్‌గడ్. దేవ్‌హారాతిల్‌గానే, జీవితనౌక, సుపర్ అణీమాక్‌డాచపూర్ (ఇది బాల గేయనాటిక) అనునవి. తరువాత శ్రీ బి. ఎస్. మరఢేకర్‌గారి 'బద్ కాచేగుపిత్' వచ్చినది. వీరు నూతన కవితా ప్రయోక్తలు. సౌందర్య తత్త్వవాదులు.

గొప్ప నవలా రచయితగా పేరుపొందిన శ్రీ జి. ఎన్. దాండేకర్ గారు 'యశోధర'తో పాటు అయిదు గేయనాటికలను వ్రాసినారు.

నేటి మరాఠి గేయనాటికా కర్తలలో మిక్కిలి ప్రసిద్ధులైనవారు శ్రీ గజానన దిగంబర్ మాడ్‌గూళ్‌కర్‌గారు, వ్యాఘ్రి 'మీర్ తుళస్ తుఝ అంగణి' అను గేయనాటికలు వారికి ఎనలేని కీర్తిని సంపాదించి పెట్టినవి.

శ్రీ మంగేష్‌కర్ పాడ్‌గాంవ్‌కర్ గారు, శర్మిష్ఠ, యుద్ధ్, కవి ప్రభంజన, అను గేయనాటికలను రచించి ఆధునిక నాటికాకర్తలలో ప్రముఖ స్థానము నాక్రమించినారు. శ్రీ పురుషోత్తమ్ శివరామ్ రేగేగారు కవులును, నవలా రచయితలును, వేదాంతశాస్త్ర విశారదులును 'రంగ పాంచాలిక', 'కాంచయవన్', 'రూపకద్ధతి' అను గేయనాటికలను వీరు రచించినారు. శ్రీ వసంత్ బాపట్‌గారి 'ప్రియంవద' అను గేయనాటిక మహారాష్ట్రి ప్రజా హృదయాలలో ప్రత్యేక స్థానమును సంతరించుకొన్నది.

అధిక ఉపాత్మకములైన గేయనాటికలను రచించి ఒక క్రొత్త మలుపును సృష్టించినవారు శ్రీ పురుషోత్తమ్ లక్ష్మణ్ దేశ్‌పాండే గారు వీరు బహుముఖ ప్రజ్ఞా పాటవములు గలవారు.

మరాఠీలో వెలువడిన గేయనాటికలలో కొన్ని పాశ్చాత్య వాద్య విశేషములు దేశీయ సంగీతమునకు అనుగుణముగా ప్రయుక్తములైనవి. కొన్ని ఇంగ్లీషు నాటకములు గేయాత్మకములుగా వెలువడినవి. ఈ రెండంశములను విడిచి మరాఠి గేయనాటికపై పాశ్చాత్య ప్రమేయము ఇంచుమించు లేదనియే చెప్పవచ్చును. వస్తువునందేమి, ఉపదేశమునందేమి, రసస్పృష్టియందేమి, సంగీతము

ందేమి, ఇతివృత్తమునకు కల్పింపబడు వాతావరణమువందేమి మరాఠి గేయ నాటికలు పూర్తిగా దేశీయములుగనే భాసించుచున్నవి [1]

**హిందీలో గేయనాటికలు**: హిందీలో గేయనాటికకు 'గీతినాట్య' అని సంకేతము. ఆచార్య శ్రీ దశరథ ఓఝాగారు తమ 'హిందీనాటక్-ఉద్భవ్ ఔర్ వికాస్' అను గ్రంథమునందు 'గీతినాట్య'కు మూలము జానపదరూపక విశేషమైన 'రాసక'మని వ్రాసినారు [2] హిందీభాష పుట్టుటకు పూర్వమే అనగా వ శతాబ్దమునాటికే ఈ రాసకము ప్రచారమునందుండెననియు వారు తెలిపినారు ఇప్పటికి లభ్యమైన మొట్టమొదటి రాసకము 'గయసుకుమార్ రాస్'. ది 13వ శతాబ్దమునకు చెందినది. ఈ రాసనాటకముల ప్రధాన లక్షణములను వరించుచు శ్రీ ఓఝాగారు అవి ఛందోబద్ధములనియును, గేయమయములనియును, సంగీత ప్రధానములైనందున గద్యము అందు సర్వథా ఉపేక్షింపడినదనియును సంపూర్ణముగా అవి నృత్యగీతసంభరితములనియు వక్కాణించినారు [3]

హిందీభాషలో ప్రప్రథమ స్వతంత్ర నాటకకర్త శ్రీ భారతేందు హరిశ్చంద్రగారు 1876లో 'చంద్రావతి' అను నాటకమును గద్య పద్య గేయ మిశ్రితముగా రచించినారు. 1873లో వారు 'వైదిక్ హింసా హింసానభవతి' ను ప్రహసనమునందు గేయములను విశేషముగా ప్రయోగించినారు. ఉత్తర భారతమున రాసలీల, రామ్‌లీల హనుమాన్‌లీల, నౌటంక్, సాంగీత్, భాండ్ ను జానపద కళారూపముల ప్రభావము చేతను, లక్నోరచయిత 'అమానత్' రచించిన 'ఇందర్‌సభ' అను యక్షగాన సదృశమైన రూపక ప్రభావముచేతను శ్రీ భారతేందు హరిశ్చంద్రగారు గద్య పద్య గేయాత్మకమైన నాటక రచనకు పూనుకొనెను.

ఆధునిక కాలమున సంపూర్ణగేయనాటికాలక్షణలక్షితమైన వానిలో పేర్కొన్నదగినది మహాకవి శ్రీ జయశంకర ప్రసాద్‌గారి 'కరుణాలయ్' (1913)

---

1. ఉస్మానియా విశ్వవిద్యాలయము మరాఠిశాఖలో రీడరుగా ఉన్న శ్రీ వసంత్‌దామోదర్ కులకర్ణిగారు మరాఠిగేయనాటికలను గూర్చిన ఈ అంశములను నాకు అందజేసినారు.
2. పుట-79.
3. 116-117 పుటలు.

రెండవది రాష్ట్రకవి శ్రీ మైథిలీశరణ్‌గుప్త్ గారి 'అనఘ్'. వీరి అనుజులు శ్రీ సియారామ్ శరణ్‌గుప్త్‌గారు 'ఉన్ముక్త్' అను గీతినాటికను రచించినారు. శ్రీ హరికృష్ణప్రేమీగారి 'స్వర్ణవిహాన్' అనునది ప్రసిద్ధమైన గేయనాటిక (1930) శ్రీ పండిత రూపనారాయణ పాండేగారి 'శాంగీ' (1927) అనునది పాంఘికేతివృత్తముగల తొలిగీతినాటిక.

గీతినాటికా ప్రక్రియకు పరిపుష్టిని, పరిపూర్ణతను సంతరింపజేసినవారు శ్రీ ఉదయశంకర్ భట్‌గారు. వీరి రచనలు – 'మత్స్యగంధా' (1934), 'విశ్వామిత్ర్' (1935), 'రాధా' (1936) అనునవి. వీరి తరువాత శ్రీ ధర్మవీర్ భారతిగారి 'అంధాయుగ్' అను ఐదంకముల గేయనాటిక ముక్తచ్ఛందస్సులతో వెలువడినది. శ్రీ గిరిజాకుమార్ మాథుర్‌గారు ఇందుమతి, ధరాదీప్, మేఘ్‌కీఛాయా, ఋతుసంహార్, రామ్‌కీ అగ్నిపరీక్షా, సీంద్ కేదేశ్‌మే అను గేయనాటికలను రచించినారు. శ్రీ సిద్ధ్‌నాథ్‌కుమార్‌గారు 'కవి', 'సృష్టికీసాంఝ్', సంఘర్ష్, వికలాంగోంకాదేశ్,'బాదలోంకీషామ్' అను నాటికలను వ్రాసినారు. ఊహావాస్తవ జగత్తులను సమన్వయ ధోరణితో దర్శించుటకు ఈ రూపకములలో ప్రయత్నములు జరిగినవి.

ఇతర భాషలలోవలె కాక హిందీ గేయనాటికలలో ఏకాంకపద్ధతి అంతగా కానరాదు. అనేకాంకరచనా విధానమువైపు ఈ ప్రక్రియ సాగిపోవుచున్నది. బహ్వంకగేయరూపక కర్తలలో, కేదార్‌నాథ్‌మిశ్ర్, ప్రభాత్, ఆచార్య జానకీవల్లభ్‌శాస్త్రి ఎన్నదగినవారు శ్రీ ప్రభాత్ గారి స్వర్ణోదయ్, అంగులిమాల్, మానవ్‌నిశ్చయ్ హీ లాఏగా, సంవర్త్ అను రచనలు పేర్కొనదగినవి. శ్రీ శాస్త్రిగారి నాటికలలో పంచాత్, తమసా, మదన్‌దహన్, ఊర్వశీ మానభంగ్, గోపా, ఇరావతీ శాపముక్తి, అద్మి అనునవి ప్రసిద్ధములు.

ఆధునికకాలమున హిందీభాషలో ఈ గీతినాటికలు శతాధికములుగా వెలువడుచున్నవి. హిందీ సాహితీ జగత్తులో ఈ ప్రక్రియ బహుళ జనాదరణమును పొందుచున్నది.[1]

---

1. హిందీ భాషలోని ఈ గేయనాటికా విశేషములను నాకు వివరముగా తెలిపినవారు – ఉస్మానియా విశ్వవిద్యాలయ హిందీశాఖలో రీడరు డా॥ భీమసేన్ 'నిర్మల్'గారు.

**ఉర్దూలో గేయనాటికలు :** ఉర్దూ యావద్భారతములో అత్యంత జనప్రియమైన భాషగా రూపొందినది. 12వ శతాబ్దమునుండి ముసల్మానులు తెలుగు దేశముపై దండెత్తుచు కొన్ని భాగాలను ఆక్రమించుకొని పరిపాలన సాగించుట వలన, ముందు ఫారసీ, అరబ్బీ తరువాత ఉర్దూ శబ్దములు అత్యధికముగా తెలుగులో చేరిపోయినవి. తెలుగు శబ్దజాలములో ఉన్న అన్యదేశ్యములలో ఉర్దూ పదముల సంఖ్యయే అత్యధికము. కొన్ని ఉర్దూ శబ్దములు తెలుగులో కలసిపోయినతీరు ఎంతవరకు పోయినదనగా వానికి సరియైన తెలుగుమాటలే అరుదైపోయినవి. విశాలాంధ్ర మేర్పడుటకు పూర్వము హైదరాబాదు రాష్ట్రమునందలి తెలుగుప్రాంతములో (తెలంగాణములో) ఉర్దూ ప్రభుత్వ భాషగా ఉండుటవలన ఎందరో తెలుగువారు ఉర్దూ ఫారసీ భాషలలో సమగ్రమైన పాండిత్యమును సంపాదించి కవితలను పత్రికలను వెలయించియుండిరి.

19-వ శతాబ్దపు ఉత్తరార్ధమున నాటకలక్షణములున్న కొన్ని ప్రదర్శనముల ప్రసక్తి ఉత్తర హిందూ దేశమునందంతటను కానిపించుచున్నది. ఉర్దూ నాటకమునకు పూర్వరూపములు మన తెలుగు నాటకమునకు వలెనే జానపదులే ప్రయోగించిరి నౌటంకి, సంగీత్, జంగ్‌నామా, భాండ్, కట్‌పుత్‌లీ, ఆల్హా మున్నగునవి అట్టివి. వంగదేశములో 'యాత్రా,' 'మేలా' అను జానపద రూపకములు ప్రచారమునందుండెడివి.

క్రీ. శ 1850 ప్రాంతమున లక్నో ప్రభువు - వాజద్‌అలీషా 'రహాస్య' (రాసలీల) అను నృత్యగీతాత్మకమైన రాధా కృష్ణుల ప్రణయగాథను తన అంతఃపురములో దృశ్యకావ్యముగా ప్రయోగించెను. ప్రజాబాహుళ్యమునకు అందుబాటులో లేని ఈ ప్రదర్శనమునందు అభినయమునకు కొంత ప్రమేయమున్నను అది రూపకమనిపించుకొనలేక పోయినది. 'అమానత్ లక్నవి' అను కవి ఈ ప్రదర్శనమును చూడకపోయినను, కర్ణాకర్ణిగవిని 'ఇందర్ సభ' అను గేయబద్ధమైన నాటకమును 1852 లో రచించెను [1] ఇందే మాత్రమును వచనము లేకపోవుట గమనింపదగిన విషయము. ఇంద్రుడు, అప్సరసలు ఈ రూపకమునందలి పాత్రలు మన యక్షగానములలోవలె, పాత్రలు పాడుచును ఆడుచును

1. "ఉర్దూ డ్రామా - రివాయత్ ఔర్ తజ్రుబా" - పుట 60.
రచన : డా॥ అత్యానిషాత్. ప్రచురణ : (1973).

తమ్మిత్రాము సామాజికులకు తెలుపుకొందురు ఆటపాటలకే ప్రాముఖ్యమున్న ఈ రూపకవిశేషమునందు కొన్ని నాటకీయ లక్షణములున్నవి. అంతేకాని రంగమున కుండవలసిన లక్షణములేవియును లేవు. 'ఇందర్ సభ' తర్వాత పాశ్చాత్య నాటక ప్రభావము వలన ఫారసీ నాటకములవలన తెలుగులోవలెనే గద్యపద్య నాటకము లనేకములు ఉర్దూలో వెలువడినవి. జనసామాన్యము నలరించు ఉద్దేశముతో ఇందులో పాటలు ప్రవేశించినవే. కాని పూర్తిగా గేయనాటకములు వెలువడనేలేదు. సర్దార్ జాఫరి అను కవి 'నయీాదునియా' అను దీర్ఘపద్యకావ్యమును వివిధ పాత్రలచేత గానము చేయించి గేయనాటికగా ప్రాచుర్యమునకు తీసికొని వచ్చినారు.

ఇటీవల ఆకాశవాణి వివిధ కేంద్రములనుండి కొన్ని గేయ నాటికలు ప్రసారితములైనను వానికి ఒక ప్రత్యేక సాహిత్య ప్రక్రియాస్థాయి కలుగలేదనే చెప్పవలసియున్నది.[1]

---

1. ఉర్దూ గేయనాటికలను గూర్చి నాకు ఈ అంశములను తెలియజేసినవారు ఉస్మానియా విశ్వవిద్యాలయ ఉర్దూ శాఖాధ్యక్షురాలు డా॥ రఫియా సుల్తానా గారు.

# పాశ్చాత్య భాషలలో గేయనాటికలు

పాశ్చాత్య దేశములలో 16-వ శతాబ్దమునకు ముందు ఓపెరాలున్నట్లు నిదర్శనములు లేవు. 16వ శతాబ్దములో ఇటలీలోని 'ఫ్లోరెన్స్' నగరవాసి గియోవన్నిబార్డీ (Giovanni Bardi-1534-1612) ప్రాచీన గ్రీకు కథలకును నాటకములకును సంగీతము కూర్చినట్లు తెలియవచ్చుచున్నది. బహుశః ఇది ఓపెరాలకు ప్రారంభదశ. ఇటలీదేశము ఈ ప్రక్రియకు జన్మస్థానము.

సంగీతముతో కూడిన నాటకాలను ఓపెరాలనవచ్చును. సంగీ మున్నను నృత్యమిందులేకపోవుట గమనింపదగిన అంశము. తొలిదశలో ఓపెరా రచయితలలో ప్రముఖుడు జాకోపోపెరి (Jacopoperi) ఇతని ఓపెరాలలో సంగీతమునకంటె నాటకాభినయమునకే అధిక ప్రాధాన్యమున్నట్లు కనబడుచున్నది. కాని వెనిస్ నగరవాసి క్లాడియో మాంటివెర్డి (ClaudioMonteverdi, 1567-1643) ఓపెరాలలో సంగీతమునకు అత్యంతప్రాధాన్యము నిచ్చినాడు. ఆకాలములో వెనిస్‌నగరము జంత్రసంగీతమునకు పేరుపొందియుండెను. జంత్రవాద్యప్రవీణులున్న ఆ వాతావరణమును మాంటివెర్డి ఉపయోగించుకొని మొదటిసారిగా జంత్ర సమ్మేళనము (orchestra)ను ఏర్పరచి దానిని ఓపెరాలో ప్రధానాంగముగా వినియోగించుకొన్నాడు. ఇతని ఓపెరాలలో ఆర్ఫియో (Orfeo), అరియెనామార్క్ (Arienna Mark) అనునవి ప్రసిద్ధములైనవి.

పాశ్చాత్యదేశములలో సంగీతజ్ఞులు మాత్రమే ఓపెరాలను రచించినట్లు తోచుచున్నది. మనదేశములో గేయనాటికారచయితలు సంగీతజ్ఞులు కావలసిన అవసరమంతగా లేదు. సాధారణముగా ముందుగా వారు నాటకములురచించగా వానికి మరొకరు సంగీతమును కూర్చుదురు. సంగీతములో చక్కనిఅభినివేశమున్న రచయితలు గేయనాటికారచనకు పూనుకొన్న సందర్భములును లేకపోలేదు. పశ్చిమదేశాలలో సంగీతముతో పరిచయములేని వారు ఓపెరా రచనము చేసిన సందర్భములు కనిపించవు.

ఇటలీనుండి ఓపెరాలు ఫ్రాన్సుకు ప్రాకినవి. ఫ్రాన్సు చక్రవర్తి 14వ లూయీ ఆస్థానములో సంగీతవిద్వాంసుడుగానున్న **Jean Baptiste Lully** (జన్మతః ఇటలీవాడు) ఓపెరా రచనలో ఒక నవ్యతను ప్రవేశపెట్టినాడు. అదే కాలమున ఫ్రాన్సులో ప్రసిద్ధివహించిన నాటకకర్త మోలియర్ (**Moliere**) తో కలిసి ఓపెరాలు వ్రాసి ప్రదర్శించినాడు. వీనిలో జంత్రసమ్మేళనముతోపాటు బృందగానములు, నృత్యసన్నివేశములుకూడ నుండెడివి. ఇంగ్లండుదేశ సాహిత్యము కూడ ఇతనిచే ప్రభావితమైనది. ఇతని తరువాత హెన్రి పర్సెల్ (**Henry Purcell - 1659-1695**)ను గొప్ప ఓపెరా రచయితగా పేర్కొనవచ్చును. ఇతడు ప్రఖ్యాత సంగీతవిద్వాంసుడు. ఇతని ఓపెరా **'Dido and Aeneas'** మిక్కలి రసవత్తరమైనది.

ఓపెరా వికాసములో మరొక ముఖ్యమైనదశ **'The Baroque Age'**. 17-వ శతాబ్దము పూర్వార్ధమువరకు ఈ యుగము విస్తరించి యున్నది. ఆ కాలమున కళారంగము లన్నిటియందును గొప్ప అభివృద్ధి జరిగినది. విశేషించి జంత్రవాద్యములలో విప్లవాత్మకములైన మార్పులు సంభవించినవి. వయోలిన్, చెల్లో అను రెండు వాద్యములు రూపొంది వ్యాప్తిలోనికి వచ్చినవి. **Bartoloneo christofori** (1655-1737) అనునాతడు మొదటిసారిగా పియానో వాద్య విశేషమును సృష్టించినాడు. దీనితో జంత్ర సమ్మేళనములో పలు మార్పులు జరిగినవి. ఈ మార్పులు ఓపెరా రచనలయందును ప్రతిబింబింపక తప్పలేదు. ఈ మార్పులను ఉపయోగించి ఓపెరాలు వ్రాసిన వారిలో **Handel** ను ప్రముఖుడుగా చెప్పవచ్చును. ఇతడు సుమారు నలుబది సంగీత రూపకములను రచించినాడు. ఇతని ఓపెరాలలో **Oratorios** అనునవి కడు ప్రసిద్ధములు. ఇంగ్లీషులో **Oratory** అనగా చిన్న చర్చి ఈ ఓపెరాల కథలన్నియు మత పరములైనవే. అందుచేత వానిని పవిత్ర నాటకములని కూడ అనుచుండెడివారు. మొదట ఇవి చిన్న చిన్న చర్చిలలో మాత్రమే ప్రదర్శింపబడుచుండెడివి. అందుకే వానికా పేరు ఏర్పడినది. తరువాత బయలు రంగస్థలములపై ప్రదర్శింపబడినను అవి పవిత్రనాటకములను పేరుతోనే నిలిచిపోయినవి. 1742 లో డబ్లిన్ నగరములో **Messiah** (దేవదూత) అను సంగీత రూపకము ప్రదర్శింపబడినది. **Handel** తో ఈ బారక్ యుగము (**The Baroque Age**) ముగిసిన దనవచ్చును.

తరువాత హేతువాదయుగము (Age of Reason) లో ఒపెరా రచనలో కొన్ని మార్పులు జరిగినవి. ఇది దాదాపు 18-వ శతాబ్ది మధ్యకాలమునకు వర్తించును. ఈ యుగములో ప్రజల మనస్తత్వములో మార్పులు వచ్చినవి. మానవతావాదము ముందునకు వచ్చినది. జీవితమును సుఖమయముగా చేసికొనవలయునను ఆరాటము ప్రజాజీవన దృక్పథములో ఒక మలుపుతెచ్చినది. అందుచేత కళారంగములన్నింటియందును రూపసంపదకును, లాలిత్యమునకును, ఆలంకారికత్వమునకును ప్రాముఖ్యము హెచ్చినది. జీవితమునందును, కళలయందును వచ్చిన ఈ నూతనదృక్పథమునకు 'Rococo' అని సంకేతము. దీని ప్రభావమువలన Sonata, Symphony అను రెండు జంత్ర సంగీత పద్ధతులు రూపొందినవి వీనిని ఆధారము చేసికొని Fraiz Joseph Hayden (1732-1809) జంత్ర సమ్మేళనమును పునర్వ్యవస్థీకరించి కొన్ని ఒపెరాలను వ్రాసి వానిలో ఒక క్రొత్తదనమును సాధించెను.

ఒపెరా రచయితలందరిలో పేరు పొందినవాడు W. A Mozart. ఇతడు సంప్రదాయ సంగీతమునందు దారితేరినవాడు. స్వరకర్త ఇతని జీవితమును పేదరికము వెన్నాడి పలుకష్టములను కలిగించెను. అందుచేత ఇతని సంగీతముపై స్వీయానుభవముద్ర ఉన్నదని పలువురి అభిప్రాయము ఇతని సంగీత రచనలు ప్రాయికముగా విషాదాత్మకములుగా నుండెడవి. అయినను ఇతడు కొన్ని వినోదాత్మకములైన రూపకాలు కూడ వ్రాసినాడు 'Cosí fan tutte' అను హాస్యరస ప్రధానమైన ఇతని ఒపెరా పేరు మోసినది. ఇతని సంగీత స్వరకల్పనలో నాటకీయతా పరిమళము గుబాళించును.

18-వ శతాబ్దము పూర్వార్ధమునందు కొన్ని చక్కని ఒపెరాలు వచ్చినవి. కాని అప్పటికే ఒపెరాల రచనా ప్రదర్శనములలో కొన్ని అర్థరహితములైన సంప్రదాయములేర్పడి పురోగతికి అడ్డువచ్చినవి ఈ అవరోధములను ఛేదించుటకు కృషిచేసినవాడు Y. W Gluck (1714 87). మోజార్టుకు ఇతడు ఆదర్శముగా నిలిచినాడు. మోజార్ట్ ఒపెరా రచనా ప్రదర్శనములలో కొన్ని సంస్కరణములను ప్రవేశపెట్టి కృతకృత్యుడైనాడు ఇతడు ఇటలీదేశస్థుడు Lorenzo da Ponte (1749-1834)తో కలిసి ఉత్తమమైన ఒపెరాలను సృష్టించియుండెను వీనిలో 'The marriage of Figaro and Don giovanni' అను ఒపెరా చక్కని కథాగమనమునకు, ఇంపైన సంగీతమునకు ప్రసిద్ధి చెందినది.

ఇందలి పాత్రలు నాటకములోని పాత్రలవలె గాక దైనందిన జీవితమునందలి వాస్తవికతను సంతరించుకొన్నవి.

తరువాత 1770 నుండి 1827 వరకు బెథోవెన్ (Bethoven) ఓపెరా రచనకు సరిక్రొత్త పోకడలను సవదరించినాడు ఈతని కథలలో నైతిక రాజకీయాంశములు తొంగిచూచినవి. ఆ కాలములో ఫ్రెంచి విప్లవమునకు నినాదములైన స్వాతంత్ర్యము, సౌభ్రాత్రము ఇతనిని ప్రభావితుని చేసినవి. ఇతని ఓపెరా లలో ఈ భావములు ప్రబలముగా చోటుచేసికొన్నవి. ఇతడు స్వయముగా గొప్ప స్వరకర్త. కనుకనే ఇతని ఓపెరాలలో సంగీతము కూడ ఉన్నత ప్రమాణముల నందుకొన్నది.

ఓపెరాల సంగీతములో మరొక నూతనత్వమును ప్రవేశపెట్టిన ఘనత **F. M. Bartholdy** (1809-1847) కి దక్కుచున్నది. ఇతని కాలములో జంత్ర సమ్మేళనము సువిస్తరముగా అభివృద్ధి నందినది. ఇతడు షేక్స్పియరు నాటకములలో కొన్నింటిని ఓపెరాలుగా మలచినాడు. జంత్ర సమ్మేళనములోని వాద్యములతో సమయానుకూలమైన వాతావరణమును సృష్టించుటకు ఇతడు ప్రయత్నము చేసినాడు. సంగీతము ద్వారమున దృశ్యచిత్రణము నీతడు ప్రవేశ పెట్టగలిగినాడు. ఆయా సన్నివేశములు ప్రేక్షకుల హృదయములకు హత్తుకొని పోవుటకు వాద్య సంగీత విశేషము నుపయోగించి వారి హృదయములలో తదనుకూలమైన భావములను ప్రేరేచుటకు కృషిచేసినాడు.

ఇతని తరువాత **Hector Berliz** అను ఫ్రెంచి రచయిత బ్రహ్మాండమైన జంత్ర సమ్మేళనము నుపయోగించి ఓపెరాలను సృష్టించినాడు. షేక్స్పియరు గోథేలు రచించిన కొన్ని నాటకములను ఓపెరాలుగా రూపొందించినాడు. కాని ఉత్కటమైన జంత్ర సమ్మేళనము రంగస్థలముపై ప్రదర్శించుటకు అనువైన నాటకీయతను కోల్పోయినందుకు ఇతని నాటకాలు ఎక్కువగా ప్రసిద్ధిని పొందలేకపోయినవి.

ఓపెరా సృష్టిలో గొప్ప పేరు సంపాదించినవాడు **Richard wagner.** జర్మనీ దేశీయుడైన ఇతడు అపూర్వమైన ఓపెరాలను సృషించి ప్రదర్శించినాడు. మోజార్టు కూడ జర్మనీ భాషలో ఓపెరాలను రచించినాడు. ఇంతకు పూర్వము

ఇటలీ తదితర ఐరోపాఖండ దేశములలో వచ్చిన ఓపెరాలలో సంభాషణలు కూడ సంగీతాత్మకముగా నుండెడివి. ఈ పద్ధతికే **Recitative** అనియును **Aria** అనియును పేర్లు. మోజార్టు వాగ్నర్ మొదలగు వారు ఇందుకు భిన్నముగా **Sing - spiel** అను మరొక పద్ధతిని అనుసరించినారు. కొన్ని సంభాషణములను సంగీత స్పర్శ లేకుండ పలుకుటయు, అవసరమని తోచిన సందర్భాలలో గేయాత్మకముగా పలుకుటయు ఈ పద్ధతిలోని విశేషము.

మోజార్టు తరువాత **C. M. Von weber** (1786-1826) జర్మనీ భాషలో ఈ పద్ధతినే అవలంబించి **'The Marksman'** అను ప్రసిద్ధమైన ఓపెరాను రచించెను. అయినను **Sing-spiel** పద్ధతిని విస్తృతముగా ఉపయోగించుకొని దానికి ఒక ప్రామాణికతను కల్పించినవాడు వాగ్నర్. ఇతడు తన నాటకములను సంగీత రూపకములని పేర్కొన్నాడు. ఈ రూపకముల కథాసంవిధానమును స్వరకల్పనలును క్లిష్టములైనవి. ఇతని **'The Ring of the Nebelungs** అను 40 ఓపెరాల సముదాయము, జర్మనీ నార్మను దేశముల పురాణగాథలు ఆధారముగా రచింపబడినది ఇది మిక్కిలి ప్రసిద్ధమైనది. బవేరియా దేశమునందలి **Bayrenth** అను ప్రదేశములో ఓపెరా రంగస్థల రూపకల్పనా నిర్మాణములు ఇతని సలహాల వలననే జరిగినవి. సంగీత రూపకముల నెన్నింటినో రమణీయముగా రచించిన వాగ్నర్ 19-వ శతాబ్దము ఉత్తరార్ధమువందు ప్రభవిల్లిన ఉత్తమ నాటక కర్తగా ప్రయోక్తగా ప్రఖ్యాతిని పొందినాడు.

19-వ శతాబ్దపు తొలిదశలో **Gioacchiro Rossini** ఇటలీ దేశములో చక్కని ఓపెరాలను సృష్టించినాడు. 1829 లో ఇతడు వ్రాసిన **William Tell** అను ఓపెరా మిక్కిలి పేరు పొందినది.

ఇటలీలో **Guieseppe Verdi** (1813-1901) ఓపెరా రచయితగా అతి దీర్ఘకాలము మన గలిగినాడు. 1871లో కైరోలో సూయజ్ కాలువ ప్రారంభోత్సవ సమయమున ఇతని **Aida** అను ఓపెరా ప్రదర్శింపబడినది. ఇతని **Othello**, **Falstaff** అను రెండు ఓపెరాలు షేక్స్పియరు నాటకములను ఆధారముగా చేసికొని రచింపబడినవి. వాగ్నర్ కంటె పనినతనుతో ఇతడు వాద్య సంగీతమును తన ఓపెరాలలో ప్రయోగించినాడు. **G. Puccini** ఈ వాద్య సంగీత విశేషమును 20-వ శతాబ్దములో ప్రచారములోనికి తెచ్చినాడు.

Richard Strauss (1864-1949) వాగ్నర్ వలెనే ఉత్తమమైన ఓపెరాలు వ్రాసిన కవి. కథా సంవిధానమునకు ఇతని ఓపెరాలు నిధానములు.

19-వ శతాబ్దములో ఓపెరా రచనలో ఒక నూతన ధోరణి ప్రవేశించినది. అంతకు ముందు ఓపెరాలలో జాతీయతా భావము లేదు. కాని ఈ కాలములో జాతీయతాభావము ఓపెరాలలో ప్రముఖముగా వ్యాపించినది. నెపోలియన్ కాలమునాటినుండి రాజకీయరంగమునందు అలముకొన్న ఈ జాతీయతాభావము కళలకు కూడ ప్రాకినది. ప్రతిదేశము సంగీతములో తనదైన ఒక శైలిని ఒక బాణీని ఏర్పరచుకొనుటకు మహోద్రేకముగా ప్రయత్నించినది. ఇటాలియనులు వర్డిని తమ జాతీయ కళాకారుడుగా ప్రకటించుకొన్నారు. వాగ్నర్‌ను నవకళా స్రష్టగా జర్మను దేశస్థులు శ్లాఘించుకొన్నారు. Mikhail Glinka (1804-1857) అను రష్యా రచయిత 'A life for the Tsar' 'Russlan and Ludmilla' అను తన రెండు ఓపెరాల ద్వారమున ఒక ప్రత్యేకమైన దేశీయ శైలికి దిగ్దర్శకుడైనాడు. ఇంగ్లండులో Edward Elgar ఒక ప్రత్యేక దేశీయ శైలికి అంకురార్పణ చేసినాడు. ఈ ప్రత్యేక దేశీయశైలీ సంప్రదాయము అన్ని దేశములందును వ్యాపించినది.

దేశీయ ముద్రకే కాక ఓపెరాలలో ఇతర ప్రయోగములు కూడ పలు దేశములందు సాగుచున్నవి.[1]

1. పాశ్చాత్య దేశములందలి ఓపెరాల ఉత్పత్తి వికాసములను గూర్చిన ఈ విషయమునకు ఆధారము. 'The Hamlyn Junior Encyclopaedia in Colour - (India edition) Edited by Kenneth Baily - పుటలు - 495-515.

# 8. తెలుగు గేయనాటిక - అవతరణము

భారతీయ లాక్షణికులు కావ్యములను రెండు విధములుగా వింగడించి నారు; ఒకటి శ్రవ్యము, రెండవది దృశ్యము. దృశ్యకావ్యమే రూపకము. వారి దృష్టిలో నాటకకర్త కవి. పాశ్చాత్యులు నాటకకర్తను కవిగా గుర్తించ లేదు, నాటకములోని కవితాత్మకములైన భావములను దృష్టియందుంచుకొని యును ప్రత్యేకముగా అతడు రచించిన కావ్యములను దృక్పథమునందుంచు కొనియును అతనిని కవిగా గుర్తించిరే కాని కేవలనాటకకర్తను వారు కవి యనలేదు. భారతీయుల దృక్పథమున కావ్యము సాహిత్యాంశము; సాహిత్య ప్రక్రియ; సాహిత్య కళాప్రతీక. నాటకకర్తను మన లాక్షణికులు కేవలము కవిగా గుర్తించుటయే కాక అతనిని సాహిత్యకళానిష్ణాతుడుగా ప్రశంసించి నారు. "నాటకాంతంహి సాహిత్యమ్" "నాటకాంతం కవిత్వమ్" అను ఆ భాణకముల అంతరార్థమిదియే.

సాధారణముగా కవిత్వమనగనే మనకు శ్రుతిపేయమైన లయబద్ధమైన రమ్య భావమనియే స్ఫురించును. అదే విధముగా కవి యనగనే రమణీయ భావములను ఛందోరూపముగా ప్రకటించువాడను అభిప్రాయము వెంటనే మనకు సాక్షాత్కరించును. హృదయము భావ నిర్భరమైనప్పుడు వెలువడు వాక్కులు ఛందోబద్ధముగా అభివ్యక్త మగు ననుటకు ఆది కవియందు కవిత్వ మావిర్భవించిన ఘట్టమే నిదర్శనము. కిరాతుని శరాఘాతమునకు నేలగూలి విలవిల కొట్టుకొనుచున్న క్రౌంచమును చూచి శోకభావభరముతో వాల్మీకి మహర్షి ముఖమునుండి వెలువడినది తంత్రీలయ సమన్వితమైనదియు, సమాక్షర పాదబద్ధమైనదియు అగు శ్లోకమే (ఛందమే) కాని వేరొకటి కాదుగదా! "Poctry We will call musical thought" అనియును "It is the rhythmic creation of Beauty" అనియును కార్లైలు, ఎడ్గార్ ఎలన్ పో వంటి పాశ్చాత్య సాహిత్య వేత్తలు కవిత్వము ఛందోరూపముననే వ్యక్తమగు నని ప్రకటించినారు. ఆచార్య పింగళి లక్ష్మీకాంతముగారు కవిత్వమునకును ఛందస్సునకును ఉన్న సంబంధమును ఇట్లు వివరించినారు — "కావ్యకళా సృష్టికి

శ్రుతిలయాత్మకత జీవము. ఈ శ్రుతిలయలను గ్రహించునది శ్రవణేంద్రియము. దాని ద్వారా మనస్సునకు ఆహ్లాదము గొలుపు కళగనుకనే కవిత్వము సంగీతము వలె శ్రవ్యకళయైనది. ఈ శ్రుతిలయలను సాధించుటకే ఛందస్సేర్పడినది...... గద్యరచయిత ఎంత ప్రయత్నించియు ఛందస్సాధితములైన ఆ శ్రుతిలయలను సమకూర్పలేడు...... వచనరచనలు ఆహ్లాదము గొలుపుట కావ్యార్థ రామణీయకమును బట్టియే గాని, శ్రుతి బద్ధమైన రచనను బట్టి కాదు. మరియు ఎంత ప్రయత్నించియు గద్య రచయిత పద్యమునందలి శ్రుతిలయలవంటి వాటిని తన కావ్యములో సాధింపలేడు."[1]

ఛందస్సు కవిత్వమునకు అనివార్యమైన లక్షణము; అది లేనిదే కవిత్వము సమగ్రము కాదని నమ్మిన సంస్కృత కవులు గద్యమునే కాక రసస్ఫూర్తికిని భావోల్బణమునకును వివిధచ్ఛందో మర్యాదాలంకృతములైన వృత్తములను తమ నాటకములయందు ప్రయోగించిరి. వృత్తములు లయాత్మకములై గానయోగ్యములుగా నుండుటచేత నాటకమునకు అవి ఎనలేని సౌందర్యమును చేకూర్చునని భావించి, వారు వృత్తరచనను నాటక రచనా శిల్ప విశేషముగా గుర్తించిరి. ఉదాత్తభావములను ప్రకటించవలసి వచ్చినప్పుడును, సుందరములైన ప్రకృతి వర్ణనములు చేయవలసి వచ్చినప్పుడును, నృత్య సన్నివేశములను ప్రయోగింపవలసి వచ్చినప్పుడును, నృత్య సన్నివేశములను ప్రయోగింపవలసి వచ్చినప్పుడును వారు వృత్తములనే ఆశ్రయించిరి. భాష ఛందస్సహితమైనప్పుడు సంగీతాత్మకమై దానికి రక్తియు, ఆకర్షణయు ఏర్పడును తన్మూలమున అది విశ్వజనీనతను సంతరించుకొనును. కనుక నాటకములలోని వృత్తములు సామాజికుల జిహ్వాగ్రములందు లాస్యమాడి వారి హృదయ కుహరాంతరములందు స్థానమాక్రమించుకొన గలిగినవి. సంస్కృత రూపకములలో వృత్తములకున్న ప్రమేయము గేయములకు లేదను అంశమును వివరించుచు శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ గారు–"సంస్కృత నాటకములలో ఎందును పాటలున్న సూచనయే కానరాదు. రత్నావళి మొదలగు వానిలో 'ద్విపదీఖండము', 'చర్చరి' మొదలగు గీతఖండము లొకటి రెండున్నను అవి నృత్యగాన సన్నివేశము వలన వచ్చినవిగాని

1. సాహిత్య శిల్ప సమీక్ష - పుటలు 53-54 ప్రచురణ: మాలికో పబ్లిషర్సు - తిరుపతి (1966).

పాత్రముల యభిలయమునకు సహజముగా తోడుపడినవి గావు. తుదకు త్రిశ్ర గతిలోనో, చతురస్రగతిలోనో తాళ మార్గము ననుసరించి విధింపబడిన నాందిని గూడ సంస్కృత నాటకకర్త లోక వృత్తముగా మార్చుకొనిరి -"[1] అని వ్రాసినారు. సంస్కృతమునందు క్వాచిత్కముగనున్న 'చర్చరి' తెలుగు జాన పదులకు అత్యంతప్రీతి పాత్రమైనట్లు తెలుగు సాహిత్యమునందు సాక్ష్యము లున్నవి. నాచనసోముని 'వసంత విలాసము' లోనిదని ప్రాయికముగా లక్షణ గ్రంథములందు ఉదాహరింపబడుచున్న—

"వీణాగానము వెన్నెలతేట
రాణామీఱఁగా రమణులపాట
ప్రాణమైన పిన బ్రాహ్మణుపీట
జాణలు మెత్తురు జాజరపాట"

అను పంక్తులలోని 'జాజరపాట' యు, శ్రీనాథుడు భీమేశ్వర పురాణములో—

"జాదుర జాదురంచు మృదు చర్చరి గీతులు వారుణీరసా
స్వాదమదాతిరేకముల జంద్రికగాయగ దక్షవాటికా
వేదుల మీదటన్ గనకవీణలు మీటుచుఁబాడి రచ్చరల్
మోదమెలర్పఁగా భువన మోహన విగ్రహు భీమనాథునిన్"

అను పద్యమునందు పేర్కొన్న 'జాదుర'యు ఒక్కటే. నేటికిని తెలంగాణము నందు జానపదులలో జాజరపాటలు అతి ప్రచురముగా ఉన్నవి. "కొందరు పండితులు సంస్కృతమందలి చర్చరీగీతమే తెలుగున జాజరగా నవతరించిన దందురని"[2] ఆచార్య డా॥ బి. రామరాజుగారు అభిప్రాయపడినారు. పాడు చున్నప్పుడు ఈ జాజరపాట త్రిశ్రగతిలోనే సాగును. హృదయాహ్లాదకరములగు గేయములు రూపకములలో లేనందువలననే తరువాతికాలమున గేయ నృత్య ప్రధానములైన ఉపరూపకములు వెలసినవని ఊహించుట యుక్తము.

19వ శతాబ్దపు ఉత్తరార్ధమందు సంస్కృత నాటకముల అనువాదములు తెలుగులో వెలసినవి. సంస్కృత నాటకములలోని శ్లోకములకు (వృత్తములకు)

---

1. నాటకోపన్యాసములు - పుటలు 6, 7. తృతీయ ముద్రణ 1968 ప్రచురణ: త్రివేణి పబ్లిషర్సు - మచిలీపట్టణము. మదరాసు.

2. తెలుగు జానపద గేయ సాహిత్యము - పుట 46. ప్రచురణ: 1958.

తెలుగు పద్యము అవతరించినవి. వానిని ప్రయోగింపవలసి వచ్చినపుడు చదువుటతో తృప్తిపడక లయబద్ధముగా రాగయుక్తముగా పాడుట పరిపాటియైనది. ధర్మవరము రామకృష్ణమాచార్యుల కాలమునుండి పద్యములను హృద్యముగా పాడుట ప్రారంభమై, ఆ ధోరణి తరువాతి కాలములో పరాకాష్ఠనందుకొన్నది. ఈ పద్యముల ఆకర్షణము ఎంతవరకు పోయినదనగా అనువాద నాటకముల మాట యటుంచి స్వతంత్ర సాంఘిక నాటకములు సైతము పద్యములు లేనిదే జనాకర్షణమునకు యోగ్యములు కాలేకపోయినవి.

ఆంగ్ల విద్యాభ్యాసమువలన విద్యాధికులైన కొందరికి పాశ్చాత్య భావ ప్రపంచమువట్లను పాశ్చాత్య సాహిత్య ప్రక్రియలవట్లను ఆదరము అతిశయించినది. షేక్స్పియరు ప్రభృతుల రూపకములలో ముక్తచ్ఛందము (**Blank verse**) నకు ప్రాధాన్యమెక్కువ. పలుతావులలో సంభాషణములు కూడ పద్యములలోనే సాగుచుండును. ఎడనెడ గేయములు కూడ చోటుచేసికొనుచుండును. గ్రీకువిషాదరూపకములన్నియును పద్యమునందే (**Iambic metre** లో) యున్నవి. ఇంగ్లీషు ద్వారా పాశ్చాత్య దేశములలోని సాహితీ ప్రక్రియలతో మన దేశపు పండితులకు పరిచయము కలిగినది. ఈ పరిచయముతో వారు తమ దేశీయులకు ఆ ప్రక్రియలను అదేరూపమున అందించవలెనను ఉత్సాహముతో రచనా వ్యాసంగమును సాగించిరి. తత్ఫలితముగా తెలుగులో సంపూర్ణ పద్యనాటకాలు అవతరించుటకు అవకాశము కలిగినది. వావిలాల వాసుదేవ శాస్త్రిగారి 'సీజరు చరిత్రము' (షేక్స్పియరు 'జూలియస్ సీజరు' కు అనువాదము) మొట్టమొదటి పద్యనాటకము. ఇదిగాక వారు 'నందకరాజ్యము' అను స్వతంత్ర పద్యనాటకమును గూడ రచించిరి. ఈ రెంటిలోని ఛందము తేటగీతి. శ్రీ కోటమర్తి చినరఘుపతిరావుగారు సీసమాలికలలో సుయోధన విజయమును వ్రాసినారు. శ్రీ తల్లావఝ్ఝల శివశంకరస్వామివారి దివ్యలోచనములు, ప్రభుతీర్థము, దీపారాధన, కర్దముని, ప్రతాపకుమారి మున్నగు పద్య నాటకములు ఉదాహరింపతగినవి. శ్రీ స్వామివారు తమ పద్యనాటకములలో ఆటవెలది, తేటగీతి కందము మున్నగువానితోపాటు మత్తేభ, చంపక, ఉత్పల, శార్దూల, వసంతతిలకాది వృత్తములను ప్రయోగించినారు.

సంస్కృతమునందు చంపూ పద్ధతిలో రచించిన నాటకములే ఉన్నవి. కాని కేవల పద్య నాటకములుగాని, కేవల గద్యనాటకములుగాని లేవు. కనుక

పద్యనాటకములు పాశ్చాత్యుల అనుకరణమే అని శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణ శర్మగారు అభిప్రాయపడినారు.[1]

పద్యైకనాటకములు చదువుకొనుటకు బాగుండునేకాని రంగస్థలముపై అదే పనిగా నటులందరును పద్యములే పాడుచున్నచో అభినయము కుంచించుకొనిపోయి కథాగమనము కుంటుపడుచుండును. లయబద్ధముగా కొన్ని పద్యములను పాడుచుండగా విని సామాజికులు ఆనందించగలరేకాని నాటకమంతయు పద్యములలో నుండునప్పుడు విసుగు జనింపక మానదు. రసదృష్టికి, ప్రయోగదృష్టికి ఇది సంబాధకమగునను అభిప్రాయముతో రచయితలు ఈ ప్రక్రియపట్ల తూష్ణీంభావము వహించియుందురను ఊహలో సాహసము లేదు.

తెలుగులో గద్య పద్యాత్మకములైన నాటకములను మహామనీషులైన వీరేశలింగంపతులు, వేదం వేంకటరాయశాస్త్రిగారలు సంస్కృత నాటక పద్ధతిలో రచించినారు. ఈ నాటకముల యందలి పద్యములు ఎంత లయాత్మకముగా పాడినను, పండితుల మనస్సులనే ఆకట్టుకొన జాలినవి కాని పామరజనమునంతగా ఆకర్షించుకొనలేక పోయినవి. పారశీ, మరాఠీ నాటక సంఘాలు తెలుగు దేశమును ఉర్రూతలూగించి నాటకాభిరుచిని ప్రేరేచినవి. తెలుగులో నాటక రచనకు కవులును పూనుకొనిరి. పారశీమరాఠి నాటకములలో పారశీమట్టులలో హిందీ పాటలుండుట ఒక విశేషమైన ఆకర్షణము. పాటలలోని ఈ జనరంజక స్వభావమును గమనించి ఆంధ్రనాటక పితామహులు ధర్మవరపు రామకృష్ణమాచార్యులుగారు, కోలాచలము శ్రీనివాసరావుగారు తమ నాటకములలో పాటలను ప్రవేశపెట్టిరి. అవి పామరుల నుద్దేశించి వ్రాసినవేకాని పండితులకు కాదని అందుకు తాము ఉంతవ్యుల మనియు చెప్పుకొని యున్నారు. నాటకము నందు ఈ పాటలు జనాదరణమును పొందినవి. నాటకమునందలి రసము, కథాగమనము, పాత్రపోషణము అభినయము మాట ఎట్లున్నను కేవలము పాటల కొరకే నాటకమును చూచి ఆనందించు పరిపాటి నాటి జనులలో ఏర్పడినది. ఆ పాటలను కూనిరాగముతో పాడనివాడు ఆ కాలమున నాటకములను చూడనివాడే. నాటక ప్రాచుర్యమునకు పాటలు మిక్కిలిగా తోడ్పడునను అభిప్రాయము నాటి రచయితలలో ఏర్పడి పెక్కుఱు రచయితలు - పానుగంటి లక్ష్మీనరసింహారావు, ధర్మవరము గోపాలాచార్యులు, చక్రావధానుల మాణిక్య

1. నాటకోపన్యాసములు - పుట 42. తృతీయ ముద్రణ : (1968) త్రివేణి పబ్లిషర్సు.

శర్మ, అయినాపురపు సోమేశ్వరరావు, వేదము వేంకటరాయశాస్త్రి, సోమరాజు రామానుజరావు, కొప్పరపు సుబ్బారావు మున్నగువారు తమ నాటకములలో 20 నుండి 30 పాటలకు తక్కువ లేకుండ వ్రాసినారు. పాపట్ల కాంతయ్యగారు ఇతరులు వ్రాసిన నాటకములకు పాటలు వ్రాసి జనరంజక మొనర్చినారు. పాటల మూలమున నాటకములకు అశేషప్రాచుర్యము కలుగుటచేతనే ఆయా నాటకములు సంగీతశబ్ద విశేషణముతో వెలుగొందినవి. సంగీత సావిత్రి, సంగీత రస పుత్ర విజయము ఇత్యాది ఆ వరుసలోనివే.

నాటి నాటకములలోని పద్యములు, పాటలు సామాజికులకు ఉత్సాహాము కలిగించిన మాట నిజమే. కాని ఆ శ్రుతిపేయమైన సంగీతమునకే అవి అంకితమయిపోయినవి కాని వస్తుగతమైన రసస్పృష్టికి గాని, రసస్పృష్టికి కారణమగు అభినయమునకు గాని అవి తోడువడియుండలేదు. ఒకటి రెండు అపవాదములు తప్ప నాటకములలోని పాటలు కథా గమనమునకు అనుకూలముగ నుండలేదు. పాటల సంగతి వేరుగను, నాటకము సంగతి వేరుగను ఉండిపోయినది. కనుకనే శ్రీ ధర్మవరము వారను, శ్రీ కోలాచలమువారను పాటలను అనుబంధముగ చేర్చి, ఆ పాటలలోని భావమునే వచన రూపమున నాటకమున చేర్చి యుండిరి. స్వయముగా నటులగుట వలనను, సంగీత శాస్త్ర మర్యాదను ఎరిగిన వారగుట చేతను, నాటక ప్రయోజనమును తెలిసియున్న వారగుట చేతను వారట్లుచేసి యుండుట స్పష్టము. పద్యము చక్కగా రాగయుక్తముగా పఠించుటకొరకే పాటను వాద్యమునకు అనుకూలముగా పాడుటకొరకే నటుల ప్రయత్నమంతయును. ఈ ప్రయత్నములో అభినయ ప్రాణితమైన నాటకము మరుగునపడిపోయిన దురవస్థ వచ్చినది. గాయకులైన వారే నటులు కావలసిన అగత్యమేర్పడినది. ఈ స్థితిని గమనించిన కొందరు పాటలుగాని, పద్యములు గాని లేని సంపూర్ణ గద్య నాటకములను వెలువరించిరి. వీరేశలింగం పంతులు గారి బ్రాహ్మ వివాహము మున్నగు ప్రహసనములును, ఆంగ్ల నాటకములకు వారి అనువాదములును, గురజాడ అప్పారావుగారి కన్యాశుల్కము మున్నగునవి ఇందుకు ఉదాహృతులు. ఈ విధముగా రూపక రచనా ప్రయోగములో మనకు ఇంతవరకు మూడు దశలు కనిపించుచున్నవి; ఒకటి — సంస్కృత నాటకములకు యథాతథముగా గద్యపద్యాత్మకములైన అనువాదములు; రెండు — ఆంగ్లపద్యనాటకములకు తెలుగులో కేవల పద్యరూపము; మూడు —

కేవల గద్య నాటకములు. కేవల గద్యనాటకము ప్రజాబాహుళ్యమును ఆకర్షించుచుండిన కాలములోనే వానికి సమాంతరముగా పద్యగద్యాత్మకములైన నాటకములు శిష్టులైన సామాజికులకు ప్రీతిపాత్రములుగ ఉండెను. తిరుపతి వేంకటకవులు, పానుగంటి, చిలకమర్తి, బలిజేపల్లి, కాళ్లకూరి మున్నగువారి పౌరాణిక, సాంఘిక నాటకాలు ఇందుకు తార్కాణాలు.

దృశ్యకావ్యములలో వచనము ఆదినుండియే అగుపించుచున్నది. సంస్కృత రూపకములందును, ఉపరూపకములందును, తెలుగునాట వెలసిన యక్షగానాది దేశి కళా రూపములందును, సంస్కృత నాటకానువాదములందును, స్వతంత్ర నాటకములందును ఈ వచనము అనివార్యముగా ప్రయుక్తమగుచు వచ్చుచున్నది. ఇట్టి వచనమును త్రోసిరాజని కేవల పద్యములతో నాటకమును (సీజరు చరిత్రము) రచించి ఒక నూత్న ప్రయోగమును చేసినారు శ్రీ వావిలాల వాసుదేవశాస్త్రిగారు. శ్రీ తల్లావఝ్ఝల శివశంకరస్వామివారు ఈ ప్రయోగమునకు దోహదముచేసి, ఈ ప్రక్రియను తమ ప్రతిభావ్యుత్పత్తులతో ఫలవంతము చేసినారు. ఇంతటితో ఆగక శ్రీ స్వామిగారు పద్యనాటికలలో గేయములను ప్రవేశపెట్టి 'పద్యగేయనాటిక' అను ఒక నూతన ప్రయోగమును చేసినారు. ప్రయోగశీలురైన శ్రీ స్వామిగారు నాటికలనుండి పద్యములను కూడ తీసివేసి కేవల గేయనాటికకు ప్రప్రథమముగా రూపకల్పనచేసి "గేయ నాటికా తోయజాత సంభవులు"[1]గా సాహితీ ప్రపంచమున ఒక విశిష్ట స్థానమును సంపాదించుకొన్నారు.

ఒక ప్రయోగశీలికి ఉండవలసిన లక్షణములన్నియు శ్రీ శివశంకరస్వామి వారి యందు సమగ్రముగా ఉన్నవి. తెలుగు సాహిత్యమును నాటినుండి నేటి వరకు ప్రయోక్తలే తీర్చిదిద్దుచున్నారు. తెలుగునకు కావ్యార్హతను ప్రసాదించిన నన్నయ ఒక ప్రయోక్త. దేశిచ్ఛందములో మహాకావ్యరచనకు పూనుకొన్న పాలకురికి సోమనాథుడు ఒక ప్రయోక్త. గభీరములైన భావములను గీర్వాణవాణిని అపేక్షింపకయే తెలుగులో వ్యక్తము చేయగలిగిన తిక్కన ఒక ప్రయోక్త. పురాణ శైలినుండి విడివడ ప్రబంధమును అవతరింపజేసిన పెద్దన

1. విశిష్ట సభ్యుల ప్రశంస - ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు - పుట (85).
ప్రచురణ: ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ (1972).

ఒక్క ప్రయోక్త. ఇక ఆధునిక కాలమున పాశ్చాత్య సాహిత్య ప్రభావితులైన తెలుగు రచయితలు, కవులు అనేకములైన క్రొత్త ప్రయోగములనుచేసి సరిక్రొత్త ప్రక్రియలతో తెలుగు సాహిత్యమును సుసంపన్నము చేసినారు. వీరందరును యాదృచ్ఛికముగా, అలవోకగా ప్రాచీన - అర్వాచీన సాహితీ మర్యాదలతో తలస్పర్శి పరిచయములేక సమకాలీన ప్రజాభిరుచులతో పరిచయములేక ఈ ప్రయోగములు చేయలేదు. ఏ ప్రయోగమైనను హఠాత్తుగ తటిత్సంకాశముగ బహిర్గతము కాదు.

శ్రీ శివశంకరస్వామివారు శ్రీకృష్ణ లీలాతరంగిణీ కర్తలైన నారాయణ తీర్థులవంశమువారు. నారాయణ తీర్థుల తరంగములన్నను, జయదేవుని అష్టపదులన్నను, వైష్ణవాళ్వారుల శైవనయనారుల కీర్తనలన్నను, అన్నమయ్య క్షేత్రయ్య త్యాగరాజ పురందరదాసాది వాగ్గేయకారులు భక్తిపారవశ్యముతో పాడుకొన్న పదములన్నను శ్రీ శివశంకరులకు ప్రీతి అపారము. రమణీయ భావము ఛందోమయముగా లయాత్మకముగా వెలువడినప్పుడే సహృదయులను రసాత్ములు చేయగలుగునని వారి విశ్వాసము. కేవల వచనము కన్నను పద్యము నందు వారికి అభిరుచి అధికము. అంతకంటెను లయతాళబద్ధములైన గేయముల పట్లను వారు పెంచుకొన్న అభిమానము ఇంతింతనరానిది. అనేక గేయ ఫణితులను పొందుపరుచుకొన్న యక్షగానము అతిప్రాచీన దృశ్యకావ్య స్వరూపమనియును, అత్యంత రమణీయమనియును వారి ప్రత్యయము. అందలి గేయాభినయములు శ్రీ స్వామివారి హృదయమును ఆకట్టుకొన్నవి వారి వ్యక్తిత్వము ప్రతిభావ్యుత్పత్త్యభ్యాసములకు త్రివేణీ సంగమము. సంస్కృత సాహిత్యమునే గాక తర్క-వేదాంత వ్యాకరణ శాస్త్రములను జీర్ణించుకొన్న ధీశాలురు. సంస్కృత రూపక - ఉపరూపక మర్యాదల ఆంతర్యమును ఎరిగిన మనీషులు. అందలి నృత్య గీతాభినయముల స్వరూప స్వభావములను సంపూర్ణముగా అవగాహనచేసికొన్న సహృదయులు. ప్రాకృతము, పాళీ, బెంగాలీ, హిందీ, తమిళ, కర్ణాటకాది భారతీయ భాషలనే గాక, ఇంగ్లీషు, ఫ్రెంచి, జర్మని, లాటిను మున్నగు పాశ్చాత్యభాషలయందు అభినివేశమును సంతరించుకొన్న బహుభాషావేత్తలు. ఆయా భాషలలోని సాహిత్య ప్రక్రియలను, వాని తీరుతెన్నులను గరీయః ప్రతిభాదృష్టితో అవగాహన చేసికొన్న మేధావులు. పాశ్చాత్య దేశములందలి ఒపెరా (Operas) లనబడు సంగీత రూపకములను

అధ్యయనము చేసినవారు. జర్మను రచయితలు - **Duestach land, Richard wagner**, ఇటలీ ఓపెరా రచయితలు, ఇంగ్లీషు ఓపెరా రచయితలు - ప్రధానముగా ఆర్థర్ సెలివాన్, ఫిలిప్స్‌రోడ్‌లీ బెక్ మున్నగువారి రూపక సాహిత్యమును, ఇంకను ప్రసిద్ధ రచయితలు మోజార్టు, మారిస్ మేథర్ లింక్ మున్నగువారి ఓపెరాలను చదివినారు. వంగభాషతో విశేష పరిచయమున్న వారు కనుకనే వంగభాషలో గేయనాటికా రచనలో సిద్ధహస్తులైన రవీంద్రుని రచనలను అనివార్యముగా అధ్యయనము చేసినారు.

సంస్కృత ఉపరూపకములతో, యక్షగానాది దేశిరూపకములతో, పాశ్చాత్యుల ఓపెరాలతో, రవీంద్రుని గేయరూపకాలతో ఎంత పరిచయ మున్నను తాము గేయనాటికా ప్రక్రియను చేపట్టుటకు "శ్రీకృష్ణలీలా తరంగిణియే ఉపాదాన కారణము"నియు పాశ్చాత్యుల రచనలు నిమిత్త కారణము లనియు శ్రీస్వామివారు నాతో నుడివినారు.[1] పాశ్చాత్యులచే ప్రభావితులై గేయ నాటిక రచన చేసినారా యని నేనడిగిన ప్రశ్నకు - "కాదు సత్యలేశము మాత్రము కలదు -"[2] అని శ్రీ స్వామివారి సమాధానము. బాల్యము నుండియే వారు నాటికలపట్ల ఆసక్తిని పెంచుకున్నవారు. ఏడేండ్ల చిరుత వయస్సులో - సత్తెనపల్లి ప్రాథమిక పాఠశాలలో (1899) నాలుగవ తరగతి చదువుచున్న దినములలో నాటకములకు పోయి ముందువరుసలో కూర్చొని చూచుచుండువారు. వారి అభిరుచి పల్లవావస్థను దాటి పరిణతదశను ప్రాపించగా 1921-22 లో తెనాలి 'రామవిలాస సభ' నాట్యమండలికి ముఖ్య దర్శకులు (**Chief director**) గాను, 1929 లో స్థాపితమైన 'నాటక కళా పరిషత్తు'కు స్థాపక సభ్యులు (**Founder - member**) గాను ఉండి రూపక రచనా ప్రయోగములను గూర్చి నిశితముగా రసాత్త పరిశీలనము చేసినారు. సంస్కృత రూపకములలోని 'ధ్రువాగీతి' సంకేతమును గ్రహించి తమ గేయ నాటికలలో చతురశ్రాది గతులలో నడుపుట, గీర్వాణ సాహిత్యము నుండి తమ నాటికలకు వస్తువును గ్రహించుట, త్రిశ్రాదిగతులు, ముత్యాల సరాలు,

---

1, 2. 1974 లో నేను శ్రీ శివశంకర స్వామివారిని ఒంగోలులో కలిసికొని సుదీర్ఘముగ చర్చించితిని గేయనాటికలకు సంబంధించిన ప్రశ్నలను నేనడుగగా వారు సమాధానములనిచ్చినారు. నా ప్రశ్నలను వారి సమాధానములను అనుబంధము - 1. 2. లో సమకూర్చియున్నాను.

ఝంజరీ ద్విపదలవంటి గానయోగ్యములగు ఛందస్సులను గ్రహించుట, భారతీయ సంస్కృతి మహితములైన భావములను వ్యంగ్యముగా భంగ్యంతరముగా మహోదాత్తమైనవిగా చిత్రించుట అనునవి శ్రీ శివశంకరస్వామివారి గేయ నాటికా ప్రయోగము స్వతంత్రమైనదియే భారతీయమైనదియే అనుటకు అంతస్సాక్ష్యములు

డా॥ పి. ఎస్. ఆర్. అప్పారావుగారు తమ సిద్ధాంత గ్రంథము నందు తెలుగు రూపకములపై ఆంగ్ల రూపకముల ప్రభావమును వివరించుచు "పాశ్చాత్య రూపకముల ప్రభావము కారణముగానే - విషాదరూపకములు, గేయరూపకములు పద్యరూపకములు, ఏకాంకికలు, శ్రవ్యరూపకములు మొదలగు నూత్నప్రక్రియలు తెలుగులో అవతరించినవి. కాని ఉత్తమ రూపక నిర్మాణ విషయమున కొంత క్లిష్టసమస్య యేర్పడినదని చెప్పకతప్పదు. ప్రక్రియలు రచనా విధానము పాశ్చాత్యము; కాని నిరూపించెడి విషయములు, చిత్రించెడి విషయములు దేశీయములు"[1] అని అభిప్రాయ పడినారు

తెలుగులో గేయనాటికా ప్రక్రియ "పాశ్చాత్య సాహిత్య ప్రభావము వల్లనే రూపొందినద"ని[2] శ్రీ నో-నరసింహశాస్త్రిగారును, "...గేయనాటికల ఆవిర్భావము పాశ్చాత్య సాహిత్య ప్రభావముచేతనే తెలుగు వాఙ్మయమున జరిగినద"[3]ని మంగళగిరి ప్రమీలాదేవిగారును వ్రాసియుండిరి.

నేను శ్రీ శివశంకరుల వారి గేయనాటికలనుగాని, తదితరుల గేయ నాటికలను గాని పరిశీలించినపుడు వారి రచన యందుకాని, వస్తువునందుకాని, భావమునందుకాని పాశ్చాత్య ప్రభావమున్నట్లు తోచలేదు. రంగము (Scene) విషాదాంత రూపకేతివృత్తము, స్వరమేళ (బృందగానము - Chorus) పాశ్చాత్యులవనియును, కనుక గేయనాటికలపై పాశ్చాత్యుల ప్రభావమున్న దనియును భావించి శ్రీ అప్పారావు మున్నగువారు ఇట్లు అభిప్రాయ పడి

1. తెలుగు నాటక వికాసము - పుట 473.

2. 'తెలుగులో పద్యగేయనాటికలు' - పరిచయము - పుట 5. (గ్రంథరచన : మంగళగిరి ప్రమీలాదేవి).

3. ,, ,, ,, - అవతారిక - పుట 8. ప్రచురణ : సాహితీ సమితి - రేపల్లె. ప్రథమ ముద్రణ : 1974.

యుందురు. కాని, ఇవి నిమిత్తకారణములేకాని ఉపాదానకారణములు కావు. తొలి గేయనాటికా కర్తలు శ్రీ శివశంకరస్వామివారే పాశ్చాత్యుల రచనలు నిమిత్త కారణములని అన్నారు. అందుకే వారు "సత్యలేశము మాత్రము కలదు" అన్నారు. ప్రయోగ శీలురును, ప్రాక్పశ్చిమ సాహితీ మర్యాదలను పుడిసిటబట్టిన వారును అయిన శ్రీ శివశంకరస్వామి వారి అభిప్రాయము ప్రామాణిక మనుటకు వీలున్నది. అధునాతన సాహితీ ప్రపంచమున వారు సంపాదించుకొన్న స్థానమట్టిది. కావున కేవలము "పాశ్చాత్యరూపకముల ప్రభావము కారణముగానే" గేయనాటికలు ప్రభవిల్లినవను అభిప్రాయము స్థూలముగా ప్రచలితమైనదే.

గేయరూపక ప్రక్రియ భారతీయమైనదే. కొన్ని శతాబ్దముల క్రితమే అభినవగుప్త హేమచంద్రాది ప్రామాణికలాక్షణికులు గేయరూపకములను గూర్చి విపులముగా చర్చించినారు. ఈ విషయము ఇదివరకే ఉపరూపకముల అధ్యాయమున వివరింప బడినది.

భారతీయ భాషలన్నింటి యందును ఇటీవల వెలువడిన గేయనాటికలు ఆయా ప్రాంతాలలోని జానపదరూపకకళల ప్రభావముచేత యక్షగానముల ప్రభావముచేత పుట్టుకొని వచ్చినవని ఆయా భాషా సాహితీ వేత్తల అభిప్రాయము. ఈ విషయమును 'వివిధ భాషలలో గేయనాటికలు' అను ప్రకరణమున చర్చించి యున్నాను.

భారతేతిహాసమునందు వివిధకళా ప్రయోగములను గూర్చియు, వాని పుట్టుపూర్వోత్తరములను గూర్చియు తెలిసికోనదగిన విశేషము లనేకములున్నవి. నేటి గేయనాటికల స్వరూపస్వభావములకును భరతుని తరువాత వెలసిన ఉపరూపకములకును సామ్యముశే ఎక్కువ. ధార్వాడనాటక కంపనీల ప్రభావముచేత తెలుగులో రూపకములు వెలసినను రూపకమర్యాదలను అధ్యయనము చేయునప్పుడు భరతుని నాట్యశాస్త్రమునే ప్రమాణముగా స్వీకరించుట నేటికిని విద్వల్లోకమున ఉన్న పరిపాటి. దీనికి కారణమేమి? అదే విధముగా గేయనాటికలను గూర్చి పరిశీలనముచేయుట్లు ఉపరూపకములను ఏల ఎత్తుకొన గూడదు? నేడున్నవి నిన్న లేవనుట చరిత్రాధ్యయనము హేతు

బద్ధముగ చేయకపోవుటయే అగును. ఇది ఎట్లున్నదనగా నిన్న మనము దాస్యము అనుభవించితిమి కనుక మొన్న స్వేచ్ఛను అనుభవించనే లేదనుట వంటిది. ఆంగ్లేయులు భారతదేశమును కుయుక్తులచేత ఆక్రమించుకొనుటకు పూర్వము మనకు స్వేచ్ఛయేలేదా? కారణాంతరములవలన మనము స్వేచ్ఛా స్వాతంత్ర్యములను కోల్పోయి 'అస్తంగతమహిములమై యుంటిమే'కాని మనకు ఉపజ్ఞయే లేదనియు ప్రతిభాహీనులమనియు కాదు. లలితకళలపట్ల నిరసన భావమున్న ముసల్మానుల ధార్ష్ట్యమునకును అనాదరణమునకును అణచివేతల కును గురియై ప్రాచీన కళా సంప్రదాయము లెన్నియో అదృశ్యములైనవి. కనుక ప్రాచీన దృశ్య కళారూపముల చరిత్రను వెలికితీసి, తగిన ఉపపత్తులను సంపాదించి తెలుపవలసిన అగత్యమెంతేని యున్నది. ఈ పట్టున పరిశోధనము జరుగవలసియున్నది. సాంకేతిక శాస్త్రాభివృద్ధివలనను, వైజ్ఞానికాన్వేషణము వలనను పాశ్చాత్యదేశములలోని రూపకములు ప్రదర్శనకు సంబంధించిన అంశములెన్నింటియందో మిరుమిట్లు గొలుపుచున్నంత ప్రగతిని సాధించినవి. అంతేకాని భారతీయులు సాధించిన వైశిష్ట్యమును అవి సంపాదింపలేకపోయినవి. పాశ్చాత్యులు బట్టకట్ట నెరుగని దినములలో భారతీయులు సాధించిన సిద్ధులు అతివేలములు. పరమాత్మనే జగన్నాటక సూత్రధారునిగా గుర్తించిన భారతీయులకా పాశ్చాత్యులురూపక మర్యాదలను నేర్పుట! ముప్పదికి మించిన ఉపరూపకములలో కొన్నింటినైనను నేడు ప్రయోగించినచో నేటి గేయనాటికలకును నృత్యనాటికలకును అవి మాతృకలుగనో ఆదర్శములుగనో కనిపించక పోవు. ఆర్షభారత ప్రతిభ పట్ల ప్రత్యయమున్న ప్రయోగదక్షునికొరకు కళా పిపాసువులు ప్రతీక్షించుచున్నారు. ప్రాచీన ఉపరూపకములకును నేటి గేయ నాటికలకును ప్రత్యక్ష సంబంధమును స్థాపించుట ఇపుడు లభ్యమగుచున్న సామగ్రితో కష్టసాధ్యమగునేమో కాని ఉత్తరోత్తరము అసంభవము మాత్రము కాదని నా నమ్మకము.

1924 నుండియే శ్రీ శివశంకరస్వామివారికి గేయనాటికా రచనముపట్ల అత్యంతాసక్తి ఉండెను. ఇందుకు వారి హృదయేశ్వరి కావ్యములోని పాత్రల గేయరూప సంభాషణము ప్రబల నిదర్శనము. అదే సంవత్సరమున వారి 'దివ్యాలోచనములు' వెలువడినది. శార్దూల చంపకోత్పలాది వృత్తములతో సాగిన పద్యనాటిక అది. ఇందు రెండే రెండు పాత్రలున్నను నాటకీయతకు కొదవ లేదు.

నా దృష్టిలో ఇదియే శ్రీ శివశంకరస్వామివారి ప్రప్రథమ సంపూర్ణ పద్యనాటిక. మరల అదే సంవత్సరము (1924) లో వారి 'శిష్యురాలు' అను నాటిక వచ్చినది. ఇందు తొలిసారిగా పద్యములతో (తేటగీతులతో ఆటవెలదులతో) పాటు గేయము (ముత్యాలసరాలు) కూడ ప్రవేశించినది. ఇట్లు 'శిష్యురాలు' శ్రీ శివశంకరస్వామి వారి మొట్టమొదటి పద్య గేయనాటిక అగుచున్నది. ఈ రచన తరువాత సుమారు అయిదేండ్లవరకు శ్రీ స్వామివారు ప్రభుతీర్థము దీపారాధనము వంటి సంపూర్ణ పద్యనాటికలను రచించినారు. 1930లో వారు ముత్యాలసరములలో 'పలితకేశము' అను నాటికను రచించినారు. మూడు పాత్రలున్న ఈ నాటిక ప్రదర్శనయోగ్యము పద్యరహితము కేవల గేయాత్మకము. ఇట్టి నాటికలను శ్రీ స్వామివారు అనేకములు రచించినారు. వానిలో ఇదే ప్రథమమని వారి రచనల పౌర్వాపర్యమును పరిశీలించినచో మనకు అవగతమగును [1]

డా॥ పి. ఎస్. ఆర్. అప్పారావుగారు తమ సిద్ధాంతగ్రంథమునందు శ్రీ శివశంకరస్వామివారి రచనలను గూర్చి తెలుపుచు "వరపరీక్ష" వీరి ప్రథమ గేయనాటిక (1936)" అని వ్రాసినారు.[2] కాని నేను అనుబంధము (2) నందు పేర్కొన్న సూచికననుసరించి 'పలితకేశము' రచనాకాలము 1930. కావున 'పలితకేశము' తెలుగులో మొట్టమొదటి గేయనాటికయని నిర్ణయించుట సాహసము కాదనుకొందును. నే నిట్టి నిర్ణయము చేయుటకు శ్రీ శివశంకరస్వామి వారితో నేను చేసిన సంభాషణము, వారు నాకు వ్రాసిన లేఖయును కొంత ఉపకరించుచున్నవి.[3] శ్రీ శివశంకరస్వామివారి దృష్టిలో కేవలము గేయములున్న నాటికయే గేయనాటిక. తాము రచించిన గేయనాటికలనుగూర్చి అడిగినప్పుడు వారిచ్చిన పట్టిక కేవలము గేయములున్న నాటికలదే. 'పద్మావతీ

1. శ్రీ శివశంకర స్వామివారి రచనలను వాని రచనాకాలమును సూచించు పట్టికను అనుబంధము (2)న సూచించినాను.
2. తెలుగు నాటక వికాసము - పుట (408).
3. శ్రీ శివశంకర స్వామి వారు నాకు వ్రాసిన లేఖ - (1 (గ) ) అనుబంధము చూడుడు.

చరణచారణచక్రవర్తి' లో పద్యములు కూడ ఉన్నవి. అది ప్రయోగింపబడి సహృదయుల అభిమానమునకు పాత్రమైనది. కొందరి దృష్టిలో ఇది గేయ నాటికగా కనిపించినది. కాని యదార్థమదికాదు. శ్రీ స్వామివారు కూడ దీనిని మొదటి నాటిక అనిరే కాని గేయనాటిక అనలేదు. కేవల గేయనాటికలను వారు పేర్కొన్నప్పుడు అందు 'పద్మావతీచరణచారణచక్రవర్తి' లేకపోవుటయు గమనింపదగిన అంశము. కావున తెలుగులో వెలసిన ప్రప్రథమ గేయనాటిక 'పలితకేశము'.

# 9. గేయనాటికా వైవిధ్యము

రసవస్తుచ్ఛందోవిశేషములననుసరించి సాహిత్యప్రక్రియలలో వైవిధ్యము సహజముగనే ఏర్పడుచున్నది. లాక్షణికులు కావ్యములను దృశ్యశ్రవ్యములుగా ముందు విభజించిరి. మరల శ్రవ్యకావ్యములను పద్యకావ్యములుగను, గద్య కావ్యములుగను, చంపూకావ్యములుగను విభాగించిరి. ప్రాచీనకాలమునందును అధునాతనయుగమునందును పద్యగద్యకావ్యములు దిద్దుకొన్న రూపములను వ్రేళ్ళపై లెక్కపెట్టలేము. ఏప్రక్రియయైనను లాక్షణికులు రూపొందించిన లక్షణ మెట్లున్నను దేశకాలానుగుణముగా వినూత్నచ్ఛందో భాషామర్యాదలను సంత రించుకొని సజీవమై అలరారుచుండును. ప్రక్రియారూపములలో వైవిధ్యము రూపొందుట సజీవసాహిత్యలక్షణము. మార్పులకు సరితూగని ప్రక్రియ మృతప్రా యము. దాదాపు నాలుగైదుదశాబ్దములుగా తెలుగుసాహితీప్రపంచమున విశిష్ట స్థానము నాక్రమించుకొన్న గేయనాటికాప్రక్రియ పోయిన పోకడలను ఛందో వస్తుదృష్టులతో విభజించి ఒక్కొక్క విభాగమును పరిశీలించుటకు యత్నింతును.

**ఛందోదృష్టి :**

నా పరిశోధనా పరిధి కేవలము గేయనాటికలు. గేయైకనాటికల స్వరూప స్వభావములను మాత్రమే నేను వివరించుటకు ఉత్సహించినాను. కాని 'గేయ నాటిక' అను సంకేతముతో శతాధికములైన రచనలు వెలువడినవి. అందు కొన్నింటిలో పద్యగేయములతోపాటు వచనముకూడ ఉన్నది. మరికొన్నింటిలో గేయవచనములే ఉన్నవి. మరికొన్నింటిలో మాత్రాచ్ఛందస్సులతోపాటు వచన కవితయు చోటుచేసికొన్నది. ఇంకను కొన్ని గేయనాటికలలో వచనము లేదు కాని గేయముతోపాటు పద్యముకూడ ప్రవర్తిల్లినది. ఇక పద్యవచనములు పూర్తిగా పరిహరింపబడిన గేయైకనాటికలుకూడ ఉన్నవి. ఈగేయైకములందును ఒండురెండు తావులలో తేటగీతియో, ఆటవెలదియో, కందమో, చంపకోత్పల వృత్తములో ఆ వృత్తపాదములో సకృత్తుగా తారసిల్లి ఉండుటచేత వానిని అప్రధానములుగా నెంచి ఆ నాటికలను గేయనాటికలుగనే సంకేతించితిని. నాకు లభ్యములైన ముద్రితాముద్రితములైన గేయనాటికలను విభజించు

సందర్భమున ఈ విశేషములు నాదృష్టికి వచ్చిన కారణమున ఛందోదృష్టితో నేను చేసిన విభాగముల స్థూలరూపము లివి ఒకటి-పద్యగేయవచనమిశ్ర నాటికలు; రెండు-పద్యగేయనాటికలు; మూడు-. గేయనాటికలు (గేయైకములు).

**వస్తుదృష్టి :**

సాధారణరూపకములలోవలెనే గేయనాటికలలో నాయికా నాయకుల సమగ్రజీవితవృత్తముండదు. రేఖామాత్రముగా రెండుమూడు సన్నివేశములతో ప్రయోగము జరుగును. అందు గేయాభినయములకే ప్రాధాన్యము. గేయము నందలి భావములే సూక్ష్మరూపముననున్న ఇతివృత్తమును సూచించును. అందుచేత తత్త్వావిష్కరణమునకు సంగీతనృత్యకవిత్వములను ఆశ్రయించుట గేయనాటికలలో సర్వసామాన్యము. ఈకారణముచేతనే ప్రాయికముగా వీని యందలి పాత్రలు ప్రతీకాత్మకములుగా భాసించుట సంభావ్యము.

నాకు ఉపలబ్ధములైన గేయనాటికలను వస్తుదృష్టితో నేను విభజించు సందర్భమున స్థూలముగా ఏర్పడిన విభాగములివి-

**పౌరాణికములు :** పురాణేతిహాసములందలి కథాఘట్టములను మూలముగా గ్రహించి రచింపబడిన గేయనాటికలు - పౌరాణికములు.

**చరిత్రాత్మకములు :** చారిత్రిక సన్నివేశములు భూమికలుగా వెలువడినవి చరిత్రాత్మకములు.

**సాంఘికములు :** దైనందిన సాంసారిక జీవితమును, సాంఘిక సమస్యలను చిత్రించు నాటికలు సాంఘికములు.

**సాంస్కృతికములు :** పర్వదినములలో ప్రజలు జరుపుకొను వేడుకలను, విధినిహితములైన క్రియాకలాపములను వస్తువుగా గ్రహించిన నాటికలు సాంస్కృతికములు.

**అనుసరణాత్మకములు :** గేయనాటికాకర్తలు తమతమ నాటికలకు కొన్ని ప్రసిద్ధ కావ్యములను, అన్యభాషలయందలి రూపకములను సంఘటనలను ఆధారము చేసికొని రచించినట్లు తామే తమ నాటికలలో చెప్పికొనినారు ఇట్టి గేయనాటికలకు అనుసరణాత్మకములని సంకేతము.

**ప్రకృతి సంబంధములు (ప్రతీకాత్మకములు) :** పశుపక్షి తరులతా గిరిగుహా సరిత్సాగర రవిశశి తారకాది ప్రకృతి పదార్థములు పాత్రలుగా అవతరించిన గేయనాటికలను ప్రకృతి సంబంధములుగా పేర్కొని ఉన్నాను ఈ తెగకు చెందిన గేయనాటికలన్నింటియందును ప్రకృతి పదార్థములు ప్రతీకాత్మకము లుగా భాసించుట సర్వసామాన్యము. కనుకనే వీనిని ప్రతీకాత్మకములన్నను చిక్కులేదు.

**ప్రబోధాత్మకములు :** మానవాభ్యుదయమునకు దోహదకారియగు ఏదేని ఒక ప్రబోధమును వ్యంగ్యస్ఫూర్తితో ప్రతిపాదించు గేయనాటికలకు ఇది స్థూలమైన సంకేతము. ఇందు కల్పనాత్మకమైనవియు, తాత్త్వికములైనవియు సైద్ధాంతికములైనవియునయిన నాటికలు చేరియున్నవి.

ఈ విభజనము స్థూలమని నేనిదివరకే తెలిపియున్నాను. సూక్ష్మముగా పరిశీలించినచో ఒకదాని లక్షణములు మరియొక దానియందు కానిపింపక పోవు. కేవలమిది ప్రాధాన్య వివక్ష మాత్రమే.

ఇక పద్యగేయవచనమిశ్ర – పద్యగేయ – గేయనాటికలందలి ఇతి వృత్త విశేషములను వస్తు దృష్టితో చేసిన పౌరాణికాది విభజనము ననుసరించి క్రమముగా వివరింతును.

# పౌరాణికములు

## (పద్యగేయ వచన మిశ్రనాటికలు)

**గుహుడు :**

భక్తిరసాత్మకమైన ఈ శ్రవ్యగేయనాటికను రచించినవారు శ్రీ దేవులపల్లి వేంకటకృష్ణశాస్త్రిగారు. మూడు రంగములుగా సాగిన ఈ నాటికయందలి పాత్రలు – శ్రీరాముడు, సీతాదేవి, లక్ష్మణుడు, సుమంత్రుడు, గుహుడు, ఇద్దరు నిషాదులు, పడవవాళ్లు (ముగ్గురు ఆడ – ముగ్గురు మగ).

వనవాసమునకు బయలుదేరి గంగాతీరమునకు వచ్చిన సీతారామ లక్ష్మణులకు గుహుడు భక్తి రసార్ద్రుడై ఆతిథ్యమిచ్చి వారిని పడవపై గంగను దాటించిన రామాయణఘట్టమిందు రమణీయముగా చిత్రింపబడినది.

ఈ నాటికలో పాటలును, తేటగీతి ఆటవెలది పద్యములును ఉన్నవి. ఆద్యంతములందు 'కవి'నోట రెండు పద్యములను కథా సార సూచకముగా పలికించినారు శ్రీ కృష్ణశాస్త్రిగారు. వచన సంభాషణములు సంక్షిప్తముగా సాగి భక్తిపరిమళమును విరజిమ్ముచున్నవి. ఈ రూపకమందలి పాటలు రెంటిలో "గుండెల్లో ఉండాలి దిలాసా – నిండాలీ మనసులో కులాసా" అను పడవ వారి పాట సహృదయుల హృదయాలలో కులాసాను నింపును. ఈ పాట యందలి –

"గాలిజూలు పట్టేది
కడలి నడగ త్రొక్కేది
కనపడని సరంగొకడే !
కనపడని సరంగే –
గుండెల్లో ఉండాలి ...
చీకట్లో వెన్నెల్లు
చిలికే దెవరు ?
నీళ్లల్లో దారుల్లు
నిలిపే దెవరు ?
అసలు పడవనడిపేదీ,
అవలి ఒడ్డు చేర్చేదీ

అగపడని సరంగొకడే
అగపడని సరంగే -
గుండెల్లో ఉండాలి ..."

అను చరణములు గుహుని భక్తి విశేషమును, పరమాత్మ తత్త్వమును తెలియ పరచుచునే శ్రీ కృష్ణశాస్త్రిగారి ధ్వన్యనుప్రాణిత కవితా స్ఫూర్తిని వారి లలిత మైన తెలుగు పలుకుల కూర్పును ప్రకటించుచున్నవి.

ఈ నాటిక ఆకాశవాణి హైదరాబాదు కేంద్రమునుండి ప్రసారితమైనది.

**కృష్ణాష్టమి :**

ఈ నాటికయు శ్రీ దేవులపల్లి వేంకటకృష్ణశాస్త్రిగారిదే. కారాగారము నందు జన్మించిన శ్రీకృష్ణుడు వ్రేపల్లె చేరుకొని రాధలాలనలో యశోదపాలనలో హాయిగా పెరుగుచు తన అల్లరిచేతలను ప్రదర్శించుట ఈ నాటికలోని ఇతివృత్తము. యశోద, రోహిణి రాధ, నందుడు, ఉద్ధవుడు, రాయణుడు, వసుదేవుడు, అక్రూరుడు, గోపికలు, గోప కుమారులు – ఇందలి పాత్రలు.

ఈ నాటికలో పాటలు పద్యములు అధికము. వచనము స్వల్పము. పాటలన్నియు మకరందమధురములు శ్రీకృష్ణుడు వ్రేపల్లె చేరునపుడు సంతోష తరంగితమైన ప్రకృతిని, శ్రీకృష్ణుని చిలిపిచేతలను మనోహరముగా వర్ణించినారు శ్రీ కృష్ణశాస్త్రిగారు. రాధముఖతః పలికించిన–'జయజయకృష్ణా !' అను పాట సంస్కృత సమాసములతో అత్యంతసుందరముగా నడచినది. ఉదాహరణమునకు ఈ గేయము నందలి ——

"జయజయ శ్రావణ జలదేందీవర
తరుణ తమాల కిసాల సమాన
శ్యామల కోమల చారుశరీరా !
మామకహృదయాంతర సంచారా !
..........................
జయజయ కదంబ కకుభప్రసూన
కేసరకేసర నవకువలయదళ
సురభిళ మృదుళయ్యావ్తవిహారా !
గోపీ జనతా ఘనతాపహరా !"

వంటి చరణాలను పేర్కొనవచ్చును.

తలుపు తీయుమని అడిగిన గోపికలతో రాధ పలికిన సందర్భమునందలి - "వేయబోవని తలుపు తీయమంటూ పిలుపు" అను గేయములోని -

"విశ్వమంతా ప్రాణ విభుని మందిరమైన
వీధివాకిలి యేది చెల్లెలా !
విశ్వవిభుడే రాధ వెంటనంటిరాగ
పిలుపేది తలుపేది చెల్లెలా !"

వంటి పంక్తులు వేదాంత మందిరముల తలుపులు తీయుచున్నవి. ఈ నాటికలో చోటు చేసికొన్న సీసములు, తేటగీతులు, ఆటవెలదులు, కందములు, శార్దూలము మధురభావ విలసితములై సహృదయుల హృదయములలో 'శారద శశాంకాంశు ప్రభ'లను పర్వులెత్తించుచున్నవి.

ఆకాశవాణిలో ప్రసారితమైన ఈ నాటికయందలి పాటలకు రాగతాళ నిర్దేశము చేయబడినది.

**శ్రీ ఆండాళ్లు :**

నాటికా కర్తలు శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారే. పాటలతో పద్యాలతో వచన సంభాషణలతో సాగిన ఈ నాటికయందలి పాత్రలు ఆండాళ్లు, పెరియాళ్వారు (విష్ణుచిత్తుడు), గోవిందుడు, కేశవుడు, పాండ్యరాజు, నంబి, రంగనాయకి, అర్చకుడు - కొందరు స్త్రీలు.

శ్రీకృష్ణదేవరాయలు రచించిన ఆముక్తమాల్యద యందలి గోదాదేవి శ్రీరంగేశుల వివాహ వృత్తాంతము ఈ నాటిక యందలి కథ. ఆండాళ్లు శ్రీరంగని ప్రేమించుట, శ్రీమన్ననారు అనుమతిచే పెరియాళ్వారు మధురకు పోయి పాండ్య రాజు సభలో ప్రతివాదులను ఖండించి శ్రీమన్నారాయణుడే మోక్ష ప్రదాతయను సిద్ధాంతమును స్థాపించి రాజుచే సన్మానమునందుట, ఆండాళ్లు తాను ధరించిన మాలలు స్వామికి సమర్పించుట, తర్వాత తిరువరంగము నుండి శ్రీరంగేశుని దూతగా అర్చకుడు వచ్చి గోదా శ్రీరంగేశుల వివాహ నిర్ణయమును పెరియాళ్వారుకు విన్నవించుట, ఆండాళ్లు కల్యాణము జరుగుట మున్నగు కథాంశములు కనుల ముందు కదలుచున్నట్లుగా ఈ రూపకమున చిత్రింపబడినవి.

భక్తికి పెరియాళ్వారు, శృంగారమునకు ఆండాళ్లు, హాస్యమునకు గోవింద కేళవులు, అద్భుతమునకు శ్రీరంగేశులు ఆలంబనముకాగా ఈ నాటిక నవనవముగా నడచినది. ఈ నాటిక చివరకు గోదా శ్రీరంగేశుల పరిణయోత్సవమును వర్ణించు -"మరి వనమాలి చూడమున మానిని" "గళమున గట్టెను హారి" అను పద్యములు ఆముక్తమాల్యద ప్రబంధమునుండి గ్రహింపబడి అర్చకుని నోట పలికింపబడినవి. ఆముక్తమాల్యద యందలి "గృహ సమ్మార్జనమో జలాహరణమో" అను సంస్కృత సమాస భూయిష్ఠమైన మత్తేభవృత్తము ఈ నాటికలో —

"కోడి కూతకు మున్న కోనేటిలో దోగి,
వడపెరుంగోయిలాన్ విడిదికేగి,
గుడి నలుమూలలు తుడిచి, కడిగి, అంద
ముగ వన్నెచిన్నెల ముగ్గులల్లి,
తీర్థమ్ము కొనితెచ్చి తిరుమజ్జనమ్ము కా
వించి. కోవెలతోట విరుల, తులసి
దళముల జతచేర్చి దండలు కూరిచి
తిరుకాపుతీరిచి, దివ్వెపెట్టి,
ఇంక తిరునాళ్ల స్వామి ఊరేగు వేళ,
మోసి పల్లకి, వ్యజనమ్ము వేసి, ధ్వజము
వెల్ల గొడుగో తాలిచి, పెరుమాళ్ల కొలుచు
కన్న, దాసునకింక ఏమున్నదయ్య!"

అను చిరుచిరు తెలుగు పలుకుల సీస పద్యముగా రూపుదిద్దుకొన్నది. మూల పద్యమున శ్రీకృష్ణదేవరాయల రాజసస్ఫూర్తి కట్టెదుట మెరసి కనిపించగా ఈ పద్యమున పెరియాళ్వారుల సత్వమూర్తి విరిసి మురిపించుచున్నది. పదప్రయోగమున వైష్ణవ సంప్రదాయము పరిమళించుచున్నది.

ఈ నాటిక యందలి పాటలలో —

"పాదాబ్జముల దివ్యవేదముల గంధమ్ము
నలువ పుట్టిన నాభినలినమున గంధమ్ము
కమల ఉరమున అలదు కస్తూరి గంధమ్ము

కన్న, వలచునోయెమో ? చిన్ని మా అండాళ్లు
సిగదండకోసమై శిరసు వంచెను స్వామి."

అను పాటయు మరియు "కలగంటినే, సఖి, కలగంటినే" అను పాటయు రమ్యాతి రమ్యములు. ఈ నాటిక ఆకాశవాణి హైద్రాబాదు కేంద్రము నుండి ప్రసారితమైనది.

**శర్మిష్ఠ :**

గేయబహుళమైన ఈ నాటిక కూడ శ్రీ దేవులపల్లి వేంకట కృష్ణ శాస్త్రి గారు రచించినదే. ఆకాశవాణి హైద్రాబాదు కేంద్రము నుండి ప్రసారితమైనదే. ఐదురంగములుగల ఈ నాటికయందలి పాత్రలు-హేమంతుడు, దేవయాని, వాసంతి, శర్మిష్ఠ, మాధవి, యయాతి, మంత్రి, భిషగ్వరుడు, గురుదేవుడు, కవి, యువతీ యువకులు, తాత.

యయాతి మహారాజ్ఞియైన దేవయానికి తెలియకుండ శర్మిష్ఠను వసంతోత్సవమున కలసి ప్రేమించుట ఈ నాటికయందలి ఇతివృత్తము. మహాభారతములోని స్వల్పమైన ఈ ఇతివృత్తమును గ్రహించి కవితా సుందరముగా ప్రతీకాత్మకముగా సముచిత పాత్ర కల్పనతో మనోజ్ఞమైన నాటికగా మలచినారు శ్రీకృష్ణశాస్త్రిగారు. ఇందలి హేమంత పాత్ర కల్పనము దేవయాని మానసిక విచారమునకును, యయాతి పలితకేశసంజనన స్థితికిని, అనురాగ వతియైన శర్మిష్ఠా రాగప్రతికూల వాతావరణమునకును సంకేతము. 'కవి' పాత్ర శర్మిష్ఠా యయాతుల సమ్మేళనమునకు, వారి అనురాగసాఫల్యమునకు కారణభూత మైనది. యౌవనమునకును, వార్ధక్యమునకును, ఆశకును, నిరాశకును, రాగమునకును విరాగమునకును ప్రతీకలు యువతీ యువకులు, తాత అను భూమికలు.

ఈ నాటికయందలి పాటలు పద్యములు (తేటగీతులు - సీసములు), హృద్యములు. శర్మిష్ఠ, మాధవి పాడిన "మూసిన తలుపేరో తోసినయట్లు - ప్రాసాదమున కవళ మ్రోసి అలికిడులౌను" అను పాట ప్రశ్నోత్తర రూపమున తీవెలుసాగి పరమ రమణీయముగా ఉన్నది. తాతకును యువతీ యువకులకును నడుమ నడచిన—

"వెదుళ్లవన్నీ వేణువులైతే
కుంజాలన్నీ గొంతుకలైతే

పందిళ్లకు మరి పాకలకు
వాసాలో! రాటాలో!"

అను పాటయు, యయాతి చుట్టు నృత్యము చేయుచు యువతీ యువకులు పాడిన —

"చలిత చలిత మచ్చరణ కటక మం
జీరగళ స్రుత శింజి తమ్మునిను
పిలిచి పిలిచినా. పలుకరించినా
చలియింపద జడశిలయో! నీ యెద!
..............................
లులితలులిత దరహసిత వినిర్గత
లలిత లలిత చంద్రాతపములు, కను
వెలిగి వెలిగినా, తళుక్కుమనినా
పులకరింపదే మొరడో! నీ యెద!"

అను గేయమును సాక్షాత్తు గేయ లక్ష్మియే నాట్యము నేయుచు పాడినట్లున్నది. సుతిమెత్తని పదములలో పొదిగిన మధుర కవితకు ఉదాహృతి ఈ గేయయుగళి. ఈ నాటికయందలి వసంతర్తువర్ణనా గేయములు వస్తువునకు అనుశ్రుతులై, కమనీయ కవితా వీణానిక్వాణములై, రచనాశిల్పమాధురీమహితములై అలరారు చున్నవి.

**యమునా విహారి :**

ఈ శ్రవ్య గేయనాటికయు శ్రీ దేవులపల్లి వారిదే. కార్తికపూర్ణిమనాటి కలికివెన్నెల రాత్రిలో వేణుగానమును విన్న గోపికలు నిలువలేక యముననుచేరి శ్రీకృష్ణునికై అన్వేషించుట, శ్రీకృష్ణుడు పడవ పాటలు పాడుచు వారిని 'తరుణ మురళీ శరన్నిశోత్సవము'లో నానందింప జేయుట ఈ నాటిక యందలి విషయము.

చిన్ని చిన్ని వచన సంభాషణములను తీసివేసినచో ఈ రూపకమంతయు ఒక మధురాతి మధుర బృందగానమే. నాటికాంతమున మురళీనాద మాధురీ మహిమను ప్రకటించు పద్యములున్నవి. ఇవి సీసము, తేటగీతి, ఆటవెలది, శార్దూలము వంటి ఛందములలో నడచినవి.

: "కార్తిక రాత్రుళ్లో —
: ఊఁ!
: కరిమబ్బుంటుందా ?
: ఆఁ
: నీలమేఘమూ కాశము విడిచి నేలనడుస్తుందో
: ఓ!
: నడిచే మబ్బునకూ —
: ఊఁ!
: నవ్వే పెదవుందా !
: ఆ!
: పెదవులందితే పేదవెదుళ్లే అదరి పాడతాయో"

అను పాటయు —

"రెల్లు పూలాపానుపు పైనా
జల్లూజల్లులుగా - ఎవరో
చల్లీనారమ్మా ! వెన్నెల చల్లీనారమ్మా
కరిగేపాలా కడవలపైనా
నురుగూ నురుగులుగా
మరిగేరాధా మనసూపైనా
తరకా తరకలుగా - ఎవరో
పరచీనారమ్మా ! వెన్నెల పరచీనారమ్మా !
కడిమి తోవుల నడిమిబారుల
ఇసుకబైళుల మిసిమిదారుల
రాసీరాసులుగా - ఎవరో
పోసీనారమ్మా ! వెన్నెల పోసీనారమ్మా !"

అను పాటయు జానపదుల పలుకుబళ్ల పరిమళాలను గుబాళించుచు వెన్నెలవలె వేణుగానమువలె అంతరంగముల నాడించును.

ఈ రూపకము ఆకాశవాణి హైద్రాబాదు కేంద్రము నుండి ప్రసార మైనది.

**విశ్వవీణ :**

కవితాసంగీతకళామర్మాదావిదులును గేయనాటికా రచనా ప్రయోగ పారీణులును అయిన శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావుగారు 'విశ్వవీణ' అను ఈ గేయవచనకవితామయరూపకమును రచించినారు. హృద్యమైన ఈ నాటిక 'వేరనే' వారి గేయనాటికల సంపుటి వెలువడినది

"గ్రీసుదేశపు పౌరాణిక గాథలలోని వైణికుడు ఆర్ఫియస్ జీవిత గాథ"ను ఈ రూపకమునందు చిత్రించినారు శ్రీ రజనీకాంతరావుగారు. ఒక సంగీత విద్వాంసుని హృదయమును సంగీతజ్ఞుడు రసాత్మకముగా చిత్రింప గలడనుటకు ఈ నాటిక ఒక అక్షర తార్కాణము. ఈనాటిక యందలి పాత్రలు- కవి, వైణికుడు (ఆర్ఫియస్), సుందరి, సన్యాసి, మృత్యుదేవత, కొన్ని మృత్యు లోకకంఠాలు.

ఆర్ఫియస్ గొప్ప వైణికుడు. అతని వీణావాదనము "శిశిర హేమంతము లలో మోడుల చివురింప" జేయు శక్తి కలిగినట్టిది ఒక మాంత్రికుని దౌష్ట్య కారణమున సర్పదష్టయై మరణించిన సుందరి అను తన భార్యను బ్రతికించు కొనుటకై ఆ వైణికుడు అద్భుతమైన తన వీణాగాన మహిమచే మృత్యులోక మునకేగి, మృత్యు దేవతను ప్రసన్నము చేసికొని, తన సతి పునరుజ్జీవితురాలగు నట్లేగాక తన "వీణారుతి విన్న జగములకు ఏ వంతయు" లేకుండువట్లును ఆ దేవతవలన వరములను పొందును ఇది ఈ నాటికలోని కథ.

ఈ నాటిక యందలి 'కవి'పాత్రయు బృందగానములును కథా గమనము నకు చక్కని చేయూతనిచ్చి సంగీత రూపకమును శక్తిమంతము చేసినవి. మృత్యు లోకమందలి కొన్ని 'గొంతుల' చేత వచన కవితలో వీణాగాన ప్రభావమును చెప్పించుట సముచితముగా నున్నది. గేయరచనా ప్రయోగ వైదుష్యమునకిది ఒక ఉదాహరణము.

ఈ నాటిక యందలి పాటలన్నియును కవితా గాంధర్వ కళా కాంతులను పులుముకొన్నవే. ఉదాహరణమునకు వైణికుడు ఆలపించిన ఈ పాటను గ్రహింపవచ్చును

"నా వీణారుతి మ్రోయగా తోయగా
నీ ధ్యానమే భావమై రాగమై

నీ దారి నా ధ్యేయమై లోకలోకాలు
తిరిగేటి చరణాలగతి తాళమై
ఎత్తెత్తి విన్పింతు నిదె నా హృదయవాణి,
ఏలోకమందుందువో విందువో రాణీ !
నా వీణారుతి మ్రోయగా !
వేలావకాశాల కెదురీతలో
గోళాల భ్రమణాల శ్రుతిమోతలో
తేజఃకలాకాల ఛాయాంధ తమసాల
ఆజానుహస్తాల మెలివేతలో
ఎత్తెత్తి విన్పింతునిదె నా హృదయవాణి,
ఏలోక మందుందువో విందువో రాణీ !
నా వీణారుతి మ్రోయగా !"

ఈ పాట వైణికుని గానావేశముతో పాటు శ్రీ రజనీకాంతరావుగారి కవితావేశమును కూడ కనులముందు నిలుపుచున్నది.

సంగీత కళా స్వరూప స్వభావములను వ్యంగ్యార్థ స్ఫూర్తిలో వ్యవహారక్షుణ్ణములైన లలిత పదములతో సంగీతాత్మకముగా శ్రీ రజనీకాంతరావుగారు తెలుగుదేశమున కర్పించిన అపురూపమైన గేయనాటిక ఈ విశ్వవీణ.

**మహిషాసుర మర్దని :**

గేయ పద్య వచనమయమై ఆరు దృశ్యములుగా పరచుకొన్న ఈ నాటికను రచించినవారు శ్రీ మల్లవరపు విశ్వేశ్వరరావుగారు. ఇది ఆకాశవాణి హైద్రాబాదు కేంద్రమునుండి 1960 లో దేవీనవరాత్రుల సందర్భముగా ప్రసారితమైనది.

ఇది ఒక ప్రసిద్ధ పౌరాణిక గాథ. భూలోక స్వర్లోకములను గెలిచి హుంకరించుచున్న మహిషాసురుని తాము చంపలేమని గ్రహించిన హరిహర బ్రహ్మాదులు తమ తమ శక్తులను ఏకముచేసి, దేవిని ఆవిర్భవింపజేసి ఆమె చేత మహిషుని సంహరింపజేయుట ఈ నాటిక యందలి కథ.

మహిషుడు, ఆతని మంత్రి, దూత, సేనాని, కాందిశీకులు, ఇంద్రుడు, దేవసేనాని, బృహస్పతి, హరి ఇందలి పాత్రలు. సూత్రధారుని వ్యాఖ్యానముతో బృందగానములతో ఈ నాటికయందలి కథ చకచకా సాగినది. మంజరి

ద్విపదలు, తేటగీతులు, కందములు, కందార్థములు, చంపకవృత్తము, దీర్ఘ వచనములు ఈ నాటికలో చోటు చేసికొన్నవి. గేయములలో యక్షగాన ధోరణి తొంగిచూచుచున్నది. రూపకమంతయు రసాత్మకముగా కవితావేశముతో కదను త్రొక్కినది. మహిషాసురుడు సేనానితో తన బల ప్రతాపములను గూర్చి చెప్పుచు పొంగునప్పటి —

"అల యింద్రు డొక జొన్న చొప్ప – నాకు
హరిహరులె ఒక గడ్డికుప్ప
చంద్ర సూర్యులను వాయువరుణులను
ఉలవగుగ్గిళ్లుగా నమిలివేయగలాడ
నేను మహిషుండ – మీకు నేనండ
యుద్ధమ్మునకు వేగ సిద్ధమ్ముకండు
రా కాసిపింఛు"

అను పాట మహిషుని పాశవికతను ప్రత్యక్షము చేయుచునే సహృదయులను హాస్య తరంగితుల నొనర్చును. దేవతలతో యుద్ధము చేయునప్పుడు మహిషుడు వేసిన రంకెలను, చేసిన హుంకారములను ఔచితీ సుందరముగా చిత్రించినారు శ్రీ విశ్వేశ్వరరావుగారు. ఈ నాటికలో ఆయా పాత్రల స్వభావములకు అనుకూలమైన సాభిప్రాయపదప్రయోగము, రసానుకూలమైన ఛందోగతులు విశిష్టముగా కనపడుచున్నవి.

**తపతీ సంవరణము :**

గేయవచన మిశ్రితమైన ఈ నాటిక కూడ శ్రీ మల్లవరపు విశ్వేశ్వరరావు గారిదే. మూడు దృశ్యములుగల ఈ నాటిక ఆకాశవాణి ప్రసారము నుద్దేశించి రచింపబడినదే.

రవి తనయ తపతిని సంవరణుడు వనాంతరమున చూచి మోహించును. ఆమె అదృశ్యయైపోగా ఆమెకొరకు అతడు ఆ వనమునందే సూర్యుని గూర్చి తపస్సు చేయును. తపతి పంపించిన కీర సందేశమునందుకొని సంవరణుడు వసిష్ఠుని సూర్యుని యొద్దకు పంపి, తపతిని తన నగరమునకు ఆహ్వానించి, ఆమెను భార్యగా పొందును. ఇది ఈ నాటికయందలి కథ. వచన బహుళమైన ఈ నాటిక ——

"వనమయూరములతో
కీరశారికలతో
అవయము జలజలమనియిల
ప్రవహించు సెలయేరులతో
వెలసిన ఈ సుందరవన
పరిసరముల పాడియాడి
పొలసితివే సూర్యపుత్రికా"

అనుచు చెలికత్తెలు, వనదర్శన కుతూహలము తరగని తపతిని పిలుచు సన్నివేశముతో మొదలై —

"గతిమరచి భువన పతి
పతిగా వలచికొన్న తపతీ
స్వర్గ లోకనాథు సం
వరణాధిపు ప్రణయ
వరమైన తరణి సందీప్తి
...............
స్వాగతము తపనసుత !
స్వాగతము సంవరణ
రాగ రంజిత హృదయవర్తీ !"

అను తపతిని ఆహ్వానించెడు పుణ్యస్త్రీల స్వాగత గీతముతో ముగియుచున్నది. శ్రీ మల్లవరపు వారి శ్రవణ సుభగములైన శబ్దాలంకారములకు ఈ పంక్తులనే తార్కాణముగా పేర్కొనవచ్చును.

**ప్రమద్వర:**

ఈ నాటికయు శ్రీమల్లవరపు విశ్వేశ్వరరావుగారిదే. మూడు భాగములు గల ఈ నాటిక యందలి పాత్రలు రురుడు, ప్రమద్వర, మదనుడు, యముడు, మహాకాలము.

తాను ప్రేమించిన ప్రమద్వర సర్పదష్టయై చనిపోగా రురుడు మదనుని ప్రార్థించి ఆతడిచ్చిన ప్రేమ పుష్పమును గైకొని, యముని సన్నిధికి పోయి, తన ఆయువున అర్ధభాగమును త్యాగముచేసి, యముని మెప్పించి ప్రేయసిని బ్రతికించుకొనును. సంక్షిప్తముగా ఈ నాటిక యందలి కథ ఇది. మహాభారతము

నందలి కథను హృద్యములైన అన్యథా కల్పనములతో రమణీయమైన నాటికగా రచించినారు శ్రీ మల్లవరపు వారు.

ఈ నాటికలో గేయములంతగా లేవు. ఇతివృత్తము ప్రధానముగా వచనములలో నడచినది రచన గంగాస్రవంతివలె ధారాసుందరముగాసాగినది.

"ప్రమద్వరా! చిరప్రియా! ప్రమద్వరా!
లోకపుతోలి ప్రాభాతపు
భూతల సౌందర్యశిరా! ప్రమద్వరా!
రురుకుమారు నవప్రణయ
తరుణవనీ మందారా! ప్రమద్వ"

వంటి చరణములు ఈ రచయిత నిరర్గళకవితా-ధారకు రేఖామాత్ర నిదర్శనములు.

## ప్రత్యభిజ్ఞ :

గేయవచన సమ్మిశ్రితమైన ఈ నాటికను రచించినవారు శ్రీ సూరంపూడి భాస్కరరావుగారు. ఆరు రంగములు గల ఈ నాటికలో వచనమే అధికము. ఉత్తర, మల్లిక, శ్రీకృష్ణుడు, ద్రౌపది, సుభద్ర, ధర్మరాజు, అర్జునుడు, కుంతి, చక్రపాలుడు, అనుచరులు ఈ రూపకమందలి పాత్రలు.

పద్మవ్యూహమునందు నిహతుడై ఎవరికి గుర్తుపట్టరాని తన పతి అభిమన్యుని ఖండ శిరస్సును ఆ రాత్రియే గుర్తుపట్టి ముద్దుపెట్టుకొని ఉత్తర తన చెలికత్తెయైన మల్లికపై ఒరిగిపోవుట ఈ నాటికయందలి ప్రధానవిషయము.

ఈ నాటికలోని ఆయాసందర్భముల కనుగుణముగా పొదిగిన తొమ్మిది పాటలును బాగుగనున్నవి. వానిలో- ఉత్తర అభిమన్యుని శీర్షమును అందుకొని తుడుచుచు ముద్దుపెట్టుకొనునప్పటి-

"ఇదిగోనె! ఇదిగోనె!
నానాథు శీర్షమ్ము
నా వలపుచెలికాని నవమంగళాకార
మిదిగోనె! ॥
కనలేదచే కురుల నునువంపుసొంపులో

తన ప్రాణసఖియ దిద్దిన నీలికెరటాలు ॥ ఇదిగోనె ॥
తన నిదురలో మూసికొనిన కనురెప్పపై
చిరవాసమున్న ఈ చిరుతరేకలపాళి ! ॥ ఇదిగోనె ॥
ఈ లేత పెదవులంటెండిపోలేదింక
నమిలి నానోట నే నందించి యున్నట్టి
కర్పూర తాంబూల గంధసారస్యమ్ము"

అను పాట కంట నీరొలికించును. ఇందలి సంభాషణలు సంయమనముతో సాగినవి. రేఖా మాత్రముగా నున్న ఇతివృత్తమును గ్రహించి కరుణ రసాత్మకముగా నాటికను మలచిన శ్రీ నూరంపూడి భాస్కరరావుగారి ప్రతిభ ప్రశంసనీయము.

**సౌగంధిక :**

గేయ వచనమయమైన ఈ రూపకమును శ్రీ కొలిపాక మధుసూదనరావు గారు వ్రాసినారు. ద్రౌపది, భీముడు, ఆంజనేయుడు రక్షస్సులు, యక్షకన్యకలు, కుబేరుడు, ధర్మరాజు, మిగిలిన కౌంతేయులు ఇందలి పాత్రలు. కథ ప్రఖ్యాతమైనదే.

గంధమాదన పర్వత సానువులలో విహరించుచున్న ద్రౌపది పాదము లందు సౌగంధిక పుష్పమొకటి పడగా ఆమె పుష్పములు కావలయునని కోరును. భీముడు కుబేరవనమునకు బయలుదేరును. మార్గమధ్యమున ఆంజనేయుని ఆశీస్సును పొంది, భీముడు కుబేరవనమును చేరుకొని, వనరక్షకులతో యుద్ధమునకు సిద్ధమగును. యక్ష కన్యల ద్వార ఈ వార్తను విన్న కుబేరుడు, సంతోషముతో భీమునకు స్వాగతము పలుకును. అంతలో తమ్మునకేమి జరిగినదో అని ధర్మరాజు ద్రౌపదితో సోదరులతో కుబేరుని సన్నిధికే తెంచును. కుబేరుడు ఆనందముతో తన ఆరామము దర్శింపవలసినదిగా ధర్మరాజాదులను కోరి, ద్రౌపదిని కావలసినన్ని సౌగంధికాలను తెంచుకొవమ్మనును. దీనితో ఈ నాటిక పరిసమాప్తమగును.

ఈ రూపకమందలి గేయములన్నియు సందర్భ శుద్ధిని, భావనాసౌందర్య సిద్ధిని సంతరించుకొన్నవి. ఉదాహరణమునకు ఒక్కటి. ద్రౌపది సౌగంధిక పుష్పమును చూపగా భీముడు ప్రమోదముతో పాడిన —

"కమలాలయ కరపద్మము
కదలివచ్చె జవరాలా !
నీ ముఖ పద్మముకొక
నేస్తము లభించె ప్రియురాలా
రమణీ !
రమణీ ... ! అతికమనీయం
తపనీయారుణపద్మం
రమణీయమౌ ప్రకృతి
కేయానేక నయగారం
మన శాశ్వత ప్రణయవన
మ్మునకే ఒక శృంగారం"

అను గేయము సౌగంధికమువలె కమనీయము.

**శైలజ :**

కమనీయకవితాశ్రీఅయిన 'కరుణశ్రీ' శ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రి గారు ఈ 'సంగీతరూపకము'ను రచించినారు. పద్యగేయ వచనమయమైన ఈ నాటిక 22-12-62నాడు ఆకాశవాణి విజయవాడ కేంద్రమునుండి ప్రసారమైనది. ఇందలి కథ కాళిదాసకుమారసంభవము నందలి మొదటి ఏడు సర్గలలోనిదే. పార్వతి జననము మొదలు పార్వతి పరిణయమువరకు ఈ రూపక కథ సాగినది. అక్కడక్కడ కథా కథనము వచనములో గేయములో పద్యములో నిర్వహింప బడినది. పెక్కు చోటులందు మూలమునందలి భావములను తమ రమణీయ శిల్ప ముద్రతో వెలువరించినను, కొన్ని తావులందు స్వీయ ప్రతిభా వైభవముతో వినూత్న కల్పనలు చేసినారు శ్రీ 'కరుణశ్రీ' గారు. ఉదాహరణకు —

"బాల శైలజ కదిసి పాలు త్రాగింది
పూలడోలికల నూయేలలూగింది ॥
కిలకిలా నవ్వింది గిరిరాజపుత్త్రి
జలజలా కురిసాయి సన్నజాజుల్లు ॥
అటునిటూ దోగాడె అచలేంద్రపుత్త్రి
నింగిలో శశిరేఖ తొంగిచూచింది ॥
ఇటు నటూ పారాడె హిమశైలపుత్త్రి

నందనమె నట్టింట నాట్యమాడింది ॥
నడిచింది మెలమెల్ల నగరాజ పుత్రి
పొంగి పులకించింది భూదేవి తనువు"

అను గేయమును గ్రహింపవచ్చును. శైలజ శైశవముతోపాటు ఆమె సౌందర్యమును వ్యంగ్యమూర్తితో వర్ణించిన వైనము రమణీయము.

**మేనక :**

నాటికాకర్తలు శ్రీ టి. రామకృష్ణారెడ్డిగారు. గేయవచన మిశ్రితమై మూడు అంకములుగా పరచుకొన్న ఈ నాటిక యందలి పాత్రలు - మేనక, చంద్రరేఖ, హారిణి, విశ్వామిత్రుడు. మేనకావిశ్వామిత్రులకు శకుంతల ఉదయించి కణ్వుని యొద్ద పెరిగిన ప్రసిద్ధ మహాభారత గాథ ఇది.

ఈ నాటిక యందలి గేయములు సంగీతానుగుణముగా తీవెలు సాగి సాహితీ సౌరభమును వెదజల్లుచున్నవి. మేనకా విశ్వామిత్రుల యుగళగీతము ఇందుకు నిదర్శనము.

విశ్వా : ఎన్నడు కనరాని మిసిమి
వెన్నెల కలదీరేయి

మేనక : సురలోకము నందైనా
ఎరుగనులే ఈ హాయి

విశ్వా : ఏమి వింత ! పొదరిల్లే
ఇంద్ర భవనమనిపించె

మేనక : సుందరాంగ ఈ వనమే
నందనవనమునె మించె

విశ్వా : ఎన్నడు కనరాని

మేనక : సురలోకము

విశ్వా : రమణీ ఈ ద్రాక్షారసమే
అమృతమే మొ అనిపించె

మేనక : పాటల కుసుమములె మా
పారిజాతముల మించె

విశ్వా : ఎన్నడు కనరాని

మేనక : సుగలోకము
విశ్వా: మరులు మల్లెపూలు చేసి
కురులలోన తురుముదునా
మేనక : బ్రతుకును పూజాసుమముగ
పదములపై నిలుపుదునా"

**మేనక :**

మేనకా విశ్వామిత్రుల ఉదంతమునే గ్రహించి కీర్తిశేషులు శ్రీ తల్లావజ్ఝల కృత్తివాస తీర్థులు మూడురంగములుగా గేయవచన మిశ్రితముగా ఈ రూపకమును రచించినారు. శ్రీ కృత్తివాస తీర్థులు శ్రీ తల్లావజ్ఝల శివశంకర స్వామి వారి కుమారులు. వచనబహుళమైన ఈ నాటిక యందలి సంభాషణములు దీర్ఘములై, ప్రౌఢములై రచయిత ప్రతిభా పాండిత్యములను ప్రదర్శించుచున్నవి. మేనక, భ్రమరిక, వాసంతి, కామదేవుడు, వనదేవత, కోయిలపిండు, పుష్పకన్యలు, శారికలు, భ్రమరిగణములు ఈ నాటిక యందలి పాత్రలు.

శృంగార విలాసముతో నాట్యము సేయుచు పుష్పాంజలులను చల్లిన మేనక ధ్యాన ముద్రలో దీపశిఖవలె నున్న విశ్వామిత్రుని తపమును భంగపరచి వలపించలేకపోవును. అపుడు మేనకాది అప్సరసలు మదనుని ప్రార్థింతురు. అతడు ప్రత్యక్షమై వారికి అభయమొసగి తన మహిమను వినియోగించును. అంత విశ్వామిత్రుడు కనులుదెరచి మేనకాదులను వీక్షించును. తరువాత విశ్వామిత్రుడు మేనకయందు శకుంతలను కని, కరుణమాలి వారిని విడిచి తపస్సునకై వెడలిపోవును. మేనక మాతృహృదయము కరగి గంగవలె ప్రవహించగా పసిపాపను ముద్దిడుకొని విలపించును. అంత వనదేవత ప్రత్యక్షమై ఆమెను ఓదార్చును. చివరకు మేనక కన్నీరు మున్నీరుగా విలపించుచు శకుంతలను వనదేవతకు అప్పగించి విధిలేక విడువలేక విడువలేక విడిచి పోవును. ఇది ఈ నాటిక యందలి కథాక్రమము.

ఈ నాటిక యందలి కామదేవ - వనదేవతా - పుష్ప కన్యల పాత్ర కల్పనము ఔచితీ భాసురమై, కథాగమనానుకూలమై, నాటికా సౌందర్య కారణమై నాటికాకర్త గేయనాటికా రచనా ప్రతిభను చాటుచున్నది. మేనక దుఃఖమును కరుణరసోదాత్తముగా చిత్రించినారు శ్రీ కృత్తివాస తీర్థులు

గారు. వీరు సృష్టించిన మేనక కేవలము సోయగము లొలికించు సుందరి కాదు. వైదుష్యము నలవరచుకొన్న అమరసుందరి. ఈ నాటికలోని —

"రమణీఘన వక్షోజసానువుల
తరుణీజన తాపానలకీలల
అమరీ కపోలదర్పణముల
భ్రమరీగళ తంత్రీ నిక్వణముల
కోకిల కలకల కాంచీఘోషల
నిర్ఝరిణీమంజీర రావముల
సికతాజఘనదుకూలాంచలముల
నాట్యము చేసెద నాహాహా"

అను పాట సరస సంస్కృత సమాస సుందరమై మదనుని మహిమను వ్యక్తము చేయగా —

"చిన్న నిద్దురపోవె - పొన్న నిద్దురపోవె
చెదరి నీ ముంగురల్ నుదుటిపై వ్రాలగా
కమల పత్రాలతో వీవనల్ వీతుమే
బంగారు నాతల్లి ! రతనాల నా పావ !
నిదురపోవే కన్న ! చిన్నరి పొన్నారి !"

అను శారికలగానము చిన్నారి పొన్నారి తెలుగు పలుకుల వన్నెచిన్నెలను. తల్లి ఎదలోని చల్లదనమును వెదజల్లు చున్నది.

**రాసలీల :**

శ్రీ కృత్తివాస తీర్థుల మరొక గేయనాటిక రాసలీల. నాలుగు రంగములుగా సాగిన ఈ నాటిక గేయవచన మిశ్రితము.

మురళీగానమును విన్న గోపికలు ఇళ్లను, వల్లభులను, పిల్లలను వదలి పోయి శ్రీకృష్ణుని చేరి ఉపనిషన్మురళీ సుధలననుభవించుచు రాసక్రీడానందమున తన్మయులగుట ఈ నాటిక యందలి వృత్తాంతము. 'స్వరమేళ'ను ఇందు ప్రయోగించి తమ తండ్రి అడుగుజాడలలో నడిచినారు, శ్రీ కృత్తివాస తీర్థులు.

సంస్కృత ఉపరూపకములలో రాసకము ఒకటి. ఈ రాసలీల ఆ ఉపరూపక విశేషమును జ్ఞప్తికి తెచ్చుచున్నది.

# (పద్యగేయ నాటికలు)

**గురుశిష్యులు :**

మహాభారతాంతర్గతమైన ఇతివృత్తముతో వెలువడిన ప్రథమ పద్యగేయ నాటిక 'గురుశిష్యులు'. ఈనాటికను రచించినవారు ప్రప్రథమ గేయనాటికా కర్తలు శ్రీ తల్లావజ్ఝల శివశంకరస్వామిగారు రెండు రంగములున్న ఈ చిన్న నాటికయందలి కథ మహాభారతమునందలి అనుశాసనిక పర్వములోనిది. కంద ములతో ఆటవెలదులతో ముత్యాలసరములతో నడచిన ఈ నాటిక యందలి పాత్రలు - దేవశర్మ, విపులుడు, రుచిదేవి, ఇంద్రుడు.

దేవశర్మయను ముని యాగార్థము బయలుదేరుచు తన భార్యయగు రుచిదేవిని కాముకుడైన ఇంద్రుని ఇంద్రజాలమునుండి జాగరూకతతో రక్షింప వలసినదిగా శిష్యుడైన విపులు నాజ్ఞాపించి వెడలిపోవుటయు, ఇంద్రుని రాకను పసికట్టిన విపులుడు యోగశక్తిచేత రుచిదేవిలో ప్రవేశించి ఇంద్రునికి బుద్ధిచెప్పి పంపివేసి గుర్వాజ్ఞను నిర్వర్తించుట ఈ నాటిక యందలి ప్రధాన కథాంశములు

పంచచూడా నారదోపాఖ్యానము ద్వారమునను ఇంద్రపాత్ర మూలము నను శ్రీ శివశంకరస్వామివారు నాటకీయతను చక్కగా పోషించినారు. ఇంద్రుడు రుచిదేవిని సమీపించి ఆమెను పొగడుచు పలికిన సందర్భమునందలి —

"స్వర్గధామమునందె కాదో
సరసిజేక్షణ, ఉండనేర్చునె
నీ నఖాగ్రమునోలు సుందరి నిఖిలలోకములన్
అఖిల సౌందర్యైక దేవత
అబ్జజుండు సృజించి ప్రజ్ఞను
మునికులమ్మున ద్రోసి చివరకు మూఢుడై పోయెన్"

అను పంక్తులలో శ్రీ స్వామివారి కవితామౌక్తికాలు కాంతులీనుచున్నవి. ఈ నాటికలోని మొదటి రంగము కందములతో ఆటవెలదులతో సాగినది. రెండవ రంగములో 'ముత్యాలసరాలు' ఆటవెలదులతో జతకూడినవి. అందుచేత గేయత్వము రెండవరంగమునందే తొంగిచూచుచున్నది ఒక పాత్రకు ఒక రకమైన ఛందము ప్రయుక్తమగుట ఈ నాటికయందు గమనింపదగిన రచనా శిల్ప విశేషము

**భాగవతావతరణము :**

మహాభాగవతగతమైన ఇతివృత్తము కలిగిన ప్రథమ పద్యగేయనాటిక భాగవతావతరణము రూపకకర్తలు ప్రసిద్ధ సాహిత్యవేత్తలు కవిసమ్రాట్ శ్రీ నోరినరసింహశాస్త్రిగారు. మహాభాగవతారంభమందలి కథను గ్రహించి శ్రీ శాస్త్రిగారు భక్తిరసాత్మకముగను పారమార్థిక జ్ఞాన సంవాసితముగను ఈ నాటికను తీర్చిదిద్దినారు. శ్రీ వేదవ్యాసులు పైలుడు వైశంపాయనుడు, జైమిని, సుమంతుడు, రోమహర్షణుడు, నారదుడు, శ్రీశుకుడు ఈ నాటిక యందలి పాత్రలు.

అష్టాదశ పురాణములను మహాభారతేతిహాసమును రచించినను మనశ్శాంతిని పొందలేని వ్యాసమహర్షికి నారదుడు కృష్ణ స్తుతిపరమైన మహాభాగవతమును రచించి ప్రశాంతచిత్తతను వడయుమని ఉపదేశించిన ఘట్టము మహాభాగవతారంభమునందున్నది. ఈ ఘట్టమునకు గేయరూపకమర్యాదలను సవదరించుటలో సఫలీకృతులైనారు శ్రీ నరసింహశాస్త్రిగారు.

"గంగా ప్రవాహ విమలాభంగుర ధారాళమగుచు" శ్రీ నరసింహశాస్త్రి గారి 'వాక్స్రోతస్సు' ఉప్పొంగినది ఈ నాటికలో

"ఘోరారణ్యమువోలె దుర్గమమునై కోలాహలంబట్టుల
ర్థారూఢ స్వరవాక్యహీనమయి పారావారసంకాశదు
ష్పారంబౌ శ్రుతినుద్ధరించి వరుసన్ భాగించి శాసింపగా
ప్రారంభించిననాడు చిత్తమిటు విభ్రాంతంబుగాదే ప్రభూ"

అను పద్యము వ్యాసుని ప్రతిభావైదుష్యములను, చెప్పనలవికాని అతని చిత్త విభ్రాంతిని, అనూహ్యమైన ఆర్తిని చక్కగా వ్యక్తము సేయుచున్నది

"క్షుబ్ధంబైన మదంతరంగమున సంక్షోభించెవేభంగి వి
స్రబ్ధంబై ప్రతిశబ్దమీనెడిని శిష్యవ్రాతమందల్ల సం
రబ్ధంబైన వివాదఘోషణమునన్"

అను పంక్తులు భావి కథా సూచకములై వ్యాసుని అశాంతి ప్రభావమును, శిష్యుల విద్వత్కలహకారణమును వ్యాఖ్యానించుచున్నవి. ఇట్లు వ్రాయుట శిల్పవేత్తలైన మహాకవుల లక్షణము.

ఈ నాటిక యందలి శిష్యుల సంభాషణలు సంక్షిప్తములై నాటకీయతా పుష్టికి దోహదము చేసినవి. ఒకొక్క పాత్రకు ఒకొక్క ఛందమును ప్రయోగించి తమ రచనా శిల్ప విశేషమును ప్రదర్శించినారు శ్రీ శాస్త్రిగారు. శార్దూల - ఉత్పల-మత్తకోకిల - ఉత్సాహ - ఆటవెలది-తేటగీతి పద్యములతోను, ముత్యాల సరాలు మున్నగు గేయములతోను నడచిన ఈ నాటిక యందలి జైమిని, రోమహర్షణ, నారద, శుకయోగి పాత్రల వలన గేయత్వము వికసించి పరిమళించినది. శ్రీశుకుని ప్రవేశముతో ఈ నాటిక బృందగాన నృత్యవేదిక అయినది. ఈ నాటిక చివరలో శ్రీరామావతారస్తుతి సందర్భమునందు శ్రీశుకయోగి పాత్రముఖతః —

"సేతుబంధమున చెండి దశాస్యుని
సీతం దెచ్చిన శ్రీరామప్రభు
పూరుషులకు బహుమోహనరూపుని
నోరినృసింహుని నోమువేలుపుని"

అని తమ పేరను పలికించినారు శ్రీ నోరివారు. తెలుగు భక్తి సాహిత్యమునందును నాటకసాహిత్యమునందును కృతికర్తల పేరు పైన పేర్కొన్న విధముగా నుండుట సంప్రదాయ సిద్ధమే. శ్రీ శాస్త్రిగారి భక్తి భావమునకు సంప్రదాయజ్ఞతకు ఇదొక తార్కాణము.

**దేవయాని :**

మహాభారతమందలి ప్రసిద్ధమైన గాథను గ్రహించి కళాప్రపూర్ణ శ్రీ బోయిభీమన్నగారు ఈ నాటికను రచించినారు. దేవయాని, కచుడు, శుక్రాచార్యుడు ఈ నాటికయందలి పాత్రలు.

బృహస్పతి కుమారుడైన కచుడు రాక్షసగురువైన శుక్రాచార్యుల యొద్ద మృత సంజీవని విద్యను నేర్చుకొని శుక్రాచార్యుల కూతురు దేవయాని తన పట్ల చూపిన ప్రణయమును సవినయముగా సోదరభావముతో కాదని స్వర్గలోకమునకు తిరిగిపోగా దేవయాని మూర్ఛిల్లుట ఈ నాటికలోని కథ.

ఈ నాటిక చిన్నదైనను ఇందలి వర్ణన, పాత్రచిత్రణ ప్రశంసాపాత్రము. శుక్రాచార్యుల ఆశ్రమములోనికి దిగివచ్చుచున్న కచుని దేవయాని చూచి —

"బారెడు పై కేగినట్టి
భాస్కరు డది ఇద్దరయ్యె
జాముప్రొద్దు పగటితీగ
జంటపూలు పూచెనేడు"

అని అతనిని వర్ణించును. అతనికి హృదయము నిచ్చును. చివరకు కచుడు ఆమె ప్రణయమును నిరాకరించి స్వర్గమునకు పోవునపుడు దేవయాని —

"ఇర్వురై ఆనాడు
ఇనుడుర్వికుదయించి
ఒక్కడై ఈనాడు
ఉపరితలమంటె
అరుణోదయము నాడు
ఆత్మనే వెలిగించి
ఆర్పిపోయెను నేడు
ఆశలను కూడ"

అని చింతించును. ఇట్లు మొదట చేసిన వర్ణనను అంతసూత్రము మరచి పోకుండ చివరివరకు నిర్వహించుట ఔచితీమర్యాదావిదులైన శ్రీ భీమన్నవంటి మహాకవుల లక్షణము. దేవయానిని వర్ణించు —

"దేవలోక కాంతియెల్ల
త్రోవచూప వచ్చినదో
సంజీవని విద్యె ఇట్లు
స్వాగత మీ నిల్చినదో"

అను పంక్తులు వస్తుధ్వని గర్భితములై కచుని ఆగమన కారణమును సూచించును. నాటకాంశమునగల కచదేవయానుల సంభాషణవలన నాటకీయతాలత చిగిర్చి పూలు పూచినది. దేవయాని పాత్ర సహృదయుల సానుభూతిని చూరగొనునట్లు చక్కగా చిత్రింపబడినది ఈ నాటికలో.

"బ్రతుకగా లేను నీ యెడబాటులోన
ప్రేమకై మరణించు నదృష్టమేని

లేదు నాకు సంజీవని లీల జేసి
పరుషకమ్మృతమ్ము నాకు చావయ్యె నౌర"

అను పద్యము కరుణరసాత్మకము నాటికాద్యంతములందు గేయములు నిలువగా మధ్య కందములు, తేటగీతులు, ఆటవెలదులు చోటు చేసికొన్నవి. పద్యగేయాత్మకమైన ఈ నాటికలో గేయాంశము స్వల్పము.

**రాసలీల :**

శ్రీకృష్ణకర్ణామృతము, బమ్మెరపోతనామాత్యుని భాగవతము ఆధారముగా 'రాసలీల' నాటికను రచించినవారు ప్రసిద్ధ గేయనాటికాకర్తలు శ్రీబాలాంత్రపు రజనీకాంతరావుగారు. సరమ, సురస, రాధ. కృష్ణుడు మరి కొందరు గోపగోపకులు ఇందలి పాత్రలు.

సంధ్యా సమయమున వేణుగానలోలురై అన్నింటిని విడిచి, మరచి, యమునా తీరమును చేరిన సరమ, సురస, రాధ మున్నగువారు తమను వలుకో వలసినదిగా శ్రీకృష్ణుని ప్రార్థించుట, శ్రీకృష్ణుడు వారితో దాగుడుమూత లాడుట, చిట్టచివరకు ఆ రమణులు అతని చుట్టుచేరి రాసలీలలో ఓలలాడుట ఈ నాటికయందలి రసమయసన్నివేశములు.

ఈ రూపకమందలి పద్యములన్నియు భాగవతమునందలి దశమ స్కంధము లోనివే. సందర్భానుగుణముగా వానిని ఈ రూపకహారమున పొదిగినారు శ్రీ రజనీకాంతరావుగారు. పద్యములకు పద్యములకు మధ్య తీయని బృందగీతులను ప్రయోగించినారు శ్రీ రజని. ఇవి అంగనకు అంగనకు నడుమ శృంగార మాధవునివలె స్ఫురించును.

ఈ నాటికలోని గేయములు అంత్య ప్రాసల అందాలను, రమ్యభావ సుగంధాలను ప్రసరించుచు, శృంగారరసమరందమును చిలికించుచున్నవి. దాగుడుమూతల సందర్భమునందు శ్రీకృష్ణునకు సరమసురసాదిగోపికలకు మధ్య నడచిన గేయములోని ——

"కృష్ణుడు : చిక్కిందే ఎవరిచేయి ?
సరమ : కాదోయి కలువకాడోయి
కృష్ణుడు : ఈ పరిమళము రాధ తలది
సురస : కాదోయి మాలతీలతది

కృష్ణుడు : నడచునా మాలతీలతలు ?
సరమ : నీ స్పర్శకేదైన కదలు
కృష్ణుడు : ఇదిగిదిగో దొరకె రాధా
గోపికలు : తనయంత తనె కోరికాదా
మాధవు కరయుగ బంధముకోరి
రాధ దొంగాయెకాదా"

అను కొన్ని చరణములు అందుకు ఉదాహరణములు.

**స్వైరిణి అవ్వారు వమ్న :**

ఈ నాటిక కూడ శ్రీ రజనీకాంతరావుగారిదే. పానుగంటి లక్ష్మీనరసింహారావుగారి ప్రసిద్ధ నాటకము 'రాధాకృష్ణ'ను దృష్టి యందుంచుకొని ఈ రూపకమును రచించినట్లు నాటికాకర్తలు నాటికారంభమున ఉటంకించిన పానుగంటివారి "తనువు గృహంబునందు" అను పద్యమును బట్టియు తెలియుచున్నది. వ్రజబృందము, రాధ, కృష్ణుడు ఈ నాటికయందలి పాత్రలు. రాధాకృష్ణుల అన్యోన్యానురాగమును చిత్రించు నాటిక ఇది.

కృష్ణుని పిలుపునందుకొని రాధ 'ప్రణయకుంజధామము' వైపు పరుగెత్తుచు వచ్చుచుండగా వ్రజభామినులు ఈసున గేలిసేయుదురు. అయినను వానిని లక్ష్యము సేయక రాధ శ్రీకృష్ణుని సన్నిధికిచేరి గోపికలు తనను 'స్వైరిణి' అని పరిహాసించినారని అతనితో చెప్పును శ్రీకృష్ణుడామెను దరిజేర్చుకొని-

"ఎవ్వరహమ్మ్మతో నెన్నడు క్రొవ్వి
యుందురో వారిలో నుండదు ప్రేమ !
నవ్వితేనవ్వని, నొవ్వకుమెదను
నీ ప్రేమవడిముందు నిలుతురే వారు"

అని ఓదార్చి ఆమెతో ప్రణయరసానందమున తేలియాడును.

ఈ నాటికయందు శ్రీ రజనిగారు రాధాకృష్ణులను గీతికానాద స్వరూపులుగా, లక్ష్మీనారాయణులుగా, నిభృతశంపా నీలమేఘములుగా, ఆదిప్రకృతి ఆదిపురుషులుగా అభివర్ణించినారు. కందములతో, మంజరీ ద్విపదలతో సాగిన ఈ నాటిక యందలి పాటలతీవెలు 'పల్లవి'తో పల్లవించి చరణములతో మొగ్గలు

దొడిగి రాగతాళ నిర్దేశములతో ప్రఫుల్లమై పరిమళాలను ప్రసరించుచున్నవి. రాగతాళ సూచనము శ్రీ రజనిగారి సంగీత వైదుష్యమునకు తార్కాణము.

"మనసౌనే ఓ రాధా!
మురళవేణువూద" అను పాట యందలి

"ప్రతినయనద్వయి నాపయి
ప్రణయామృత ధార కురియ
ప్రతియెడంద నవవిద్యు
ల్లతయై నా హృదయ మొరయ
ప్రతివనమ్ము ప్రతి కుంజము
ప్రతిలయాన్వితమై విరియ
ప్రతిస్వరమ్ము ప్రతిమూర్ఛన
ప్రణవమంత్ర మౌచు మొరయు"

అను చరణములు హృదయాలను భావరాగ శిఖరములకెత్తుకొని పోవును

**శునశ్శేపుడు :**

నాటికాకర్తలు శ్రీ సూరంపూడి భాస్కరరావుగారు. మూడు భాగములున్న ఈ నాటిక ఆకాశవాణి మదరాసు, హైదరాబాదు, కేంద్రముల నుండి ప్రసారితము. ఈ పౌరాణిక నాటిక యందలి పాత్రలు - బ్రాహ్మణులు, అంబరీషుడు, వసిష్ఠుడు, మునిపత్ని, అజీగర్తుడు, శునశ్శేపుడు, విశ్వామిత్రుడు, ఇంద్రుడు.

దుర్భర దారిద్ర్యబాధావిముక్తికై తన తండ్రి అజీగర్తునిచే, పుత్ర సంతానార్థమై నరబలిని నిర్వర్తింపబోవు అంబరీష ప్రభువునకు అమ్మబడిన శునశ్శేపుడను విప్రకుమారుడు, విశ్వామిత్రుని శరణమును పొంది, ఆ మహర్షి ఉపదేశించిన ఇంద్రదేవతాకమైన మంత్ర ప్రభావముచేత ఇంద్రుని ప్రసన్నము చేసికొని బంధవిముక్తుడగుటయు. ఇంద్రుడాతనిని విశ్వామిత్ర పుత్రుడై వర్ధిల్లు నట్లు దీవించుటయు ఈ నాటికయందలి ప్రధాన కథాంశములు.

ఈ రూపకమందు నాటకీయత అడుగడుగున ఉట్టిపడుచున్నది. సంభాషణ ములు పద్యగేయాత్మ ములై సంక్షిప్తతను సంతరించుకొన్నవి. ముత్యాల సరాలు మున్నగు గేయములతో మత్తేభ, కంద, తేటగీతులతో సాగు ఈ రూపకమునందు తేటగీతులు అధికము.

కరుణ రసాత్మకమైన ఈ నాటికయందలి పాత్రల మనస్థితి చిత్రణము ప్రశంసనీయము

"ఓ రాజ రాక్షసాకార పాపిష్ఠక చాలు
నా కన్నుల స్మృతికి నర్పింప జాల"

అను మునిపత్ని మాటలు మాతృహృదయమును కనుల ముందు నిలుపుచున్నవి.

"పుత్రాప్తికై యాత్ర మొకవైపు కలిగించు
బ్రహ్మహత్యాపాపభర మను లోలికించు
ఆశతోనొకవైపు, ననుకంప నొకవైపు
దహింయిచునాకు స్వాస్థ్యముగల్గదేమొ" అనుచరణములు

అంబరీషుని అస్వాస్థ్యమనస్థితికి పట్టిన అద్దము.

"యజ్ఞమా ? ఇదియేటి
యజ్ఞమో హింసా ప్ర
చండకాండయెగాక
యజ్ఞమా ?
.....................
యజ్ఞమో గ్జ్ఞమో
అడుగు కదపనునేను"

అను శునశ్శేపుని మాటలు, అతిసహజ నైశిత్యముతో దూసికొనివచ్చి అక్రమమును ఖండించిన ఈటెలు.

ఈ నాటికయందలి ఇంద్రావరుణ దేవతాకములైన మంత్ర చరణములు, వాని అనువాద పంక్తులు సందర్భోచితములై రూపకదివ్య వాతవరణ కల్పనకు దోహదముచేసినవి. నాటికను కరుణ రసాత్మకముగా చిత్రించుటలో శ్రీ సూరంపూడి భాస్కరరావుగారు కృతకృత్యులైనారు.

**గీతగోవిందం :**

శ్రీ లంకా సూర్యనారాయణరావు ('లసూనా') గారి నాటిక ఇది. ఇందలి పాత్రలు – బృందావని, గోపికలు, రాధ, గోవిందుడు.

వేణుగానమును విని మరులుగొని, బృందావనికిచని, గోవిందుని గని గోపికలు తమ వలపును తెలుపుకొనుట - గోవిందుడు రాధను కానక పరితపించుట - రాధ ప్రణయకోపమూనుట - గోవిందు డామె నోదార్చి ప్రణయమున దేల్చుట ఈ నాటికయందలి అంశములు.

తేటగీతులున్న ఈ నాటికయందలి పాటలు నృత్యాత్మకములు.

"చాలు చాలు దొంగ
సరసాలు మానరా
మంచి మాటలనింక
వంచింపలేవురా"

అను పాట రాధ ప్రణయకోపమును చక్కగా చిత్రింపగా, నాటికాంతమున-

"నేను పురుషుడ రాధిక! నీవె ప్రకృతి
ధరణియెల్లను ప్రణయ బృందావనమ్మ
ఆస లలమిన లీలలు రాసలీల
లరయప్రణయము ప్రణవము లవియసుమ్మ"

అను తేటగీతి రాధాకృష్ణుల ప్రణయ తత్త్వమును తేటతెల్లమొనర్చుచున్నది.

**జ్యోత్స్నాభిసారిక :**

విద్వత్కవులు డా॥ నండూరి రామకృష్ణమాచార్యగారు రచించిన నృత్యగేయనాటిక జ్యోత్స్నాభిసారిక. ఇందలి పాత్రలు- రాధ, రాగిణి, శ్రీకృష్ణుడు. మధురభక్తి ప్రతిపాదకమైన ఈ నాటికయందలి విషయము రాధారాగిణులు శ్రీకృష్ణుని ప్రణయచంద్రికాకిరణాలను స్పృశించుట.

విరహిణియైన రాధిక జ్యోత్స్నాభిసారికయైన రాగిణి బృందావనమున కలసికొని, పిల్లనగ్రోవి, పిల్లతెమ్మెరలు ఉల్లములో ఉప్పెనలు లేపగా ఒడలు తెలియక పరుగెత్తుకొని వచ్చినట్లు పరస్పరము తెలుపుకొనుచున్నంతలో వారికి మురళీగానము వినిపించును. వేదనను కల్గించు వేణువు నూదకుమని రాధయు, వాల్లభ్యసుఖము కావలెనని రాగిణియు శ్రీకృష్ణుని ప్రార్థింతురు. శ్రీకృష్ణుడు మెల్లగా వచ్చి రాగిణి కన్నులు మూసి, రాధను ముద్దుపెట్టుకొని వెడలిపోవును. శ్రీకృష్ణుని శృంగారకర స్పర్శకు రాగిణి పులకితయై తాను ధన్యురాలైనట్లు

అనుభూతి చెందును. రాధ శ్రీకృష్ణుని చిలిపి చేతలలోని రహస్యమును గ్రహించినను రాగిణికి చెప్పదు. ఇరువురు వెడలిపోవుదురు.

శృంగార రస రంజితమైన ఈ నాటికయందు రాగిణిని ముగ్ధగా రాధికను ప్రౌఢగా వ్యంగ్యవైభవముతో చిత్రించినారు శ్రీ రామకృష్ణమాచార్యగారు. "చవి యెరుగని దానను రా - రుచిమరగని దానను రా" "తలుపు తట్టని పిలుపు - పెదవి వదలని తలపు - మలపుతిరుగని వలపు - మొగ్గకన్నెకు సిగ్గుగోలుపు" అను చరణములు రాగిణీ ముగ్ధాత్వ సూచకములు. ఇక ప్రౌఢ అయిన రాధ - "మంజు మంజుల మధుర మంజీరమణి నూపురకింకిణీ రవరాగ రంజిత రాధికా మృదు చరణచారణ చక్రవర్తీ" అని శ్రీకృష్ణుని సంబోధింపగలిగినది. 'శృంగార రస రాణ్మణి' యైన శ్రీకృష్ణుడు అందుకే రాగిణికి కరస్పర్శను, రాధకు చుంబన మును అందించినాడు. కవితా ప్రౌఢులయిన శ్రీ రామకృష్ణమాచార్యగారు ఈ విషయమును — "మురిసిపోవుచును టివో ముద్దరాల! ఎందుకై కనుల్ మూసెనో ఎరుగగలవె? ఏల పిందెతో పండువాదింప వలయు?" అను పద్యములో సూక్తి సుందరముగా వ్యాఖ్యానించినారు.

ఈ నాటికలో శ్రీకృష్ణుడు భాషింపక అభినయమును మాత్రమే ప్రదర్శించును. ఇది ఇందు విశేషము. రసరమ్యములైన ఇందలి గేయములు నృత్య కళానుగుణముగా రూపుదిద్దుకొన్నవి.

"తలపు పాలకడలి చిలికి
వలపు వెన్న ముద్ద చేసి
నిండుగుండె వెండికుండ
కోరికోరి కూర్చినాను
ఆరగింపరార చేరి
కోడెవయసు సొగసుకాడ"

అను చరణములు శ్రీ నండూరి వారి మధుర కవితాస్ఫూర్తికి ఉదాహరణములు. "తెల్లని చీరగట్టి వెలదీ! జడమల్లె చెండు వెట్టి" అను పద్యము జ్యోత్స్నాభి సారికా లక్షణ సంభావితమై ఈ కవీంద్రుని సాహిత్యశాస్త్రపరిజ్ఞానమును ప్రదర్శించుచున్నది.

ఈ రూపకమందలి మరొక ప్రత్యేకత పద్యములకు గేయములకు రాగ తాళములను నిర్దేశించుట. సంగీత సాహిత్యనృత్యములు సరసముగా సమ్మేళనము పొందిన నాటిక ఈ జ్యోత్స్నాభిసారిక.

**గోదావరి :**

ఈ నాటిక కూడ డా॥ నండూరి రామకృష్ణమాచార్యగారిదే. గోదావరి పుట్టుకను తెలుపు పౌరాణికగాథయే ఈ రూపకమందలి విషయము. సూత్రధారి, నందీశ్వరుడు, నటరాజు, గౌతమర్షి సముద్రుడు, గోదావరి ఈ రూపక మందలి భూమికలు.

గౌతమర్షి తపస్సునకు మెచ్చి నటరాజు అతనిని వరము కోరుకొమ్మనగా ఆ ఋషి "భవ్యగంగా విమలాంబుబిందువులు కమ్మని నీ జడవీడి వచ్చి గోదావరి యాచు దక్షిణపథంబు సుఖితము చేయుగాత" అని వేడుకొనును. వెంటనే నటరాజు అనుగ్రహముచే గోదావరి 'కన్యాసుందరి' ఉదయించును. ఆ కన్నెకు తగిన వరుని ఎన్నికచేసి తెత్తునని గౌతమర్షి పశ్చిమ దిక్కువైపుగా విహరింప వలదని కూతురుకు చెప్పి, గీటుగీచి దాటకుమని హెచ్చరించిపోవును. తరువాత సముద్రుడు వచ్చి ఆమెను ప్రేమించి, పొంగించి తనతో రమ్మని పిలుచును. గోదావరి మరచి, గీటుదాటి పోవును. అంత 'కన్నెగోదారి విలువెల్ల' కరగి ఏరుగామారి పారసాగును. సముద్రుడు వెడలిపోవును. గోదావరి ఉదయగిరి ప్రాంతముచేరి, కుంభవృష్టిలో పొంగులుదేరి, తప్త, హృదయముతో సప్తర్షులకు మ్రొక్కును. కన్నీరు పెట్టుచు గౌతమర్షి పాదములు కడిగివేయును. కరుణార్ద్రు డైన గౌతమర్షి, గోదావరి గుణసముద్రుని వరించినందుకు సంతసించి, ఆమెను ఉదయాద్రిదరులు దాటి సముద్రుని చేరుకొమ్మనియు, అతడు లాలించి ఏలుకొన గలడనియు ఆశీర్వదించును.

ఈ 'నృత్యనాటిక' యందలి పద్యములకు గేయములకు రాగతాళములను నిర్దేశించినారు డా॥ నండూరి వారు. ఇందు శివతాండవములను, గోదావరి నృత్యసన్నివేశములను, రాగమాలికలను సూచించి అందుకు అనుగుణముగా సాహిత్యమును సృష్టించినారు. డా॥ నండూరి వారు రచనా శిల్ప రహస్యము నెరిగిన సాహితీస్రష్టలు. ఆలంకారికులు నిర్దేశించిన ఔచితీమర్యాదలను ఆకళించు కొన్న కళాహృదయులు. అందుకే ఈ రూపకమందలి రచన అంతరమ్యముగా సాగినది. అందుకు తార్కాణముగా —

"దరహాసస్ఫుటపాటవ ప్రకట సంధ్యానాట్యమ్మృత్యుంజయే
శ్వరకోటీర జటాకుటీపటుతటీ చంచద్వియద్గాంగ ని
ర్ఘర ఘుంఘుంచటులచ్ఛటార్భటులు విశ్వంబెల్ల మార్మ్రోగె, నీ
చిరదీక్షా తపముల్ ఫలించె నినుమెచ్చెన్ వచ్చె విశ్వేశుడే"

అను పద్యమును పేర్కొనవచ్చును. ఇది నటరాజు తాండవార్భటిని సాక్షాత్కరింపజేయుచున్నదనుటకు సహృదయుల హృదయములే సాక్ష్యములు. ఈ నాటిక యందలి ——

"జయజయ జయజయ జయనటరాజా !
సాయంసంధ్యాపాటలతేజా !
ఆనందామృత రసమయచిత్తా !
తాళలయాన్విత తాండవమత్తా !
జయజయ గంగాశృంగారవతీ
సంగీతాంకిత మంగళజూటా !
జయజయ మీలిత ఘనమహిమాలయ
లయవయనాంకిత లలితలలాటా ॥ జయ ॥
. . . . . . . . . . . . . . . . . . . . . . . .
జయజయఢంకా ఢమరుక సంకుల
నూపుర ఝణఝణ నిక్వణచరణా !
జయజయమామక శరణాగతియుత
నవతా తాండవ కవితా భరణా !"

అను గేయము కవితా సంగీత నృత్యప్రయోగమై రూపకసాహితీ క్షేత్రమును సస్యశ్యామలము సేయుచున్నది.

## (గేయనాటికలు)

**వధూసర :**

పౌరాణికేతివృత్తముగల ప్రప్రథమ గేయైకనాటిక – వధూసర. దీనిని రచించినవారు విద్వత్కవిపండితులు శ్రీ వావిలాల సోమయాజులుగారు. ఇందలి కథ భారతమునందలి ఆదిపర్వములోనిదే. ఐదు భాగములున్న ఈ నాటిక యందలి పాత్రలు – భృగుడు, పులోమ, పులోముడు, అగ్ని, అజాత శిశువు (జాతశిశువు), బ్రహ్మ.

భృగుమహర్షి భాగీరథీనదికి పోయిన సమయమున, ఇంటనున్న గర్భవతి యైన ఆతని భార్య పులోమయే అని అగ్నివలన తెలిసికొని, పులోముడను రాక్షసుడామెను పర్వత ప్రాంతమున కెత్తుకొని పోగా, ఆమె గర్భస్థ శిశువు రాక్షసుని దౌష్ట్యమును కనిపెట్టి వానిని వధించుటకై ఉదయించుటయు, పులోముడు 'ఆదిత్య తేజుడై' న శిశువు తీక్ష్ణతకు భయపడి శైలాగ్రమునుండి దూకి చనిపోవుటయు, కొడుకు మరణించినాడనుకొని పులోమ విలపింపగా అతడు వచ్చుటయు, ఆమె బాష్పధార భాగీరథికి పాయగా ప్రవహించుటయు, అంతలో భృంగుమహర్షి వచ్చి వృత్తాంతమంతయు గ్రహించి క్రుద్ధుడై అగ్నిని సర్వభక్షకుడవు కమ్మని శపించుటయు, బ్రహ్మవచ్చి శుచులలో అత్యంతశుచివై భువనములలో చరించునట్లు అగ్నికి వరమిచ్చి ఆతని మనస్తాపము తగ్గించుటయు, కంటినీరు కాల్వగా మారగా దానికి 'వధూసర' అనియును, భృగుమహర్షి పుత్రునకు చ్యవనుడనియు నామకరణముచేసి బ్రహ్మ అంతర్హితుడగుటయు ఈ నాటిక యందలి కథాంశములు.

ఈ నాటికయందలి సంభాషణములు సరసములు, సంక్షిప్తములు, సరళములు పులోమకు పులోమ రాక్షసులకు మధ్య, పులోమునకు అజాత శిశువునకు మధ్య జరిగిన సంభాషణములు సహజరమణీయములు. పులోమ రాక్షసాగ్ని దేవుల మనస్తత్వ చిత్రణమున శ్రీ సోమయాజులుగారు ప్రదర్శించిన ప్రతిభ అనన్య సాధారణము.

ఈ నాటికయందు మూల కథకు కొన్ని మార్పులు జరిగినవి. ఒకటి - పులోముడు వరాహరూపమున పులోమనెత్తుకొని పర్వెత్తి పోయినట్లు మూలమున ఉండగా, ఇందులో పులోమ రూపముననే ఎత్తుకొని పోయినట్లున్నది. రెండు - సూర్యసహస్రసోపమదుస్సహ తేజుడైన చ్యవనుని (నాటికలో జాత శిశువు) చూచుటచే పులోముడు భస్మసాత్కృతుడైనట్లు మూలమున నుండగా, ఇందులో ఆదిత్యతేజుడైన చ్యవనుని దహనశక్తికి భయపడి పులోముడు శైలాగ్రమునుండి దూకి ఆత్మహత్య చేసికొన్నట్లు చెప్పబడినది. ఈ రెండు మార్పులను నాటకీయతా దృక్పథముతో శ్రీ సోమయాజులుగారు ప్రవేశపెట్టి యుండవచ్చును.

'వధూసర' అను బ్రహ్మచేసిన నామకరణమున ఒక క్రొత్తదనము, ఒక రామణీయకము భాసించుచుండుటచే ఈ నాటికకును ఆ పేరే పెట్టుట

యుక్తముగా ఉన్నది. ఈ నాటికను శ్రవ్యముగాను దృశ్యముగాను ప్రయోగింప వచ్చును.

**సౌగంధిక :**

ఈ నాటిక కూడ శ్రీ వావిలాల సోమయాజులుగారిదే ఇందలి ఇతి వృత్తము భారతములోనిదే. ద్రౌపది, భీముడు, వసంతుడు, మన్మథుడు, గంధర్వులు,షట్పదము,భ్రమరి, మలయమారుతము–ఈనాటికయందలి పాత్రలు.

మహాభారతమునందలి సౌగంధికాపహరణవృత్తాంతమును రేఖా మాత్రముగా గ్రహించి, వసంతఋతుశోభను కవితాత్మకముగా గేయాభినయ రమ్యముగా చిత్రించుచు శ్రీ వావిలాల సోమయాజులుగారు ఈ నాటికను ఆవిష్కరించినారు. ప్రాయికముగా గేయనాటికలో కథ అందియు అందనట్లుం డును. మరొక విధముగా చెప్పవలసినచో కథ అస్థిపంజరము. రక్తమాంసప్రాణ సౌందర్యాదులు గేయాభినయములు. ఈ దృష్టితో 'సౌగంధిక', గేయనాటికకు చక్కని ఉదాహృతి. ఈ నాటికలోని గేయములన్నింటియందును శబ్దార్థములు చెట్టపట్టాలు పట్టుకొని మిక్కిలి హృద్యముగా లాస్యము చేసినవి.

"ఏ అచ్చరవె నీవు పూ వా
ఏవియచ్చర వోసి పూ వా
కిన్నెరప్రణయినివో
గంధర్వగాయనివో
కులుకకే వలచెదవు
పాడకే పాడెదవు"

వంటి చరణములెన్నింటినో ఇందుకు ఉదాహరణములుగా పేర్కొనవచ్చును. ఈ నాటికయందు ––

"బహుభావనా మధుర
భావనాకలిత ది
వ్యామోదపవమాన
చలిత కలకంఠ కుల
కంఠఋతకాకలీ
స్వనమధురగీతికా
కలితుడై"

వంటి దీర్ఘ సమాస సంభరిత గేయములు ప్రసోన్ముఖముగా సాగినవి.

"ఘుసృణకిసలయ
మసృణశోభా
కరబంధంబున
కరగింపనె నిను"

వంటి చరణములు శృంగారరస గంధిలములు. ద్రౌపదీభీముల విహార ఘట్టము సుదీర్ఘమైనను రమణీయ భావమయములైన గేయములు ఆ దైర్ఘ్యమును కప్పి వేయుచున్నవి.

నేపథ్యమున నుండి 'స్వరమేళ' అను బృందగీతులద్వార ఇతివృత్తమునకు ఏకసూత్రత కల్పించు పద్ధతిని అవలంబించిన మువ్వురు గేయనాటికా కర్తలలో శ్రీ సోమయాజులుగా రొకరు.

రమ్యములైన గేయనాటికలలో ఈ 'సౌగంధిక' ఒకటి. ఇది 24-4-1949 నాడు ఆకాశవాణి విజయవాడ కేంద్రమునుండి ప్రసారితము.

**పాము పాట :**

ఈ గేయనాటికను కవిసమ్రాట్ శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు రచించినారు. నాలుగు రంగములున్న ఈ రూపకమందలి పాత్రలు - త్రైలోక్య సుందరి, నాగమ్మ, లక్ష్మమ్మ, ఋషి, కొందరుభక్తులు, గంధర్వులు, రుక్మాంగదుడు.

ఋషి శాపవశమున పామైపుట్టి, తన భార్య పాతివ్రత్య మహిమతో మనుష్యునిగా రూపొంది అఖిలసుఖము లనుభవించిన ఒక గంధర్వుని వృత్తాంతము ఈ నాటికయందలి విషయము. స్వర్లోకమునకూడ ఆ గంధర్వ లిరువురును దంపతులే.

ఈ రూపకమందు శ్రీ విశ్వనాథవారి ఇతివృత్త నిర్వహణము అద్భుతము "చిలవలు పలవలుగా నో - చెలువ నీదు కథ నడచెదు" అని ఒక పాత్రనోట ఈ విషయమును శ్రీ విశ్వనాథవారే చెప్పించినారు. ముందు నాయికయైన త్రైలోక్య సుందరితో ఆమె కథను చెప్పించి, పిదప ఋషివలన గతజన్మ గాథను శ్రవింపించి, తరువాత గంధర్వుడు రాకుమారుడై భార్యవలన తాను గతజన్మ మున చేసిన తప్పిదమునకు పశ్చాత్తప్తుడగుటతో ఋషి ప్రత్యక్షమై ఆశీర్వదించి నట్లు ఇతివృత్తమును నిర్వహించినారు శ్రీ విశ్వనాథవారు. ఒక ఋషి మూల

మున గతజన్మరహస్యమును చెప్పించుటయు, శాపవిమోచనమార్గమును తెలుపుటయు ఈ నాటికలో ఔచిత్యము.

ఈ రూపకమున రమణీయములైన వర్ణనములున్నవి. త్రైలోక్య సుందరిలో పొడసూపిన పెండ్లి ఈడును —

"ఇవురులోపల సన్నయీనె తోచినయట్లు
కవురు నామెయివింతకాంతి తోచినదమ్మ
లేమావి పూచిన లీల నా కనుతుదన్
లేమలారా పిసాళించెనే జిగులతో"

అను చరణములు సుకుమారముగా పరిమళింపజేయుచున్నవి.

"కడుపు తీపంతేనమ్మా !
కడుపు తీపంతేలే
రాయిగాని రప్పగాని
రమణీ కడుపున బుట్టిన
బ్రతుకులోని పరమార్థము పడసిన యట్లేయుండును"

అను మాటలు మాతృత్వమువలె మధురాతిమధురములు. త్రైలోక్యసుందరి బ్రహ్మగుండమునందు పామును ముంచగా అందుండి —

"జలధి మథించిన సమయంబందున
ధన్వంతరి యుదయించిన తెఱగున
......................
వేగుబోక తెలికాంతుల వాగుల
తూరెరేక విరియించిన పొలుపున
తమ్మిపూవు పసిదిమ్మచుట్టునను
క్రమ్మితేనెవలె"

ఆమె పతి ఉదయించి కదలినాడట. త్రైలోక్యసుందరి సౌందర్య సౌశీల్యములు అన్యపాత్రలు ఆమెను సంబోధించిన తీరులో సాభిప్రాయపదప్రయోగ సంవిధానమున వర్ణింపబడినవి. పాము త్రైలోక్య సుందరితో సయ్యాటలాడిన సందర్భమున సుందరి పలికిన మాటలు శ్రీ విశ్వనాథ వారి మనస్తత్వ నిరూపణ శక్తికి పట్టిన మణి దర్పణము.

'పాము పాట' అను పేరులోనే సంగీతమాధురి గుబాళించుచున్నది. త్రిశ్రాదిగతులలో పరుగెత్తిన గేయములేకాక, పల్లవితో పల్లవించిన పాటలును, ద్విపదలును, కీర్తనలును ఈ సంగీత రూపకమూర్తిని సమలంకరించినవి. శ్రవణ మధురములైన తేటతెలుగు పదములలో జాలువారిన గేయఫణితులకు ఈ నాటిక ఆలవాలమై అలరారుచున్నది.

**రాధప్రేమ :**

ఈ నాటికను మహాకవి డా॥ దాశరథిగారు రచించినారు. నాటిక చిన్నగా నున్నను, రాధాకృష్ణుల ప్రణయరూపమునందలి వన్నెచిన్నెలను మిన్నగా వ్యక్తము చేసినది. ఇందలి పాత్రలు రెండే - రాధ, కృష్ణుడు.

భారతీయ సాహిత్యమునందు విశిష్టమైన మధురభక్తికి రాధాకృష్ణుల జంట ప్రతీకప్రాయము. రాధా హృదయ నైర్మల్యమును పరీక్షించి, నిగ్గుదేల్చి, లోకమునకు ఆదర్శప్రేమను భంగ్యంతరముగా ప్రబోధించుట ఈ నాటికలోని ప్రత్యేకత.

"కృష్ణయ్యా! కృష్ణయ్యా!" అను పాట యందలి —

"నా కన్నులలో మిన్నులలో
నడయాడే మొయిలుమొలక
నా లోపలితేనె పలుక
లాలపించు రామచిలుక
ఏ కోనల సాగినావో
ఏ కొమ్మల దాగినావో
ఏ వెన్నెల తిన్నె నుంటివో
ఈ వేణువు నూదుచుంటివో"

అను చరణములు అంత్యప్రాసల అందాలతో క్రియార్థమును ప్రతిపాదించుచు మహాకవి దాశరథి కవితా మాధురి నందించుచున్నవి.

"రమణుల్లారా వీన్నారా! మన
రాధమ్మ వలవుల గాథా
పూలజాలిరాగాల గుండియల
పొంగారు తీయనిబాధా, మన
రాధమ్మవలపుల గాథా

గొల్ల పల్లెలో పల్లవించినది
బృందావనిలో పూలుపూచినది
యమునా నదిపై కమనీయముగా
పరుగుతీసినది పరిమళించినది
రాధమ్మ వలపుల గాథా !"

వంటి పంక్తులు సంగీతసాహిత్యములకు సరసనమ్మేళనము. ఈ నాటిక 28-9-1956 నాడు ఆకాశవాణి హైద్రాబాదు కేంద్రమునుండి ప్రసారితము.

**అడుగో రాములు వస్తున్నారు :**

నాటికాకర్తలు శ్రీ రావూరు వేంకట సత్యనారాయణరావుగారు. శబరిభక్తిని భక్తిరసార్ద్రిముగా చిత్రించిన నాటిక ఇది. ఇందలి పాత్రలు - మతంగుడు, శబరి, శ్రీరాముడు.

శ్రీమద్రామాయణమునందలి కరుణావిలమైన గాథ శబరిది. శ్రీరామ సాక్షాత్కృతికి నిరీక్షించి, ఆతని రాకతో పులకాంకితయై ముగ్ధహృదయముతో ఆతిథ్యమిచ్చి తరించిన భక్తురాలి జీవితగాథను శ్రీరావూరువెంకటసత్యనారాయణ రావుగారు రమణీయమైన గేయనాటికగా రూపొందించినారు.

"చిరుగాలిని నేనై
చేరిపోదు నా స్వామిని
వేడుకొందు నా రాముని
వెలుగుదారము నేనై
వ్రాలిపోదునా పదముల
మాలనౌదునా గళమున
పువ్వుల రెమ్మల నవ్వడి నేనై
రివ్వున ఎగిరేనా - రామునిదరి
మువ్వగ మ్రోగేనా"—

"ఇంతదీనురాలిపై దయగొని
వచ్చితివా రామా ! నా రామా ! శ్రీరామా !
నీకే మిచ్చెదరామా !

మనసెపుడో యిచ్చితి
బ్రతుకు మాలగ గ్రుచ్చితి
అది నీ గళమున వేసెద
ఇంకిన నా కన్నుల
నిపుడూరెన బిందువులతో
నీ పాదము కడిగెద
తూలిన యీ తనువును
ఇలపై పరచెద
నీ కాలు తుడుచుకొని రావా రామా''

అను పంక్తులు శ్రీరామ దర్శన కుతుహలయైన శబరి భక్తిని, శ్రీ రావూరు వారి కవితాశక్తిని ప్రతిబింబించుచున్నవి.

ఈ నాటిక 27-3-1957 నాడు ఆకాశవాణిలో ప్రసారమైనది.

**సుమబాణము :**

ఈ గేయనాటికను రచించినవారు ఆచార్య డా॥యస్వీ జోగారావుగారు. రతి, మన్మథుడు, దేవదేవి, విప్రనారాయణుడు, సుమబాలలు - (అరవిందము, అశోకము, చూతము, నవమల్లిక, నీలోత్పలము) ఈ నాటిక యందలి పాత్రలు.

పరమ వైష్ణవభక్త శిరోమణియైన విప్రనారాయణుడు దేవదేవి అను వారకాంతా సౌందర్య విలాస వాక్చాతుర్య మాధుర్యములకు కరగి మన్మథుని సుమబాణమునకు గురియై ఆ నాట్యాంగనను అనుసరించుట ఈ నాటికయందలి కథ

ఈ నాటికారచనాసంవిధానమున ఆచార్య శ్రీ జోగారావుగారు ప్రదర్శించిన ప్రతిభాపాండిత్యములు అద్భుతములు. 'భక్తాగ్రణి' యైన విప్రనారాయణుడు 'రక్తాగ్రణి' గా మారుటకు కావలసిన శృంగార రంగమును ఉజ్జ్వలభంగిలో సృష్టింపనెంచి రతిమన్మథులను ప్రవేశ పెట్టినారు. అంతియే కాదు; పంచబాణుని పంచబాణము లయిన అరవిందాశోకచూతనవమల్లికా నీలోత్పలములను 'సుమబాలలు' గా నిర్మించి, శృంగార సన్నివేశమును మరింత మధురమంజులముగా నలంకరించినారు. రతిమన్మథుల సృష్టిమాత్రముచేత

తృప్తిపడక "ఈరేడు జగమ్ములఁ నీ డెవ్వరు నాకు" అని గర్వించు మదనుని శక్తిని పరీక్షించుటకో అనునట్లు —

"విష్ణుభక్తి పరాయణుని
విప్రనారాయణనాముని
నారీసుఖపరాఙ్ముఖుని
వీరమతం కదిలింపుము"

అని రతీదేవిచేత పందెము వేయించినారు. మదనుని కదనరంగమునకు దింపినారు. అంతేకాదు - విప్రనారాయణుని భక్తిని కదలించు దేవదేవీ రక్తిమయోక్తులను సుమబాణాల చేత సత్యములనిపించినారు. దేవదేవీ చతుర సంభాషణకు, ఆమె అందచందములకు, ఒయ్యారమునకు, అభినయమునకు విప్రనారాణుడు ముగ్ధుడైన తరుణమున మదనునిచే సుమబాణము ననుసంధింపజేసినారు ఆచార్య జోగారావుగారు. ఇక విప్రనారాయణుడేమనును? అతని 'గుండె ఝల్లన, ఒడలు విరవిరలుపోవ' దేవదేవితో 'నీ వెంట వత్తునేను' అనక తప్పలేదు. "శ్రీరంగని కని స్వయముగ" నిర్మించిన హారమును ఆరసికు డాయంగవకు అర్పింపక తప్పలేదు. ఈ విధముగా 'సుమబాణము' అను పేరు ఈ నాటికకు సార్థకమైనది.

దేవదేవీ విప్రనారాయణుల సంభాషణములు శ్రీ జోగారావుగారి ఉక్తివైచిత్రికి, హేతువాదధిషణానైశిత్యమునకు పట్టిన నిలువుటద్దములు. ఈ నాటికయందలి వర్ణనలు హృదయంగమములు. ఉదాహరణమునకు ఒకటి-రెండు; దేవదేవి మన్మథుని -'పంతపు జయపతాక', అతని 'బాణాంచలధారానైశిత్యపుశాణరేఖ'-'రసికలోక రాకాశశి - చకచ్చకిత శశిశలాక - హొయలు వయసు నొయ్యారము - పురివిప్పిన పుంజునెమలి! నానానరపాల సభారచిత నాట్య రంగవల్లి' "అందచందాలదీవి - హావభావాలక్రోవి" ఈ చరణములందలి శబ్దార్థాలు, అంత్యప్రాసల మెరుపులు ఎదలను కదలించి వానిచే సంగీతము పాడించును. ఇక విప్రనారాయణుడు -'తిరునాళ్ల నూరేగు పెరుమాళ్లవలె'-'నిలువునా నామాల నీమాలలో వయసు నిలువు దోపిడి యిచ్చి నీలమేఘశ్యాము కొలువు గుత్తకు గొన్న వాడివలె' ఉన్నాడట. ఉక్తిలో భక్తిని రంగరించి రసరమ్య వర్ణన ఇది.

"ఆంధ్రవిశ్వకళాపరిషత్తు పరమపట్టభద్రక కేంద్రానికి చెందిన విద్యార్థినులచే దీనిలోని కొన్ని ఘట్టాలు సంగీతనృత్యాలతో ప్రదర్శింపబడినాయ"ని[1] మంగళగిరి ప్రమీలాదేవిగారు తెలిపియున్నారు.

**బృందావని మంజీరాలు :**

"బృందావని మంజీరాలు" శృంగారరసాత్మకమైన గేయనాటిక. నాటికాకర్తలు శ్రీ కొలిపాక మధుసూదనరావుగారు. మధుర భక్తితత్వము ఆధారముగా రచింపబడిన ఈ నాటికయందలి పాత్రలు - ఎనమండుగురు గోపికలు, రాధ, కృష్ణుడు.

రాధాగోపికా శ్రీకృష్ణుల రాగబంధమును రసవంతముగా చిత్రించినది ఈ నాటిక.

"స్వామి మీవాడేను
చెలులార సతతమ్ము
మీ ప్రేమ జలధిలో
ఒక్కతరగను నేను"—

"ప్రణయలోకమ్ములో
ప్రళయభావనలేల ?
అందాలవనిలో ది
వాంధాల పిలుపేల"

"ప్రేమైకజీవులకు
రాధ సుమవేదిక"

"అందాల వనబాల
ఆలాపనతి చొక్కి
అలసివాలినయట్టి
అరమోడ్పు కనుగవలు
ఈ వికచసంపెంగ
రేకులై మొలిచెనో—

1. తెలుగులో పద్యగేయనాటికలు - పుట 191. ప్రథమ ముద్రణ-1974.

ఈ హాసితమల్లిక నీకమై విరిసెనో"

అను చరణములు ఈ గేయనాటికలోని కవితాపారమ్యమునకు ఉదాహృతులు.

**సుభద్రా విజయము :**

సుభద్రార్జునుల ప్రణయపరిణయములను చిత్రించు ఈ నాటికను శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావుగారు రచించినారు. మూడు దృశ్యములుగా సాగిన ఈ నాటికయందలి పాత్రలు - సుభద్ర, శ్రీకృష్ణుడు, అర్జునుడు, బలరాముడు, సుభద్ర చెలులు, కొందరు యాదవులు.

ఈ నాటికయందలి మొదటి బృందగీతులలో గల వసంతఋతువర్ణన శృంగారరస పోషకము.

"తెండి నా ధనుర్బాణాల్
తెండి నాదు హలాయుధం
ముగ్ధసుభద్ర విడిపింతు
ముచ్చగు పార్థుని వధింతు"
"హలాయుధమ్మెత్తితి నీ
తల సహస్రభిన్నములుగ
మొత్తుదునిక చత్తువులే
ఎత్తిన గాండివము దింపు"

అను చరణములు తరగెత్తిన రౌద్రమునకు ఉజ్జ్వలవాహికలు.

సుభద్రావిజయము ప్రసార ప్రదర్శనా విజయమును సాధించిన నాటిక.

**మేనక:**

ఈ నాటికయును శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావుగారిదే. మేనక విశ్వామిత్రుని తపమును భంగముచేసి అతనిని ప్రణయరసపరవశుని చేయుట ఈ నాటికయందలి విషయము. ఈ కథ ప్రసిద్ధమే అయినను ఈ నాటికను శ్రీ రజనిగారు మలచిన తీరు ప్రశంసాపాత్రము.

మేనకతోపాటు రంభ, ఊర్వశి, తిలోత్తమలుకూడ వచ్చి విశ్వామిత్రుని ఉపోదీప్తను కదల్పలేక తిరోహిత లగుటయు, మేనక ఒక్కతె స్వామి కార్యమును

సాధించి విశ్వామిత్రుని వశపరచుకొనుటయు ఈ నాటికయందలి విశేషము. "జ్వలన్నిశ్చల ప్రణయ నర్తకి మేనకా" అను సంబుద్ధి వస్తుధ్వని గర్భితము.

మేనక విశ్వామిత్రుని వశముచేసికొనగల్గుటకు ఒక మనోహర సమర్థ సాధనమును సృష్టించినారు శ్రీ రజనికాంతరావుగారు. ఆ సాధనము మన్మథ పాత్ర కల్పనము. ఈ కల్పనమును కూడ చాల చమత్కారముగా నిర్వహించినారు వారు. మేనక విశ్వామిత్రుని ఎదుట 'శృంగారనృత్యము' సేయుచు చిట్టచివరకు ఆ మహార్షిని —

"రావె రావె మదనా, ప్రణయలోకసదనా

చైత్రకుసుమకదనా, రావె రావె మదనా" అని మదన నామముతో సంబోధించును. ఆ మాటలు విని నిజముగనే మేనక తననే పిలుచుచున్నదని భావించి మదనుడు ప్రవేశించి, ఆమెకు 'సుమబాణములు' 'ఇక్షుశరాసనము'ను అందించి, 'అజేయసుందరిగా' ఆమెను అనుగ్రహించును. ఇట్టి రమణీయ సందర్భమును ప్రతిభామూర్తులైన శ్రీ రజనికాంతరావుగారు కల్పించి, ఈ నృత్యగేయనాటికకు సౌందర్య సౌకుమార్యములను సంతరించినారు. నిజమునకు ఇట్టి రమ్య కల్పనలే గేయనాటికకు జీవముపోసి దానిని తొణికిసలాడించును.

అంత్యప్రాసలతో సాభిప్రాయపద ప్రయోగములతో గతివైవిధ్యముతో ఈ నాటికయందలి గేయములను ఉజ్జ్వలముగా తీర్చినారు శ్రీ రజనిగారు.

**నౌకావిహారము :**

శ్రీ రజనీకాంతరావుగారి మరొక పౌరాణికగేయనాటిక 'నౌకావిహారము'. వెన్నెలవేళలో యమునానదిలో గోపికలు శ్రీకృష్ణుడు నౌకపై విహారముసేయు సుందర దృశ్యమును ఈ చిన్న నాటిక చిత్రించుచున్నది శ్రీకృష్ణుడు, గోపికలు ఇందలి పాత్రలు.

శ్రీకృష్ణునితో కలసి గోపికలు వెన్నెల వెలుగులలో యమునలో నౌకపై విహరించునపుడు తుఫానుగాలులు చెలరేగి వరదలెక్కువకాగా, నావకు రంధ్రము పడి జలధారలందు ప్రవేశించును. గోపికలందరును భయార్తలై కాపాడుమని శ్రీకృష్ణుని వేడుకొందురు. అప్పుడతడు వారితో —

"వనితలార, అహంకార
వసనములను జారవిడిచి

మడిచి వావ క్రంతలోన
మాటువేయ వరదలడగు''

అని పలికి తరణోపాయము సూచించి తాను మాత్రము 'మూతిముడిచి, తెడ్డు విడిచి ఒదిగియుండును. అదంతయుచూచి కొంటెవాడైన కృష్ణుని పంతమేయని గ్రహించి, విధిలేక గోపికలు ఆతడు చెప్పినట్లుచేసి ఆ పురుషోత్తమునికి మొక్కెల్లుదురు. వలువలు తొలగగానే చిత్రముగా వరదలు, గాలి తొలగిపోవును. గోపికలందరును మరల 'తరుగని వలువల'తో నిలిచి మురళీమోహనునితో హాయిగా యమునలో విహరింతురు.

శ్రీకృష్ణుడు గోపికలతో యమునపై విహరించుటను మహాభక్తుడును సంగీతమూర్తియునయిన త్యాగరాజు తన నౌకా విజయమను యక్షగానమున మనోహరముగా వర్ణించినాడు. ఆ సన్నివేశమునే గ్రహించి శ్రీ రజనికాంత రావుగారు ఈ నాటికగా కూర్చి కళారూపమున త్యాగరాజుపట్ల తమకుగల భక్తి గౌరవభావములను ప్రకటించుకొన్నారు.

ఈ నాటికలోని— ''ఆకసమ్ములో చందురుకోవ
నీలయమునలో తేలెడి నావ
తెలితెలిమబ్బులు యిసుకపొరలలో
తేలుచుసాగే చందురునౌక
వలివలి గాలుల నీలియలలపై
కులుకుచుపోయే చెలువలనావ''

అను బృందగీతి భావనారమణీయమై ఎదలో మధురనాదతరంగము లెత్తించును.

**శ్రీరామరాజ్యం :**

శ్రీ వింజమూరి శివరామారావుగారు రచించిన చిన్ననృత్య గేయనాటిక ఇది శ్రీ రాముడు, భద్రుడు, చాకలివాడు, చాకలిది ఇందలి పాత్రలు. భద్రుని ద్వారమున శ్రీరాముడు చాకలివాని నిందలు విని సీతను పరిత్యజింప నిశ్చయించుకొనుట ఈ నాటికయందలి కథ. భద్రుడు తెచ్చిన నిందావార్తా సన్నివేశమును **Flash back** సంవిధానముతో ప్రత్యక్షసంవాద సరణిలో సరసముగా ప్రవేశపెట్టి ఈ నాటికకు ప్రాణము పోసినారు శ్రీ శివరామారావుగారు.

"అక్కటా పొరపాటు చేసితి
నిక్కముగ ధర్మమ్ము బాసితి
సర్వులకు సన్మార్గదర్శకు
డుర్విపాలకుడే గదా"



"రాజులకు ప్రత్యేక శాసన
మీ జగమ్మున నుండగూడదు
మించి యెల్లరన నొక్కగతి పా
లించుటు త్తమ ధర్మమూ"

అను మాటలు ఆదర్శ ధర్మప్రభువుగా శ్రీరామచంద్రుని కనులముందు నిలుపుచున్నవి.

**మేనక :**

శ్రీ వింజమూరి శివరామారావుగారి మరొక పౌరాణికగేయనాటిక 'మేనక'. మేనకా విశ్వామిత్రుల ప్రణయోదంతమును, శకుంతలో దయమును చిత్రించు ఈ నాటికయందలి పాత్రలు – మేనక, ఊర్వశి, విశ్వామిత్రుడు. దేవ వేశ్యయు ఇంద్రుని చెప్పుచేతలలో మెలగునదియు నయిన మేనక తన పరాధీనతను, విశ్వామిత్రునిపట్ల చేసిన మహాపరాధమును తెలుపుఘట్టము శ్రీ శివరామారావుగారి కల్పనము. ఇది మిక్కిలి హృద్యమై స్త్రీసహజస్వభావమును వ్యక్తము సేయుచున్నది.

"నా వయస్సు సంధ్యాసమ
యావసాన తీరమూ
మోడువారినట్టి చెట్టు
నేడు నా శరీరము

"మీ వయస్సు నిత్యనూత్న
యౌవనభాసితమూ
మీ శరీర ముత్ఫుల్ల స
రోజము సంతతమూ"

అను విశ్వామిత్ర మేనకా సంభాషణము కవితాత్మకము.

"ఎందుకో వలపెందుకో?
ఎందుకో తలపెందుకో?
నిలువునా నిలువునా చివురై
పులకరించే మావికొమ్మకు?
"ఎందుకో వలపెందుకో?
ఎందుకో పిలుపెందుకో?
వింతగా చివురాకు పొత్తిట
గొంతునెత్తే కోయిలయ్యకు?"

వంటి చరణములు శృంగార రసోజ్జ్వలములు.

**ఊర్వశి :**

ఈ నాటికను నిర్మించినవారు శ్రీ టి. రామకృష్ణారెడ్డిగారు. నాలుగు దృశ్యములున్న ఈ నాటికయందలి పాత్రలు - పురూరవుడు, విదూషకుడు, చిత్రలేఖ, ఊర్వశి, దేవదూతలు, సూత్రధారుడు, వారుణి, లక్ష్మి, భరతుడు, ఇంద్రుడు, రంభ, మేనక, అశరీరవాణి.

ప్రసిద్ధమైన ఊర్వశీపురూరవుల ప్రణయగాథను వినూత్నములును కళాత్మకములైన కల్పనలతో శ్రీ రెడ్డిగారు గేయనాటికగా మలచినారు.

ఈ నాటికయందలి గేయములు మధురభావములతో లలితమంజుల పద ప్రయోగముతో ప్రాసల కొనమెరుపులతో నొప్పుచు నృత్యసంగీత కళామర్యాదలను సంతరించుకొన్నవి. ఉదాహరణమునకు పురూరవుడు చివరకు ఊర్వశిని వీడ్కొలిపిన సందర్భమునందలి —

"నా సఖీ ఊర్వశీ! నను వీడిపోయేవ?
వరణీయమౌ వలపు వరముగా నొసగేవ? ॥నా॥
హరివిల్లు విరిసినటు అగుపించు నీ సొగను
పారిజాతమువోలె పరిమళించును మనసు ॥నా॥
నీవు వాసంత నవలావణ్య దేవతవు
ప్రవిమలామృత రాగభావనా శోభితవు ॥నా॥
నీవు పలికినచోట నిగుడు గాంధర్వాలు

నీవు వెలసినచోట నిలుచు సురలోకాలు ॥వా॥
భాసించు మవుడపుడు ప్రణయరసరూపిణీ !
వాసించు నా హృదిని ప్రణవాంతరంగిణీ! "

అను పాటను పేర్కొనవచ్చును.

శ్రీ రామకృష్ణారెడ్డిగారు రాధాగోపికాశ్రీకృష్ణుల ప్రణయమును చిత్రించుచు 'రాసలీల' అను మరొక చిన్ననాటికను కూడ వ్రాసినారు.

**మాయలేడి :**

'మాయలేడి' నాటికను శ్రీమతి దర్భాభాస్కరమ్మగారు రచించినారు. గేయనాటికలను రచించిన ఇద్దరు రచయిత్రులలో వీరొకరు. మరొకరు శ్రీమతి డా॥ నాయని కృష్ణకుమారిగారు.

'మాయలేడి' మూడురంగములున్న దీర్ఘనాటిక. రాముడు. సీత, లక్ష్మణుడు, జటాయువు, ఆంజనేయుడు, సుగ్రీవుడు, రావణుడు, మండోదరి అగ్నిదేవుడు ఇందలి పాత్రలు.

సీత మాయలేడిని చూచినప్పటినుండి ఆమె అగ్నిపరీక్ష నెదుర్కొని శ్రీరాము ననుగ్రహము నందు వరకుగల రామాయణగాథ ఈ నాటిక యందలి ఇతివృత్తము. ఎడనెడ కథాగమనము నేపథ్యగాన ద్వారమున నిర్వహింపబడినది.

ఈ నాటికలో కవితాసౌందర్యమున కన్న కథాకథనశిల్పమునకే ప్రాముఖ్య ముండుట ఒక విశేషము. గేయములతోపాటు ద్విపదలును ఈ నాటికలో ప్రయుక్తములైనవి.

**పారిజాతము :**

ఈ నాటికకూడ శ్రీమతి దర్భా భాస్కరమ్మగారిదే. ప్రసిద్ధమైన పారిజాతాపహరణగాథను గ్రహించి ఈ నాటికగా మలచినారు శ్రీమతి భాస్కరమ్మగారు. మూడు రంగములున్న ఈ నాటికయందలి పాత్రలు - నారదుడు, శ్రీకృష్ణుడు, రుక్మిణి, సత్యభామ, చెలికత్తెలు.

**శకుంతల :**

శ్రీమతి దర్భా భాస్కరమ్మగారి మరొక పౌరాణిక గేయనాటిక శకుంతల.

'అభిజ్ఞాన శాకుంతలము'నందలి గాథయే ఈ నాటికయందలి విషయము. శకుంతల, అనసూయ, ప్రియంవద, దుష్యంతుడు, దుర్వాసుడు, కణ్వుడు, శార్ఙ్గరవుడు, గౌతమి, ఈ నాటికయందలి పాత్రలు.

ఈనాటికయందలి గేయములు సంక్షిప్తసుందరములు. ఉదాహరణమునకు- గాంధర్వవిధిని శకుంతలను దుష్యంతుడు పరిణయమాడిన సన్నివేశమునందలి ఈ క్రింది యుగళగీతమును తిలకింపుడు.

"దుష్యంతుడు : ఎదుట నిలిచెను ఒక దేవత నా
ఎదలో విరిసెను శంపాలతా
హృదివీణియపై మృదురావాలే
సుధలను చిలికి పలికించెనే

శకుంతల : ప్రణయరాజ్యము పాలించగా
ప్రభువై ఇటు విచ్చేసినావా
వలపు సుమాలే తొలిజల్లులాయే
కలలే అపరంజి కానుకలాయే.

దుష్యంతుడు : అందీఅందని ఆకాశ హర్మ్యం
ముందు నిలచి కనువిందు చేసెనే

శకుంతల : నందనవనమే పందిరివై చె
నాలో ఆశలు పూచినవే

ఇద్దరు : ప్రకృతిమాత తొలిదీవనలిచ్చి
ప్రేమికులకు నివాళియొసంగె
తరుపూలతవలె ఇరువురమొకరై
విరితోటలలో సాగుదమా."

**కృష్ణభక్తి :**

'కృష్ణభక్తి' నృత్యగేయనాటిక. దీనిని రచించినవారు శ్రీ ఎం.కె.రాము గారు. ప్రయోగదృష్టితో గేయనాటికలను రచించుటనునది ఈ రచయిత ప్రత్యేకత. రాధికాకృష్ణుల ప్రణయము ఈ నాటిక యందలి ఇతివృత్తము. ఇందలి గేయములు మృదుమధురములై సంగీత నృత్యానుకూలముగా సాగినవి. కృష్ణ భక్తితత్త్వమును ప్రతిపాదించు —

"నా పెదవిని నిలుచును రాగాలు
నా హృదినిండా అనురాగాలు
నా మేన విరియు విరిగంధాలు
నా నడకంతా పలు అందాలు
భక్తిలోనె అనురక్తి నాకు
రక్తిలోనె పెనుభక్తి నాకు
భక్తికి రక్తికి వారధి నేనే
బంధ విముక్తికి సారథి నేనే"

అను చరణములు ఈ నాటికయందలి శైలికి తార్కాణములు.

ఈ నాటికను సేంట్ అంథోని స్కూలు విద్యార్థినులు రవీంద్రభారతిలో ప్రదర్శించినారు

**మోహినీ భస్మాసుర :**

ఈ నాటికయును శ్రీ ఎం. కె. రాముగారిదే. ప్రసిద్ధమైన మోహినీ భస్మాసురగాథ ఈ నాటికలో చిత్రింపబడినది. ఈ నాటికయందలి గేయములు భావాత్మకముగా నృత్యానుకూలమైన శైలిలో నడచినవి. నిదర్శనమునకు-మోహిని నాట్యభంగిమలను ప్రదర్శించు సందర్భమునందలి—

"మేని వీణియను వలపు రాగములు
మీటిమీటి పలికించనా
కనులసైగలో చిలిపిభావములు
కొసరికొసరి చిలికించనా...... ॥మే॥
తనువును సుందర నందనవనిగా
ఆమనిభావము నభినయించగలవా ?
మనమును మంజులయామినిగా నువు
వెన్నెలభావము నభినయించగలవా
కొలనుఅలలలో తళుకులీను చెం
గలువలు కనులలో చూపవా
మెరపులోని జలతారు జిలుగులను
కులుకు చిన్నెలో చూపవా..." అను పాటను పేర్కొనవచ్చును.

**శకుంతల :**

నాటికాకర్తలు శ్రీ రాముగారే. శకుంతలాదుష్యంతుల వృత్తాంతమున్న ఈ నాటిక రెండురంగములుగా పరచుకొన్నది. శకుంతల, అనసూయ, ప్రియంవద- చెలులు, దుష్యంతుడు, తుమ్మెద, పూవు ఈ నాటికయందలి పాత్రలు. ఇందలి నేపథ్యగానము కథాగమనమునకై ప్రయుక్తమైనది. ప్రదర్శనోద్దేశముచే రచింపబడిన ఈ నాటికయందలి రచన సంగీతనృత్యమధురము. ఇందలి కథ కాళిదాసు అభిజ్ఞానశాకుంతలము ఛాయలో నడచినను పువ్వు తుమ్మెదలకు జరిగిన ప్రణయసంభాషణము శ్రీ రాముగారి సరికొత్త కల్పనపు.

"తుమ్మెద : రేకు రేకులో నీ రూపమున్న దే
రమ్మని పిలిచే సైగ వున్నదీ
పూబోణీ ! నా వనరాణీ !

పువ్వు : నీ చూపు మాపులో మైకమున్నదీ
కమ్మగ పిలిచే పి ు వు వున్నదీ
మగరాయా ! తుమ్మెదరాయా !

తుమ్మెద : నీ గుండె గిన్నెలో వున్నవీ
ఎవరికి అందని మధువులు

పువ్వు : నీ గొంతు వీణియలో వున్నవి
నను మురిపించే సరిగమలు
మగరాయా ! తుమ్మెదరాయా ! " వంటి పంక్తులు ఈ

గేయనాటికలోని కవితాప్రాశస్త్యముతో పరిచయము కలిగించుచున్నవి శ్రీ రాముగారు గేయనాటికాకర్తలేకాక ప్రయోక్తలుకూడ.

**లక్ష్మీగణపతి :**

'లక్ష్మీగణపతి' 'కరుణశ్రీ' జంధ్యాల పాపయ్యశాస్త్రిగారి నాటిక. శ్రీగణేశపురాణమందలి ఒక ఉపవృత్తసన్నివేశము ఈ నాటికయందలి ఇతివృత్తము క్షీరసముద్రమథన సందర్భమున అమృతమునకు బదులు హాలాహలముదయించుటకు కారణము కార్యారంభమున శ్రీ గణేశుని పూజింపకపోవుటయే. బ్రహ్మవలన తెలిసికొన్న సురాసురులు గణేశుని కొనివచ్చి పూజించి సముద్రమథన మారంభింతురు. అందుదయించిన ఉచ్చైశ్రవ కల్పవృక్షాదులను

సురాసురులు తలకొక్కటి పంచుకొని గణేశుని నిర్లక్ష్యము చేసిన వతడు క్రోధముతో కైలాసమునకు బయలుదేరును. అంత వారు అతనిని ప్రార్థించి పాల సంద్రమున ఏది పుట్టినను ఇచ్చెదమని మాటయిచ్చి మరల మథన మారంభింపగా లక్ష్మి ఉదయించును. ఆమె విష్ణువును వరించును. అంత గణేశుడు లక్ష్మి తనదే యనుచు విష్ణువుతో యుద్ధమునకు దిగును. విష్ణువు సుదర్శనచక్రమును ప్రయోగించును. గణేశుడు తన రెండు దంతములలో ఒక దంతమును పెరికి-

"నాతల్లి లోకైకమాత యే యగునేని
నాతండ్రి జగదేకనాథుడే యగునేని
కంజాక్షు చక్రమును గడికదలిరానీక
ఈ నా మహాదంతమిది యెదుర్కొనుగాక" అనుచు ప్రయోగించును. అంత ప్రళయాగ్నులు ప్రజ్వరిల్లగా పార్వతి వచ్చి—

"లక్ష్మి యుగయుగాలుగ కమ
లాక్షుని గృహలక్ష్మి సుమ్మి
లక్ష్మిని విష్ణువున కొసగి
'లక్ష్మీగణపతివి'కమ్మి." అని కొడుకును బుజ్జగించి అతనిని తన వెంట తీసికొనిపోవును

ఈ నాటికలో అక్కడక్కడ కొంత కథాగానము చోటుచేసికొన్నది. ఇందలి రచన మధురము.

"గాలిలోన తేలియాడు
పాలకడలి కెరటమువలె
కుచ్చుతోక కదిలించుచు
ఉచ్చైశ్రవ ముదయించెను" అను చరణములు 'కరుణశ్రీ' గారి దర్శనవర్ణనశక్తులకు రేఖామాత్ర నిదర్శనములు.

# చరిత్రాత్మకములు

## (పద్యగేయ వచన మిశ్ర నాటికలు)

**సుప్తాస్థికలు :**

ఇది శ్రీశ్రీ గారి రచన. 'సుప్తాస్థికలు' గాంధీమహాత్ముని హత్యను గూర్చి ప్రస్తావించును. కవి, విషాదకంఠాలు, సంధ్య, అంధకారము, నక్షత్రము, రెండుతారలు (సోదరతార - సోదరీతార) ఇందలి పాత్రలు.

ఈ నాటిక చివరలో రెండు తారల సంభాషణ ద్వారమున గాంధి హత్యను కరుణరసార్ద్రముగా చిత్రించినారు శ్రీశ్రీ గారు. ఆకాశములో నిద్రపోవుచున్న సోదరీతార ఒక్కసారి తుళ్లిపడి మేల్కొని వణికిపోవుచుండును. అట్లు వణకుటకు కారణమేమని సోదరతార అడుగగా - భూగోళము మీద - హస్తినాపురములో నాలుగుసార్లు రివాల్వరు ప్రేలుడు వినిపించిదనియు, 'ఆ రాక్షస ధ్వనుల నాల్గింటిని' 'హేరాం! హేరాం' అను నాలుగక్షరాలు ఎదుర్కొన్నవనియు, అది హింసాహింసలకు మధ్య జరిగిన ఒక పెద్దయుద్ధమనియు, తనకింకను ఆ యుద్ధ ధ్వనులు వినిపించుచున్నవనియు, అందువలననే తనకు గుండెలు కొట్టుకొనుచున్నవనియు సోదరీతార చెప్పును.

అస్థికలు చేతనారహితములు కావున వానికి నిద్ర ఉండదు. అయినను సుప్తాస్థికలను సృష్టించినారు శ్రీశ్రీ గారు. "ఎముకలు మరణానికి చిహ్నం కాబోలు" అని వారే వ్రాసినారు ధరాగర్భస్థములైన అస్థికలు కలగని, ఆ కలలో మహాత్ముడు ఆహుతియైన సన్నివేశమును గాంచి దుర్భర దుఃఖములో మునిగినవను ఊహకు అవకాశమిచ్చుచున్నది ఈ నాటిక. సమస్త ప్రపంచమును మహాత్ముని మరణమువలన కన్నీరు విడిచినదని ఈ నాటికలోని ప్రతిపాత్ర ధ్వని గర్భముగా వ్యక్తము చేయుచున్నది.

"అన్యాయం సమక్షంలో
ఆగ్రహోదగ్రమూర్తి
చరాచర ప్రపంచానికి
క్షమా మార్గదర్శి" యై

అమరత్వమునందుకొన్న మహాత్మునికి నతులర్పించినారు శ్రీశ్రీ. ఈ నాటికలోని-

"హిమాలయం మా హృదయభారం
గంగానది మా కన్నీళ్లు"

అను పంక్తులు మహాత్ముని పోగొట్టుకొన్న భారతీయుల శోకాతిశయమును కవితాత్మకముగా చిత్రించుచున్నవి. అహింసాప్రేమలు మృత్యువును జయించు నను సందేశమును వ్యంగ్యముగా అందించుచున్నది ఈ నాటిక.

పద్యగేయవచనమయమైన ఈ నాటికలోని సంధ్య, అంధకారం, నక్షత్రం అను పాత్రల నోట పలికించిన పంక్తులు చాలవరకు గతములో శ్రీశ్రీ గారే రచించిన 'అంధకారము' అను కవితాఖండికలోనివి. ఈ నాటిక ఆకాశవాణిలో ప్రసారమైనది.

**ధమర్దాసు :**

శ్రీ దేవులపల్లి వేంకటకృష్ణశాస్త్రిగారి రసవంతములయిన నాటికలలో 'ధనుర్దాసు' ఒకటి. మూడురంగములుగా విరిసిన ఈ నాటికయందలి పాత్రలు- శ్రీ భగవద్రామానుజులు, ధనుర్దాసు, హేమాంగి, మాధవుడు, పరాశరుడు, శ్రీనివాసుడు చూడమ్మ, నాంచారమ్మ, సీనయ్య, విష్ణుచిత్తుడు, మారుతి, బాలార్యుడు, ఆంధ్రపూర్ణుడు గోముఠార్యుడు, భజనకూటము - బిచ్చగాడు, సానిమేళము.

తన ప్రియకాంతానయనసౌందర్యమునకు దాసుడైన ధనుర్దాసు శ్రీ మద్రామానుజుల మహిమా ప్రభావములచేత "శతసహస్రార్యమదీప్తిని మించి శతసహస్రతుహినకరశీతలత నించు" శ్రీరంగనాయకుని దివ్యనేత్రము లకు దాసుడగుటయే ఈ నాటికలోని వస్తువు.

భక్తిరసాత్మకమైన ఈ నాటికను పరమరమణీయముగా తీర్చినారు శ్రీ కృష్ణశాస్త్రిగారు

"తావికన్నా మృదులతరమైన మనసుగల
దేవేరితోకొలువు దీర్చి హరిగొలువగా"

వంటి కవితాత్మక గేయచరణములు,

"నా తండ్రీ ! చిరదగ్ధజాంగలము ప్రాణమ్మిద్ధి; యుష్మత్కృపా
స్నిగ్ధస్నిగ్ధ కటాక్షవీక్షణము ప్రావృణ్మేఘమాలాగళ

చ్ఛిక స్రోతము ఒక్కమారయిన వర్షింపంగదే! అరునే
మోతృష్ణాగ్ని ? రవంత చల్లబడునేమో జీవమోయీ ప్రభూ !"

వంటి రసవత్తరపద్యములు శ్రీ కృష్ణశాస్త్రిగారి ప్రతిభాపాండిత్యములకు ప్రతిబింబములై ఔచితీమణిహారతరళాయమానములై ఒప్పుచున్నవి.

ఈ నాటికయందలి ద్రవిడ ప్రబంధ పాశురములు వైష్ణవ సంప్రదాయ వాతావరణమును చక్కగా కల్పించుచున్నవి. నాందీశ్లోకముతో, నాతిదీర్ఘ వచనములతో పాటలతో ఆటవెలదులతో తేటగీతులతో కందములతో ఉత్పల శార్దూల మత్తేభములతో మధురాతిమధురముగా సాగిన ఆపాతమధుర రూపకమిది. ఆకాశవాణిలో ప్రసారమైనది

**సాయుజ్యము :**

ఈ నాటిక కూడ శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారిదే. ఆకాశవాణిలో ప్రసారమైనదే. ఐదు రంగములున్న ఈ నాటికలోని పాత్రలు – మల్హణుడు, శివశర్మ, మల్హణి, మందయాన.

శివభక్తులును, నృత్య కవితా కళాకోవిదులును అయిన మల్హణీ మల్హణుల ప్రణయమును, మల్హణీశివసాయుజ్యప్రాప్తియును ఈ నాటికయందలి ఇతివృత్తము.

మల్హణీ మల్హణుల పాత్రలద్వార శృంగారభక్తిరసములను, మందయాన శివశర్మ పాత్రలద్వార హాస్యరసమును చక్కగా పోషించినారు శ్రీ కృష్ణశాస్త్రిగారు. చివరకు ఆలయములో మల్హణుని ముఖతః పలికించిన పద్యములు రక్తినుండి భక్తివైపు పయనించు మల్హణుని మనఃస్థితికి పట్టిన మణిముకురము.

"కైలాసపురినుండి కాశికై
కాశికాపురినుండి దాసికై
వేంచేసినావయా విజయేశ్వరేశ్వరా !
కరుణానిధీ ! ఓయి లావణ్యాశేవధీ
విరిసిజాబిలి మల్లి రేకగా
దరిసితేనియల ముత్యాకగా

కురిసి మాపయిధార ధార ముంచెత్తరా !
కరుణించరాస్వామి విజయేశ్వరేశ్వరా !"

అను పాట పరమరమణీయమై ప్రతిహృదయమును భక్తిరసార్ద్రముచేయుచున్నది. ఈ నాటికలో ప్రయుక్తములైన ఉపమాలంకారములు శివసంబంధములై పాత్రల దైవభక్తిని అడుగడుగున చాటుచు ఔచిత్యమునకు వన్నెచిన్నెలు కూర్చినవి

**రామప్ప :**

ఆచార్య డా॥ సి. నారాయణరెడ్డిగారి ప్రసిద్ధ 'సంగీతరూపకము' రామప్ప. కాకతీయుల కాలమునాటి శిల్పనృత్య కళా సంస్కృతి వైభవమును కమనీయముగా చిత్రించు ఈ రూపకము మొదట ఆకాశవాణి హైదరాబాదు, విజయవాడ, మద్రాసు కేంద్రములనుండియు, పిదప హిందీ భాషా ద్వారమున పన్నెండు భాషలలోనికి అనూదితమై అఖిలభారత రూపక కార్యక్రమములో అన్ని కేంద్రములనుండి ఒకేసారి ప్రసారితమైనది ఈ రూపకరచనాప్రేరణను గూర్చి శ్రీ నారాయణరెడ్డిగారు 'నాలుగుమాటలు' ఈ విధముగా వ్రాసినారు — "రామప్ప గుడి సింహద్వారం మీది 'మదనికాశిల్పా'ల్లో నాగిని అనే విగ్రహం ఈ రచనకు ఊపిరులూదింది. దీనిలోని కథంతా నాగినిచుట్టే తిరిగింది. నా సౌందర్యదృష్టి కనుగుణంగా చారిత్రక మూల్యాలు చెదిరిపోకుండా ఈ రూపకాన్ని కల్పించుకున్నాను."[1] యాత్రికుడు, గణపతిదేవుడు, రుద్రసేనాని, జాయపసేనాని చంద్రభూషణుడు, నాగి, నందికేశ్వరుడు- ప్రధాన పాత్రలుగా, పదునెనిమిది భాగములుగా పరచుకొన్న ఈ నాటికయందలి కథ అంతయును రామప్ప గుడియందలి నాగదేవతా శిల్ప విగ్రహమును చూచి ముగ్ధుడై, గత చరిత్ర స్మృతిలోనికి పయనించిన ఒక సహృదయ యాత్రికుని మధురానుభూతిగా, ఒక కమ్మని కలగా చిత్రించినారు శ్రీ నారాయణరెడ్డిగారు. ఇందలి కథ సంగీతవాహినీసదృశము.

ఆలోచనామృతమైన సాహిత్యము, ఆపాతమధురమైన సంగీతము, నయనపర్వమైన నాట్యము మూడును సరసముగా సంగమించిన రమ్యరూపకము 'రామప్ప'. ఈ నాటికలో మొట్టమొదట వచ్చు యాత్రికునిలో రచయితయే కానిపింతురు. ఇందలి ప్రతిపాత్ర జీవమును నింపుకొన్నది. ముఖ్యముగా నాగి -

1. రామప్ప - 'నాలుగు మాటలు' - ప్రచురణ - మార్చి-1960.

చంద్రభూషణుల పాత్రలు ఈ రూపకకర్త అమృతములో కలమునద్ది చిత్రించి నట్లున్నవి. సన్నివేశముల కూర్పు, సంభాషణముల తీర్పు సహృదయులకు గిలిగింతలు కలిగించును. నాగి పల్కిన పల్కులలో తెలంగాణా మాండలిక పదజాలము అతిసహజముగా చోటుచేసికొన్నది. శృంగార కరుణాద్భుత రౌద్ర రసములు చక్కగా పోషింపబడినవి. ఈ నాటికయందలి ఏడు గీతములును రసరమ్యములు. వానిలో —

"ఈ నల్లని రాలలో
ఏ కన్నులు దాగెనో
ఈ బండల మాటున
ఏ గుండెలు మ్రోగెనో ॥ఈ॥
పాపాలకు తాపాలకు
బహుదూరములో నున్నవి
మునులవోలె కాంచవుల
మూలలందు పడియున్నవి— ॥ఈ॥
కదలలేవు మెదలలేవు
పెదవివిప్పి పలుకలేవు
ఉలి యలికిడి విన్నంతనె
గలగలమని పొంగిపొరలు— ॥ఈ॥
పైన కఠిన మనిపించును
లోన వెన్న కనిపించును
జీవమున్న మనిషికన్న
శిలలే నయమనిపించును. ॥ఈ॥" అను పాట తారాస్థాయి నందుకొన్నది. ఈ నాటికలోనున్న దొకే పద్యమైనను హృద్యముగా నున్నది

కళావిఖ్యాతికి కళావిలసనమునకు ఉన్న అతి సూక్ష్మమైన సంబంధమును శ్రీ నారాయణరెడ్డిగారు ఈ నాటికలో వ్యంగ్యస్ఫూర్తితో ప్రతిపాదించినారు. కళ దైవాంశమను భారతీయుల విశ్వాసమునకు ఈ నాటిక కాణాచి.

**హరిచరణదాసి మీరా :**

డా॥ సి. నారాయణరెడ్డిగారి మరొక చారిత్రక నాటిక 'హరిచరణదాసి మీరా'. గేయగద్యాత్మకమైన ఈ నాటిక ఆకాశవాణి హైదరాబాదు

కేంద్రమునుండి 15-7-1959 నాడు ప్రసారమైనది. ఇందలి పాత్రలు- మీరా, వాసంతి, రాణా(మీరాభర్త).

ప్రసిద్ధ కృష్ణభక్తురాలైన మీరా భర్త పెట్టిన విషమపరీక్ష నుండి బయట పడి ఆమె పునీతత్వమును. భక్తిపారమ్యమును నిరూపించుకొన్న సన్నివేశ మిందలి వస్తువు.

ఈ నాటికలోని పాటలు సంభాషణలు ఎంతయు ఆకర్షణీయముగా నున్నవి.

"మోవి చిగురుపై మురళిని మోపి
మూగవైతి వేలాకృష్ణా!
మ్రోగించ వేలా కృష్ణా!" అనుపాట భక్తిరసార్ద్రము. ప్రదర్శనకు కూడ పనికివచ్చు చక్కని చిన్న నాటిక ఇది.

**తరతరాల తెలుగు వెలుగు :**

ఈ నాటికయును శ్రీ నారాయణరెడ్డిగారిదే. 1975 ఉగాది ప్రపంచ తెలుగు మహాసభల సందర్భముగా ప్రత్యేక ప్రదర్శనార్థము శ్రీ రెడ్డిగారు ఈ 'నృత్యగేయరూపకము'ను రచించినారు. గేయ పద్యగద్యాత్మకముగా నడచినది ఈ నాటిక.

ఐతరేయ బ్రాహ్మణముల కాలమునుండి ఆంధ్రప్రదేశావతరణము వరకు గల 'ఆంధ్రపురా రమ్య చరిత్ర' సంస్కృతులకు సంబంధించిన సముజ్జ్వల ఘట్టముల కవితాత్మకచిత్రణమే ఈ నాటికయందలి ఇతివృత్తము.

కథాగానములతో, సంధివచనములతో, బుర్రకథలతో, జావళులతో, పూర్వకవుల కమనీయపద్యములతో, పదకవుల సంకీర్తనములతో భామాకలాపములతో ఈ రూపకము వివిధ విచిత్ర కళాసమ్మేళనమునకు నిదర్శనముగా అగుపించును. కథాగానము జరుగుచుండగా రంగస్థలముపై అభినయము సాగుట ఈ రూపక ప్రదర్శనములోని ఒక విశేషము.

ఆంధ్రప్రదేశావతరణ దినోత్సవము (1-11-1976) సందర్భముగా ఈ నాటిక ఆకాశవాణిలో కూడ ప్రసారితమైనది.

**అంబాపాలి :**

'అంబాపాలి' అను చరిత్రాత్మకమైన నాటికను రచించినవారు డా॥ వేటూరి ఆనందమూర్తిగారు. గేయవచనమయముగా సాగిన ఈ 'సంగీతరూపకము'లో వచనమే అధికము.

ఆమ్రవనమునందు మహానామునికి దివ్యానుగ్రహమువలన లభించిన 'అంబాపాలి' లిచ్ఛవిప్రభువుల దౌష్ట్యమునకు గురియై వివాహమాడక చివరకు మగధేశ్వరుడైన బింబిసారునివలన పుత్రుని కనుటయు, ఆ మాతాపుత్రులు బుద్ధుని దర్శించి, బౌద్ధము స్వీకరించి, ప్రజాసేవలో జీవితశేషము గడపుటయు ఈ నాటికయందలి ఇతివృత్తము

"అంబాపాలి కథను వినండీ
అమ్మలక్కలందరు రండీ" అను పల్లవితోడిపాట అక్కడక్కడ ఈ నాటికలో సాగుచు కథను కొంత నడపుచుండును. ఇందలి ఐదు పాటలయందును-

"కొండిగట్టిన నా శిథిల జీవితము
కొండెక్కెదెపుడో" అనుపాట హృదయంగమము. ఈ నాటిక ప్రసారమునకేకాని ప్రదర్శనము నుద్దేశించి వ్రాసినది కాదు

**అశ్వఘోషుడు :**

'అశ్వఘోషుడు' నాటికను డా॥ అరిసిరాల విశ్వముగారు రచించినారు. ఇది 1972లో ఆకాశవాణిలో ప్రసారమైనది

ప్రభాదేవి – అశ్వఘోషుల విషాదాంతప్రణయగాథను చిత్రించిన రూపకమిది. గేయవచనములతో పదమూడు సన్నివేశములుగా సాగిన ఈ నాటికయందలి పాత్రలు- అశ్వఘోషుడు, సువర్ణాక్షుడు, సువర్ణాక్షి, అభిధర్మరక్షిత్, మాలి, ఆనంద్, బుద్ధప్రియుడు, ప్రభ, ప్రభతల్లి

రమణీయసంభాషణలతో సాగిన ఈ రూపకము పఠితలో అడుగడుగున ఉత్కంఠను కలిగించును, వచనబహుళమైన ఈరచనయందు వస్తురసానుగుణములైన ఎనిమిది పాటలున్నవి. వానిలో

"ఎదలోని దీపమా
ఎందుకే వెలిగేవు?
మనసు వాకిట నిలచు
మరపుచీకటిలోన"

"ఈ యెడారిలో
ఈ సమాధిలో
వాకొరకై ఎవరో హో
పలికింతురు రాగమొకటి" అను గీతములు కవితాత్మకములు. ఈ నాటికలో ఆనంద్ పాత్ర హాస్యరసమును చిలుకరించగా, ప్రభా-అశ్వఘోషుల భూమికలు శృంగార కరుణములకు ఆలంబనములుగా నిలిచినవి.

**భాగ్యనగరం :**

'భాగ్యనగరం' రూపకమును కీ॥ శే॥ శ్రీ నార్ల చిరంజీవిగారు రచించినారు. ఈ నాటికయందలి పాత్రలు- భాగమతి, రాగమతి, జాగీర్‌దారు, కుతుబ్, అమీర్, పరిచారకుడు, రుద్రకవి, మల్కిభరాం, శైరంఖాన్.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రమునకు రాజధానియైన నేటి భాగ్యనగర నిర్మాణమునకు ప్రాణముపోసిన ప్రణయమూర్తులు- భాగమతీ, కులీకుతుబ్‌షాల రాగామృత గాథయే ఈ రూపకమందలి ఇతివృత్తము. ఈ శృంగారరసప్రధానమైన ఈ రూపకకుసుమము పదునాలుగు రంగములుగా వికసించినది.

ఉర్దూపారసీపదముల ఇంపుసొంపులతో ఈ నాటికలోని భాష చారిత్రక వాతావరణమునకు అనుకూలముగా మలచబడినది. సంభాషణలు అతిక్లుప్తములై ఆంగికాభినయమునకు యథోచితమైన అవకాశమును కల్పించుచున్నవి ఇందలి పద్యములు ధారాశుద్ధిశోభితములు. పాటలు సంగీతమయములు. వచనములు, పాటలు, పద్యములు రమ్యకవితాపరిమళములను గుబాళించుచున్నవి. కవితాస్ఫూర్తి, చారిత్రకదృష్టి, సంగీతకళావిలసనము ఈ నాటికలో చక్కగా పెనవేసికొనిపోయినవి.

"కొండకోనా గూడుకట్టి
గూటిలోనా ఊయలేసి

రాసకొండుకా! నిన్నె తలిసీ
వూసుబోకా వూగినానురా
ఏటిగట్టున మంచెవేసీ
మంచెమీదా మంచమేసీ
రాసకొండుకా! నిన్నె తలిసీ
అద్దరేతిః అలిసిపోతిరా"

"మబ్బుకన్నె నుదిటిపైని
మెరవుతీగవో!
కడలితరగ వెన్నుమీది
వెలుగురేకవో!
గోలుకొండ గుండె దోచుకొనే చూపులు
కెంపులతోకియ్యమాడు లేతబుగ్గలు" వంటి చరణములు జానపదపరిమళాలను, మధురభావనామకరందాలను ప్రసరించు శ్రీ చిరంజీవి గారి కవితాహృదయమునకు నిదర్శనములు.

ఈ రూపకమున కాద్యంతములందు నాందీభరతవాక్యములు నిలిచినవి. ఈ నాటకము మద్రాసు, హైదరాబాదు, బొంబాయి నగరములలో ప్రదర్శిత మైనది. ఆకాశవాణిలో ప్రసారితమైనది.

### గేయసాహిత్యంలో గాంధీజీ :

నిద్రాణమైన భరతజాతిని మేల్కొల్పిన కర్మవీరుడు, జాతిపిత, స్వాతంత్ర్య ప్రదాత, మానవతామూర్తియైన మహాత్మాగాంధీజీ కొనసాగించిన ఉద్యమము లను, సాధించిన విజయములను, ఆతని గుణగణములను ప్రశంసించుచు ఆంధ్ర కవు లనేకులు అనేకగేయములను రచించినారు. వారిలో శ్రీయుతులు బసవ రాజు అప్పారావు, గరిమెళ్ల సత్యనారాయణ గురజాడ రాఘవశర్మ, ప్రయాగ నరసింహశాస్త్రి, మంగిపూడి వెంకటశర్మ, బలిజేపల్లి లక్ష్మీకాంతము, అడివి బాపి రాజు, దుగ్గిరాల బలరామకృష్ణయ్య మున్నగు కవులు ఎన్నదగినవారు. వీరి చక్కని గేయములను కూర్చి సంధివచలములను చేర్చి 'కరుణశ్రీ' శ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రిగారు ఒకనాటికను రచించినారు. అదియే 'గేయసాహిత్యంలో గాంధీజీ'. సత్యం, శాంతి, శివం, సుందరం, కాంతి ఈనాటికయందలి పాత్రలు.

"గాంధిమహాత్ముడు బయలుదేరగా కలకలనవ్వింది - జగత్తూ కలకల నవ్వింది." "శ్రీ గాంధినామం మరువాం మరువాం - సిద్ధము తైలుకు వెరువాం వెరవాం". "అంతా గాంధీమయం ఈ జగమంతా గాంధీమయం" వంటి ప్రసిద్ధమైన ఇరవై పాటలతో, కమనీయమైన 'కరుణశ్రీ' వచనములతో ఈ నాటిక సాగును. మహాత్ముని మద్యపాన నిషేధము, సహాయ నిరాకరణోద్యమము, ఉప్పు సత్యాగ్రహము, 'క్విటిండియా' ఉద్యమము, స్వాతంత్ర్య సముపార్జనము, భారతదేశ విభజనము, మహాత్ముని నిర్యాణము వంటి సన్నివేశములిందున్నవి.

ఈ నాటిక 1-12-1969 నాడు ఆకాశవాణి విజయవాడ కేంద్రము నుండి ప్రసారమైనది.

## (పద్యగేయనాటికలు)

**శిష్యురాలు :**

దేశచరిత్రల విశేషములను, ప్రసిద్ధ పురుషుల జీవితములందలి రసమయ ఘట్టములను తమ హృదయమునందు పొదిగికొని, వానిని కవితారస పరిమళార్ద్రముచేసి దృశ్యకావ్యములుగా సాహిత్యజగత్తుకు సమర్పించిన వారు శ్రీతల్లావజ్ఝల శివశంకరస్వామిగారు. వారు పద్యగేయాత్మకముగా రచించిన నాటికలలో మొట్టమొదటిది 'శిష్యురాలు'. అంతియేగాక పద్యగేయాత్మకమైన సుప్రథమచారిత్రకనాటిక కూడ ఇదియే అగుచున్నది.

'శిష్యురాలు' సంవాదాత్మకమైన చిన్ననాటిక. రెండు భాగములుగా పరచుకొన్న ఈ నాటికయందలి పాత్రలు - శిష్యుడు. మీరాబాయి, శ్రీరూపగోస్వామి.

ప్రసిద్ధ కృష్ణభక్తురాలైన మీరాబాయి బృందావనక్షేత్రములో ప్రవేశించి శ్రీరూపగోస్వామి ఆతిథ్య సాన్నిధ్యముల నొందుట ఈ నాటికయందలి ఇతివృత్తము. ఈ నాటిక చిన్నదైనను, ఇందలి సంభాషణలు సంక్షిప్తములై సరళసుందరములై అభినయానుకూలములై గానయోగ్యములై నడచినవి. భక్తిరసాత్మకమైన ఆవేశము రచనయందంతటను వ్యాపించి సహృదయులయందు కుతూహలమును రేకెత్తించుచు, నాటిక పూర్తియగువరకును వారిని విడువదు. మీరాబాయి పాత్రపోషణము మిక్కిలి హృద్యము

ఒకొక పాత్రకు ఒకొక ఛందమును ప్రయోగించు శ్రీ స్వామివారి ఛందఃశిల్పము ఈ నాటికతోనే ఆరంభమగుచున్నది. తేటగీతులు, ఆటవెలదులు

చోటుచేసికొన్న ఈ నాటికకు, ముత్యాలసరాలలో మాటాడు మీరాబాయి పాత్ర ద్వారముననే గేయవాతావరణము కల్పింపబడినది.

"నేడు సుదినమమ్మ నిన్నుగాంచుటజేసి
భక్తజనములందు ప్రథితవీవు
సిద్ధురాలి కేను చెప్పెడి దేముండు ?
నిలువవచ్చు నిచట నీవుతల్లి!

"ఆడువారలు కృష్ణదేవుని
జూడగూడదొ ? యెచట నేనీ
జాడగానగలేదు మీకడ నేడుకనుగొంటిన్" వంటి పద్యగేయములు ఈ నాటికయందలి సరసమైన శైలికి సంభాషణాసారళ్యమునకు తార్కాణములు.

శ్రీ శివశంకరస్వామివారు పద్యగేయనాటికల రచనకు పూనుకొన్న సంవత్సరము 1924. వారి ప్రథమ పద్యైకనాటికయైన 'దివ్యలోచనములు'ను ప్రథమ పద్యగేయాత్మకనాటికయైన ఈ 'శిష్యురాలు' ను ఈ సంవత్సరముననే రచింపబడినవి. అందువలన ఈ నాటిక శ్రీ శివశంకరుల నాటికా ప్రారంభ దశను తెలియపరచుచున్నది ప్రారంభదశయందే రమణీయరచనాశిల్పసౌందర్య రేఖ లున్న ఇట్టి నాటికలు వారి భవిష్యన్నాటికాచిత్రరచనాసమగ్రశోభకు దారితీసినవని భావింపవచ్చును.

## పద్మావతీచరణచారణచక్రవర్తి :

శ్రీ శివశంకరస్వామివారు బహుభాషావేత్తలు. అందులోను సంస్కృతమందు వారికి అవధిలేని అభిమానము, అభినివేశము. వారు సంస్కృతకావ్య కుసుమ సౌందర్య సౌరభమకరందాలను ఆలోకించినారు, ఆఘ్రాణించినారు, ఆస్వాదించినారు. గీర్వాణవాణిని కావ్యపారిజాతములతో నలంకరించిన మహా కవిపండితుల ఆలంకారికుల జీవితములందలి రమణీయములైన ఘట్టములను గ్రహించి తమ ప్రతిభాపాండిత్యముల తో వానిని కమనీయకావ్యములుగా మలచినారు. ఇట్లు మలచిన వానిలో 'పద్మావతీచరణచారణచక్రవర్తి' అను పద్యగేయాత్మకమైన నాటిక ప్రథమమున పేర్కొనదగినది. మూడురంగము

లున్న ఈ నాటికయందలి పాత్రలు — పద్మావతి, జయదేవుడు, పరాశరుడు, లక్ష్మణసేనుడు, మహేశ్వరభట్టు, వామదేవదీక్షితులు, నీలకంఠముఖి, ఉమాపతి, ధోయీకవి, గోవర్ధనాచార్యులు.

శ్రీకృష్ణభక్తుడును, గీతగోవిందకావ్యకర్తయును అయిన జయదేవ మహాకవి జీవితమునందలి ఒక రమణీయ ఘట్టమును ఈ నాటిక చిత్రించుచున్నది. జయదేవునకు 'పద్మావతీ చరణచారణచక్రవర్తి' అను బిరుదము ప్రసిద్ధము, ఈ విషయము అతని—

"వాగ్దేవతా చరితచిత్రితచిత్తసద్మా
పద్మావతీచరణచారణచక్రవర్తీ
శ్రీవాసుదేవరతికేళికథాసమేత
మేతం కరోతి జయదేవకవిః ప్రబంధమ్" అను శ్లోకము

వలన విదితమగుచున్నది. జయదేవుని భార్య పద్మావతి. పద్మావతీచరణచారణ చక్రవర్తి' అనగా 'పద్మావతి పాదములచే నాట్యము సేయించుటయందు నేర్పరి' అని అర్థము. జయదేవునకు ఈ బిరుదమెట్లువచ్చినదో, అది యెట్లు సార్థకమో ఈ నాటిక చక్కగా చిత్రించుచున్నది.

గౌడలక్ష్మణభూపతి సభలో జయదేవమహాకవి తన గీతగోవిందకావ్యమును గానముచేసి, విశేషసన్మానములతోపాటు 'పద్మావతీచరణచారణచక్రవర్తి' బిరుదును పొందుటయు, సన్మానవిశేషములను తన భార్య పద్మావతికి వివరించి, మణి నూపురములను బహూకరించిన మహారాజ్ఞి అభిమతానుసారము వానిని జయదేవుడు భార్యకలంకరించి ఆమెచే నాట్యము సేయించుటయు ఈ నాటిక యందలి ఇతివృత్తము.

తన పేరును తొలగించవలసినదని పద్మావతి ఎంత ప్రతిమిలాడినను వినక జయదేవుడు తన కావ్యమున ఆమె పేరు పేర్కొన్న — 'పద్మావతీ చరణ చారణ చక్రవర్తి' – 'జయతి పద్మావతీరమణ' – 'విహిత పద్మావతీ సుఖసమాజే' అను మూడు సందర్భములును సభలో రాజకుటుంబ విశేష సన్మానాదరణములకు పాత్రమగుట ఈ నాటికయందలి రమణీయాంశము.

ఈ రూపకమందలి సంభాషణలు కమనీయశైలిలో కవితాత్మకముగా సాగినవి. సంక్షిప్తతను సంతరించుకొన్న సంవాదములు అభినయానుకూలముగా రూపుదిద్దుకొన్నవి.

నాటికలోని రెండవరంగమందు — రాజసభా సన్నివేశములో కవి పండితులు వెలిబుచ్చిన సందేహములు, సమాధానములు, ప్రశ్నలు, వివరణలు శ్రీ శివశంకరస్వామివారి కూలంకష సాహిత్యశాస్త్ర పరిజ్ఞానమును, సునిశిత విమర్శనాపటిమను సువ్యక్తము సేయుచున్నవి.

ఈ నాటికయందలి మనోహరవర్ణనలకు ఒకటి-రెండు ఉదాహరణములు. జయదేవుని "హస్తగతమైన నీలకౌశేయబద్ధ మనోజ్ఞ ప్రబంధమ్ము" "రాధికా దృఢ పరీరంభమందున్న గోవిందు"ని పోలియున్నదట. "లలితమణిమయ భూష ణాలంకృతమైన పద్మావతి తనూలత, "పల్లవితయైన వాసంతవల్లివోలె - శాణితంబైన పుష్పేషు శరమువోలె" భాసించినదట.

ప్రతిపాత్రయు హృద్యముగా పోషింపబడినది ఈ నాటికలో. జయదేవుడు మహాకవిగా, మధురగాయకుడుగా, వినయశీలుడుగా, పద్మావతీ ప్రణయ మూర్తిగా, పరాశరాప్తమిత్రుడుగా, కవిపండిత విధేయుడుగా చిత్రింపబడినాడు. పద్మావతి లలితకళాభిజ్ఞగా, ప్రేమమూర్తిగా, పద్మావతీభక్తురాలిగా, భర్తృ హృదయానుకూలగా కనులముందు నిలుచును.

తేటగీతులతో, ఆటవెలదులతో, సీసకందములతో, మంజరీద్విపదలతో ఈ నాటిక యందలి రెండురంగములు సాగును. మూడవరంగమున వీనికితోడు ముత్యాలసరములు ప్రవేశించుటతో నాటికలో గేయత్వ మధికమగును. మంజరీ ద్విపదలతో మారాకులు హత్తిన గానాంశము, ముత్యాల సరములతో మొగ్గలు తొడుగును. ఏమైనను పద్యగేయాత్మకమైన ఈ నాటికయందు పద్యమే బహుళము. గీతగోవిందమందలి కొన్నిశ్లోకములను, అష్టపది పంక్తులను ప్రయోగించుట ఔచి తీభాసురమై నాటకీయతను ఇనుమడింపజేయుచున్నది.

అనేక నగరాలలో అనేక పర్యాయములు ప్రదర్శితమై కళాహృదయుల కవిపండితుల ప్రశంసలకు పాత్రమైనది ఈ నాటిక. దీనినిగూర్చి మరికొన్ని వివ రములను అనుబంధము (1-క) నందు చూడనగును.

ప్రధానముగా ప్రాచ్యసాహిత్య పఠనము వలననే, అందును గీతగోవిందము వంటి గేయకృతుల ప్రభావముచేతనే శ్రీ శివశంకరస్వామివారు పద్యగేయనాటి కారచనకు పూనుకొన్నారనుటకు నా 'పద్మావతీ చరణచారణచక్రవర్తి' ఒక నిదర్శన మనవచ్చును.

**దీక్షితదుహిత :**

పదునారవ శతాబ్దికి చెందినవారును, అఖిలనిగమధర్మశాస్త్ర పారంగతులును అయిన అప్పయదీక్షితుల జీవితమునందలి ఒక ఘట్టమును రసాత్మకముగా చిత్రించు ఈ నాటికను శ్రీ శివశంకరస్వామివారు రచించినారు. అనుశ్రుతముగా వచ్చు ఒక ఐతిహ్యరేఖనుగ్రహించి సమగ్రసుందరమైన ఈ రూపక చిత్రమును నిర్మించినారు శ్రీ స్వామివారు. మూడురంగములుగల ఈ నాటికయందలి పాత్రలు—మంగళాంబ, చంద్రమౌళి, సరసవాణి, మరకతవల్లి, అప్పయదీక్షితులు.

అప్పయ దీక్షితుల కుమార్తెయు, బాల్యవితంతువును అయిన మంగళాంబయు, అప్పయదీక్షితుల శిష్యుడైన చంద్రమౌళియు పరస్పరము ప్రేమించుకొని వివాహమాడవలెననుకొనుటయు, అందుకు దీక్షితులు మొదట వారి వివాహమును శాస్త్రప్రకారము సమర్థింప యత్నించియు చివరకు సంప్రదాయ వృద్ధాచార బ్రాహ్మణ్య ధర్మములే ప్రధానమని వారి పరిణయమునకు సమ్మతింపక పోవుటయు, భగ్నప్రేమికుడైన చంద్రమౌళి గుర్వాజ్ఞను తలదాల్చి సేతుస్నానమునకే వెడలిపోవుటయు చిగురించిన ఆశలు తెగిపోగా మంగళాంబ కన్నీరు మున్నీరుగా విలపించుటయు ఈ నాటికయందలి ఇతివృత్తము.

విషాదాంతమైన ఈ నాటికయందలి పాత్రలు ఎంతో జాగరూకతతో చిత్రితములైనవి. అప్పయదీక్షితులు ధర్మశాస్త్రవేత్తగా, ఆదర్శాచార్యుడుగా, విద్వత్కవిగా, పరమకారుణికుడుగా సహృదయుల ప్రశంసల నందుకొనును. దీక్షితుల పాత్రలో శ్రీ శివశంకరుల శాస్త్ర పరిజ్ఞానము, మానవతాదృక్పథము ప్రతిబింబించును. సరసవాణి మానసిక శాస్త్ర పరిజ్ఞాతగా, కరుణాస్వాంతగా, చతురభాషిణిగా, మానవతామూర్తిగా కనులముందు కదలాడును. మంగళాంబా చంద్రమౌళులు ప్రణయమూర్తులుగా సాధువర్తనులుగా సంగీత కవితా కళా సాధకులుగా అమాయికులుగా చివరకు విషాదనాయికానాయకులుగా కన్నీరు తెప్పింతురు.

సంక్షిప్తములును, అభినయానుకూలములును అయిన సంభాషణలు రసస్ఫూర్తికై అక్కడక్కడ ఆగుచు సాగినవి. పద్యగేయాత్మకసంవాదము లింత మధురముగా సరళముగా సాగిన సందర్భములు గేయనాటికలలో అరుదుగా కనిపించును. సన్నివేశములందు ఏ విషయము నెక్కడ చెప్పించ

వలయునో అక్కడ చెప్పించు నిర్మాణ శిల్పము ఈ రూపకమున అడుగడుగున విశదమగును. ఉదాహరణమునకు - అప్పయదీక్షితుల ముగ్గురు కోడుకుల ప్రసక్తి, అల్లుని ప్రసక్తి రెండవరంగము చివర ఒక్క ముక్కలో దీక్షితుల ముఖతః బయల్పడును. అంతకు ముందును ఆ తరువాతను వారి ప్రసక్తి అగుపడదు.

ఈ నాటికయందు అక్కడక్కడ విద్యుల్లతలవంటి వర్ణనలున్నవి. ఉదాహరణమునకు —

"హంసకమ్ములు లేని నీ యడుగుదోయి
అలికిడి రవంతలేక జలాశయమ్ము
నందు విహరించుచుండు రాయంచనడక
నను కరించెను మంగళా ! అందమందు"

అను మంగళాంబ 'అడుగుదోయి' అభివర్ణనమును

"నాకలోకాంగనా వీటికాకరండ
మండితోన్నత నవసుధా ఖండమట్లు
విరియుచున్నాడు శశి యుడువీథియందు
కళలు త్రిజగదుద్దీపనకారణుండు"

అను చంద్రవర్ణనమును పేర్కొనవచ్చును.

'దీక్షితదుహిత' యందు తేటగీతులు, ఆటవెలదులు, మంజరీ ద్విపదలు ముత్యాలసరాలు మున్నదు గేయములేకాక కొన్ని సంస్కృత శ్లోకములు, సంస్కృత వాక్యములు కూడ ప్రయుక్తములైనవి. మంగళాంబ, అప్పయ దీక్షితులు, చంద్రమౌళి పాత్రల ముఖతః వీనిని పల్కించుట పాత్రౌచిత్యము. ఈ నాటికయందలి 'స్వరమేళ' కల్పనము శ్రీ శివశంకరస్వామివారి నాటకీయతా శిల్ప నైపుణ్యమునకు నిదర్శనము. రసోత్పత్తికి అది కావించు దోహదము అసాధారణము.

ఈ నాటికారచనాకాలమునాటికి కందుకూరి వీరేశలింగంపంతులు గారు ప్రారంభించిన వితంతువివాహాదిసాంఘికసంస్కరణోద్యమాలకు ఇతోధికమైన ఆదరణమేర్పడి ప్రాచుర్యమునందుకొన్నవి. ముఖ్యముగా

అప్పటి రచయితలలో పలువురు ఈ సంస్కరణోద్యమమునకు బాసటగ నిలిచిరి. శ్రీ శివశంకరస్వామివారు తమకంటె మూడు శతాబ్దములక్రితము జరిగిన ఈ ఘట్టమును చిత్రించుట వారి సంస్కరణాభిలాషను వ్యక్తము చేయుచున్నది.

ఈ నాటిక కవిసమ్రాట్ శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారికి అంకిత మగుటలోని ఔచిత్యము గమనార్హము.

**కవిప్రియ :**

పద్యగేయాత్మకమైన ఈ నాటికయును శ్రీ శివశంకరస్వామివారిదే. సంస్కృతమందలి బిల్హణచరిత్ర, విక్రమాంకదేవచరిత్రములనుండియు, జన ప్రసిద్ధ గాథలనుండియు కొన్ని అంశములు గ్రహించి రసోచితముగా మార్పులు చేసి శ్రీ స్వామివారు ఈ రూపకమును నిర్మించినారు. ఐదురంగములున్న ఈ నాటికయందలి పాత్రలు - యామినీదేవి, కేరళిక, మందారమాల, బిల్హణభట్టు కోటిపాలుడు, రాజు (మదనభూపతి), రాజగురువు, అమాత్యుడు.

కవితాకళాకోవిదులును, నిర్మలానురాగమూర్తులును అయిన యామినీ బిల్హణుల ప్రణయగాథను చిత్రించు నాటిక కవిప్రియ.

తన కూతురు యామినీదేవికి సాహిత్యశాస్త్రమును, కవితారచనను నేర్పవలసినదిగా కాశ్మీరదేశ నివాసియును, విద్వత్కవియును అయిన బిల్హణుని రాజు మదనభూపతి దేశికునిగా నియమించుటయు, యామినీబిల్హణులు పరస్పరము ప్రేమించుకొనుటయు, ఈ విషయమును తెలిసిన రాజు, బిల్హణుడు చేసినది అంతఃపుర ద్రోహమని యెంచి అతనికి శూలవేధ శిక్షను విధించుటయు, చివరకు యామిని ప్రార్థనను మన్నించి, వారి నిర్మలానురాగమును గ్రహించి, బిల్హణుని శిక్షను నిషేధించి, అతనిని రాజ మర్యాదలతో నలంకరించి తీసికొని రావలసినదిగా కోటిపాలునాజ్ఞాపించుటయు ఈ నాటికయందలి కథ.

ఈ నాటికకు 'కవిప్రియ' అను పేరు పెట్టుట సముచితముగానున్నది. యామినీ బిల్హణులలో యామినియే ప్రణయమును తీగసాగించుటలో ప్రథమ స్థానము వహించినది. 'కవిని కవిరాజు' చేసిన క్రమమూర్తి ఆమె. అందుకే శ్రీ శివశంకరులు ఆమెను కవినోట ——

"సరసభంగిని గురుశిష్య సంప్రదాయ
బంధపరివర్తన క్రియా ప్రవణమూర్తి
ప్రణయజీవి కవిప్రియా ప్రథమమూర్తి"

అని మొట్టమొదటిసారిగా పలికించినారు.

"అవనిపతిపుత్రికా నామమైనగాని
కలిసిపోవును విస్మృతిగర్భమందు
కాని అక్షయ్యమగునాథ, కనకవర్ణ
రంజితంబు కవిప్రియా రమ్యగాథ"

అని యామినినోట కూడ కవిప్రియ అనిపించినారు.

సరసమధురములును, సంక్షిప్త సుందరములును సంగీతాభినయానుకూలములునయిన సంభాషణలను నడిపించుచు, సందర్భోచితముగా బిల్హణీయమునందలి రసమయ శ్లోకములనుటంకించుచు శృంగారరసబంధురముగా కవితాకళా కమనీయముగా వివిధ చ్ఛందోమహితముగా ఈ నాటికను రచించి కవిలోకప్రియులైన యామినీ బిల్హణులను జనలోకమునందు నిలిపినారు శ్రీ శివశంకరస్వామివారు.

ఈ నాటికలోని కాశ్మీరదేశాభివర్ణనము శ్రీ స్వామివారి భౌగోళిక పరిజ్ఞానమును, ప్రకృతి వర్ణనా నైపుణ్యమును ప్రదర్శించుచున్నది.

ఈ 'కవిప్రియ'ను శ్రీ శివశంకరస్వామివారు తమకు ఆత్మీయులును సత్కవులునయిన శ్రీ నోరినరసింహశాస్త్రిగారికి అంకితముచేయుట ఒక విశేషము.

**పదాంకము :**

కల్హణుని 'రాజతరంగిణి' ఆధారముగా. శ్రీ శివశంకరస్వామివారు ఈ 'పదాంకము'ను వ్రాసినారు. క్రీ.శ. ఎనిమిదవ శతాబ్దికి చెందిన ఒక కాశ్మీర ప్రభువు జీవితమందలి ఒక ఘట్టమును చిత్రించురూపకము 'పదాంకము'. ఇందలి పాత్రలు లలితాదిత్యుడు, బంభరకుడు, సువర్ణప్రభ, మహాపద్మ, నీలలోచన, మనోరథుడు, బ్రాహ్మణబృందము, పరివారజనము.

కాశ్మీరదేశప్రభువైన లలితాదిత్యుని అతివేలమైన విషయలౌల్యము

అతని ప్రియురాలి (నీలలోచన) పదాంకచిహ్నితమైన దుకూలమును ధరించు కొను స్థితికి దిగజారిచ్చినగాథ ఈ నాటికలోని వస్తువు.

ఈ రూపకమున రాజు కామశంత్రాభిషిక్తుడుగా, నృత్యగాన పానమత్తుడుగా, కూటనీతికుశలుడైన చాటుకారుని కీలుబొమ్మగా, పితృద్రోహాత్మజ ప్రజా దూషకుడుగా, లాసికాదాసుడుగా చిత్రింపబడిన తీరు హృద్యము.

అంతస్సూత్రమునకు భంగమురాకుండ సంభాషణలను సహజసుందరముగా గద్యముకన్నను సులభముగా వడపుటలో శ్రీ శివశంకరులు అగ్రేసరులు. వారికి గల కవితావేశము, భాషాపటిమ, రచనాశిల్పము, భావనాబలము, రూపకనిర్మాణ వైశారద్యము అనన్యసాధారణము. ఏతాదృశలక్షణములు వారి ప్రతి పద్యగేయ నాటికయందును స్పష్టముగా గోచరించును

నాయిక రాజనర్తకియగుటచేతను, నాయకుడు లలితకళా వినోదియగుట చేతను, నృత్యములతో గానములతో బృందగీతులతో వాద్యవిశేషములతో నాట్య వేషములతోనిండిన ఈ నాటిక ప్రదర్శనలో ప్రేక్షకులను రసానందతన్మయులను చేయుచు గేయనాటికా ప్రాశస్త్యమును ముక్తకంఠముతో చాటును.

మంజరీద్విపదలతో, గేయములతో, సంస్కృతశ్లోకములతో, తేటగీతులతో, ఆటవెలదులతో సాగిన ఈ నాటికలో ఐక్యత్రయము (Three unities) పాటింపబడినది.

**చండీదాసు :**

ప్రసిద్ధ వంగకవియైన చండీదాసుని విచిత్ర ప్రణయగాథను చిత్రించు ఈ రూపకమును సాహిత్యసంగీతకోవిదులు శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావుగారు రచించినారు. ఐదురంగములుగల ఈ రూపకమునందలి పాత్రలు - చండీదాసు, నకులదాసు, రామిని, పూజారులు, ధర్మకర్తలు, సాంఘికులు, రజకజనము.

రాధాకృష్ణుల మధురభక్తి ప్రణయముతో తన చిత్తసంస్కారమును పెంపొందించుకొన్న భక్తకవి చండీదాసు అతని ప్రియురాలు 'రామిని' అతనికి బ్రాహ్మీస్వరూపిణి. దివ్యమూర్తి. భౌతికములైన సంప్రదాయములకును, మూఢవిశ్వాసములకును బలియై, దివ్యత్వమును అర్థము చేసికొనలేని ఛాందసులైన బ్రాహ్మణులు ఎంత అపార్థము చేసికొన్నను, చండీదాసు లోకాతీతమైన

తన ప్రణయమును మానుకొనక తన ప్రణయినితో ఎటకో వెడలిపోయినగాథ ఈ నాటికకు వస్తువు.

పద్యగేయాత్మకమైన ఈ నాటికయందలి కథను, సంభాషణలను సంగీతాత్మకముగా నిర్వహించినారు శ్రీ రజనీకాంతరావుగారు. నీరసత, శుష్కత, మచ్చుకైనను కానిపించదు. గేయములు కవితాసుగంధిలములై, ఆలంకారిక శైలీ సముద్దీప్తములై సాగినవి.

"మనప్రేమ
సస్యసౌందర్య భూములలో
ప్రభవించి ప్రభవించి
నమ్రమరుసీమమగునో
కమ్రసుమ ధామ మగునో
మన ప్రేమ............
కల్లోలినీ తరంగములన్
పయనించి పయనించి
శీర్ణ సికతాద్రియగునో
పూర్ణకలశాబ్ధి యగునో
మన ప్రేమ............
కాలగాఢాగ్ని కీలలలో
తపియించి తపియించి
దగ్ధ తరుకాండమగునో
ముగ్ధమధుభాండమగునో"

వంటి గేయపంక్తులు సంగీతసాహిత్యములు సరసముగా సమ్మేళనముపొందిన ఈ నాటికయందలి రచనకు ఉదాహరణములు.

చండీదాసు ఆడినమాట, పాడినపాట అతనిని రసవత్కవిగా నిలబెట్టుచున్నవి. అతడు రామినిని 'జన్యరాగిణి', 'జగజ్జనని', 'అనంతప్రేమఖని', జీవననందిని', 'సాధర్మ్యస్వరూపిణి' 'చకితరవి శశితారకా ప్రభావ్యాపిని', 'విశ్వసుందరి', 'వేదమాత' 'గాయత్రి' అని సంబోధించిన సరణి ఆతని విశ్వప్రణయమును, భక్తిమార్గ వైశిష్ట్యమును అభివ్యక్తము సేయుచున్నవి, రామిని 'చదువు

తెరుగనట్టిదైనను. వేదరాశైనను 'పంకజాంగన'గా పరిమళించి, 'అకలంక తేజో ఘనుడై'న ఆ 'ప్రభాకరమూర్తి'ని అందుకొనగలిగినది.

ఈ నాటికయందలి సంస్కృతశ్లోకాలు, శ్లోకపంక్తులు, దేవాలయ దివ్య వాతావరణమును చక్కగా కల్పించుచున్నవి. ఇందలి బృందగీతములు కథా గమనమును సంగీతసుందరముగా నిర్వహించుచు, పన్నివేళ తీవ్రతను సాధించుచు, పాత్రల చిత్తవృత్తులను రసరమ్యముగా వ్యంగ్య స్ఫూర్తితో వ్యాఖ్యానించినవి. పూర్వరంగమునందలి బృందగీతియందు, వాల్మీకి, కాళిదాస, జయదేవుల పంక్తిని చండీదాసుని పేర్కొనుట అతని కవితా భక్తి వ్యక్తిత్వముల ప్రామాణికతను ప్రస్ఫుటీకరించుటయే. ఉత్తర రంగము "మాధవదేవుని మధువనము జగము రాధా రమణీ జీవనము" అని చండీదాసుని భక్తితత్వమును ప్రతిపాదించినది.

కందములతో తేటగీతులతో గేయములతో 'తారస్థాయి'లో సాగిన ఈ నాటిక 22-2-1941 నాడు మద్రాసు రేడియో కేంద్రమునుండి ప్రసారమైనది.

**లకుమాదేవి** :

ఇదొక విషాదాంతనాటిక. రచన శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావు గారిదే. "శ్రీ భావరాజు వేంకటకృష్ణరావుగారు, కొన్ని చరిత్రాధారములపై ఊహించి కల్పించిన కథ – ఈ నాటికకు ఆధారము" అని నాటికారంభమునకు ముందే తెలిపినారు శ్రీ రజనీకాంతరావుగారు.

నాలుగురంగములున్న ఈ చారిత్రక నాటికయందలి పాత్రలు – కుమార గిరి, కాటయవేమన, లకుమ, వంది మాగధబృందము, మరికొందరు స్త్రీ పురుషులు. ఆయాసందర్భములందు కథా కథనబృందము, వదంతిబృందము ప్రయుక్తములైనవి.

కర్పూరవసంతరాయలు కుమారగిరి ప్రభువును వలచివలపించుకొన్న నర్తకి లకుమ. లకుమావసంతరాయల ప్రణయమునకు ఈరసపడి కొందరు లేవదీసిన వదంతులకు కుమారగిరి వశుడై లకుమను మేడమీదినుండి దూకి సాశీల్యమును ప్రకటించుకొనుమని ఆజ్ఞాపింపగా ఆమె తన స్నిగ్ధ ప్రణయమును నిరూపింపనెంచి మేడమీదినుండి దూకి గుండెలో బాకుతో పొడుచుకొని ప్రాణములను వదలును. ఈ నాటికా కథాసారమిది.

ఈ నాటికయందు బృందగీతులను కథాకథన బృందమును ప్రయోగించి శ్రీ రజనిగారు కథను సంగీతాత్మకముగా నడిపించినారు వసంతిబృందము ద్వారమున కథలో ఒక మలుపును స్వల్పవ్యవధిలో సాధించినారు. ఇది గేయ నాటికా ప్రయోగ కోవిదులకుగాని అందని అంశము. కుమా నృత్యసన్నివేశము జరుగగానే 'జయతి మహిమాలోకాతీతః' అను చారిత్రక సంస్కృత చాటుశ్లోక మును పేర్కొనుటచేత నాటికకు ఒక చారిత్రక వాతావరణము, గాంభీర్యము సిద్ధించినవి. ఈ నాటిక యందలి మొట్టమొదటి బృందగీతి నాందీశ్లోకమువలె కథా సూచనము చేసినది.

ఈ నాటికయందలి – "విషాదమేఘాంబు పూర వికిర కేశపాశముతో.
హృదయము చిదికిన ఏ సతి వదనమ్మో ఆకాశము.
జగదరిష్ట కారియైన ధూమకేతువాలమో,
ఛిన్నహృదయ రక్తరాగరంజిత కరవారమో,"

వంటి పంక్తులు కవితాత్మకములు గేయములతో కందములతో ఆట వెల దులతో తేటగీతులతో సాగిన ఈ నాటిక "వినువారికి కనువారికి హృదులు కరగు ఆర్ద్రగాథ"

**బిల్హణీయం :**

పద్యగేయాత్మకమైన ఈ నాటికను రచించినవారు శ్రీ మల్లవరపు విశ్వేశ్వరరావుగారు ఆకాశవాణి ప్రసారముపొందిన ప్రప్రథమగేయరూపకము బిల్హణీయమే అని డా॥ పి ఎస్ ఆర్ అప్పారావుగారు తమసిద్ధాంతగ్రంథము నందు తెలిపినారు.[1]

ఐదు దృశ్యములుగా విరిసిన ఈ నాటికయందలి పాత్రలు – మదనాభి రామనృపతి, యామినీపూర్ణతిలక, మంత్రి, ముగ్గురు పండితులు, బిల్హణకవి, కింకరుడు.

ప్రసిద్ధ సంస్కృత కవియైన బిల్హణుడును మదనాభిరామనృపతి కుమార్తె అయిన యామినీ పూర్ణతిలకయును పరస్పరము ప్రేమించుకొని, విమలానురాగ ముతో విషమపరీక్షలనెదుర్కొని వివాహము చేసికొన్న ప్రణయగాథయే ఈ నాటికయందలి ఇతివృత్తము.

---

1. తెలుగునాటక వికాసము – పుట 495.

శ్రీ విశ్వేశ్వరరావుగారు ఈ నాటికయందు సంక్షిప్తములును మనోహరములును అయిన వర్ణనలు చేసినారు. తెరవెనుకనున్న యామినీ పూర్ణతిలక – "మరుగువడిన గంధకుసుమ మట్టుల" ఉన్నదట. ఆమె మూర్ఛపోయినపుడు – "శారదనీరద శకలము"వలె నున్నదట. ఇందలి గేయములు ఆవేశముతో అంత్యప్రాసలముక్తాయింపులతో నడిచినవి. శబ్దము యొక్క బరువును పరిమళమును నాదసౌందర్యమును తెలిసిన కవిశిల్పి శ్రీ విశ్వేశ్వరరావుగారు.

"స్వప్నసీమలో గుప్తకోరకము
రక్తులోలుక మేల్కొన్నదిలే
అప్రయత్నముగ ముక్తప్రణయము
గట్లనొరసిపొంగెత్తెనులే"

వంటి పంక్తులు గేయగత్యావేశసౌందర్యములకు ఉదాహరణములు.

నాటికాదియందున్న 'ప్రవేశిక' లోని కుసుమకోమలి, భృంగరాజముల ప్రణయగానము, సూత్రధారి ప్రవేశము, భరతవాక్యమందలి పుంస్కోకిల పికాంగనల గానము ఈ శ్రవ్యగేయనాటికకు ఒక ప్రత్యేకతను ఆపాదించుచు రచయిత ప్రయోగకౌశలమును నిరూపించుచున్నవి. శృంగారరసతరంగితమైన ఈ నాటికలో ఆద్యంతములందు ప్రణయపాత్రములను ప్రయోగించుట ఔచిత్యమనోహరము కందములతో, బృందగీతులతో, ద్విపదలతో, వియోగినీవృత్తములతో, చతురస్రాది గతులలో సాగిన గేయములతో నడిచిన ఈ నాటిక రసరమ్యము

## రాగహృదయం :

ప్రభా-అశ్వఘోషుల భగ్నప్రణయమును చిత్రించు ఈ నాటికను శ్రీ శేషకుర్తి వీరభద్రాచారి (ఆచారి), శ్రీ పురాణపండ సూర్యప్రకాశ దీక్షితులు. ('ఉపశ్రీ') గారలు కలిసి రచించినారు. గేయపద్యాత్మకమైన ఈ నాటికయందు వసంతోదయం, కళానిలయం, వల్లరీవనం, బౌద్ధవిహారం, శిశిర సంధ్య అను కథా ప్రధానాంశ సూచనాత్మకమైన ఐదుభాగములున్నవి. అశ్వఘోషుడు, ప్రభాదేవి, ధర్మసేనుడు, గౌతముడు, రాగిణి ఈ నాటికయందలి పాత్రలు.

శ్రీయుతులు ఆచారి, ఉపశ్రీగారలు రసవత్కవితాభిషిక్తులు. ఈ నాటికయందలి లలితపదప్రయోగము, శయ్యాసౌభాగ్యము అలంకారికరచనా విన్యాసము వారి ప్రతిభావ్యుత్పత్తులకు అక్షరసాక్ష్యములు. ఈ నాటికలో ఎడనెడ పూర్వకవుల పదప్రయోగ వైచిత్రి పరిమళించుచుండును. ఇందలి దీర్ఘసమాసములతోడి వర్ణనలు పాత్రోచితములు. ఉదాహరణకు—

అశ్వఘోషుడు కవి ఆతని ప్రియురాలు ప్రభాదేవి—

"వసంతరాగసుషమోజ్జ్వల
బాలరసాల శాఖకావాస
లతావినూత్న ప్రసవాసవ
మత్తచలద్విరేఫమాలా
సదృశప్రభాలక" యట

ఆమె "అతిలోక మనోజ్ఞభావ
భంగ్యంతర వ్యంగ్యవైభవ
రసాంచిత కావ్యకథా సరోజపత్రాంత
తుషారబిందుకళీకావృత దివ్యలోచన" యట. ఈ మనోహర

సమాసములు గేయసరస్సులో వికసించిన విశాల - 'ఉత్పల' దళములు ఇక ప్రభాదేవి అశ్వఘోషుని—

"పరిహాసితయమునాలోలలావణ్య
లహరీవిహారిత జటాజూట
పరవశితగాంగతరంగ వీచీశీకర
విలసితవాక్సుధాపూర" అని సంబోధించినది ప్రభాదేవి - అశ్వ

ఘోషుల కళాప్రదర్శన సందర్భమున వెలసిన ఈ సంగీత సాహితీవిలసద్వర్ణనలు రమణీయములై రచయితల ఔచితీస్ఫూర్తిని ప్రకటించుచున్నవి. ఈ నాటిక యందలి వాల్మీకి శ్లోకములు అశ్వఘోషుని కవితావాతావరణమును కనుల ముందు నిలుపును. నాటికాదిలోనున్న ప్రకృతివర్ణన పాత్రల స్థితిని, రసమును వ్యంజించుచున్నది. నేపథ్యబృందగానములు కథాగమనదోహదకాములైనవి. నాటికాంతమునగల భరతవాక్యములోని "కళాతపస్వి నిరంతరాతిలోక సౌంద

ర్యాన్వేషణలో ఉదాత్తరచనలు ఆవిర్భవిస్తాయి.'' అను మాటలే ఈ నాటిక అందించు సందేశము.

తేటగీతులతో, కందములతో, ఉత్పలవృత్తములతో, త్ర్యస్రాదిగతులలో నడచిన గేయములతో రచించిన ఈ రాగహృదయం భీమవరము కళాశాల 'సంస్కృతి ఉత్సవాలలో 24-11-1955 నాడు రచయితల పర్యవేక్షణలో ప్రదర్శింపబడినది; ఆకాశవాణి విజయవాడ కేంద్రమునుండి ప్రసారమైనది

## రుద్రమదేవి :

'రుద్రమదేవి' నాటికను రచించినవారు విఖ్యాత విద్వత్కవులు 'కరుణశ్రీ' శ్రీ జంధ్యాల పాపయ్య శాస్త్రిగారు.

కాకతీయ సామ్రాజ్ఞి రుద్రమదేవి నేతృత్వమున కాకతీయ సైనికులు దేవగిరివల్లభుడైన మహాదేవరాజు నోడించిన వీరఘట్టము ఈ నాటికయందలి ఇతివృత్తము. ఇందు రెండే రెండు పాత్రలు - రుద్రమదేవి, మహాదేవరాజు. ఈ నాటికలో అత్యధికభాగము బృందగానముల ద్వారమునను, నటీమాత్రధారుల వ్యాఖ్యాన గానద్వారమునను నడచును. చిట్టచివరకు మాత్రము రుద్రమాంబ - మహాదేవరాజు పాత్రల సంభాషణలు ప్రత్యక్ష సంవాద సరణిలో సాగినవి.

వీరరసాత్మకమైన ఈ నాటికయందలి పద్యగేయములు కరవాలఝాంకార, భేరీనినాదాలను, మణికిరీటాల తళతళలను సంతరించుకొని ఉత్సాహావేశములతో, ఉరకలెత్తుచున్నవి. ఇందలివర్ణనలు రమణీయభావనోద్దీప్తములు. ఉదాహరణమునకు-

> "ఏకశిలకోటలోని ప్రత్యేకశిలయు
> ధీరగంభీరగతుల రాత్రింబవళ్ళు
> గానమొనరించు గద్గదగళము వెత్తి
> రాణిరుద్రమ్మ శౌర్యధైర్యాలగాథ"
>
> "కాకలెత్తువీరరసము కాకతి గణపతి దేవుడు
> వీరము వెన్నంటివచ్చు విజయశ్రీ రుద్రమాంబ" వంటి

పద్యగేయములు వీరరసభేరిని మ్రోగించుచున్నవి; వీరతామూర్తుల రక్తశక్తిని వ్యక్తీకరించుచున్నవి. ఆంధ్రసామ్రాజ్ఞి రుద్రమ భద్రపీఠిపై కూర్చున్నప్పుడు -

"వేయిస్తంభాలకోవెలలోని ప్రతిరాయి తీయతీయని కలల" తేలిపోయినదట! శిల కలగనుట భావనారమ్యము.

"జాతీయకేతన శ్వేతవారాహోగ్ర
దంష్ట్రాప్రభలు మింట తాండవించినయట్లు
శ్రీ స్వయంభూస్వామి చికిలి చిచ్చులకన్ను
చటులకాలానలచ్ఛటలు గురిసినయట్లు
ఏకవీరాదేవి భీకరభ్రుకుటీత
రంగభంగిమములుప్పొంగి పొరలినయట్లు
కాకతమ్మకరాళ కంఠహుంకారాలు
విశ్వరూపముదాల్చి వెల్లివిరిసినయట్ల"

కాకతీయుల దళాలు ముందుకు కదలినవట. కవితారససిద్ధులైన 'కరుణశ్రీ' కలములోని బలమిది.

గేయములతో తేటగీతులతో సీసములతో కదనుత్రొక్కిన ఈ నాటిక 26-9-1963 నాడు ఆకాశవాణి విజయవాడ కేంద్రమునుండి ప్రసారితమైనది.

## (గేయనాటికలు)

**పలితకేశము :**

పద్యముగాని గద్యముగాని ఏమాత్రము లేకుండ గేయైకముగా రచింపబడిన మొదటినాటిక 'పలితకేశము'. తెలుగులో గేయనాటికకు శ్రీకారము చుట్టిన శ్రీ శివశంకరస్వామివారి కృతి ఇది.

భారతదేశమునందు బౌద్ధమతము బహుళవ్యాప్తముగానున్న కాలము నాటి గాథ ఈ నాటికయందలి వస్తువు. ఇందలి పాత్రలు మఖాదేవప్రభువు, విశాఖ, ఉపాలి, ఈనాటిక. ఒక మనోహర సుందర సన్నివేశము. అత్యంత భోగైక జీవి మిథిలానగర మఖాదేవప్రభువు నిజరాజ్ఞిదర్శనార్థమై త్వరితముగా పోనెంచి అలంకరించుకొను సందర్భమున తన తలయందలి పలితకేశమునుజూచి, శరీర మశాశ్వతమని విరక్తి జెంది, బౌద్ధధర్మము స్వీకరించి సన్యాసియగుట ఈనాటిక యందలి కథ. స్వల్పమైన ఈ కథను శ్రీ శివశంకరస్వామివారు నాటికగా మలచిన తీరు హృదయంగమము, కళాత్మకము, భావోద్దీపకము.

ఈ నాటిక యందు మఖాదేవుని భోగపరత్వమును, అలంకార ప్రియత్వమును కన్నులకు కట్టించినారు శ్రీ శివశంకరస్వామివారు. మఖాదేవుని అలంకరణార్థము పాటలీపుత్రమువారు 'వివిధపరిమాణా కృతుల్ గల' విమలదర్పణములు పంపినారట. అతడుపయోగించు తెల్లని వ్యైనలు - "వింధ్యభూధరవనమదస్తంబేరమమ్ముల దివ్యదంత వినిర్మితము"లై నవట. అతడు వాడుకొను సుగంధ తైలములు - "కోసలదేశ వివిధారామసీమలలో మనోజ్ఞ ప్రసవసారమునుండి తీసిన" వట. ఆ సుగంధద్రవ్యములు పరిమళము తరగకుండ "రమ్యచందన పేటికాంతర్గత మనోహర కాచపాత్రికలందు" భద్రపరచబడినవట. ఆ ప్రభువునకు 'ఉపాలి' యనునామె కేశసంస్కృతి చేయును. ఒక యవనబాల అద్దము పట్టును. మృదు పాదపీఠము తెచ్చును. మద్రచామరవాహిని మందమందముగ విసరును విశాఖ యనునామె పాట పాడును. ఇంతరక్తితో భోగమనుభవించు మఖాదేవుడు ఒక్కక్షణములో స్వీయ పలిత కేశదర్శనమాత్రమున విరక్తుడై సన్యాసియగుట - అదియును తన రాణియొద్దకు పోవుటకు ముందు- అన్నదే ఈ నాటిక చిత్రించిన రమ్యాంశము. శ్రీ శివశంకరస్వామివారు మఖాదేవుని రక్తినుండి విరక్తికి మరలించి నాటికలో రసాంతరస్థితిని కల్పించిన వైనము ప్రశంసాపాత్రము.

ఈ నాటికయందలి వర్ణనలు సంక్షిప్తమనోహరములు. పలితకేశములతోడి ధవళశిరస్సును 'హిమాలయ శిఖరి' తో ఉపమించుట మిక్కిలి రమణీయము.

"నిజగళంబున హరుడు విషమును
నిలిపి మృత్యుంజయుండయ్యెను
అగ్నిదగ్ధుడయ్యు బ్రదికిన యాతడెవ్వడగున్?
నా మతంబున, పాటి యెరుగని
నాయకుండొక మనసిజుండే!
అతనుడయ్యును నడపులోకము లాత్మ పాలనలో"

అను మదనమాహాత్మ్య వర్ణనము భావోద్దీప్తము.

శారీరకమైన సౌందర్యభోగములు శాశ్వతములు కావను ఒక భారతీయ సాంస్కృతిక తత్త్వమును ఈ నాటిక కళామయముగా ప్రతీకాత్మకముగా చిత్రించినది. ఈ సందర్భమున శ్రీ శివశంకరస్వామివారి కృతులనుగూర్చి వారి వ్యక్తిత్వమునుగూర్చి ఆంగ్లములో మహాగ్రంథము వ్రాసిన ప్రసిద్ధ పండితులు సాహిత్యాచార్యులు శ్రీ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రిగారి మాటలు పేర్కొనదగినవి.

**"Physical beauty, sensous love and material power are the things of the world that do not endure. This fact is symbolised in the play; and yet the entire scene does not make us feel it is symbolic. Here in lies the artistic alchemy of Sastry. Even symbols come alive in his hands, and they are capable of becoming realistic. They are at the very heart of human life and they continue to move us to action.[1]"**

శ్రీ శివశంకరస్వామివారి గేయనాటికలన్నియును చిన్నవైనను పెద్దవైనను సమున్నత సాహిత్యస్థాయినందుకొన్నవే. సరళ మధురములైన సంభాషణములతో రమణీయములైన ఒకేఒక సన్నివేశముతో రససిద్ధిని సాధించిన ఈ నాటిక పూర్తిగా ముత్యాలసరములలో నడచినది.

**ప్రభువాక్యము :**

ఇదియును శ్రీ శివశంకరస్వామివారి రచనయే. ఇందలి కథ ఉత్కళదేశ చరిత్రకు సంబంధించినది. రెండురంగములున్న ఈ నాటికయందలి పాత్రలు– రూపాంబిక, పురుషోత్తమదేవుడు, మహామాత్యుడు, ప్రతీహారి.

సంవత్సరమునకొకమారు స్వహస్తములతో నీలాచలక్షేత్ర జగన్నాథ స్వామి దేవాలయ సమ్మార్జనము చేయు ఉత్కళాధిపతి పురుషోత్తమదేవుని భక్తి భావమును అవహేళనము చేసిన కాంచీరాజును యుద్ధమున నోడించి, ఆతని కూతురు రూపాంబికను ఒక సమ్మార్జకున కిచ్చి వివాహాము సేయుమని పురుషోత్తమదేవుడు మహామాత్యునాజ్ఞాపించును. రూపాంబిక అంతకుమున్నే ఉత్కళేశుని వరించియుండుటచేత ఆమె తనస్థితిని మహామాత్యునికి తెలుపుకొనును. తన ప్రభువు హృదయమును, రూపాంబికా ప్రణయమును అర్థముచేసికొని మహామంత్రి ప్రభువు సమ్మార్జనము చేయు తరుణమునకు వేచియుండి రూపాంబికను ఆ సందర్భమున కానుకగా నిచ్చును. ఆమె రాజ్ఞి యగును. ఇది ఈనాటిక యందలి కథ. శిక్షగా పరిణమించవలసిన ప్రభువాక్యము శుభోద్వాహముగా రూపొందుట ఈ కథలోని చమత్కారము. కరుణార్ద్రముగా ఆరంభమై దృశ్యా

1. THE MIND AND ART OF SIVA SANKARA SASTRI. (Manuscript)- P. 218.

దృశ్య శృంగార రేఖతో సమాప్తమగు ఈ నాటికలోని సంభాషణములు ఉత్కంఠను కలిగించునవియై పూర్వాపర కథాంశములను హృద్యముగ వ్యక్తముచేయ గలుగుచుండుట యొక విశేషము.

త్ర్యశ్ర చతురశ్రాదిగతులలోను, మంజరీద్విపదలతోను సాగిన ఈ నాటికలో సంగీతాంశ మధికము.

**వరపరీక్ష :**

శ్రీ శివశంకరస్వామివారు రచించిన 'వరపరీక్ష' నాటికలోని కథ రాజస్థాన్ చరిత్రకు సంబంధించినది. విషాదాంతమైన ఈ నాటిక మూడురంగములుగా వరచుకొన్నది. ఇందలి పాత్రలు— జ్యోతిస్సింగు, అలకాదేవి, గంభీరసింగు, దుర్జయసింగు, అమాత్యుడు, సైనికబృందము.

తన ప్రియురాలైన అలకాదేవిని దక్కించుకొనుటకై, ఒక్కదినము పూర్ణముగా ఉపవసించి ఆమె నెత్తుకొని దింపకుండ పర్వతాగ్రమునగల దేవిమందిరము చేరవలెనను విషమపరీక్షకు ఒప్పుకొని అందుత్తీర్ణుడై అసువులుబాసిన జ్యోతిస్సింగు అను వీరక్షత్రియ యువకుని విషాదాంత గాథ ఇది. అలకాదేవియును చురకత్తితో పొడుచుకొని అతనిని అనుగమించిన ఉదంతము ఇంకను కరుణరసాత్మకము.

ఈ నాటికలో మొదటనుండియు భవిష్యద్విపాదఘటనను సూచించు మాటలు పాత్రల నోట వినబడుచునేయుండును.

"ఇది మొదలుగా మనకు నింక నా మరణమ్ము
అద్వైతసిద్ధియే ప్రియురాలా!
"జీవిత పరమావధియే చేకూఱనదీక్షబావ,
ధన్యుడ నీకౌగిలిలో తనువు విడుతునేని ప్రియా !"
"గ్రహియించితివొ లేదొ గాఢసౌఖ్యమునందు
ఉండు ప్రియతమ, అనుమ్యాతమ్ముగా బాధ !"

అను జ్యోతిస్సింగు మాటలు విన్నప్పుడెల్ల వేదనతో హృదయాలు బరువెక్కుచుండును.

ఈ నాటికయందు వీరశృంగారభక్తికరుణరసములు ఉదాత్తముగా పోషింపబడినవి. ఇందులో శ్రీ శివశంకరస్వామివారు ప్రదర్శించిన సంభాషణ చాతుర్యము, రసానుగుణ గతివైవిధ్యము, నాటకీయతా వైదుష్యము అసామాన్యములు.

**యక్షరాత్రి :**

ఆరవ శతాబ్దమునకు చెందిన మాళవదేశ కవయిత్రి వికటనితంబ జీవితము నందలి ఒక ఘట్టమును చిత్రించు నాటిక యక్షరాత్రి. సంస్కృత కవయిత్రి వికటనితంబ రచించినట్లు చెప్పబడుచున్న కొన్ని శ్లోకములను బట్టియు, ఆమె పునర్భువు అను ప్రతీతిని బట్టియు ఈ నాటికను నిర్మించినారు శ్రీ శివశంకర స్వామివారు. వికటనితంబ భర్త విద్యాహీనుడనుటకు —

"కాలేమాషం సస్యేమాసం
వదతి శకాశం యశ్చ సకాశమ్
ఉష్ట్రేలుంపతి రంవాషంవా
తస్మైదత్తా వికటనితంబా"

అను శ్లోకమును విద్వల్లోకము పేర్కొనుచున్నది. మూర్ఖుడైన తన భర్త చనిపోగా వికటనితంబ వరొకరిని పెండ్లిచేసికొనినదనియు, నిరక్షరుడైన తన భర్తతో కాపురము చేయలేక రహస్యముగా చెప్పకుండ వెళ్లిపోయి వేశ్యా వృత్తి నవలంబించినదనియు, ఆమె కవయిత్రి యగుటచే చక్కని కవిత్వము చెప్పినవానికి ఆ రాత్రి తన శరీరము నర్పించుచుండెననియు కొన్ని కథలు వికటనితంబను గూర్చి కల్పితములైనవి. వీనినన్నింటిని పరిశీలించి రసజ్ఞతతో సానుభూతితో మంచిని గ్రహించి, ఇతివృత్తమును అనుకూలముగా కూర్చి, వికటనితంబను నితంబవతిగా మార్చి, కవయిత్రియైన ఆ వితంతువు నొసట కుంకుమ నలంకరించి ఇందురాజు అనుకవితో కల్యాణము జరిపి నాటికను మంగళాంతము చేసినారు సహృదయులు శ్రీ శివశంకరస్వామివారు.

యక్షరాత్రి అనున దొక క్రీడావిశేషమనియు, అది నాగరజనులు చేయు ప్రియాసమాదేశమనియు. శుక్లపక్షరాత్రిలో యక్షులను గూర్చిచేయు ఒక వ్రత విశేషమనియు ద్యూతముతో వినోదించు క్రీడారాత్రమనియు, కార్తికమాస మందలి వెన్నెల రాత్రియనియు, వెన్నెలరాత్రిలో వేశ్యాగృహమున జరుగు

కవితా గాన కళాసంబంధమైన గోష్ఠియనియు రకరకములుగా విద్వద్విమర్శకులచే పేర్కొనబడినది. వీని యన్నింటిలోను "వెన్నెలరాత్రిలో గణికాగృహములో కవిగాయకప్రముఖులు గోష్ఠి చేయుటయే ప్రధానముగా వెంచిన పాశ్చాత్య విద్యులమతమే" తాము స్వీకరించి ట్లును, ఈ నాటికకు యామరాత్రి అని నామకరణము చేయుటకు ప్రబల కారణమదేయనియు శ్రీ శివశంకరస్వామి వారే తెలిపియున్నారు. ఈ నాటికయందలి పాత్రలు - నేమికవి, ఇందురాజ కవి, భీమ:భుడు, మనంద నితంబవతి.

ఒక ప్రౌఢ కవికి ఒక సరస కవయిత్రిని జతచేసి శృంగారలతికకు పూలు పూయించినారు నాటికలో శ్రీ శివశంకరస్వామివారు. ఇందలి ఇందురాజ కవి యాత్రా ప్రబంధము శృంగార రస ప్రసారమునకు దారులుతీసి అనందసస్యములు పండించినది యాత్రా విశేషములందలి గజ విజృంభణ వృత్తాంతము, వక్ర సంఘటన, గాంగనదీ జలస్నానపతన సన్నివేశము, హిమాచల సింహనాదశ్రవణ సందర్భము నాయిక హృదయమును రసార్ద్రముచేసి నాయకుని సన్నిధికి చేర్చినవి.

ఈ నాటికలో నితంబవతి పాత్ర తప్ప తక్కినవి కల్పితములు. ఇందురాజకవి పాత్ర ఉదాత్తముగా చిత్రింపబడినది.

"గణికగాంచినయంత కలుషవర్తనుడనుచు
సజ్జనుల్ నిందింతురా, ఓ సఖా
సత్యమేమో చూడరా ?

"కవివతంసులన్నను శ్రీ కాళిదాసఖారవులే"
"అనుచితంబైన కార్యమైనగదా అపయశమ్ము ?"
"సౌందర్యము శాశ్వతమా ? సద్గుణాలమాటయేమి ?"
"లేదు భూతకాలముపై లేశమైన తలపునాకు
భావికాలమే మనకు ప్రధానమ్ము"

అను ఇందురాజకవిపాత్ర మూలమున శ్రీ శివశంకరస్వామివారు తమ సౌజన్యమును, ఉదాత్తకావ్యరచనా దృక్పథమును, సంస్కృత కవితాసక్తిని, నిర్భీకతను, గాఢానురాగహృదయిమును, ఆశోజ్జ్వలప్రగతిభావమును చక్కగా వ్యక్తీకరించినారు.

"వాంఛాలతికా వాగురలోనే
చేతోహరిణము చిక్కువడునుగద"

వంటి రమణీయకవితా సూక్తులు ఈ నాటికలో చోటుచేసికొన్నవి.

"కవిభూషణ సువర్ణ కాంతమిక్కుటమేమొ" "ప్రాకృత కవులేన మీరు" వంటి చరణములు శ్లేషసంవాసితములు. ఈ నాటికలోని సంస్కృతశ్లోకములు సన్నివేశములకు వన్నెలు దిద్దుచు రసదీప్తికి దోహదము చేసినవి.

"...వికటశబ్దమ్మునకు-
అభిధానమందు రమ్యార్థమున్న విధంబు" తెలిసిన శ్రీ శివశంకరస్వామి వారు వికటనితంబను నితంబవతిగా మార్చి 'వికట' శబ్దమును తొలగించి తమ సరసతను నిరూపించుకొన్నారు. నాటికలో కవిగాయక కవయిత్రుల గోష్ఠి జరిపించి సమకాలిక కవిసమ్మేళనములను స్ఫురింపజేసి వానియందు తమకు గల ఆసక్తిని, కవులను ప్రోత్సహించు అమృతహృదయమును వ్యంజింపజేసినారు శ్రీ స్వామివారు. కవిత్వముపట్లను సంస్కృత ప్రాకృత భాషల పట్లను ప్రేమ తత్త్వము పట్లను శ్రీ స్వామివారికిగల అభిప్రాయములను ఈ నాటిక భంగ్యంతరముగా సూచించుచున్నది.

ఈ నాటికలో ఐక్యత్రయ నిర్వహణము ఒక విశేషము. రసానుకూలమైన వివిధ గేయఫణితులకు ఈ నాటిక ఒక ఉదాహృతి.

**సహజయానవంథీ :**

వంగమహాకవియైన చండీదాసు, చాకెతయైన రామమణియందు దివ్యత్వమును దర్శించి ఆమెను ప్రణయైకజీవిగా వరించినగాథ ఈ నాటికయందలి ఇతివృత్తము.

విశ్వసాహితీసంస్కృతులను అంతరంగమున రంగరించుకొని వానిని తమ ఉదాత్తకావ్యములద్వారమున రమణీయముగా ప్రదర్శించిన సర్వతోముఖ ప్రతిభామూర్తులు శ్రీ శివశంకరస్వామివారు. పదునాల్గవశతాబ్దికి చెందిన వంగమహాకవి చండీదాసు జీవితచరిత్రను చదివి ప్రభావితులై, ఆమహాపురుషుని సహజయానసాధనకు ముగ్ధులై ఈ నాటికను రచించినారు వారు. వంగసాహిత్యవేత్త శ్రీ దినేదచంద్రసేన విరచితమైన వంగసాహిత్యచరిత్రయు, చండీదాసును గూర్చిన వివిధభాషావ్యాసములును, చండీదాసు రచించిన పదములును ఈ నాటికా రచనకు ఆధారములు.

మధురభక్తిని చిత్రించు నాటిక సహజియాపంథీ. బౌద్ధమతములో హీనయానము, మహాయానము, వజ్రయానము, సహజయానము అను మార్గము లున్నవి. వీనిలో సహజయానము వంగదేశమున అధికప్రచారమును పొందినది. ప్రియురాలిని జగదంబగా భావించి ఆరాధించి నిశ్శ్రేయసము నొందుట సహజయానపంథ. ఈ పంథను అవలంబించిన సాధకుడు సహజయానిపంథీ. అఘోర పంథీ, నానక్ పంథీ, కబీర్ పంథీ అను ప్రసిద్ధములైన హిందుస్తానీ పదరూపముల పద్ధతిలో 'సహజయానపంథీ' అను రూపమును గ్రహించి ఆ పేరుమీదుగా ఈ నాటికను రచించినారు శ్రీ శివశంకరస్వామివారు.

'సహజయానపంథీ' మూడు రంగములుగా పరచుకొన్న నాటిక. ఇందలి పాత్రలు— నకులదాసు చండీదాసు, దేవీదాసు, రామమణి, తారణి, విశ్వంభర ఠాకూరు, వృద్ధబ్రాహ్మణబృందము, యువబ్రాహ్మణబృందము.

ఈ చారిత్రకనాటిక యందు నకులదాసు, చండీదాసు, రామమణి అను పాత్రలు తప్ప తక్కినవి కల్పితములు. సహజయానప్రవర్తకులైన చండీదాసు పాత్రను సహజరమ్యముగా చిత్రించుటలో కృతకృత్యులైనారు శ్రీస్వామివారు. అందుచేతనే రామమణిని 'బ్రహ్మమయి' గా భావించు సహజయానభక్తిరసోన్మత్తుడుగానే చండీదాసు నాటికలో కానిపించును.

ఈ నాటికలో అనేకసందర్భములందు సహజయాన లక్షణములు పాత్రలచే ప్రస్తావింపబడినవి.

"కాదు లౌకికమైన కామ ప్రదీపార్చి
అతిమానుషంబైన యనురాగదీపమది" వంటి పంక్తులిందుకు

నిదర్శనము. సహజయానమునకు ప్రమాణగ్రంథమైన గుప్తసాధన తంత్రకోశము నందలి విశేషములిందు వివరింపబడినవి. ఆ శాస్త్రము ననుసరించి—

"నవకన్యకలు; విప్ర, నట, శూద్ర, గోపాల,
కాపాలి, కాంబష్ఠ, గణికా, రజక, మాలి
కాకారపుత్రికల్ కమనీయ విగ్రహాలు,
సౌశీల్య కారుణ్య సంపన్నలు విశేష
వైదగ్ధ్యయుక్తలై వరలు కన్యకలనే

అకలంకబుద్ధితో నారాధనముచేయు
నాతండు సిద్ధుడౌన"ట.

మూడవరంగములో చండీదాసు రామమణినిస్తుతించుభాగము మాత్రము వంగభాషామాతృకలోని భావాలకు అనువాదమనియు, తక్కినదంతయు తమ 'ఉపజ్ఞాసంజాతమ' నియు శ్రీ శివశంకరులు తెలిపినారు.

ఈ నాటిక యందలి బృందగీతులు రామమణి తారణుల నాట్యములు ప్రయోగ విజయ సాధకములు.

'సహజయానపంథీ' శ్రీ మొక్కపాటి నరసింహశాస్త్రిగారి దర్శకత్వమున మద్రాసులోని గోఖ్లే హాలులో 15-2-1941 నాడు విజయవంతముగా ప్రదర్శింపబడినట్లు డా॥ పి. ఎస్. ఆర్. అప్పారావుగారు తమ సిద్ధాంతగ్రంథము నందు తెలిపియున్నారు.[1] నాటికయందలి మూడవరంగమును అదే సంవత్సరము మార్చి నెలలో మహానటసభవారు ప్రత్యేకముగా ప్రదర్శించినారు.

**రాజజామాత :**

కల్హణుని రాజతరంగిణినుండి కథను గ్రహించి ఈ నాటికను రచించినారు శ్రీ శివశంకరస్వామివారు. నాలుగురంగములుగా సాగిన ఈ నాటిక యందలి పాత్రలు— ఖంఖుడు, దుర్లభవర్ధనుడు, బలాదిత్యుడు, బింబాదేవి, అనంగలేఖ, కజ్జ, వసంతలేఖ, సుగంధ.

తన భర్తయైన దుర్లభవర్ధనుని కులహీనుడను అపోహతో త్రోసిరాజని కాశ్మీర దేశాధిపతి పుత్రిక అనంగలేఖ ముఖ్యామాత్యుడైన ఖంఖునితో గూఢముగా ప్రణయకలాపము సాగించును. తమ అక్రమ ప్రణయము తెలిసియు చంపక క్షమించివదలి ఆభిజాత్యమును ప్రకటించిన దుర్లభవర్ధనుని సౌజన్యమునకు ఔదార్యమునకు చలితుడైన ఖంఖుడు భర్తను ప్రేమించి సుఖముగా నుండుమని అనంగలేఖకు బోధించి ఆమె భర్తపట్ల తన కృతజ్ఞతను ప్రదర్శించుకొనును. ఇది ఈ నాటికలోని కథాసారము.

ఈ నాటికయందలి నాయిక అనంగలేఖ సౌందర్యస్వభావములే రూపకము నంతయు నడపినవి.

---

1. తెలుగు నాటక వికాసము - పుట 495.

"పదియారు వన్నియల పసిడి విగ్రహమేని
పనాటికానాడె యెక్కించినను వన్నె
క్రమముగా క్రమముగా కళలు గోత్పవచ్చు" కాని
ఆమె 'వపుర్గాంగేయదీప్తిలో లవమైన' తరుగదట. అంతటి 'లావణ్యదేవత'యట.

"భరియించువాడైన భర్త కావలయు-
ఈతండు నను భరియించుచున్నాడె ?
భర్తృభావమె నాకు బహుకంటకమ్ము-
ఓర్వజాల నిరోధమొక్కింత యేని
ఇంపుగాలేదు నా కీయన పేరె
యోగ్యుడైనంత నే ఒరిగినదేమి ?
తండ్రి యేలనో రాజతనయుండు కాని
వానికి నన్నిచ్చి వంచించినాడు" అను అనంగలేఖ
మాటలు ఆమె మనస్తత్వమును ప్రకటించుచునే భర్తృకర్తవ్యమును భంగ్యంతర
ముగా సూచించుచున్నవి.

నాటికలోని రెండవరంగమున రాజకుమారి జన్మదినోత్సవసందర్భమున కాశ్మీరదేశాచార సంప్రదాయములు చక్కగా వ్యక్తము చేయబడినవి. మూడవ రంగమున ఉటంకింపబడిన భర్తృహరి శ్లోకములు రాజజామాత దుర్లభవర్ధనుని పాండిత్యమును ప్రకటించుచునే సన్నివేశమునకు వన్నెలుకూర్చినవి.

శ్రీ తల్లావఝ్ఝల పతంజలిగారు ఈ నాటిక 'పీఠిక'లో వ్రాసిన ఈ మాటలు పేర్కొనదగినవి - "ఇందులో **A STUDY IN JEALOUSY** అంతర్లీనముగా నున్నది. **A woman is incapable of jeaiousy man is only capable** అనే **FEDERIC NIEZSTCHE** అను జర్మన్ తత్త్వసిద్ధాంతము అంగీకృతము"[1]

**సోఢలజాయ :**

ఇదియును శ్రీ శివశంకరస్వామివారి నాటికయే. దీనియందలి కథ కల్హణుని రాజతరంగిణిలోనిది. ఆరురంగములున్న ఈ నాటికయందలి పాత్రలు-

1. రాజజామాత - ప్రథమ ముద్రణ - 1973. (శ్రీ శివశంకరస్వామివారి,
ద్వ్యశీతితమ (82) జన్మవాసర ముద్రణము.)

వరేంద్రప్రభ, శ్రీలేఖ, హంసపదిక, వితస్త, నోణకశ్రేష్ఠి, దుర్లభప్రతాపాదిత్యుడు, వర్ధనస్వామి, ఉత్పలకుడు, బంభలకుడు.

తనభార్యయైన వరేంద్రప్రభయును తనకు ఆప్తమిత్రుడును, కాశ్మీర దేశాధిపతియును అయిన దుర్లభప్రతాపాదిత్యుడును పరస్పరానురాగబద్ధులని తెలిసికొన్న నోణకశ్రేష్ఠి తన భార్యను స్వయముగా రాజున కర్పించుట ఈ నాటికయందలి కథాంశము.

ఈ నాటిక యందలి నోణకశ్రేష్ఠి, దుర్లభప్రతాపాదిత్యుల పాత్రచిత్రణము సహృదయులను ఆలోచనానంద తరంగితుల నొనర్చును.

'నోణకజాయలోని' ప్రణయతత్త్వమును గూర్చి వర్ధనస్వామి అను కవి పాత్రద్వారమున శ్రీ శివశంకరస్వామివారు వెలిబుచ్చిన ఈ అభిప్రాయములు గమనింపదగినవి–

"పాతివ్రత్యము పత్నీవ్రతమును
సాంఘికనియమాచారములనుకో
ప్రణయము వీనికి పై మెట్టనుకో
అంతరంగమున కదియే ధర్మము"

"పాణిగ్రహణము పాతివ్రత్యము
పత్నీవ్రతమును పవిత్ర విధులే
వివాహబంధము విధింపదగినదె
కాని శాశ్వతము కాదని యెంతురు"

ఈ నాటికయందలి 'ఆత్మార్పణము', 'క్రుద్ధముని' అను అంతర్నాటికలు రసపరిణతికి, ఔచిత్యమునకు అనుకూలముగా కూర్చబడినవి.

## పద్మావ్యూము :

బౌద్ధ–ఆర్ష ధర్మఘర్షణను, ఆర్ష ధర్మవిజయమును కళాత్మకముగా చిత్రించు ఈ నాటికను శ్రీ శివశంకరస్వామివారు రచించినారు. నాలుగురంగములుగా పరచుకొన్న ఈ నాటికయందలి పాత్రలు – సుమతి, రాజీవలోచన, సుజాత, భదంత రాహులుడు.

యౌవన సౌందర్యములు శాశ్వతములుకావని రాజీవలోచన అను యువతికి భదంతరాహులుడను బౌద్ధ గురువు ఉపదేశించును. కాని ఆ ఉపదేశమును ఆమె మరొకవిధముగా అర్థముచేసికొని సన్న్యసించుటకు మారుగా అంతకుముందే తాను ప్రేమించి నిరాకరించిన సుమతి అను యువకుని పిలిచి వివాహము చేసికొని ఆర్ష ధర్మానుసారముగా గార్హస్థ్యమును స్వీకరించును. ఇది సద్వాక్యము నందలి కథాసారము.

శృంగారరస ప్రధానమైన ఈ నాటికలో సంభోగశృంగారము, విప్రలంభ శృంగారము రెండును చోటుచేసికొన్నవి.

బౌద్ధమతము నవలంబించునకొన్న నాయిక ఆర్యధర్మమునై పునరలుట ఆర్యధర్మావలంబియైన నాయకుడు నాయికకై బౌద్ధధర్మము ననుసరింపవలె ననుకొనుట అనునవి కథ నొక్కమలుపుత్రిప్పి, సహృదయులందు ఆనందాశ్చర్యములు కలిగించును. బౌద్ధగురువు ఉపదేశించిన సద్వాక్యము స్వతంత్రాలోచనా పరురాలైన నాయికలో విపరీతభావమును కలిగించినతీరు హృద్యము.

బలాత్కారముగా పరివ్రాజనమిప్పించి తత్క్షణవిరక్తిని కలిగింపయత్నించు బౌద్ధుల అక్రమధోరణిని నిరసించి, గృహస్థాశ్రమాదుల ద్వారమున క్రమముగా వైరాగ్యమునకు మార్గముచూపు ఆర్యధర్మమును బలపరచినది ఈ నాటిక. "కేవల సన్న్యాసమే గతియని బోధించి శిథిలోన్ముఖమవుతున్న బౌద్ధధర్మమునకు ప్రతీకగా ఈ నాటికను గ్రహింపవచ్చును"[1] అను శ్రీ నోరి నరసింహశాస్త్రిగారి మాటలు ఈ సందర్భమున పేర్కొనదగినవి.

ఈ నాటిక మొదటిరంగములోని నాయికానాయకుల శృంగారసంభాషణ, రెండవరంగమందలి ఆంధ్రగణికాసౌందర్యవర్ణనము, నాలుగవరంగములోని సౌందరనంద ప్రసక్తి సందర్భోచితములై రూపకమును రక్తికట్టించుచున్నవి.

"సౌందర్యము యౌవనంబు శాశ్వతములుకావు" అను వాక్యము సద్వాక్యము. మానవుడు కల్పించిన మతాలకు అతీతమైనది పరమసత్యము ఆర్షధర్మము

---

1. అక్షరార్చన: డా॥ పాటిబండ మాధవశర్మగారి షష్టిపూర్తి సన్మాన సంచిక - పుట - 185. ప్రచురణ (1972).

ఈ సత్యమునకు అతిసమీపముగ నున్నదను అభిప్రాయమును శ్రీ శివశంకర స్వామివారు ఈ నాటికలో భంగ్యంతరముగా ప్రకటించినారు.

ఈ నాటికను శ్రీ శివశంకరస్వామివారు బౌద్ధధర్మమును రమణీయముగా ప్రపంచించు 'సౌందరనంద' కావ్యకర్తలలో ఒకరైన శ్రీ కాటూరి వేంకటేశ్వర రావుగారికి అంకితముచేసి ఔచిత్యమును ప్రదర్శించినారు.

శ్రీ శివశంకరుల రచనలన్నింటియందును ధారాశుద్ధి, ప్రసాదగుణము, సరళపదప్రయోగము, కవితాసంప్రదాయవైదుష్య ప్రతిభావిశేషములు ప్రఫుల్ల సహస్రదళ పద్మమువలె భాసించి పరిమళించుచుండును.

**ధర్మఘంటిక :**

ఈ నాటిక శ్రీ వావిలాల సోమయాజులుగారిది. జనశ్రుతిలోనున్న ఈ నాటికయందలి కథ చోళదేశమునకు సంబంధించినది. దక్షిణదేశ దేవాలయ శిల్పములందు ఈ గాథ శిల్పింపబడినదని విజ్ఞులు చెప్పుదురు. నాలుగు భాగము లుగా సాగిన ఈ నాటికయందలి పాత్రలు — మనునీతి, సౌవిదల్లుడు, గోప కుడు, యువరాజు, మాధవాంబ, ధర్మామాత్యుడు.

చోళదేశపు యువరాజు రథముక్రింద తన దూడపడి చనిపోయిన దుస్సంఘ టనను ఆవు రాజు మనునీతికి ధర్మఘంటికను మ్రోగించి విన్నవింపగా ప్రభువు దోషి శిరచ్ఛేదమునకాజ్ఞాపించును. ఆ దోషి యువరాజే అగుటవలన తాను శిక్షింప లేక రాజు కంచుకియైన సౌవిదల్లుని ఆజ్ఞాపించును. యువరాజును శైశవదశనుండి పెంచిన మమతను చంపుకొనలేక సౌవిదల్లుడు తన్నుతానే చంపుకొనును. ఇదంతయు చూచిన యువరాజు తండ్రి ధర్మనిర్ణయమును శిరసావహించి తన్ను తాను పొడుచుకొని మరణించును. ధర్మఘంటికలోని కథాంశమిది.

ధర్మవీరప్రధానమైన ఈ నాటికను శ్రీ సోమయాజులుగారు రసార్ద్రముగా నిర్మించినారు. ధర్మఘంటిక విన్న రాజునకు అపశకునములు తోచుట, కన్నకుమా రుని మూర్తి కన్నులయెదుట కానిపించుట, ప్రభువుముందు గోపకుడు నిజము చెప్పుటకు వెనుకముందాడుట, యువరాజు భార్య మాధవాంబ పీడకలగనుట వంటి సన్నివేశములు ఔచిత్యభరితములై అగామివిషాదవృత్తాంతమును సూచించుచు, సహృదయుల హృదయములను కదలించివేయును. "శిరసావహా-

నీయక్షుగును – శిఖాస్మృతి యెవరికైన" అను మాటలు యువరాజాశీలమునకు నిదర్శనములు మాధవాంబాయువరాజుల అన్యోన్యానురాగము ఈ విషాదనాటికకు మరింత తీవ్రతను ఆపాదించినది. యువరాజును వధించుటకు సేవిదల్లుడు ఖడ్గమునెత్తి ఆకస్మికముగా తానే పొడుచుకొనువరకు సహృదయులకు రేఖా మాత్రముగానైన తెలియదు. కథాంతమున వచ్చిన ఈ మలుపు ఈ నాటికకు ఒక ప్రత్యేకతను సంతరించినది.

గోపకుని భాషణను జానపదసరణిలో నడిపించిన శ్రీ సోమయాజులుగారి పాత్రౌచిత్యస్ఫూర్తి ప్రశంసాపాత్రము.

"మడిసికాదు మా బాబూ! మాబొల్లావయ్యా పెబూ
వాయించినదయ్యా సామి వరసంగా శానసేపు"

నంటి మాటలు జానపదభాషా మాధురీ నిధానములు.

''రాకాయామిని వేళల రానేలా యంధతమము'' అను పంక్తి భావికథా సూచకము. చిన్నకథను నాలుగు పన్ని వేశములుగా విభజించి, సహజరమ్యముగా సంభాషణలు సాగించి ధర్మవీర కరుణములను చక్కగా పోషించి నాటికను తీర్చి దిద్దిన శ్రీ సోమయాజులుగారి ప్రతిభ శ్లాఘాపాత్రము.

**శోణితపారణ :**

ఆచార్య డా॥ కె.వి.ఆర్. నరసింహముగారు రచించిన నాటిక ఇది. కారాగారబద్ధుడైన పృథ్వీరాజు మహమ్మద్‌ఘోరీని మత్స్యయంత్రభేదనమును మిషచే చంపుటయు చాందుభట్టు పృథ్వీరాజు ఒకరినొకరు పొడుచుకొని మరణించుటయు 'శోణితపారణ' యందలి విషయము. ఇందలి పాత్రలు – చాందుభట్టు, ప్రాభాతికవాతపోతములు, విజయ, విలయ, పృథ్వీరాజు, ఘోరీ.

రేఖా మాత్రముగా నున్న కథను గ్రహించి డా॥ నరసింహముగారు ఈ నాటికను ప్రదర్శనాదృక్పథముతో నృత్యకవితాకళాత్మకముగా నిర్మించినారు. విజయ, విలయ పాత్ర కల్పనము శ్రీ నరసింహముగారి అసాధారణ ప్రతిభకు, గేయనాటికాప్రక్రియామర్యాదావైదుష్యమునకు నిదర్శనము. విజయ, విలయ ఇచ్చిన తెల్లని, ఎర్రని పద్మములను రెంటిని చాందుభట్టుచే ఆఘ్రాణింప జేసి, ఘోరీని పృథ్వీరాజు వధించి విజయము సాధించుననియు, తర్వాత చాందు భట్టుతో కలిసి విలయమును పొందుననియును వస్తువును ధ్వనింపజేసినారు. ఇట్లు

నమ్మధ్వనిని నిర్వహించుటమనది సాహిత్యశాస్త్ర మర్యాదలను ఆకళించుకొన్న శ్రీ నరసింహామువంటి విద్వన్మూర్తులకే సాధ్యము.

"రక్తపు శేయలు ద్రావిన
రక్కసి యీ పుడమి పడఁతి,"
"విధి దష్టము సర్వజగము
విధుంతుడుఁడె జయముగాంచె"

వంటి చరణములు భావికథా సూచకములు.

ఈ నాటికయందలి గేయములన్నియు సాహిత్య సంగీత. నృత్య కళా సౌందర్య మాధుర్యవిన్యాసవిశేషాలను సంతరించుకొన్నవి.

"ఈ జగచ్చక్రమ్ము మొదట
నెవ్వాఁడు త్రిప్పెనోయకట
ఈ జగచ్చక్ర రంహః ప్రసారమ్మాపు
యోజనయు నాతనికి నున్నట్లుగనరాదు"

"కనద్ధ్వనత్ కాలకూట
కటుకఠోరగర్జారవ
భయదభైరవోరుఫాల
నయనమ్మున శయనించితి"

అను చరణములందలి శబ్దార్థ సౌందర్యము హృదయంగమము.

"రాలైన నెదపొంగి
యేఱులై పారంగ
నాలపించెద రాగ
మమరకల్లోలినీ
కమలినీ మధుధునీ
క్రమమధురమ్ములై
కపురంపు వానలై
యపరంజిసోనలై
కలకంఠకులకంఠ
కాకలీరవములై"

వంటి పంక్తులు గానకళామధురములు. విజయ, విలయ పాత్రలచేత పాడించిన "పాలవెల్లి కడుపు చలువ" "ఖరాసిసదృశఘనదంష్ట్రా" అను గేయములు నృత్యాభినయానుకూలములు.

కథలో ప్రధాన వ్యక్తులు మువ్వురును నేలగూలి అంతయు శోణితమయ మగుటచేతను, శత్రువైన ఘోరిశోణితమును పారణచేయ సమకట్టిన చాందుభట్టు పృథ్వీరాజుల సాహస ప్రతీకారచర్య వర్ణితమగుటచేతను ఈ నాటికకు 'శోణిత పారణ' అను పేరు సార్థకమైనది.

**షణ్ణవతి :**

షణ్ణవతి కవిసమ్రాట్ శ్రీ నోరి నరసింహశాస్త్రిగారి నాటిక. శ్రీ శాస్త్రిగారి శ్రీ విద్యారహస్య పరిజ్ఞానమునకు, యాజ్ఞికమంత్రశాస్త్ర వైదుష్యమునకు ఈ నాటిక ఒక నిదర్శనము. యాగవాతావరణమును కల్పించు ఏకైక నాటిక షణ్ణవతి. ఇందలి పాత్రలు - సోమవర్ముడు, శ్రీగురువులు, గురుపత్ని, కేశవుడు.

శత్రు సంతయార్థమై సోమవర్ముడను రాజు గుర్వాజ్ఞచే చండీయాగము నారంభించును. యాగమధ్యమున చండీదేవి ప్రత్యక్షమై గురుపుత్రుడైన కేశవుని బలియిమ్మని కోరును. రాజు ఆ విషయమును గురువునకు చెప్పకపోయినను, గురువు అందు కంగీకరించును. కేశవుడును సంతోషముతో బలికి సమ్మతించును. బల్యనంతరము గురువు సన్యసించును. రాజు చండీదేవిలో లీనమైపోయిన కేశవునే ఇష్టదైవముగా ప్రతిష్ఠించి తన సర్వస్వము నర్పించుటకు సంసిద్ధుడగును. ఇది ఈ నాటికలోని కథ.

శ్రీ నరసింహశాస్త్రిగారి భావావేశము ఈ నాటికలో అడుగడుగున ప్రత్యక్ష మగుచుండును.

"కాలానలపటుకౌక్షేయధృత
కరమటు చూపెను స్వామీ!"
"జ్వలన తీక్ష్ణమీ శాతకృపాణము
శత్రుశిరఃకర్తనలో
కోరలు పెంకిన కోడెత్రాచుసుమి
గురుపుత్రకునెడ తల్లీ!"

అను సోమవర్ముని భాషణమందుకు నిదర్శనము. జగదంబ పలుకులు

"జలజలను సుధనెలవిధంబున
నెలఁబుడుతని విందునగవటు"
వినిపించినవనుట హృద్యము.

ఈ నాటికయందలి పాత్రలన్నియును అద్భుతముగా చిత్రింపబడినవి. శ్రీ గురువులు తన వేదశాస్త్ర వివేకమును, ధర్మనిష్ఠను భవానికై అంకితము చేసినాడు. అతడు—

"దేహమే దేవ్యాలయంబుగ
ఆత్మజగదంబైకబుద్ధిని
జీవితము శ్రీయాగవట్టులు" చెల్లనిచ్చినవాడు.

"శ్రుతిమేళవించితిని శుద్ధాత్మవీణనా
పతి స్వేచ్ఛాగానములు చేయన్
బాధింపుమనెదే యపశ్రుతులతో దీని
స్వప్రగల్భము చూపి రాజా"
అను మాటలు గురుపత్ని పతిభక్తిని చాటు వైజయంతికలు.

బలివిషయము తెలియకముందే కేశవునకు—
"దేహంబెదో దివ్యశక్తిను
దీప్తంబైనటు" తోచును.
అంతటి భక్తుడు కావుననే దేవి ఆతనిని గ్రహించినది.

శ్రీవిద్యాతత్త్వవేత్తలైన శ్రీ నరసింహశాస్త్రిగారు మూలమంత్రశ్లోకార్థములను ఈ నాటికలో ప్రయోగించి యజ్ఞవాతావరణమును భాసింపజేసినారు. ఉదాహరణమునకు—

"పశుస్త్వం బలిరూపేణ మమభాగ్యాదుపస్థితః
ప్రణమామి తతః సర్వరూపిణం బలిరూపిణమ్......"
"చాముండా బలిరూపాయ బలేతుభ్యం నమోస్తుతే"
అను శ్లోకము ఈ నాటికయందు

"భాగ్యవశంబున ప్రాప్తంబయితివి
బలిరూపంబుగనిందున్

చాముండికయే సంభవించినది
స్వయంబుగా నీ రూపమువన్"

అను గేయముగా నవతరించినది.

"రసనాత్వం చండికాయాః సురలోకప్రసాధః" వంటిశ్లోకభాగము ఈ నాటికలో "చండీదుర్గకు సాష్టాంగ్రదనవపు"గా రూపుదిద్దుకొన్నది. ఈ మూల శ్లోకములు కొన్ని 'సప్తశతీహోమవిధిః' అను గ్రంథములోనివని శ్రీ శాస్త్రిగారే నాకు తెలిపినారు ఈ నాటికయందలి శ్రీ గురువులు శాక్తేయుడు కాడు. ఎందుకనగా శాక్తేయులకు సన్యాసము నిషిద్ధము. శ్రీ గురువులు పుత్రబలికి హార్దికముగా ఒప్పుకొని సన్యాసము పుచ్చుకొని వెడలుదురనును ఇందలి రహస్య మదే. పూర్ణోపాసనాయోగ్యత (సన్యాసము) సిద్ధించినదన్నమాట. పుత్రేషణ పోయినచో అంతేకదా!

'షణ్ణవతి' అనగా తొంబదియారని అర్థము. ఈ నాటికలో తొంబదియారు గేయములుండుటకే ఈ పేరు సార్థకము. మరొక విశేష మేమనగా శ్రీయాగ విధానక్రమమున షణ్ణవతి కళలను అవాహనముచేసి 'చక్రార్చనము' గావింతు రని మంగళగిరి ప్రమీలాదేవిగారు తెలిపినారు.[1] అందువలన కూడ ఈ నాటికకు నామసార్థక్యము సిద్ధించుచున్నది.

శ్రీ నరసింహశాస్త్రిగారు పాత్ర శోక ఛందమును ప్రయోగించి వైవిధ్య మును ప్రత్యేకతను సాధించినారు రాజుకు, కేశవునికి చతురస్రగతిని, శ్రీ గురువులకు ముత్యాలసరమును, గురుపత్నికి ఖండగతిని ప్రయోగించివారు వారు.

నాటిక చిన్నదైనను అయాసందర్భములందు అద్భుత, త్యాగవీరభక్తి శాంతరసములు చక్కగా పోషింపబడినవి.

**అప్సరస :**

ఈ నాటికను రచించినవారు ఆచార్య డా॥ యస్వీ జోగారావుగారు. "యెక్కలగాణల, జక్కులపురంధ్రుల గానకళాభిమానములే యక్షగానోత్పత్తికి బీజాంకుర ప్రాయములైన"[2]వని నిరూపించిన శ్రీ జోగారావుగారి ఈ అప్సరస

1. తెలుగులో పద్యగేయనాటికలు– పుట 80
2. ఆంధ్రుల యక్షగాన వాఙ్మయ చరిత్ర – ప్రథమభాగము– పుట 95.
ప్రథమముద్రణ (1961 మే)

నాటికయందలి నాయికయు యక్షగానమును పదకేళిక పద్ధతిలో అభినయించు కుక్కలపురంధ్రియే ఇతివృత్తమును యక్షగానసంబంధియే. 'అప్సరస' ఈ రూప కేతివృత్తములో వచ్చు ఒక యక్షగానము పేరు.

అప్సరస' రెండు రంగములుగా సాగిన విషాదాంత నాటిక. ఇందలి పాత్రలు- కామిని, మురళీధరుడు, మునలాయుధుడు, మాణిభద్రుడు, రాజ భటుడు.

ఈర్ష్యాసూయలకు బలియైన ఒక కవి (మురళీధరుడు) గాథ - ఆ కవికి హృదయమర్పించిన ఒక నర్తకి (కామిని) విఫలప్రణయగాథ-అప్సరస యందలి వస్తువు.

డా॥ జోగారావుగారు ఈ నాటికను రసార్ద్రముగా నిర్మించినారు. వారు 'కామిని' పాత్రను నిర్వహించిన వైనము ప్రశంసనీయము, కామిని తన మధురపదాలాపముచే సుభగమైన అభినయముచే రాజు మాణిభద్రుని ఆశ్చర్య పరచి, అతనిచే 'అప్సర' యని 'కిన్నరకులోత్పన్న' యని ప్రశంసలందుకొన్న కళామూర్తి. ఆమె స్వేచ్ఛాజీవి. రాజు ఆస్థానమున కాహ్వానింపగా-

"వాడవాడ నాడి పాడి
వేడుకతో విచ్చలవిడి
వియచ్చరపు బతుకు బ్రదుకు
మాకెందుకు లేనిపోని
రాచరచ్చలోయి ప్రభూ!" అనును.

"పంజరమున కులుకుచిలుక
పలుకు పలుకు మంజులమే
కానీ యొక కాన పులుగు
కలవరింత కది సమమా? అను మాటలు ఆమె స్వేచ్ఛా

ప్రవృత్తికి నిదర్శనములు. ఆమె రాజు అభయమిచ్చినమీదనే ఆస్థానమునకు తరలి నది రాజు మురళీధరునికి శిక్ష విధింపగా రాజుతో "కావలసిన శిక్షింపుము నను" 'అని పలికిన ప్రేమమూర్తి.

"ప్రేమకు గూడా ప్రభుశాసనమా!

"నాయెదనాతని కంకితమిచ్చితి
నాదేహము నీ కర్పణ చేసితి
త్యాగము నాదా నీదా స్వామీ!

అని రాజు నెదిరించి పలికి అతని కన్నులను తెరిపించిన ధైర్యశాలిని: మనస్విని.

ఆచార్య జోగారావుగారి రమణీయ కవితాత్మకు సంకేతము ఈ నాటిక యందలి మురళీధరకవి పాత్ర. దర్శనవర్ణనశక్తులను సమముగా గల్గిన విద్వత్కవులు శ్రీ జోగారావుగారు. అందువలననే అంతర్హార్ద్యముగా అంత సహజమై తనవ్యక్తానురముగా మురళీధరకవి పాత్రను చిత్రింపగల్గినారు.

"నీగీతము తీగసాగి
నీ నాట్యము పూలు పూచి
పుడమి కళామరళికమై
పులకించును"
"మాకంద మహాశాఖిక
కొరకు వచ్చుకోకిలవలె
ప్రియ మేఘోదయాభిముఖ
మయూరాభిసారికవలె
మహాకవి కావ్యమువలె
మా కొలువుకు రమ్మ రమ్మ"-

అను చరణములు శబ్దార్థసౌందర్యసౌగంధ్యములకు నిధానములు. పై పంక్తులందలి కోకిలశబ్దముచే గానమును, మయూరశబ్దముచే నాట్యమును, కావ్యశబ్దముచే కవిత్వమును ధ్వనింపజేసి గాననాట్యకవితామయమైన యక్షగానముతోపాటు గేయనాటికా ప్రక్రియా వైశిష్ట్యమును గూడ భాసింపజేసినారు శ్రీ జోగారావుగారు.

"నాగులు నా కోర్కెలు
......................
నాగలోక నాభినుండి
నాకసీమ పర్యంతము
నరసాగిన నాగువులివి

పరమేశ్వరు నొడలితొడవు
పరాశక్తి పరమేశ్వరి
యొడలికి తన పడగ గొడుగు
పట్టిన శివ జటాజూట
శిఖామకుటమణిమండన
ఫణిమానస సంతతి యిది
నీ చూపున పడగ విప్పి,
నీ రూపున చూపు నిలిపి
నీ లోపల ప్రవేశించి
నీలకంఠగళసీమకు
హారములుగ చేరగలవు"

అను గేయచరణములు కైలాసపు-టెత్తుల కెగిసిన కమనీయోహాశక్తికి, భావావేశస్ఫూర్తికి ఉదాహరణములు.

ఈ నాటికా కథయందలి 'అప్సరస' యక్షగానకావ్య ప్రాధాన్యమును బట్టి, ఈ నాటికకు ఆపేరే పెట్టుట ఉచితముగా నున్నది.

సంగీతనృత్యకళా మర్యాదానుకూలముగా సాగిన ఈ నాటికను ఆచార్య శ్రీ జోగారావుగారు "సంగీతసాహితీసమాహితసుహితస్వాంతులు ఆచార్య శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మగారికి" అంకితమిచ్చుట ఔచిత్యశోభితము.

**క్షమామూర్తి :**

గౌతమబుద్ధుని జీవితమునందలి ఒక సన్నివేశమును చిత్రించు ఈ నాటికను శ్రీ కొలిపాక మధుసూదనరావుగారు రచించినారు. ఇందలి పాత్రలు-జనవాణి (స్త్రీ, పురుషకంఠాలు), శ్రమణులు, అంతఃపురస్త్రీలు, యశోధర, ప్రతీహారి, శుద్ధోదనుడు, బుద్ధమూర్తి.

సన్యాసత్వమును వదలుకొనవలసినదను యశోధరాశుద్ధోదనుల అభ్యర్థనను అంగీకరింపక బుద్ధుడు వారికి సత్యాహింసాది మానవతామార్గ మవలంబించి తరింపుడని బోధించుట ఈ నాటికయందలి కథ.

ప్రయోక్తృపాత్రకల్పనముచే కథాకథనమును కొంత నిర్వహించినారు. శ్రీ మధుసూదనరావుగారు.

అంతఃపురస్త్రీలతో యశోధర పలికిన-

"గాఢతమోరుద్ధగహన
మందున ఇనుడుదయించునా ?
ఇరుల్రమగ్గుపూదీవియ
పెరిగిమరల చివురించునా ?
ఈ చీకటి నశియించదు...
ఈ తీవియ చివురించదు..."

అను పలుకులు శుద్ధోధనుడు బుద్ధునితో పలిన—

"వలదునీ ప్రియసుతుని వీడగ
వలదు నీ సతి కరము వీడగ
వలదు యీ ముదుసలిని వీడగ
వలదువలదోయీ సుపుత్రక !"

అను మాటలు హృదయమును చెమ్మగిల్లచేయుచు కన్నీరు తెప్పించును.

**శాఫో :**

సుప్రసిద్ధగ్రీకుదేశకవయిత్రి 'శాఫో' జీవితఘట్టము నూహించి ఈ నాటికగా తీర్చినారు శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావుగారు, సూత్రధారుడు శాఫో, ఫావో, సుందరి, చెలులబృందం - ఈ నాటికయందలి పాత్రలు. విశుద్ధ ప్రణయబంధమును త్రెంచి మరొక అందగత్తె వలలో చిక్కుకొన్న ప్రియుడు- ఫావో రాకకు ఎదురుతెన్నులుచూచి, కన్నీటికి తన జీవితశేషము నంకితముచేసిన కవయిత్రి శాఫో విషాదగాథ ఈ నాటికయందలి ఇతివృత్తము. కవయిత్రి జీవితఘట్టమును కవనమనోహరముగా చిత్రించుటలో కృతకృత్యులైనారు శ్రీ రజనీకాంతరావుగారు.

"వేగుచుక్క వెలుగుతోనె
వెన్నెలలూ, సంజయిరులు
కలిపి కాంచి సంతసించు
కళాశీలి సృష్టికర్త
వెన్నెలనాల మందలను
తల్లుల పాలపిల్లలను

మృదుల మధుర మోహనమై
నదెల్ల ఒక్కచో చేర్చి
నన్ను పకియ శాఖో యెదఁజేర్చె..."

అను చరణములు బ్రహ్మసృష్టికన్న కవిసృష్టి విశిష్టమును రమణీయమును అను ఆలంకారిక సూక్తిసారమునకు ఉదాహరణములై శాఖో వినిర్మల ప్రణయ హృదయమాధుర్యమును వ్యక్తము సేయుచున్నవి. "పాడిన వియోగగీతి కరగి పోయె హృదయతంత్రిపైనె" అను పంక్తి రసహృదయాలను కదలించివేయును.

ఈ నాటికయందలి కొన్ని పాటలలో బసవరాజు అప్పారావుగారి భావము లుపయోగించుకొన్నట్లు శ్రీ రజనికాంతరావుగారు నాటికాంతమున తెలిపినారు.

**శ్రీ వాసవీకన్యకాపరమేశ్వరి :**

శ్రీ వింజమూరి శివరామారావుగారి నాటిక ఇది. విషాదాంతమైన ఈ నాటికయందలి పాత్రలు - కుసుమాంబ, కుసుమగుప్తుఁడు, వాసవీకన్య, చెలి, విమలాదిత్యమహారాజు. సుమారు పది శతాబ్దముల క్రింది గాథ ఇది.

వరమునబుట్టిన కుసుమగుప్తుని పుత్రిక వాసవీకన్యను బలవంతముగా వివాహము చేసికొనుటకు విమలాదిత్యప్రభువు ఉద్యుక్తుడుకాగా వాసవీకన్యతో పాటు ఆమె తల్లిదండ్రులు, ఆప్తబంధువులు నూటయిద్దరు దంపతులు అగ్ని ప్రవేశము సేయుటయు, వాసవి దేవతగా వెలయుటయు ఈ నాటికయందలి ఇతివృత్తము. వాసవి చెలితో కలిసి పూదోటలో పాడిన —

"ఓ చెలియా యీ వనిలో, చూచితివా వసంతం
ఎల్లెడలా తోచుచుండె చల్లనైన ప్రశాంతం"

అను పాట బాగుగనున్నది.

"వ్యక్తికి స్వాతంత్ర్యము లే
కున్న జీవితము వృథా
అధర్మాన్ని జయించుటే
ప్రధానాశయమ్ము నాకు"

అను మాటలు మనస్వినియైన వాసవిసౌశీల్యము నేకాక భంగ్యంతరముగా ఆధునికభావములనుకూడ వ్యక్తము సేయుచున్నవి.

ఈ 'సంగీతనృత్యనాటిక'లోని కథతో చాలభాగము వేపథ్యవచనము ద్వారమున సాగును.

**మహోదయం :**

నాటికాకర్తలు డా॥ దాశరథిగారు. స్వాతంత్ర్యోద్యమమునకు సంబంధించిన ఇతివృత్తముగల ఈ నాటికలో —

"మహోదయానికి ముహూర్తమిదేనోయ్
విహాయసంలో విహరింతామోయ్
మంచుతెరవు విదలించి తూర్పులో
కాంచనకేతన మెగరేతామోయ్" అను పాటయు

"భూధరమో సాగరమో
భూతలమో ఆకసమో
భరతధరణి నా గృహం
భరతజాతి నా అహం"

అను పాటయు కవితావేశమునకు దేశభక్తికి నిదర్శనములు. ఈ నాటిక ప్రతి లభ్యము కాకపోవుటచే విశేషాంకములను పేర్కొనలేకపోవుచున్నాను. ఇది ఆకాశవాణి హైద్రాబాదు కేంద్రమునుండి ప్రసారితమైనది.

**యశోధర :**

ఈ గేయనాటికయును డా॥ దాశరథిగారిదే. ఆకాశవాణి హైద్రాబాదు కేంద్రమునుండి ప్రసారితమైనదే. గౌతమబుద్ధుని భార్య యశోధర జీవితరేఖలను చిత్రించిన ఈ నాటికయందలి-

"తథాగతా ! ప్రజాహితా !
సుధాపథాలపై సదాప్రయాణమై"

అను గేయమును, బుద్ధుడు జన్మించిన సందర్భమును వర్ణించు ఘట్టమునందలి-

"కోటికోటితారలతో
మేటిచందమామలా"

అను పాటయును, బుద్ధుడు వెళ్లిపోయిన సందర్భమున యశోధర కరుణార్ద్రముగా పాడిన —

"రావేమిరా శశీ
అంధకారం ఈ నిశి
ఏమి కనరాదీ నిశీధి"

అను పాటయును, రమ్యాతిరమ్యములు. దురదృష్టవశాత్తు ఈ నాటికకూడ లభ్యము కాలేదు. సహృదయులు శ్రీ పాలగుమ్మి విశ్వనాథముగారు తమకు జ్ఞాపకమున్న మేరకు వినిపింపగా పై పంక్తులను పేర్కొనగలిగినాను.

శ్రీ దాశరథిగారు 'ఆనందభవన్' అను మోతీలాల్ జీవితమునకు సంబంధించిన మరొక నాటికను కూడ రచించి ప్రసారము చేసియున్నారు. అదియును దొరుకలేదు.

**ఆవూ-దూడా :**

సంవాదాత్మకమైన ఈ నాటికను రచించినవారు శ్రీ బంధ్యాలపాపయ్య శాస్త్రిగారు మొన్నమొన్న తెలుగుదేశమును అల్లకల్లోలముచేసి బీభత్సము రేపిన ప్రత్యేకాంధ్రరాష్ట్రాందోళనమును కవితాత్మకముగా చిత్రించినది ఈ నాటిక. ఇందులో పాత్రలు రెండే- ఆవు, దూడ.

వెల్లువయై ప్రవహించుచున్న ప్రజల ఉత్సాహావేశములను ఈ నాటికలో చక్కగా చిత్రించినారు శ్రీ 'కరుణశ్రీ' గారు.

"పతాకాలు మనకెందుకు ?
నినాదాలు మనకెందుకు ?
బిడ్డా ! పశువులము మనము
గడ్డి తినుటె మనధర్మము"

అని ఆవు చెప్పగా దూడ పలికిన-

"ధర్మానికి కేంద్రానివి
దయకు పాలసంద్రానివి
నిండుకుండవలె కదలవు
బండపట్టుదల వదలవు"

అను మాటలు చాల బాగుగనున్నవి. ఆవు పలికిన-

"శాంతియందు భూమాతను
కాంతిచిందు గోమాతను
అన్నీ తెలుసును నాకే
ఆందోళనపడబోకే"

వంటి మాటలతో వ్యర్థాందోళనమును మానుకొని శాంతితో సమైక్యముగా నుండుట మంచిదను కవి సందేశము ధ్వనించుచున్నది ఈ నాటిక. ఆకాశవాణి విజయవాడ కేంద్రమువారు ఏర్పాటుచేసిన కవిసమ్మేళనమున గానముచేయ బడినది 'కరుణామయి', ఒకే కంఠం, మువ్వ, అనునవి 'కరుణశ్రీ'గారి మరి కొన్ని చారిత్రక గేయనాటికలు

**ఉమర్ ఖయామ్ :**

నాటికాకర్తలు శ్రీ టి రామకృష్ణారెడ్డిగారు ప్రసిద్ధ పారశీక కవి ఉమర్ ఖయామ్ వినిర్మలజీవితమందలి ఒక ఘట్టము చిత్రించుచున్నది ఈ 'సంగీతనృత్యనాటిక' ఇందలి పాత్రలు – ఉమర్ ఖయామ్, నిజామి, మలిక్ షా, నిజాముల్ ముల్కు, హసన్ బిన్, హసీన, అల్పేల నాటిక నాలుగు దృశ్యము లుగా నడచినది

"ఇదేవేళ నీ దనుకో
ఇదిపోతే రాదనుకో
రసికుడా ! రేపుందను
పసితలంపు వదలుకో
కలవంటిది బ్రతుకుసుమా
తెలవారిన కనగలమా"

"పాపపుణ్యము రెండును
భగవంతుని కల్పనలే
కావున మన పాపపుణ్య
కారణఫల మాయనదే"

వంటి పంక్తులు సరళసుందరముగా ఉమర్ ఖయామ్ తత్త్వము నందించుచున్నవి ఈ నాటికయందలి రచన సంగీత నృత్యానుకూలముగా సాగినది.

**అనార్కలి :**

శ్రీమతి దర్భా భాస్కరమ్మగారు ఈ నాటికను రచించినారు. అనార్కలీ సలీముల ప్రణయమును చిత్రించు ఈ విషాదాంతనాటికయందలి కథ ప్రసిద్ధమైనదే.

మూడు రంగములుగా సాగిన ఈ నాటికయందలి పాత్రలు - అనార్కలి, సలీము, సేవకుడు, చెలికత్తె, అనార్కలి తల్లి, అక్బరు, మంత్రి.

ఈ నాటికలో శ్రీమతి భాస్కరమ్మగారు ఒకచో కొన్ని గేయ పంక్తులకు స్వరకల్పనమును సూచించినారు
ఈ నాటికలోని "నీలినీలిమబ్బుగుముల
నేలేమెరపుతీవవా
పాలరాతిప్రతిమవా
పయనించేతారవా''
వంటి పంక్తులు శ్రీమతి భాస్కరమ్మగారి కవితామతిని వ్యక్తము సేయు చున్నవి

**స్వతంత్రబంగ్లా :**

నాటికాకర్తలు శ్రీ ఎం. కె రాముగారు బంగ్లాదేశ్ విజయ మిందలి వస్తువు బంగ్లా ప్రజలు, ముజిబుర్ రహమాన్, యాహ్యాఖాన్, బంగ్లాసైనికులు, ముదుసలి, చెల్లి, భార్య, భారతప్రజలు, బంగ్లాశరణార్థులు, ఇందిరాగాంధి, కమాండర్ ఈ నాటికలోని పాత్రలు

ఈ నాటికలో వీరకరుణరసాలు విడిదిచేసికొన్నవి. ఇది బాలల ప్రదర్శన కుద్దేశింపబడినందున శైలి సులభముగా సుబోధముగా ఉన్నది పాత్రాను గుణముగా భాషప్రయుక్తమైనది యాహ్యాఖాన్, అతని సైనికుల పాత్రలచే ఉర్దూ మాటలనిపించుట ఔచితీభాసురము. ఇందలి గేయములు సంగీతాను కూలముగా రూపుదిద్దుకొన్నవి.

"మనమంతాపువ్వులము
ఒక దండగ చేరితిమి,
మనమంతా గువ్వలము
ఒక గూటిలో మూగితిమి"

వంటిపంక్తులు కవితాస్ఫోరకములు ఈ నాటిక ఆంధ్రోని పాఠశాలా విద్యార్థినీ విద్యార్థులచే రవీంద్రభారతిలో ప్రదర్శింపబడినది.

**ప్రాయశ్చిత్తము :**

శ్రీ వడ్డెపల్లికృష్ణ గారి రచన ఇది. బంగ్లాదేశ్ స్వాతంత్ర్య సమర సందర్భమున భారతదేశము నిర్వహించిన ఉదారవీరకార్యమును, పాకిస్తాన్ తాను చేసిన దౌష్ట్యమునకు అనుభవించిన ప్రాయశ్చిత్తమును ప్రతీకాత్మకముగా చిత్రించినది ఈ నాటిక. భారతి, కన్నె, వచ్చినవ్యక్తి, భారతితనయులు ఇందలి పాత్రలు. ఈ నాటిక యందలి —

"సింహబలుడ నాకేమని
చిందులేసి కీచకుండు
భీముడి భుజబలముముందు
ఏమాయెను ఏమాయెను"

అనుచు భారతి తనయులు పలికిన మాటలు బాగుగనున్నవి.

ఈ నాటికలో భారతి - భారతదేశమునకు, కన్నె - బంగ్లాదేశమునకు, వచ్చిన వ్యక్తి - పాకిస్తాన్‌కు, భారతి తనయులు - భారత వీర సైనికులకు ప్రతీకలు.

# సాంఘికములు

## (పద్యగేయవచన మిశ్ర నాటికలు)

**అల్లీముఠా :**

ప్రయోగదృష్టితో నాటకములు రచించి వానిని విజయవంతముగా ప్రదర్శింపగల్గిన ప్రసిద్ధరూపకకర్తలు శ్రీ కొప్పరపు సుబ్బారావుగారు ఈ గేయ నాటికను రచించినారు. ఇది "గద్యపద్య (కీర్తన) మిశ్రితం". ఇందలి పాత్రలు- అల్లీబాబా ("దొంగలనాయకుడు. ఈ అల్లీబాబా అసలు అల్లీబాబాకాదు. ఇది వట్టి బిరుదనామం") షేకుమియా, చౌదరి, పంతులు, బండరాముడు, రంగప్ప, రామప్ప, చిన్నారెడ్డి, సారాదొంగ.

ఈ నాటికయందలి వ్యక్తులలందరు భిన్నభిన్న గ్రామములకు, కులములకు, వృత్తులకు చెందినవారు. వీరు ఆంగ్లవిద్యాసంపర్కముచేత రూపుదిద్దుకొన్న కృత్రిమకపట సమాజనాగరికతకు విసిగి, ఉత్తమమైన వృత్తులకు దూరమై, బ్రతుకు తెరువు వెదకికొనుచు, అనుకొనకుండ ఒకచోటచేరి ముఠాగా ఏర్పడి దొంగలుగా తమ జీవితమును కొనసాగింతురు.

ఈ నాటిక సమకాలిక సంఘమునందు నాగరికత పేరుతోనున్న కుళ్లును హాస్యరసాత్మకముగా అధిక్షేపించును. "అల్లీముఠా బర్లెస్క్ అనెడి హాస్యసంగీత రూపకజాతికి చెందినద"ని[1] డా॥ పి. ఎస్. ఆర్. అప్పారావుగారు తమ సిద్ధాంత గ్రంథమున తెలిపియున్నారు. ఈ నాటికయందలి వచనసంభాషణములును, భజనకీర్తనల రీతిలో సాగిన పాటలును, ఇంగ్లీషు ఉర్దూపదముల విచిత్ర సమ్మేళనముతో కూడినశైలియు రమణీయములై ఈ నాటికకు గేయరూపకసాహిత్యమున ఉత్తమస్థానమును సంపాదించిపెట్టినవి. ఈ నాటికయందలి —

"మంగలోళ్లని మాకుపేరండి - నరులార మాదు
సంగతిని మీరాలకించండి.

........... ...........

---

1. తెలుగు నాటక వికాసము పుట - 415.

ఏమి చెప్పము స్వామి తంత్రీ !
సీమకత్తులు అవతరించె
ఎవడికతడే మంగలాయె
ఎందుజూచిన ఘోరమాయె

......................

ఏమి చెప్పం స్వామి తంత్రీ !
పోయె అప్పుకింద పొన్నాయ్
కల్లు మేలనిపించె కాఫీ
ఇల్లు సాఫీ ఒళ్లు మాఫీ

......................

ఏమి చెప్పం స్వామి తంత్రీ !
విధవలే కనరారు జగతిని
ఉన్నవారికి జుట్లు మొలచె
ఊరిమంగలి దీప మారె"

వంటి కొన్ని పంక్తులు శ్రీ సుబ్బారావుగారి చక్కని హాస్యరచనకు మచ్చు తునకలు.

'అల్లీముఠా'లో ప్రసిద్ధ ఆంగ్ల గేయనాటిక కర్తలైన గిల్బర్ట్ అండ్ సలివాన్ అను జంటకవుల రచనా పద్ధతిని అనుసరించినట్లు శ్రీ సుబ్బారావుగారు తెలిపినారు.[1]

## శిరప్ప చెప్పిన రహస్యం :

శ్రీ శ్రీ గారు రచించిన విషాదాంతనాటిక ఇది. వచనబహుళమైన ఈ నాటికయందు శ్రీ శ్రీ గారు తమ మహాప్రస్థాన సంపుటియందలి 'పేదలు' అను గేయకవితను, 'కవితా ఓ కవితా' అను వచనకవితా ఖండికను చేర్చినారు. ఇది ఆలిండియా రేడియో మద్రాసు కేంద్రమునుండి 31-8-1949 నాడు ప్రసారమైనది.

1. "నేటి నటుడు వగైరా" అనెడి మూడు నాటికల సంపుటిలో రచయిత 'మువి.' ప్రథమ ముద్రణ – ఏప్రిల్ 1944. ప్రచురణ : నవజీవన గ్రంథాలయము–తెనాలి.

రెండు భాగములుగా సాగిన, ఈ నాటికయందలి పాత్రలు— కైలాసం, శిరస్సు, అచ్యుతం, ధనం.

కైలాసం ఆరితేరిన చిత్రశిల్పి. ఆతడొకసారి 'నగ్నదారిద్ర్యం' అను తైల వర్ణ చిత్రమును చిత్రించి అఖిలభారత ప్రదర్శనకు పంపగా, అందలి వస్తువు జుగుప్సాకరముగానున్నదని ప్రదర్శనాధికారులు దానిని తిరిగిపంపుదురు. మరొక సారి తన మిత్రుడు అచ్యుతం కోరికననుసరించి కైలాసం ఒక బ్రిటిషు సైన్యోద్యోగి భవనకుడ్యముపై చిత్రరచన చేయుచు మహాత్ముని దండియాత్రా వార్తచే ఆవేశపూరితుడై ఆ కుడ్యమంతటను దండియాత్రా విశేషాలను చిత్రించును. కాని బ్రిటిషు సైన్యోద్యోగికి వచ్చునందున కైలాసమునకు చిత్రరచనా ప్రతిఫలము లభింపదు. దారిద్ర్యబాధతో, కళాతృణీకారముతో విసిగిపోయిన కైలాసం తన రచనలన్నింటిని నాశనముచేసి, చిత్రరచనకు స్వస్తిచెప్పి, శిల్పరచనకు పూనుకొని, తన రూపమును ఒక శిలలో మలిచి, అచ్యుతం వచ్చుచున్నాడని తెలిసి, చెక్కిన తన శిలాశిరస్సును బహుమతిగా అందుకొనుమని ఉత్తరమొకటి వ్రాసి ఈ లోకమును వదలిపోవును. 'ధనం' అనునాతడు స్వాతంత్ర్యోత్సవ దినమున కైలాసం చిత్రించిన కుడ్యచిత్రమును 'ఫోటో' తీయించి, బ్లాకులు చేయించి పది లక్షల ప్రతుల నమ్మును. కైలాసమునకు సన్మానముచేయ నిశ్చయించి అచ్యుతం, ధనం ఇద్దరు కైలాసం ఇంటికి వచ్చి, ఉత్తరమును చూచి దుఃఖించి చేయగలిగినదేమియులేక ఆ విగ్రహమును (శిలాశిరస్సును) సగౌరవముగా తమ పట్టణములో ప్రతిష్ఠించవలెనని తీసికొనిపోవుదురు.

సమాజము కళాకారులను మహనీయులను వారు బ్రతికియున్నకాలమున నిర్లక్ష్యముచేసి, నిప్పులుపోసి, చనిపోయిన తరువాత వారిని సన్మానించు ననువిషయమును ఈ నాటిక చక్కగా నిరూపించుచున్నది. 'శిరస్సు చెప్పిన రహస్యం' కూడ ఇదియే.

ఈ నాటికయందలి శిరస్సు పాత్ర చేసిన నిశితవ్యాఖ్యానము శ్రీశ్రీగారి అసాధారణ ప్రతిభకు నిదర్శనము.

**శివక్షేత్రయాత్ర :**

శ్రీ దేవులపల్లి వేంకటకృష్ణశాస్త్రిగారు రచించిన భక్తిరసాత్మకమైన నాటిక ఇది. కథలకామశాస్త్రి, పాటలకోటయ్య, సుబ్బయ్య, సూరమ్మ,

లచ్చమ్మ, ఇంకను కొందరు యాత్రికులు ఈ నాటికయందలి పాత్రలు.

కథలకామశాస్త్రి శివక్షేత్రమాహాత్మ్యమును శ్రుతిమధురముగా భక్తిరసార్ద్రముగా వివరించుచుండగా, పాటలకోటయ్య భక్తిగీతములతో గుండెలను మీటుచుండగా మిగిలినవారందరును, శ్రీకాళహస్తిని, శ్రీశైలమును, దక్షారామమును దర్శించుచు, తీర్థములను సేవించుచు తమ జీవితములను ధన్యముచేసికొనుట ఈ నాటికయందలి ఇతివృత్తము.

ఈ నాటికయందలి కామశాస్త్రిపాత్రలో కవియే కానిపించును. ఇందు వచనము, పాటలు, హృద్యములై ఒకదానితోమఱొకటి పోటీపడుచున్నట్లుండును.

ఇందలి — "శివ శివ శివ అనరాదా?
శివ నామము చేదా?
శివపాదము మీదా – నీ
శిరసు నుంచరాదా? "

"ఎందుకయా సాంబశివా!
ఎవరు నీకు చెప్పారయ!
ఈ అల్లరి చేతలూ
ఈ బూడిద పూతలూ! "

"కైలాసగిరినుండి కాశికై
కాశికాపురినుండి దాసికై
దాసికై ఈ దక్షవాటికై
దయచేసినావయా! హరహరా! హరహరా! " వంటి పాటలు.
అఖిలాంధ్ర రసహృదయుల రసనాగ్రములపై నాట్యమాడుచున్నవి.

"ఏటికయా బాబయా
కోటయమాటినరయా
కాశీరామేశ్వరాలు
కాళ్లీడుసు కెళ్ళటం ॥ఏటి॥

పెయ్యోత్తామంటే, నీ
పెయిలం ఒరిగుంటే
కూకున్నాపోటికొచ్చి
కోటప్పాగుడివుంటే
రమ్మంటే కాళహస్తి
గుమ్మంకాడే వుంటే"

వంటి జానపద పరిమళ సంవాసితములైన పాటలు ఈ నాటికలో చోటుచేసి కొన్నవి. ఈ నాటిక ఆకాశవాణిలో ప్రసారితమైనది.

**ఏడాదిపొడుగునా :**

నాటికా కర్తలు శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారే. ఇదియు ఆకాశవాణిలో ప్రసారితమైనది. గోదావరి మండలమందలి ఒక పల్లెలోని ఒక కర్షక కుటుంబ జీవితమును, ఆ కుటుంబము 'ఏడాదిపొడుగునా' జరుపుకొను పండుగలను పర్వాలను వ్యావసాయిక కార్య విశేషములను ఈ నాటిక కమనీయముగా చిత్రించుచున్నది. సీతమ్మ, రామయ్య, లక్ష్మి, పిల్లవాడు, నారాయణ, సుబ్బమ్మ, గోవిందమ్మ, పేరమ్మ, శాస్త్రి, కోటయ్య, నాగరాజు, గైరమ్మ, చంద్రం, ఒక మనుమడు, పిల్లలు, పార్వతి, వేంకటేశ్వరరావు – మరికొన్ని 'ఆడమగగొంతులు'.

ఒక పచ్చని కర్షక కుటుంబ జీవన విధానమును సహజరమణీయముగా రూపు కట్టించినారు ఈ నాటికలో శ్రీ కృష్ణశాస్త్రిగారు. గొంతెమ్మ జాతరలు, విరాట పర్వ కాలక్షేపాలు, శివసహస్ర ఘటాభిషేకాలు, బసవన్న పూజలు, ఏరువాకమ్మ ఎదురుకోళ్ళు, శ్రావణ శుక్రవారపు నోములు. దసరా వినోదాలు, పిల్లల శాబాలవేషాలు, పుస్తకాల పూజలు, పురాణ కాలక్షేపాలు, గొబ్బిళ్ళ పూజలు, గంగిరెద్దు సన్నాయి వాద్యాలు, పాములవాని గారడీలు, ఉగాది పండుగల దంపుళ్ళు, ఇనుగుళ్ళు అన్నియు వరుసగా కన్నులముందు కదలి పోవును.

లలిత శృంగార హాస్య తరంగములతో ఈ నాటిక అంతరంగాలకు గిలిగింతలు పెట్టును. పాటలు జానపదుల బాసలోని యాసలను, వారి సంగీతపు

విన్యాసాలను పరిచయము చేయుచు ఈ నాటికకు ఒక అపూర్వ సౌందర్యమును సంతరించిపెట్టినవి.

"వానదేవుడా ఓ వానదేవుడా !
రాణిలాను రావయ్య వానదేవుడా !
రాజులాగరావయ్య వానదేవుడా !
మిన్నంతా నీతేరు వానదేవుడా !
మేఘాలు గుర్రాలు వానదేవుడా !
మెరుపులైతే తెండాలు వానదేవుడా !
ఉరుములైతే బాజాలు వానదేవుడా !"

వంటి రమ్యగీతాల నెన్నింటినైనను ఈ నాటికలో చూడవచ్చును.

**గౌతమి :**

ఇదియును శ్రీ కృష్ణశాస్త్రిగారిదే. ఆకాశవాణిలో ప్రసారమైనదే. కోనసీమలో గోదావరితీరాన పండుగలతో పచ్చపచ్చగా బ్రతుకు ఒక గ్రామము అర్ధరాత్రి గోదావరి వరదలకు గురియై ఆ గోదావరితల్లిని ప్రార్థించుట ఈ నాటికయందలి వస్తువు. సూరన్న, హరిశాస్త్రి, సన్యాసి, సుబ్బన్న, వెంకన్న తాత, లక్ష్మిదేవి, గంగిరెద్దువాడు, చిన్నమ్మి, సూరన్న అల్లుడు, సూరన్న మనుమలు, కరణం, కరణం అమ్మాయిలు, ఇంకను కొందరు ఇందలి పాత్రలు.

రైతు సూరన్న పచ్చని సంసారమును, అతని ఉదారహృదయమును చక్కగా చిత్రించినారు ఈ రూపకములో శ్రీ కృష్ణశాస్త్రిగారు. కోనసీమలోని పచ్చ పచ్చని పైరులను, పనస, అరటి తోటలను, కొబ్బరితోటలను, పోకతోపులను, గోదావరి నడకలను, ఉద్ధృతపు వరదలను ఈ నాటిక సహృదయుల నయనములముందు నాట్యము సేయించును. నీలాటిరేవుపాటలు, పడవపాటలు, 'పొలం' పాటలు, బుర్రకథలు, బువ్వపాటలు, భరతనాట్యాలు, పురాణకాలక్షేపాలు వంటి సాంస్కృతిక కళారూపాలను పరిచయము సేయుచు ఈ నాటిక ఒక సంగీత సాహిత్య నాట్యోత్సవమువలె అంతరంగములందు ఆనందగోదావరులను ప్రవహింపజేయును.

**వేణుకుంజం :**

శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు రచించిన విషాదాంత నాటిక 'వేణు

కుంటుం". ఒక పల్లెటూరి పడుచుకన్నె ఒక దుర్మార్గుని బారినుండి తన శీలమును కాపాడుకొను యత్నములో శాశ్వతముగా కన్నుమూసి కన్నె పేరంటాలు దేవతగా వెలయుట ఈ నాటికలోని ఇతివృత్తము. కవి, వేణువు, ఏరు, వీరమ్మ, గోపయ్య, కొండయ్య, కొన్ని స్త్రీ పురుష కంఠాలు – ఇందలి పాత్రలు.

ఈ రూపకమందలి విషాద గాథను ప్రత్యక్షముగా చూచిన ఒక వేణువు 'ఏరు'కు చెప్పుచున్నట్లు చిత్రించినారు శ్రీ కృష్ణశాస్త్రిగారు.

ఆకాశవాణిలో ప్రసారితమైన ఈ నాటికలోని పాటలు వంచన సంభాషణములు అతిరమ్యముగా సాగినవి.

"తోట కివల ఆమె యిల్లు
తోట కవల వానియిల్లు" అను పాటలోని

"ఎదురైనపుడాగి అగి
కదలబోవు వానికళ్లు
తప్పుకొని ఆమె కళ్లు
రెప్పలకిందికి మళ్లు

కళ్లూ కళ్లూ కలిసి
నల్లకలవ మాలలల్లి
అల్లి అల్లి మొగ్గలతో
ఝల్లనేవి వాళ్ళ ఒళ్లు"

వంటి చరణములు శబ్దార్థమధురసమ్మేళనమునకు ఉదాహరణములు. నాటికాంతముననున్న

"అయ్యో అని యేడ్చెను – ఇటు
లయేనని ఏడ్చెను"

అను విషాదగీతము ప్రతి సహృదయుని కంట కన్నీరొలికించును.

**చౌరస్తా :**

నాగరికతతోపాటు వేగమును పెంచుకొన్న నగర జీవితమును చిత్రించిన ఈ చిన్ననాటిక 1-11-1958 నాడు ఆకాశవాణి హైదరాబాదు కేంద్రమునుండి

ప్రసారమైనది. నాటికాకర్తలు శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారే. ట్రాఫిక్ పోలీసు, రిజూవాడు, ఇద్దరు గుమాస్తాలు ఈ రూపకమందలి పాత్రలు.

చౌరస్తా నడుమ నిలబడిన పోలీసు తనకు కనిపించిన రిజూవాని బ్రతుకు తీరుతెన్నులను, రిజూలో కూర్చొనిన గుమాస్తాల రైనందిన జీవితమును, నెలచివరకు వారు పడు అవస్థలను, చౌరస్తాలో ఆగిన 'కారు'లోని సంతాన హీన దంపతుల మానసికబాధలను తలచుకొని, తన స్థితిని నెమరువేసికొని విధిని సక్రమముగా నిర్వర్తించుకొనుచు తృప్తిని పొందుచుండుట ఈ రూపక మున చక్కగా చిత్రింపబడినది.

గేయములలో ఉర్దూ తెలుగుపదములు అందముగా ఒదిగియుండుట ఒక విశేషము.

## కృష్ణాపుష్కరం :

సంవాదాత్మకమైన ఈ నాటికను రచించినవారు శ్రీ మల్లవరపు విశ్వే శ్వరరావుగారు. ఇది 1958లో ఆకాశవాణిలో ప్రసారమైనది. సామాన్యముగా సంప్రదాయముగా వచ్చుచున్న పుష్కరస్నానములు ముక్తికి మార్గములగుచో. నదులపై నిర్మింపబడు ఆనకట్టలను పుష్కరములు జలాలను పొలాలకు అందిం చుచు జనావళికి ముక్తిని భుక్తిని ప్రసాదించు నను అభిప్రాయమునకు నిదర్శన ముగా కృష్ణాబ్యారేజి, నాగార్జునసాగర నిర్మాణమును గూర్చి ఈ నాటికలో వివరించినారు శ్రీ విశ్వేశ్వరరావుగారు.

వృద్ధుడు, యువకుడు ఈ నాటికయందలి పాత్రలు. ఇందు వచనము బహుళము.

భారతదేశస్తుతితో నాంది పలికిన ఈ నాటిక ఆంధ్రప్రదేశ ప్రశంసతో భరతవాక్యము పలికినది.

## 'మాచ్‌కండు' జలవిద్యుత్కేంద్రం :

ఈ రూపకరచయితలు శ్రీ ఉండేల మాలకొండారెడ్డిగారు. విశాఖ పట్టణము మండలమునందలి మాచికండునదిమీద నిర్మింపబడిన జలవిద్యుచ్ఛక్తి ప్రాజెక్టు విశేషాలు గేయవచనాత్మకమైన ఈ 'సంగీత రూపకములోని వస్తువు. ఇందలి-

"అదిగదిగో మత్స్యకుండ - జలవిద్యుత్కేంద్రం
క్షణంక్షణం తటిల్లతలు - జనియించే సరోవరం
దానిమీద వికసించిన - ధవళకాంతి సందోహం
శివునిజటాజూటంలో - చిగురించిన శశిబింబం
దుముకునదే హోరెత్తుచు - 'డుడుమా' జలపాతం
భగీ రథుని వెన్నంటిన - స్వర్గంగాపాతం
అతి రథులూ మహారథులు - అధునాతన భగీరథులు
బలోద్ధతులు కార్మికులు - ప్రకృతితోడ కావింతురు
తె గిలేని యుద్ధం - జయంమనకు సిద్ధం"

అను గేయము పేర్కొనదగినది. ఈ నాటిక 24-12-1958 నాడు ఆకాశవాణి హైదరాబాదు కేంద్రమునుండి ప్రసారమైనది.

**ఆనందలహరి :**

శ్రీ జంధ్యాలపాపయ్యశాస్త్రిగారు ఈ నాటికను రచించినారు. గేయ వచనకవితామయముగా సాగిన ఈ రూపకమునందలి వస్తువు భారతస్వాతంత్ర్య సముపార్జనము. ఇందలి పాత్రలు- ప్రజలు, ప్రకృతి, శాంతి, అహింస, స్వాతంత్ర్యలక్ష్మి.

స్వాతంత్ర్యలక్ష్మిని చూచి ప్రకృతి, శాంతి, అహింస ఆనందతరంగాలలో తేలిపోవుచుండగా ప్రజలు— "పదమూడు వసంతాలు నిండిన బాలకుమారీ, నీ వెవ్వరు ?" అని సంతోషముతో స్వాతంత్ర్యలక్ష్మిని ప్రశ్నింతురు. స్వాతంత్ర్య లక్ష్మి స్వాతంత్ర్యసిద్ధికై ఆదినుండియు మహనీయులు చేసిన మహోన్నత త్యాగములను, స్వతంత్రతాసమర ప్రసిద్ధోద్యమములను వారికి నివేదించును.

స్వాతంత్ర్యసమరములో పాల్గొన్న మనీషుల చైతన్య సౌజన్య ధైర్య వీర్య సమతా సత్యాహింసా ప్రేమాది గుణసంపదంతయు తనలో నున్నదని స్వాతంత్ర్య లక్ష్మి విన్నవించు సందర్భమునందలి-

"నేను స్వాతంత్ర్య స్వర్ణలతను
నా ఆకులు పచ్చన
నా చివుళ్ళు ఎఱ్ఱన
నా పువ్వులు తెల్లన

మువ్వన్నెల పతాకానికి
ముద్దుల ప్రతీకాన్ని నేను
అందమైన అశోకచక్రానికి
అమృతాభిషేకాన్ని నేను"

అను పంక్తులు రమ్యములు; సహృదయ గమ్యములు.

**చాండాలిక :**

ఇది శ్రీ బోయి భీమన్నగారి రచన. ఈ 'చాండాలిక' కథ విశ్వకవి రవీంద్రుని రచననుండి గ్రహింపబడినది. చాండాలిక, బౌద్ధసన్యాసి, మాలి, ఇద్దరు భటులు ఈ నాటిక యందలి పాత్రలు.

'చాండాలిక' అను చండాలకన్య ఆనందుడను యువబౌద్ధభిక్షువను సర్వస్వముగా భావించి చిట్టచివరకు ఆ దివ్యాత్మునిలో లీనమైపోవుట ఈ రూపకము నందలి వస్తువు.

గేయములు తేటగీతిపద్యములు వచనకవిత ఈ నాటికలో చోటుచేసికొన్నవి బౌద్ధసన్యాసిపాత్రకు పద్యమును ప్రయోగించినారు శ్రీ భీమన్నగారు.

ఐదురంగములున్న ఈ నాటిక రవీంద్రుని శతజయంత్యుత్సవముల సందర్భముగా రవీంద్రభారతిలోను తదితర ప్రదేశములందును ప్రదర్శింపబడినది. ఆకాశవాణిలో కూడ ప్రసారితమైనది.

ఈ రూపకములో అద్భుతహాస్యకరుణరసాలు చక్కగా పోషింపబడినవి. చాండాలిక సంభాషణమునందలి స్త్రీపురుషమనస్తత్త్వనిరూపణము హృదయంగమము.

"బైటవెలుగెంతయున్న లాభమ్ములేదు
లోన చీకటి యున్న; నీ మానసమ్ము
దివ్యదీపాలయమ్ముగ తెలిసికొమ్ము
బైట చీకటియున్నను బాధలేదు"

వంటి పంక్తులు విశ్వజనీనతాపరిమళాలను విరజిమ్ముచున్నవి. "వేసవి తెలిమబ్బును చూచి విత్తనాలు పారబోసుకొన్నావ్" వంటి కవితోక్తులెన్నింటినో ఈ నాటికలో చూపవచ్చును.

**గంగాకావేరి :**

శ్రీ రెడ్డి చినవెంకటరెడ్డిగారి నాటిక ఇది. గంగాకావేరీ నదులను కలుప వలయునను ప్రభుత్వసంకల్పమునకు కళారూపము ఈ రూపకము. సుద్దుల వాళ్ళు, ప్రభుత్వప్రతినిధి, రామయ్య, ఇంజనీరు, కిష్టయ్య, ముసలయ్య, సోము, రాము, గంగా, కావేరి, సీతమ్మ, లక్ష్మి, రంగమ్మ, ముసలవ్వ ఈ నాటిక యందలి పాత్రలు.

ఈ నాటికలో స్వాతంత్ర్యానంతరము వచ్చినమార్పులను శ్రీ రెడ్డిగారు చక్కగా వివరించినారు. 'గొల్లసుద్దులు' అను తెలంగాణా జానపదకళారూపమును ఈ నాటికలో చక్కగా వినియోగించుకొన్నారు శ్రీ రెడ్డిగారు.

**స్వేదబిందు :**

శ్రీ పాలగుమ్మి విశ్వనాథముగారు ఈ నాటికను నిర్మించి ఆకాశవాణిలో ప్రసారము చేసినారు. గేయవచనమిశ్రితమైన ఈరూపకమునందలి పాత్రలు– ఇంజనీరు, ఆతని ప్రేయసి, శ్రామికులు.

నాగార్జునసాగరనిర్మాణము ఈనాటికయందలి ఇతివృత్తము 'ఇంజనీరింగు' విద్యను ముగించిన ఒక యువకుడు తన ప్రియురాలితో విజ్ఞానయాత్రను చేయుచు నాగార్జునసాగరుకు వచ్చును ఆ మహాసాగరనిర్మాణమునందు శ్రామికులు కార్చు స్వేదబిందులను చూచి డెందము స్పందించగా, తానుకూడ సాగరనిర్మాణములో పాలుపంచుకొని, అక్కడనే జీవితమును గడపవలయునని నిశ్చయించుకొనును. ఆతని నిశ్చయమును మొదట కాదన్నను పిదప ఆతని ప్రేయసి ఆతనితో నుండి పోవును. ఇది ఈ రూపకమునందలి కథ.

"నవభారతములో వెలసినది ఈ దేవళం
నవమానవుని చైతన్యమే ఇది కేవలం"

వంటి హృద్యములైన పంక్తులు ఈ నాటికలో చోటుచేసికొన్నవి.[1]

**మాపల్లె కదిలింది :**

గేయవచనమయమైన ఈ నాటికయును శ్రీ పాలగుమ్మి విశ్వనాథము గారిదే. 1976 లో ఆకాశవాణి హైద్రాబాదు కేంద్రమునుండి ప్రసారమైనదే.[2]

1, 2 : శ్రీ పాలగుమ్మి విశ్వనాథముగారు తమకు జ్ఞాపకమున్న మేరకు నాకు ఈ నాటికలను గూర్చిన విశేషాలను వివరించినారు. ఈ నాటికల పాఠాలు లభ్యము కాలేదు.

ఉద్యోగి, యువకులు, విద్యార్థులు, కర్షకులు ఈ నాటిక యందలి పాత్రలు. అనేకసంవత్సరముల క్రితము పల్లెను విడిచి, పట్నముచేరి ఉద్యోగము చేయుచున్న ఒక యువకుడు తన సొంత ఊరు తలచుకొని, అచ్చటి పచ్చని పచ్చికపై మేను వాల్చవలెననియు, పైరగాలిలో పరవశించవలెననియు, పల్లీయుల ఆప్యాయతను ఉల్లములో నింపుకొనవలెననియు ఉవ్విళులూరుచు నియలు దేరును. ఊరి పరిసరాలను చేరి అక్కడనున్న ప్రజలలో కల్గిన చైతన్యమును చూచి సంబరపడిపోవును, ఇది ఈ నాటికలోని కథాంశము.

సమ్మెలు, కుటుంబసంక్షేమము, వరకట్నము వంటి సమస్యల చిత్రణము ఇందు హృద్యముగా ఉన్నది. ఈ నాటిక యందలి—

"అటుపోతే కొలను
కొలను పక్కనే కోనెల
కోనెల కొలను నేస్తాలు- మా
ఊరికి అవియే నేత్రాలు"

అను గేయపంక్తులు రమణీయములు.

**వరకంమండి వ్వర్గావికి :**

నాటికాకర్తలు. శ్రీ చిట్టిమల్లె శంకరయ్య (రుద్రశ్రీ)గారు. కుటుంబ నియంత్రణ మిందలి వస్తువు. గేయవచనకవితానమ్మిశ్రితమైన ఈ నాటిక యందలి పాత్రలు- వృద్ధుడు, పిల్లలు- కొన్ని స్త్రీపురుష కంఠములు.

## (పద్యగేయనాటికలు)

**అదృష్టదేవత :**

సాంఘికేతివృత్తముగల పద్యగేయాత్మకనాటిక 'అదృష్టదేవత'. శ్రీ తల్లావజ్ఝల శివశంకరస్వామివారు ఈ నాటికను రచించినారు. సంవాదాత్మకమైన ఈ నాటికయందలి పాత్రలు - సాధకుడు, అదృష్టదేవత.

ఇదొక భగ్నప్రేమికుని గాథ. ప్రియురాలిచేత వంచితుడై స్త్రీజాతిపట్ల అసహ్యభావమును పెంచుకొని, చివరకు అదృష్టదేవత ద్వార స్త్రీ శక్తిస్వరూపిణి యనియు, నిఃశ్రేయసము స్త్రీని ఉపాసింపకనే సాధ్యముకాదనియు సాధకుడు ఉపదేశమును పొందును.

ఈ నాటికలో శ్రీ శివశంకరస్వామివారి తత్త్వపాండిత్యము, హేతువాద ధీపటిమ, సంభాషణరచనాశిల్పము చక్కగా వ్యక్తమగుచున్నవి

**వ్రతభంగము .**

ఒక భగ్నప్రేమికుని గాథను తెలుపు ఈనాటికకూడ శ్రీ శివశంకరస్వామి వారిచే ప్రత్యేకముగా పాత్రల పేర్లు సూచింపబడకపోవుటచే 'వ్రతభంగము' నాటిక కాదేమో అనిపించును. కాని రచన అంతయు విభిన్నవ్యక్తులమధ్య ప్రత్యుత్తరసంవాదధోరణిలో సాగుటచే ఇది నాటికయే అగుచున్నది సంభాషణ ననుబట్టి ఈ నాటిక యందలి పాత్రలు—— కవి, ఇందిరాసుందరి, అంబ, ఇందిరా సుందరితావ, ఒక మిత్రుడు (దైవజ్ఞుడు) అని గ్రహింపవచ్చును

తనను మొదట ప్రేమించిన ఇందిరాసుందరి చివరకు మనసు మార్చుకొని వివాహమాడుటకు అంగీకరింపకపోగా భగ్నప్రేమికుడైన కవి శివుని సన్నిధిచేరి గతములో ఒకసారి తనకు కుక్కుటేశ్వరుని సన్నిధిలో వ్రత భంగము జరిగినందుకు తనను క్షమించి 'భావికాలమందుగలుగు నఖిలంబునకు' అవలంబనముగా నుండవలెనని ఆ దైవమును ప్రార్థించుట ఈ నాటికయందలి కథాంశము

ఈ నాటికలో ఇందిరాసుందరి చంచల చిత్తమును, నాయకుని (కవి) విప్రలబ్ధ ప్రణయ హృదయమును చక్కగా చిత్రించినారు శ్రీ శివశంకర స్వామివారు ముప్పదిమూడు చిన్నచిన్న భాగములుగా సాగిన ఈ నాటిక యందలి ఒక్కొక్క భాగమును ఒక్కొక్క సన్నివేశముగా గ్రహింపవచ్చును ఒక్కొక్క భాగము సహృదయునిలో ఉత్కంఠను రేకెత్తించును

త్ర్యస్రాది గతులలో సాగిన గేయములు, తేటగీతులు, ఆటవెలదులు, కందములు, మంజరీద్విపదలు, ముత్యాలసరాలు, స్రగ్విణి - స్వాగత - తోటక - శాలిని - వనమయూర - దోదక - ద్రుతవిలంబిత - ప్రమితాక్షర - రథోద్ధత వృత్తములు ఈ పద్యగేయనాటికలో చోటుచేసుకొన్నవి. ఈ ఛందోవైవిధ్యము సహృదయులకు విసుగును కలిగింపదు మొదటి కొన్ని భాగములందు ఒక్కొక్క భాగములో ఒక్కొక్క విధమైన పద్యము ప్రయుక్తమగుట ఈ నాటికయందలి ఒక ఛందోవైవిధ్య ప్రయోగ విశేషము

శ్రీ శివశంకరస్వామివారు 'ఉజ్జీవము'అను మరొక నాటికను రచించినట్లు తెలియవచ్చినది కాని అది నాకు లభ్యము కాలేదు.

## (గేయనాటికలు)

**అశరీరవాణి :**

సంవాదాత్మకముగా సాగిన ఈ చిన్న గేయనాటికను రచించిన వారు శ్రీ తల్లావఝ్ఝల శివశంకరస్వామిగారు. ఈ నాటికయందలి పాత్రలు-సాధకుడు, అశరీరవాణి.

తాను ప్రేమించిన యువతికి తనపట్ల అనురాగము లేదన్నవిషయము అశరీరవాణి ద్వారమున తెలిసియు ఆమెను ఆరాధ్యదైవముగా భావించిన ఒక సాధకుని వృత్తాంతము ఈ నాటికయందలి కథ.

ఈ నాటికలోని సంభాషణలు సరళములై సంక్షిప్తములై ముత్యాల సరములలో ముద్దుగా సాగినవి. సాధకునకుగల అచంచల ప్రేమ విశ్వాసములు ఈ రూపకమున చక్కగా వ్యక్తము చేయబడినవి. ఈ నాటికలో -

"వలపు తలమున్కలుగనుండెడి
వానికయదార్థంబె సుఖదము
కాచఖండము వజ్రదీధితిగ్రాలునాతనికి"

వంటి సురుచిర సూక్తులు ముత్యాలసరమువలె నిగనిగలాడుచున్నవి.

ఈ నాటిక పఠనమునకే గాని ప్రదర్శన కుద్దేశించి వ్రాసినట్లు కానిపింపదు.

**మృగతృష్ణ :**

ఈ నాటికయును శ్రీ శివశంకరస్వామివారిదే. 'అశరీరవాణి' వలెనే ఇదియును రెండు పాత్రలతో నడచు సంవాదాత్మకమైన చిన్ననాటిక. ఇందలి విషయము కూడ ఆ నాటికయందువలెనే ప్రణయసంబంధమైనది. యువ, సాధకుడు - ఇందలి పాత్రలు

ఒక యువకునకును (సాధకునకు), సుందరాంబ అను యువతికిని అనురాగ మంకురించును. ఇరువురును కొంతకాలము దర్శన స్పర్శన సంభాషణములతో సంతోషమున ఓలలాడుదురు. స్థితిగతుల ప్రభావమువలన ఆమె పాణిగ్రహణము నకు నిరాకరించును. కాని ఏ విధముగా నయినను ఆమెను యువకుడు తన దానినిగా చేసికొనవలె ననుకొనును. ఇది ఈ నాటికయందలి విషయము. ఈ విషయమంతయు సుందరాంబ అల్లుడైన 'యువ' అనునాతనికిని, సాధకునకును

జరిగిన సంభాషణము ద్వారమున వ్యక్తము చేసినారు శ్రీ శివశంకర స్వామి వారు.

కథంతయు కేవలము ఇద్దరి సంవాదమువలన తెలియవచ్చుట చేత ఇందు నాటకీయతకు అవకాశము లేదు. అందువలన ప్రదర్శనాయోగ్యముగా గాక పఠనయోగ్యముగా నున్నది ఈ నాటిక.

**రత్నాకరము :**

సంవదాత్మకమైన ఈ నాటికయును శ్రీ శివశంకరస్వామివారి దే. పరకీయా నాయికమైన ఈ నాటిక పూర్వోత్తర భాగములుగా సాగినది. పూర్వభాగము నందలి పాత్రలు–భ్రమర, శాంత; ఉత్తర భాగమునందలి పాత్రలు త్రిలోచనుడు, ధూర్జటి. ప్రణయ సంబంధమైన ఇందలి కథ స్వల్పము.

ప్రణయమునకు మనస్సులే ఆలంబనములు కాని సంప్రదాయ వివాహములు కావని ఈ నాటిక భంగ్యంతరముగా తెలుపుచున్నది.

ఈనాటిక దీర్ఘసంభాషణములవలనను వర్ణనాబాహుళ్యముచేతను విస్తృతముగా నున్నను, ఇందలి గేయములు 'పల్లవి'తో పల్లవించుట చేతను, వర్ణనలు రసరమ్యము లౌట చేతను, సంవాదములు చమత్కారముగా సాగుచు కౌతుకమును రేకెత్తించుట చేతను విసుగును కలిగింపదు. శ్రీ శివశంకర స్వామివారికి గల మనస్తత్త్వ నిరూపణ శక్తిని ఈ నాటిక సహస్ర కంఠాలతో చాటుచున్నది. ఇందు గానాంశము వేయిరేకులతో వికసినది. ఉన్నవి నాలుగు పాత్రలే అయినను వానిని రమ్యాతిరమ్యముగా పోషించినారు శ్రీ స్వామి వారు. త్రిలోచనుడు ధూర్జటితో పలికిన —

> "పడగల్గుదునే బాధలు సఖుడా !
> భరింపజాలను పరపీడనమును
> భ్రమరకు తూష్ణీంభావము కలిగిన
> అవివేకిని కావంగలార్చుటకు
> రక్తిలేని యొక రసికుండగు వా
> డూగులాడునొకొ యువతికోసమై"

అను మాటలు అతని మనస్తత్త్వమును చక్కగా వ్యక్తీకరించుచున్నవి. త్రిలోచనుడు పదకర్త. అతని ప్రజ్ఞకు —

"......దివ్యమంగళాకారంబు
సౌందర్యసారంపు సముదాయ సదనంబు
త్రిజగతీలావణ్య తీర్థప్రదేశమ్ము
అత్యంత పరిపూర్ణ యౌవనామృతపాత్ర
మఖరరోచిఃపుంజ హీరమణిదర్పణము
ప్రద్యుమ్నశాణిత 'ప్రసవనారాచమ్ము"

వంటి పంక్తులు ప్రతిబింబములు

భ్రమర 'గభీరసాన్వాంత రత్నాకరమ్ము' లో ప్రణయమను 'కలి' రగులుట చేతను, త్రిలోచనుడు ఆమె కంటికి గాంభీర్య లావణ్యామృత శైతల్యములను మాత్రమే ప్రసాదించు ఒక 'రమణీయమౌ మాతృరత్నాకరంబు'వలె కానిపించుటచేతను, భ్రమర అత్తగారి యిల్లు 'గౌతమీద్వారకరమ్యదేశమునందు రత్నాకరమ్ము'నకు సమీపమునమందుటచేతను ఈ నాటికకు 'రత్నాకరము' అను పేరు సార్థకము.

**సస్యశ్యామలము**

నాటికాకర్తలు విద్వాన్ శ్రీ ప్రయాగ కోదండరామశాస్త్రిగారు సూత్రధారికాక ఈ నాటికయందలి పాత్రలు—రైతు, వనిత, మహామానవుడు.

వర్షములేక కరువురాగా కర్షకజనమంతయు పట్నమునకు తరలిపోవు నరు మహామానవుని సందేశము విని వారందరును తిరిగివచ్చి తుంగభద్రకు ఆనకట్టకట్టి పంటలు పండించి ఆనందింతురు. ఇది ఈ నాటికయందలి ఇతివృత్తము.

సమైక్యశక్తి దేశమును సస్యశ్యామలము చేయునను సందేశము నందించుచున్నది ఈ నాటిక

"పరవళ్ళు త్రొక్కేటి
పరుగులే తీసేటి
పళ్ళుదారులు కట్టి
చాళ్ళు నిండిద్దాము
మెరుములై ఉరుముతూ

తరిమేటి మేఘాల
చెట్లకే కట్టేసి
చేలు పండిద్దాము
కాపుకన్నెల కళ్ళు - కలువలై నీచల్ల
నడుగులకు మడుగులో త్తేను
రావమ్మ ఓ తుంగభద్రా! రావమ్మ ఉత్తుంగభద్రా!"

వంటి రమ్యగేయము లిందు పురులు విప్పి నాట్యము సేయును ఇందు సూత్రధారుని పాత్ర కథాగమనమునకు తోడ్పడినది. ఈ నాటిక 23-10-1954 నాడు ఆకాశవాణిలో ప్రసారితమైనది.

**రైతురాజు :**

శ్రీమాన్ వానమామలై వరదాచార్యులవారు రచించిన నాటిక ఇది. దేశసౌభాగ్యమునకు వెన్నెముకవంటివారైన రైతు వ్యావసాయిక జీవితమును 'రైతురాజు' లో కళామయముగా చిత్రించినారు శ్రీమాన్ ఆచార్యులవారు. రైతు, అతని భార్య - లక్ష్మి ఈ నాటికయందలి పాత్రలు. పొలమును దున్నుట, విత్తుట, వానకెదురు చూచుట, నాట్లువేయుట, కలుపు తీయుట, కావలిగాయుట, పంటచేలు కోయుట, ధాన్యమును తూర్పారపట్టి బండిపై నింటికి తీసికొనిపోవుట అన్నియును భిన్నభిన్న గీతములలో క్రమముగా కవితాత్మకముగా చిత్రింపబడినవి ఈ నాటికలో.

శ్రీమాన్ వరదాచార్యులవారు మహాకవులే గాక సంగీతకోవిదులు కూడ. మధుర గంభీరగళముతో ఈ నాటికయందలి పాటలను పాడగా విను భాగ్యము నాకు కలిగినది. వారికిగల సంగీత సాహిత్య వైదుష్యము ఈ రూపకమును రసరమ్యము చేసినది. రైతు వానకై నిరీక్షించు సందర్భమునందలి —

"ఇంటిలో గింజలను
మంటిలో బోసితిమి
మింటికే యీ జూచి
కంట నీర్వెట్టుదుము"

అను చరణములు, వానచినుకులు పడగా రైతు సంతసించు సన్నివేశమునందలి—

"పాడు కరవులకు బాణాలు మా
పంట చేలకివి ప్రాణాలు

కాపుకన్నులకు ముత్యాలు - వరి
కట్టి వోళ్లకు చమటాలు" వంటి పంక్తులు,
రైతు తన భార్యను తలచుకొను ఘట్టము వందలి —
"అత్తమామల బెదురు ఆడుబిడ్డల యలుక
వత్తయని రాలేదు పంజరములో చిలుక
పెత్తనమ్మేది నా రాణికి ఎంత ప్రేముంటె ఏమి దొరపానికి"
వంటి చరణములు శ్రీమాన్ ఆచార్యులవారి భావుకతకు ప్రతిబింబములై నాటికను నవనవముగా రవళింప జేయుచున్నవి.

**పెదల చదువు :**

ఈ నాటిక కూడ శ్రీమాన్ వరదాచార్యులవారిదే సంవాదాత్మకమైన ఈ నాటికయందలి పాత్రలు - రాముడు, లక్ష్మి. వయోజన విద్యా ప్రాధాన్యమును చిత్రించునాటిక 'పెద్దల చదువు'.

రాముడు లక్ష్మికి మేనబావ ఇరువురు ప్రేమించుకొందురు. రామునికి చదువురాదు. విద్యా ప్రపంచమును తన అనుభవ నేత్రాలతో ఆలోకించిన లక్ష్మి కాబోవు తన మగనికి చదువు ప్రాథమికావసరముగా భావించి అతనిని చదువుకొమ్మని బలవంతము సేయును వారిద్దరి మధ్య జరిగిన సంభాషణము హాస్య రసాత్మకమై సమకాలిక సాంఘిక స్థితిని కూడ ప్రతిబింబింప జేయును.

**పైరుపాట :**

'పైరుపాట' నాటికను రచించినవారు శ్రీ బోయి భీమన్నగారు. కోనసీమ ప్రకృతి సౌందర్యమును గాంచి పరవశులైన శ్రీ భీమన్నగారు ఈ రూపకమును రచించినారు. ఈ పైరుపాటకు ఆలంబనము "పైరుచేలు, పచ్చికబీళ్లూ అచ్చటి గడ్డిపిల్లలూ కుఱ్ఱవాళ్ళ షికార్లు" అని శ్రీ భీమన్నగారే అన్నారు 'పైరుపాట' ప్రస్తావనలో.

'పైరుపాట' ఏడు రంగాల శృంగార రస ప్రధాన నాటిక. ధనికుడును, విద్యాధికుడును అభ్యుదయ భావ సంపన్న యువకుడును అయిన శ్రీవత్స అను నాతడు అమాయికురాలును గుణవంతురాలును గడ్డికోతయే జీవికగా గల స్నేహ యను గ్రామీణ యువతిని శీల అను స్నేహ స్నేహితురాలి సాహాయ్యముతో వివాహమాడుట ఈ నాటికయందలి ఇతివృత్తము.

ఈ నాటిక యందలి స్నేహ, శ్రీవత్స, శీల అను పాత్రలు మూడును ఔచితీసుందరముగా చిత్రింపబడినవి. స్నేహ మోహనదేవత. స్నేహరూపిణి. కాబట్టి ఆమెను ప్రీతితో 'స్నేహ' అని పిలుచుకొన్నాడు శ్రీవత్స. అతని దృష్టిలో ఆమె "ప్రత్యక్షంగా వచ్చిన శిల్పభారతి." అంతేకాదు "చిత్తంలో ప్రతి దెబ్బ సుత్తిదెబ్బగా మలచిన మానవమూర్తి."

"ఒడిదుడుకులు లేకుండా
ఒరుల పొంత పోకుండా
తోటమూల జీవించే
ఊటబావి గుండియ" స్నేహది.

శ్రీవత్స సంస్కారమున్న యువకుడు; యౌవనమునందే నిర్మల బుద్ధిని పండించుకొన్నవాడు. "పనియేదైనా గాని పరమేశుని రూపంగా" భావించు పరిణత హృదయుడు. "కమలకు కంటకమైనా కదలక తప్పదు రవికి" వంటి శీల మాటలు జీవిత యాథార్థ్యమును ఆమె ఎంత చక్కగా గ్రహింపగలిగినదో తెలియజేయును.

ఈ నాటికలో రమ్యములైన కవితోక్తులున్నవి. ఉదాహరణకు —

"మొక్కకంటె మొగ్గ - మృదులమై పూచు
పూవుకంటె మధువు - మధురమై లేచు
ప్రియమైన కొలది ప్రకృతి
పెరుగు బాధ్యతలు జగతి"

"మాధురిమ జన్మ జ
న్మాల కృషి ఫలితం
అర్హతను బట్టియే
అనుభూతి సైతం"

వంటి వానిని పేర్కొనవచ్చును.

ఆకాశవాణిలో ప్రసారితమైన ఈ నాటిక 1960 సెప్టెంబరు మాసమున స్వర్గీయ అయ్యదేవర కాళేశ్వరరావుగారి అధ్యక్షత క్రింద ప్రదర్శింపబడినది. ఆ తరువాత కూడ కొన్ని ప్రదర్శనలు జరిగినవి.

**మానవుని మరొక మజిలీ :**

మానవు డుదయించిన నాటినుండి ఈనాటి అణుయుగమువరకు అతడమఖ వించిన దశలను, ఎదుర్కొన్న సమస్యలను, అతని క్రమవికాసమును కళాత్మక ముగా చిత్రించు పదువారు రంగాల సుదీర్ఘ 'నృత్యగేయ నాటకం' 'మానవుని 'మానవుని మరొక మజిలీ ' ఈ రూపకమును రచించినవారు శ్రీ బోయిభీమన్న గారే. ఇందలి పాత్రలు – స్వయం ప్రభ (అన్నపూర్ణ, శ్యామల, శశికళ, కాంతామణి, ధనలక్ష్మి రూపాలతో కూడ :) భూలక్ష్మి, క్షేత్రయ్య, ఆశావతి, భోగయ్య, సస్య, మేధానిధి, ధనరాజు, సూరన్న, చంద్రన్న. 'మరియు కొందరు ప్రజ.'

పరమాణువులో బ్రహ్మాండమును పొదిగినట్లు శ్రీ భీమన్నగారు యుగ యుగాల మానవజాతి చరిత్రను హేతుబద్ధముగా ధర్మానుగుణముగా ఈ గేయ నాటకమునందు పొందుపరచినారు. ఇందులో ప్రతిపాత్ర ప్రతీకాత్మకముగా సృష్టించబడినదే. స్వయంప్రభ పాత్ర ప్రకృతి శక్తికి ('విశ్వశక్తి'కి) సంకేతము. ఆమె రూపములైన అన్నపూర్ణ, శ్యామల, శశికళ, కాంతామణి, ధనలక్ష్మి – ఆహార సమృద్ధికి, శక్తికి, లలితకళలకు, ఆధునిక నాగరికతకు, సంపదకు సంకేత ములు. స్వయంప్రభ పిలుచునట్టి 'స్వామి' పురుషునికి (భగవంతునికి) సంకేతము. క్షేత్రయ్య ఆత్మశక్తికి సంకేతము కాగా, భూలక్ష్మి భూసంపదకు ప్రతీక. అదే విధముగా సస్య పాడిపంటలకు పచ్చదనమునకు ప్రతీకకాగా మేధానిధి తెలివి తేటలకు నిలువుటద్దము. భోగయ్య భోగమునకు, కుయుక్తికి, నిష్క్రియా పరత్వమునకు ప్రతిరూపము కాగా ఆశావతి ఈసుకు, దురాశకు, అధికార గర్వమునకు మరొకపేరు. ధనరాజు ధనస్వామ్యమునకు దురాక్రమణకు అధర్మ మునకు ప్రతినిధికాగా సూరన్న చంద్రన్నలు కార్మిక శక్తికి సహకార స్వభావ మునకు చక్కని దర్పణములు. ఈ ప్రతీకల ద్వారమున శ్రీ భీమన్నగారు పాత్రల సంఖ్యను తగ్గింప గల్గుటయేగాక కథాగమనసౌలభ్యమును కూడ సాధించినారు.

> "కల్పవృక్ష శాఖాలవమిది, సం
> కల్పసిద్ధి రూపమిది" అను నాగలి వర్ణనము
> "ఏమిటివన్నీ ? ఇవఖండములా ?
> భూమికి రాలిన తారకలా ?" అను విత్తనముల వర్ణనము

"అతని చెమ్మట జాలు
ఆ పంట చేలు,
ఆమె కుంకుమరేఖ
ఆ యేరువాక" అను ప్రకృతి వర్ణనము
"మహీసతీగళ మణిమాలలవలె !
వినువీధికి నిచ్చెన లిడినట్లుగ !"

అను మేడల వర్ణనము శ్రీ భీమన్న దర్శన వర్ణన శక్తులకు తార్కాణములు.

ఈ రూపకము త్ర్యస్రాది గతులలో సాగిన గేయములతో ముత్యాల సరములతో నడచినది. అక్కడక్కడ ద్విపదగంధము కూడ గుభాళించినది. సరళసుందరముగా సాగిన ఈ గేయనాటకమున పెక్కు సూక్తులు, సామెతలు, ఆణిముత్యాలవలె మెరయుచు కానిపించును.

పదునారు రంగములుగల ఈ నాటకము ఒక్కసారిగా గాక పూర్వాపరాల వివరణతో ఏ ఒక్క రంగమునైనను ప్రదర్శింపవచ్చు.

సహజీవనము సమసమాజ నిర్మాణము, సద్ధర్మ నిర్మితి వంటి విశ్వజనీన భావము లీరూపకమున చక్కగా వ్యక్తము చేయబడినవి.

"ఇలా కావ్యమున మానవు
డికనొక ప్రియగీతి"

అను స్వయంప్రభ మాటలద్వారమున ప్రతిమనిషి విశ్వమానవానందసిద్ధికై ప్రయత్నింపవలయు నను సందేశమును కవితాత్మకముగా అందించినారు శ్రీ భీమన్నగారు.

**మెదడులో మెరుపు :**

శ్రీ: బోయి భీమన్నగారి 'చిత్రకళాప్రదర్శన' అను 'సంగీత నృత్య నాటిక'ల సంపుటి యందలి ఒకనాటిక 'మెదడులో మెరుపు.' ఈ నాటిక యందలి పాత్రలు – బాలికలు, కూలీలు, రైతు, సేద్యగాళ్లు, సోముడు.

ఈ నాటిక నేటికాలమున వ్యవసాయరంగమునందు వచ్చిన మార్పును ప్రగతిని సూచించును. పాత పద్ధతులతో వ్యవసాయము చేయుచు రకరకాల కష్టములకు గురియగుచు నిస్సహాయస్థితిలో నున్న రైతులకు క్రొత్త మర

నాగళ్లను బుల్డోజర్లను ఉపయోగించుమని సోముడు అను వ్యవసాయశాఖా యంత్రోద్యోగి చెప్పిన ఆలోచనయే 'మెదడులో మెరుపు' నాటికగా రూపు దిద్దుకొన్నది.

"అంధకారపు కంధరములో
బంధివై పడియున్న రైతా!
గాతియుగమున పాతగొంగళి
తాతవై పడుకొన్న రైతా!
లేచి రావోయ్,
లేతవయసుకు!
..................
యంత్రహలమును మీటవోయీ
మంత్రబలమును చాటవోయీ
చంద్రతారా మండలాలకు
చక్రపొంగలి పంచవోయీ
లేచి రావోయ్,
లేతయూహకు!"

వంటి హృద్యములైన గేయ ఖండికలెన్నింటినో ఈ నాటికలో చూపవచ్చును.

**శ్రేయసి :**

ఈ నాటికయును 'చిత్రకళాప్రదర్శన' లోనిదే. ఇందలి పాత్రలు – సూర్యదేవుడు, రాగిణిదేవి, దళవాయి, ప్రజలు.

ఒక నిరకుంశ ప్రభుత్వమును రూపుమాపి ప్రజాస్వామికమును స్థాపించుటకు ప్రజలు చేసిన ప్రయత్నము ఈ నాటికయందలి ఇతివృత్తము.

రాగిణీదేవీ సూర్యదేవుల సంభాషణలో సంధ్యా ప్రకృతి వర్ణన, వేదాంత తత్త్వము, అనురాగ మాహాత్మ్యము, మానవతా దృక్పథము చోటు చేసికొన్నవి. నిర్మల హృదయము, నిస్స్వార్థభావము కుట్రలను జయించి తీరుననియు, వ్యక్తి సుఖము కంటె సంఘ సుఖము, దేశసుఖము ప్రధానమనియు ఈ నాటిక సందేశము నిచ్చుచున్నది.

**పాతఊరు - కొత్తదారి :**

ఈ నాటికయును శ్రీ శ్రీమన్నగారి 'చిత్రకళాప్రదర్శన' లోనిదే. పంచవర్ష ప్రణాళికలు సాధించిన గ్రామాభ్యుదయమును నిరూపించు నాటిక 'పాత ఊరు - కొత్తదారి.' బాలకృష్ణయ్య, బలరామయ్య, ఎరుకయ్య ఇందలి పాత్రలు.

మురికి పేటలు, మాలపేటలు - అన్నింటిని తుడిచి, మాల - సాల. పెద్ద - చిన్న మున్నగు వర్ణ వర్గ కక్షలు మాని మురికి బురద గుంటలను, ముళ్ల డొంకలను తొలగించి, రోడ్లు నిర్మించి, 'బస్సు' సౌకర్యముల నేర్పరచి, నదికి వంతెనవేసి, విద్యుత్తును పండించుకొని, సమభావముతో శ్రమదానముతో ఒక గ్రామమునందలి యువజనము కలిసి, ఊరును సంక్షేమ రాజ్యములోని ఒక ఆదర్శగ్రామముగా తీర్చిదిద్దిన తీరును ఈ నాటిక చక్కగా చిత్రించుచున్నది.

**పుష్పలావికుడు :**

శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావుగారి 'విశ్వవీణ' అను గేయనాటికల సంపుటిలోనిది ఈ నాటిక. ప్రబంధములలో పరిమళించు పుష్పలావికల ప్రసక్తి రేఖామాత్రముగా ఈ నాటిక స్ఫురింపజేయును. స్త్రీబృందము (కన్య - కోడలు - తల్లి) పూవుల రంగడు ఇందలి పాత్రలు.

పూల ప్రభావము, పూలపట్ల స్త్రీలకుగల ప్రేమ, పుష్పలావికునికి స్త్రీలకు మధ్యగల పవిత్రమైన ఆత్మీయత ఈ నాటికలో రసార్ద్రముగా చిత్రింపబడినది. పూవులు లేక కన్యకు 'కమ్మటి తలపులు కరవయ్యె' నట. ఆమె 'కలలు చీకటయ్యె' నట. కోడలుకు 'వన్నెయేదో' తరుగగా ఆమె ప్రియుడు 'కన్నెత్తక' అలిగినాడట. శిశువు 'పాలు త్రావ' లేదట. 'కనులు విప్పనే' లేదట.

"కన్నులనీరా, రంగా, నీకూ
కరిగేనా మనసు ?"

"పిల్లా, మేకా, రంగా, నీకూ
బెంగేనా మనసు"

అను చరణములు పుష్పలావికుని పట్ల స్త్రీలకుగల ఆత్మీయతకు, ఆర్ద్రతకు ఉదాహరణములు.

**స్వప్నసీమ :**

ఈ నాటికయు శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావుగారిదే. మొట్టమొదటి సారిగా స్వప్నసీమలో కలిసికొని, అన్యోన్యము ప్రేమించుకొన్న యువతీ యువకులు వాస్తవ జగత్తులో కూడ ప్రేయసీ ప్రియులగుట ఈ నాటికయందలి విషయము. ఆమె, అతడు, సఖులు, కవి ఇందలి పాత్రలు. ఈ నాటికయందలి—

"ఎటకో, ఎటకో, ఎటకో, ఏకాకినిగా వెటకో
విరులేవీ. తరులేవీ, దిగుచున్నవి వరుసవరుసలై"

అను పాట స్వప్నస్థితిని చక్కగా చిత్రించినది.

"నదివి నీవే కావె? నావ నేనేకాద?"

"ఓ సఖి, నీ యౌవనలతిక
ఏ దహాకార సఖునకే"

"తెలివి మరపు పొలిమేరల వెలిగే నీరెండ" వంటి చరణములు పరవ భావనము పేతములు.

"జన్మ జన్మాంతర స్నేహాలు
ధన్య సౌహార్దపు తరంగాలు!"

ను పంక్తులు ఈ నాటికా కల్పనకు ప్రాణమువోసిన తత్త్వామృత అవర తరంగాలు.

**సాగరసౌధం :**

శ్రీ జె. బాపురెడ్డిగారు రచించి 'బాపురెడ్డి గేయనాటికలు' అను పేర ప్రచురించిన గేయనాటికా సంపుటిలోనిది ఈ 'సాగరసౌధం.' నాగార్జున సాగర నిర్మాణ మిందలి విషయము. కృష్ణవేణి, నాగార్జునుడు, ప్రజాశక్తి (నలుగు రైదుగురు స్త్రీపురుషమూర్తులు) ఈ నాటికయందలి పాత్రలు.

ఈ నాటికలో శ్రీ బాపురెడ్డిగారి కవితావేశము కృష్ణవేణి వలె పరుగులు తీసినది

"దారిద్ర్యపిశా
చీరిపులం, సమ
తాజీవన జ్యో

తిళ్ళిఖలం
శ్రమఘర్మజల
సముద్రాల, నవ
సమాజ నౌకా
చోదకలం"

"బండనెత్తుకొని రండి
బంగారమదేనండి
సుత్తెలు ప్రయోగించండి
సురదుందుభులెందుకండి"

వంటి పంక్తు లిందు కుదాహరణములు. ఈ నాటికలోని —

"వెలుగుపూయని కాల
వృతమును ఊపితిమి"

అను చరణము రమ్యభావనకు నిదర్శనము. 'కృష్ణవేణి'లో తరగెత్తిన ఆనందమునకు —

"ఏదారి చూచినా
కేదారమే!
ఏప్రోదు తాకినా
పూ మేడయే
నాచూపులెటు ప్రాకి
నా పచ్చలే!
నా అందెలెటప్రోగి
నా అందమే!
నా పాట ప్రవహించె
నా కాల్వలై!
నా ఆట దీపించె
నా కాంతులై!"

అను పంక్తులు హృద్యములైన రసవాహికలు. కృష్ణవేణి నాగార్జునుల పాత్రలను కల్పించి ఈ నాటికకు ఔదాత్యగాంభీర్యౌజ్జ్వల్యములను సంతరించి వాస్తవికతకు భావనకు వారధిని నిర్మించినారు శ్రీ బాపురెడ్డిగారు. కృష్ణవేణి

హృదయమువలె శ్రీ బాపురెడ్డిగారి కవిత ప్రయోజనమునపేక్షించినదే. ప్రసారమునకును ప్రదర్శనమునకును యోగ్యమైన దీనాటిక.

**భావిజీవులు :**

ఈ నాటికయు శ్రీ బాపురెడ్డి గేయనాటికల సంపుటిలోనిదే. సమకాలిక సాంఘిక సమస్య అయిన 'కుటుంబనియంత్రణము' (ఇపుడు 'కుటుంబ సంక్షేమము') ఇందలి వస్తువు 'విశ్వశ్రేయః కావ్యమ్' అను ఆర్యోక్తిసారమును గ్రహించిన శ్రీ బాపురెడ్డిగారు ప్రజాసమస్యలను కవితాకళారూపమున చిత్రించుచు, వానికి పరిష్కారమును సూచించుచు సామాజిక శ్రేయోభిలాషను ఈ నాటికయందు వ్యక్తము చేసినారు. ఈ నాటికయందలి పాత్రలు - దేశ కాలాలు, భావిజీవులు. ఈ నాటికకు ఆద్యంతములందు నాందీభరతవాక్యముల వలె 'నేపథ్యవాణి' కూడ వినిపించును. దేశకాలాలు తల్లిదండ్రులుగను, భావి జీవులను పుట్టబోవు బాలబాలికలుగను భావింపవచ్చు. దేశకాలములకు భావి జీవులకు మధ్యజరిగిగ సంభాషణమే ఈ నాటిక. భావిజీవులు పలికిన —

"ఇలాగోళం చాలకుంటే
ఇందుగోళం చేరుతాం
ఏమి పండని ఎడారైనా
సాగుచేసే తీరుతాం"

అను మాటలు వారి కార్యదీక్షావేశములను, వారి జీవశక్తిని శక్తిమంతముగా స్పష్టీకరించుచున్నవి.

"అల్పపీడనమువై పే
అనిలము వీచుగదా"
"భాజకమును పెంచి, భాగ
ఫలమును తగ్గించుటేల?"

వంటి పంక్తులు శ్రీ బాపురెడ్డిగారి శాస్త్రీయవిజ్ఞానమును పరిచయము చేయును.

'బయలుదేరమన్న' భావిజీవులను పట్టి ఆపుట —

"గళము జారకుండహారుడు
గరళము బిగబట్టినట్లు"

ఉన్నదట. ఎంత హృద్యమైన సాదృశ్యము ! ఇట్టి పంక్తులే వ్యక్తిలోని కవితాశక్తిని చాటునవి.

ఈ నాటికలో ఇంగ్లీషు ఉర్దూ పదములను, కార్యాలయభాషా (**Office language**) పదములను ప్రయోగించి భావప్రకటనమున ఆధునికతాగంధమును గుబాళింప జేసినారు శ్రీ బాపురెడ్డిగారు.

**రాకెట్టు రాయబారం :**

నాటికా కర్తలు శ్రీ బాపురెడ్డిగారే. విజ్ఞాన శాస్త్ర వైదుష్యముచే మానవుడు రాకెట్టులను సృష్టించి, విహాయసయాత్ర నారభించించి చంద్రమండలముపై చరణము మోపినాడు. ఇది నిన్నటి యథార్థవిషయము. కాని శ్రీ బాపురెడ్డిగారు మొన్ననే - అనగా మానవుడు చంద్రగోళముపై దిగకముందే - మానవుడు దిగినట్లు కల్పనచేసి ఈ నాటికను రచించినారు. సహృదయ కవిభావన నిజమగు ననుట కిదియొక తార్కాణము. ఈ నాటికయందలి పాత్రలు - చంద్రకాంత; రాకెట్టు.

రాకెట్టు మానవుని రాయబారిగా చంద్రకాంత (చంద్రగోళము) యొద్దకు పోయి భాషించుట ఈ నాటికయందలి విషయము.

"ఈతిబాధలేమొ నరుల హింసించెడివేళ
నీతిలేని స్వార్థమ్ములు రూపించెడివేళ
నా ఎడంద కరిగి కరిగి తరుగును
నా కన్నుల అమావాస్యలు తిరుగును"

వంటి చరణములు శ్రీ రెడ్డిగారి కరుణరసార్ద్రహృదయమును, మానవతాదృష్టిని ప్రకటించుచున్నవి.

రూపములోనేకాదు ఆత్మలో కూడ కళంకము లేనట్లు చంద్రకాంత పాత్రను చిత్రించినారు శ్రీ బాపురెడ్డిగారు. రాకెట్టుతో రాయబారమును పంపి శ్రీ రెడ్డిగారు ఒక నవ్యతను సాధించినారు.

**యన్. జీ. వో :**

ఈ నాటికను కూడ శ్రీ బాపురెడ్డిగారే రచించినారు. మూడు దృశ్యము

లున్న ఈ నాటికయందలి పాత్రలు - ఆఫీసరు, యన్. జీ. వో (సుబ్బారావు), యన్. జీ. వో. భార్య, ఆతని పిల్లలు.

ప్రభుత్వ యంత్రాంగమునకు పునాదియైన యన్. జీ. వో జీవితమును ఆతని మానసికతత్త్వమును, ఆతడు పడు కష్టనష్టములను, ఆతనెదుర్కొను దైనందిన సమస్యలను చిత్రించునాటిక యన్. జీ వో.

ఈ నాటిక యందలి సంభాషణలు సహజముగా సరళముగా 'ఆఫీసు'లలో ప్రయుక్తములగు ఆంగ్లభాషాపదములతో సజీవముగా సందర్భోచితముగా సాగినవి.

"వేమన్నకు రామన్నకు
వినా ఎవరికి తెలియదు
నా బాధలు నా గాథలు
నరకమైన సహించదు"

వంటి పంక్తులు యన్. జీ వో దైన్యస్థితికి దర్పణము పట్టుచున్నవి.

నాటికాంతమున నేపథ్యముద్వారమున 'బ్రతుకు బాధచూచి' భయపడ వద్దని, "కష్టాలకు గురియైనా - నష్టాలకు ఎరయైనా" నిజాయితిని విడువవద్దని, శ్రమించి "జాతి జాతకము మార్చే చైతన్యము" పెంచవలయునని శ్రీ బాపురెడ్డి గారు సందేశమును వినిపించినారు. ఈ నాటిక ప్రదర్శనా యోగ్యమైనది.

**భూదేవి :**

శ్రీ రెడ్డి చినవెంకటరెడ్డిగారు రచించిన నాటిక 'భూదేవి.' కుటుంబ నియంత్రణ పథక మిందలి వస్తువు. రమ, ఉమ, ఉష, భూదేవి, టి.బి, మశూచి, కలరా, పిచ్చి, నారదుడు, శివుడు, యముడు, బ్రహ్మ, నరుడు, నారాయణుడు-యీ 'సంగీత నృత్యనాటిక' యందలి పాత్రలు.

ఈ నాటిక వాస్తవికతకు కొంత పౌరాణిక కల్పనను జతపరచి, మర్త్య దైవలోకములను ముడివేసి గమ్మత్తుగా 'జనాభా' సమస్యకు వింత వింత పరిష్కారములను సూచించుచు చివరకు నేటి నాగరక ప్రపంచమవలంబించు చున్న కుటుంబనియంత్రణ విధానమును నొక్కి వక్కాణించినది.

నాటికలో యముడు — "తూర్పున పాలిస్తున్న చుప్పనాతి ఇటురావే"
"పడమర పాలిస్తున్నా పోచమ్మా ఇటురావే"
"ఉత్తరం పాలిస్తు ఉన్న నత్తిదాన సత్తిరావే"
"దక్షిణం పాలిస్తు ఉన్న దక్షిణీయక్షిణీ ఇటురావే"

అని కలరాను, మశూచిని టి. బి. ని పిచ్చిని ఆదేశించు సందర్భమున హాస్య రసము జాలువారినది.

కలరా, మశూచి వంటి రోగములు పాత్రలుగా ప్రయుక్తమగుట ఈ నాటిక యందలి ఒక ప్రత్యేకత.

**అంతా ఒక్కటే :**

ఈ నాటిక కూడ శ్రీ రెడ్డి చినవెంకటరెడ్డిగారిదే. వర్ణాంతర వివాహ మును, అస్పృశ్యతా నివారణమును ఈ 'సంగీత నృత్యనాటిక' చిత్రించు చున్నది. కథకుడుగాక ఈ నాటికయందలి పాత్రలు - రాములమ్మ, ఎంకి, రాములు, సుబ్బమ్మ, కిష్టయ్య, సీతమ్మ, గోవిందయ్య.

అస్పృశ్యతానిర్మూలనము ద్వారమున యీ నాటిక సమసమాజ నిర్మాణ మును జాతి అవిచ్ఛిన్నతను చాటుచున్నది.

**దేవుని బిడ్డలు :**

'కరుణశ్రీ' శ్రీ జంధ్యాల పాపయ్య శాస్త్రిగారు రచించిన నాటిక ఇది. కుటుంబనియంత్రణ ఈ నాటికలోని వస్తువు. మానవులు, పాపలు ఇందలి పాత్రలు.

రససిద్ధులైన 'కరుణశ్రీ' గారి పలుకులలో కమ్మకమ్మని కైతల తేనెవాకలు కదలిసాగును. వారు పసికందులను —

"నందనవన అరవిందములందున
చిందు మరందంబిందులు" గా
"స్వామికంఠమున వలపులు చిందే
వైజయంతి వనమాలలు"గా
"దిగులెరుగక ఆనందనౌకపై
ఎగిరే తెలితెరచాపలు" గా

"అనంత కాలాంబుధిలోపల - ఎదురీదేచిరుచేపలు" గా
వర్ణించిన తీరు భావనా రమ్యము.

'కరుణశ్రీ'గారి 'పావలు' మానవులు రమ్మని పిలిచినను భూమిమీది కవత రించుటకు విముఖులై వెనుకాడుచుండగా - శ్రీ బాపురెడ్డిగారి 'భావిజీవులు', దేశకాలాలు (తల్లిదండ్రులు) వర్ధమచున్నను పుడమిపై పుట్టుటకు సుముఖులై ముందుకు సాగుదురు. వైవైన ఈ వైషమ్యము కానిపించుచున్నను భావిజీవు లైన పావలకు ఈ ఇద్దరు కవులును ఉజ్జ్వలభవిష్యత్తును నిర్మించు హృదయ మును తమ నాటికలందు స్ఫటికస్వచ్ఛముగా వ్యక్తముచేసి ప్రధానమైన ప్రాణభూతమైన అంతరసామ్యమును ప్రదర్శించివారు.

**దేవాలయ ప్రవేశం :**

అస్పృశ్యతా నిర్మూలనము వస్తువుగా ఈ నాటికను రచించినవారు శ్రీమతి దర్భా భాస్కరమ్మగారు. ఈ నాటికయందలి పాత్రలు - పూజారి, మాలపిల్ల, గాంధి, కొందరు శిష్యులు, భక్తులు.

ఈ నాటికయందు శ్రీమతి భాస్కరమ్మగారు కథాగమనమునకు నేపథ్య గానమును ప్రయోగించినారు. రచన పరళముగా ఆర్ద్రముగా నడచినది. ఉదాహరణమునకు మాలపిల్ల దీనాతిదీనముగా పలికిన —

"ఒక్కమారు దేవునిచూచి
చక్కగానే పోతానయ్యా
దిక్కుతెన్నూలేని జాతియని
తక్కువసేయుట తగదయ్యా
ఆ దైవం చూచేనయ్యా" వంటి మాటలు కంటనీరొలికించును.

ఈ నాటికలో గాంధిమహాత్ముడొక పాత్ర. అస్పృశ్యతా నివారణము నకు ప్రతీకగా నిలిచిన ఆ మహనీయుని పాత్రగా ప్రవేశపెట్టి రచయిత్రి నాటికకు ఎనలేని గౌరవమును కలిగించినది.

**విజయక్రాంతి :**

శ్రీ వల్లభాపురం జనార్దన్‌గారి నాటిక ఇది. ఏడు దృశ్యములుగా సాగిన ఈ విషాదాంతరూపకము సమకాలిక గ్రామీణ రాజకీయ వాతావరణమును,

సమాజమునందలి వర్గసంఘర్షణను చక్కగా చిత్రించినది. సమసమాజ నిర్మాణము, శ్రేయోరాజ్య స్థాపనమువంటి ఆదర్శములతో శ్రీ జనార్దన్‌గారు ఈ రచనను గావించినారు. ఈ నాటికయందలి పాత్రలు - రమేశ్, పద్మప్రియ, ధర్మారావు. నాగరాజు, శేషయ్య, రామిరెడ్డి, సారథి, మల్లారెడ్డి, గిరిధర్, ప్రసాద్, కృష్ణ. కరణంశేషగిరి, మునసబు పాపారావు, రాజయ్య, కోటయ్య, హరిదాసు, బుర్రకథా బృందము.

అభ్యుదయ నిరోధక శక్తుల తీరుతెన్నులను ఈ నాటికలో అతిసహజముగా చిత్రించినారు రచయిత. కథా సందర్భానుగుణముగా నేపథ్యగానమును, జావళిని, హరికథా కాలక్షేపమును, బుర్రకథను చేర్చి శ్రీ జనార్దన్‌గారు వైవిధ్యమును సాధించినారు.

'రామాపురము' మొదలుకొని ఈ నాటికలోని పాత్రల పేర్లన్నియు సార్థకములు.

"పిల్లలుగల సంసారము చిల్లికుండయైపోదా"
"సింగమెదుట మార్జాలపు చెరలాటము పనిచేయునె"

వంటి చక్కని లోకోక్తులతో సంభాషణలు చురుకుగా సాగినవి.

'పునాదులను కదిగిస్తా
బూదికంటితో చూస్తా' వంటి పంక్తులు రమ్యములు. రమేశ్, ధర్మారావు - పద్మప్రియ అను పాత్రలు మహోన్నత మానవతాధర్మమునకు ప్రతినిధులై విజయక్రాంతికి సారథ్యము వహించినవి. పద్మప్రియ పాత్ర వ్యక్తి నశించినా చైతన్య శక్తి ఆగదని ఋజువు చేసినది.

"పగను పగతో చంపజాలము
జగతి ప్రేమయె మంచి మార్గము" అను మాటలు ధర్మవీరమును చాటుచున్నవి.

**కవ్య - కట్నం :**

సమకాలిక సమాజమందలి వరకట్నమను దురాచార దుష్పరిణామమును చిత్రించు ఈ విషాదాంతనాటికను శ్రీ వడ్డెపల్లి కృష్ణగారు వ్రాసినారు. లచ్చి, బుచ్చిబాబు ఈ నాటికయందలి పాత్రలు. లచ్చి చివరి గడియలలో పలికిన ——

"మన్నులో . . లియనుంటే
మన్నించిన పేమున్నది
మిన్నుపైననే మనసిక
నిన్ను పొందుతానన్నది" వంటి మాటలు ఆమె నిర్మల ప్రేమకు నిదర్శనములు.

"చదువుంటే చాలదురా
సంస్కారము కావాలి
మనసుంటే చాలదురా
మమకారం కావాలి" అను సూక్తి సందేశాత్మకము.

**మూడుపూవులు - ఆరుకాయలు :**

ఈ నాటికయు శ్రీ వడ్డెపల్లి కృష్ణగారిదే. కుటుంబనియంత్రణ మిందలి వస్తువు. గుమాస్తా గుర్నాథం, గుర్నాథం భార్య, కృష్ణారావు ఈ నాటిక యందలి పాత్రలు. నాటికాంతమున మున్న యుగళగీతమందలి —

"ముగ్గురె పిల్లలు వుండే జంట
మూడుపూవులు ఆరుకాయలు
అంతకుమించి వుండే యింట
ఆరుపూవులు మూడుకాయలు" అను చరణములలో పరిమిత సంతానము వలని ప్రయోజనము చక్కగా వ్యక్తము చేయబడినది.

**ప్రజావిజయం :**

నాటికా కర్తలు శ్రీ జె బాపురెడ్డిగారు. మాజీ భారత ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధి ఇరువది అంశాల ఆర్థిక కార్యక్రమమువలన కలిగిన ప్రజా చైతన్యమును 'ప్రజావిజయము' గా భావించి ఈ రూపకములో చిత్రించినారు శ్రీ రెడ్డిగారు.

ఈ నాటికయందలి పాత్రలు - ప్రజాశక్తి (కర్షక, కార్మిక, యువజన, హరిజన స్త్రీ పురుషులు) దుష్టశక్తులు (స్వార్థము, మోసము, ద్రోహము, ధ్వంసము - తగిన రూపములలో) ప్రగతిలక్ష్మి. ఇందు సంధివచనము కథాగమన మునకై ప్రయుక్తమైనది.

శ్రీ బాపురెడ్డిగారి కవితావేశము పొంగులెత్తి దరులనొరసి ప్రవహించిన దీనాటికలో.

యీ నదులు మన ఎదలు
ఈ కొండలు మనకండలు
ఈ గనులు మన కనులు
ఈ అడవులు మన తొడవులు
ఈ పొలాలు మన బలాలు
ఇవి మన అందరి కోసం
ఇది మన భారతదేశం'' వంటి పంక్తులు శ్రీ రెడ్డిగారి దేశభక్తికి కవితాశక్తికి ఉదాహరణములు. ప్రగతిలక్ష్మి విజయధనుస్సు చూపుచు పలికిన —

'సత్యం వారులు సారించాలి
శివం శరాలు సంధించాలి
సుందరమెల్లెడ వ్యాపించాలి
చీకటులన్ని నశియించాలి' అను పలుకులు కవితా హృదయము చిమ్మిన వెలుగులు.

రాష్ట్ర సంగీత నాటక అకాడమీవారు మాజీ ప్రధాని శ్రీమతి ఇందిరా గాంధీ మాతన 'ఆర్థిక కార్యక్రమము' ప్రాతిపదికగా నిర్వహించిన సంగీత నృత్యనాటికల పోటీలలో ఈ నాటిక ప్రథమ బహుమతిని గెలుచుకొన్నది.

**చందమామ వచ్చింది :**

ఈ నాటికను రచించినవారు శ్రీ రావూరి వెంకట సత్యనారాయణ రావుగారు. రాష్ట్ర సంగీత నాటక అకాడమీవారు ఇరువది అంశముల ఆర్థిక కార్యక్రమము ప్రాతిపదికగా నిర్వహించిన సంగీత నృత్యనాటికల పోటీలో ఈ నాటిక ద్వితీయబహుమతిని పొందినది. ఒక గంటకాలము ప్రదర్శించుటకు తగిన 'నృత్యనాటిక' ఇది. ఇందులో పదునెనిమిది వేరువేరు పాటలున్నవి. వస్తువు ఇరువది సూత్రముల ఆర్థిక కార్యక్రమమే. కథా సూత్రములేని భిన్నభిన్న నృత్య సన్నివేశముల సమ్మేళనము ఈ నాటిక. నర్తకి, యువతీ యువకులు, హాలికుడు, కార్మికుడు, ముదుసలిరైతు, రైతుబృందము, కార్మికుల బృందము, మహిళల బృందము, గిరిజనులు, హరిజనులు ఈ నాటికలో వరుసగా కానిపించు పాత్రలు. నాటికయందలి ఐదవపాటలోని —

'ఇందిర ఇంటికి నే పోయొస్తా
దొడ్లో పూసిన దొంతర మల్లెలు
దోసిటపోసేస్తా
చందమామవు నీవేనని
చల్లగ చెప్పేస్తా - నే చెప్పేస్తా' అను పంక్తులవలన చందమామ శ్రీమతి ఇందిరయేయని స్పష్టము. ఇందిర చందమామకాగా ఆమె ప్రవేశ పెట్టిన ఇరవది యంశముల ఆర్థిక కార్యక్రమ సూత్రములు చంద్రికలై ప్రజానీకమునకు ఆనందాభ్యుదయములను కలిగించుచున్నవను రమ్యార్థమును శ్రీ రావూరి వారు భావించినట్లు ఊహింపవచ్చును. ఈ నాటిక యందలి —

'అడవి అంచులలోన ఆలయము కట్టాలి
గుండె గుండెలోన గుడిగంట మ్రోగాలి'
"సూర్యచంద్రుల కేమిపించమన్నాది
గాలి దేవుని కేమి పించమన్నాది" వంటి పంక్తులు శ్రీ రావూరి వారి అభ్యుదయాకాంక్షను, సేవాభావనను కవితామనోహరముగా వ్యక్త పరచుచున్నది.

# సాంస్కృతికములు

## (పద్యగేయవచన మిశ్రనాటికలు)

**ముద్దులరథము :**

గేయవచనాత్మకమైన ఈ నాటిక శ్రీ మల్లవరపు విశ్వేశ్వరరావుగారిది. ఆకాశవాణి హైదరాబాదు కేంద్రమునుండి ప్రసారితమైన ఈ నాటిక ధనుర్మాస ప్రత్యేకతను, భోగి, సంక్రాంతి, కనుము పండుగల వినోదములను కనులముందు నిలుపుచున్నది. ఈ రూపకమునందలి పాత్రలు - అమ్మాయి, అమ్మమ్మ, హరిదాసు, అబ్బాయి, తాతయ్య, రామయ్య కాపు, గంగిరెద్దులవాడు.

**సంక్రాంతి :**

శ్రీ వానమామలై వరదాచార్యులవారు ఈ గేయవచనమయమైన రూపకమును నిర్మించినారు. సంక్రాంతిపురుషుడు లోకకల్యాణకాంక్షను వ్యక్తముచేసి భూలోకస్వాగతము నందుకొనుట ' నాటిక యందలి వస్తువు. రెండు దృశ్యములుగల ఈ నాటికలోని పాత్రలు - సంక్రాంతి పురుషుడు. సూర్యుడు, చంద్రుడు, అగ్ని, వాయువు, ఇంద్రుడు, గురువు, శుక్రాచార్యుడు (కవి), స్త్రీలు, గంగిరెద్దువాడు, దాసరిహరిభక్తుడు.

సంక్రాంతి పురుషుడు సూర్యచంద్రాగ్ని వాయు గుర్వాదులను తమ తమ అధికారాహంకారమదోన్మత్తతను, అవకాశవాదమును వదలుకొని ప్రజా సౌఖ్యమునకు, శాంతిసాధనకు దోహదము కలిగించుచు మానవతా దృక్పథముతో మెలగవలసినదని, లేకున్నచో స్వీయార్ష నేత్రాద్భుత దర్శన శక్తితో కనుగొని దండింతునని వారిని హెచ్చరించును. వారందరు ఆతని యాజ్ఞను శిరసావహింతుమని మనవిచేయుదురు. తరువాత ఆ సంక్రాంతి పురుషుడు భూలోకమునందు ప్రవేశించి ముత్తైదువల స్వాగత నీరాజనాదులను అందుకొనును.

శ్రీ పరశాచార్యులవారు కొంత పౌరాణిక వాతావరణమును కల్పించి స్వర్లోక భూలోకములకు ధర్మసేతువును నిర్మించిన తీరు సరికొత్తది.

ముత్తైదువలు సంక్రాంతి పురుషునకు నీరాజన మిచ్చుచు స్వాగతము పలుకు సందర్భమునందలి —

"పైడిముద్దలలోన పరిమళం నింపే
బంతులతోడ చేమంతులతోడ
.........................
కాలినేలను మోపకందిపోవనుచూ
ముగ్గతివాచీల మునుపరచినాము
భోగిని నీవంచు పువులాంటినవుల
గలిపి వరిపిండి చక్కిలములుంచాము
నడచి నడచీనావు బడలినా వంచు
చెఱుకుకఱ్ఱను నీకు చేతికిచ్చాము
కోటొక్క దేవతలు వేచి మాయింటా
కమ్మన్ని నీ రూపుకొమ్మలై కనిరి" అను పాట ఎంతయు రమ్యము.

ఈ విధముగా భారతీయ సంస్కృతికి ప్రతిబింబములైన పర్వములను గూర్చి పద్యగేయవచనమయములుగా గేయనాటికలను రచించిన రూపక కర్తల రచనలను పైన పేర్కొన్నాను. ఇంకను పర్వవిశేషములు వస్తువుగా గ్రహించి 'సంగీతరూపకము' లు వ్రాసినవారున్నారు. కాని వారి రచనలు ఎంత ప్రయత్నించినను లభ్యముకాలేదు. ఉదాహరణమునకు శ్రీ కందుకూరు రామభద్రరావుగారి దీపమాల, వసంతశోభ, హేమంతలక్ష్మి, నరకాసురవధ, విజయాంబిక మున్నగు రూపకములను – శ్రీ శశాంక గారి పచ్చతోరణం దీపలక్ష్మి, నల్లనయ్య, వసంతశోభ వంటి సంగీతరూపకములను పేర్కొనవచ్చును. ఇవి యన్నియు ఆకాశవాణివారి ప్రోత్సాహముతో వెలువడినట్టివే. ఈ నాటికల వ్రాతప్రతులుగాని, ముద్రితప్రతులుగాని లభింపని కారణమున అందలి విశేషములను తెలుపలేకపోవుచున్నాను.

## (పద్యగేయనాటికలు)

**తెలుగుపెళ్లి :**

తెలుగువారి సంప్రదాయమును సంస్కృతిని ప్రతిబింబించు ఐదురోజుల పెండ్లిని కనులకు కట్టించు ఉద్దేశముతో శ్రీ వోగి నరసింహశాస్త్రిగారు ఈ నాటికను రచించినారు ఇందలి పాత్రలు - ముత్తైదువలు, పురాణకవి, నవకవి.

ఈ నాటికయందలి పాటలు వివాహోత్సవమున ఆయా పట్టులందు ముత్తైదువలు గానముచేయునట్టివి.

"జగమే నిదురించెడి నిశి
సగమాయెను మేలుకోర సంయమినుకవీ
భగవద్గీతామృత శుభ
నిగదితమే మదిని నిల్పి నిద్దురలేరా-సుకవీ నిద్దురలేరా"

అను కందార్థము ఈ నాటికకు ఎనలేని అందమును ప్రయోజనమును చేకూర్చినది.

"ఘల్లుఘల్లుమని కాళ్ల గజ్జెలందెలు మ్రోగ
కలహంసనడకల కలికి ఎక్కడికే
జడలోన గంగను సవదరించినయట్టి
జగములేలే సాంబ శర్వసన్నిధికే
ముత్యాల ముక్కెర ముజ్జగము వెలిగింప
మిలమిలమెరిసేటి మెలత ఎక్కడికే
ఎదలోన శ్రీదేవి కుదురుగా నిలువుకొని
తుదిమొదలు లేని శుభపదుని సన్నిధికే" వంటి స్త్రీల పాటలు

ఈ నాటికలో చోటుచేసికొన్నవి.

ప్రాచీనసంప్రదాయగంధసంవాసితములై స్త్రీలలో నేటికిని ప్రచారమందున్న కొన్ని పాటలను శ్రీ శాస్త్రిగారు ఈ నాటికలో చొప్పించి తమ సంస్కృతి పరిజ్ఞానమును, జాతీయాభిమానమును ప్రకటించుకొన్నారు.

## (గేయనాటికలు)

**సంక్రాంతి :**

ఈ గేయనాటికను రచించినవారు శ్రీ వావిలాల సోమయాజులుగారు. గ్రీష్మమునుండి సంక్రమణమువరకు పల్లెపట్టులయందు జరుగు కృషీవలుల

పొలముపనులను, సంక్రాంతి పర్వవిశేషములను సహజసుందరముగా చిత్రించు ఇరువదియైదు పాటలతో కూడిన 'నృత్యగేయరూపకము' సంక్రాంతి. పల్లీయ స్త్రీ పురుషులే ఇందలి పాత్రలు.

ఋతుదాతృ స్తవముతో ప్రారంభమై ఈ నాటిక మండుటెండలను, తిండిలేక కుమిలిపోవు రైతులగుండె కన్నీళ్లను, వానదేవుని గూర్చిన ప్రార్థనలను, వర్షాలక్ష్మి ఉత్సవమును, నాట్లువేయు సందర్భమును, ఏరువాక పున్నమి వేడుకలను, ఒత్తుగా ఎదిగిన పత్తిచేలను, వరినాట్లను, ఎరువుల కుమ్మరింపులను, వరి కోతలను, బండ్లపై ధాన్యమును గృహమునకు చేర్చు రీతులను సంక్రాంతి పర్వ విశేషములైన గొబ్బిళ్లను, కోలాటాలను, రంగవల్లుల ముంగిళ్లను, బసవన్న రంకెలను, హరిదాసుల చిందులను, అల్లుళ్లరాకను రమ్యాతి రమ్యముగా వర్ణించుచు చలనచిత్రమువలె చకచకా సాగుచు పల్లీయ వాతావరణమును ప్రత్యక్షము సేయును.

'రేపే బస్తీకి పోదాం – రేవులమూటలు మోద్దాం
కూలో నాలో చేద్దాం – ఈలో వానలు చూద్దాం'
'లే లే లే పిల్లదానా మేలా నీ కన్నులాన
చిట్టిదాన్ని చంకేసుకో ఇట్టాగే గుడికెడదాం' వంటి పంక్తులు పల్లీయుల ఉల్లమునకు పట్టిన నిలువుటద్దాలు.

ఈ నృత్యనాటికయందు అయా సందర్భములలో సరసమైన వర్ణనలున్నవి. ఉదాహరణమునకు – నల్లని చల్లని మేఘాలు —

“ఉరుముల గర్జతో
మెరుపుల విండ్లతో
ధారాశర సంపాతముతో
వర్షాదేవత సైన్యాలాగా
గ్రీష్మ విరోధి”ని జయింపగ వచ్చినవట.
“నిర్ఝరిణీఘనమంజీరోజ్జ్వల
నినదమ్ములె” వందిజనము కాగా వర్షాలక్ష్మి వచ్చినదట.
'పైరగాలి పిట్టలువచ్చి ఓ భామా!
పైట లాగేస్తేనో ఓ భామా!'

'మట్టి గోళీలతో ఓ మామా
గట్టిదెబ్బేస్తాను ఓ మామా' వంటి శృంగారరసతరంగము లీ నాటికలో కానిపించును.

ఈ నృత్యనాటిక సికింద్రాబాదు 'పరేడ్ గ్రౌండు' లో 17-1-1957 నాడు భారీ ఎత్తున ప్రదర్శితమై 'The first Telugu Dance drama' గా ప్రశంసా సత్కారములు నందుకొన్నది. తరువాత ఈ నాటిక తెనాలిలోను గుంటూరులోను విజయవంతముగా ప్రదర్శింపబడినది. నాటికా ప్రదర్శనా విజయమునకు శ్రీ లంకా సూర్యనారాయణ శాస్త్రిగారి నృత్యదర్శకత్వమును, శ్రీ మాధవపెద్ది రామస్వామిగారి సంగీత దర్శకత్వమును దోహదము చేసినవి.

**సంక్రాంతి :**

నాటికను రచించినవారు ఆచార్య డా॥ సి. నారాయణరెడ్డిగారు. సంక్రాంతి సంబరములను సాంసారిక జీవితముతో మేళవించి లలిత శృంగార హాస్య తరంగితముగా శ్రీ రెడ్డిగారు ఈ రూపకమును నిర్మించినారు. మూర్తి, లక్ష్మి, లత, గంగెద్దులవాడు నాటికయందలి పాత్రలు.

లక్ష్మి, మూర్తి ఆలుమగలు. లత మూర్తి చెల్లెలు. యీ ముగ్గురి మధ్య తీవెలు సాగిన సంభాషణము రమణీయము. నాటికయందలి —

'సెనగపూవు చిన్నది ప
చ్చని పైటను సవరించెను
గుమ్మడిపూ ముత్తైదువ
గుండె నిండుగా నవ్వెను' వంటి పంక్తులు సంక్రాంతి ప్రకృతిని మనోహరముగా వర్ణించుచున్నవి. లక్ష్మి కపోలఫలకాలు - 'తొలిసంధ్యవోలె తళుకులు' చిలుకుచున్నవట. అరుణోదయమువంటి అందమైన ఉపమానము.

నాటికకు ఆద్యంతములందు వాయుగానము, మధ్య చందమామ గొబ్బిళ్ల బృందగానము ప్రయుక్తమైనవి. ఈ నాటిక ఆకాశవాణి హైదరాబాదు కేంద్రము నుండి ప్రసారితమైనది.

**వసంత స్వయంవరం :**

శ్రీ బోయి భీమన్నగారి నాటిక ఇది. ఈ నాటిక ఒక సన్నివేశము; కవి కల్పనా సుందరము; వర్ణనాత్మకము. ఇందలి పాత్రలు - మధుప్రియ, వసంతుడు, రసాలిని, నింబలత, ఇక్షుకాంత, గోపిక.

వసంతుడు తనను కోరివచ్చిన మధుప్రియ (కోకిల)ను, రసాలిని (మామిడి)ని, నింబలత (వేప)ను, ఇక్షుకాంత (చెరకు)ను కాదని ఉగాది పచ్చడిని వెండిగిన్నెలో పట్టుకొన్న ఒక గోపికను వరించుట నాటిక యందలి కథాంశము.

వసంతుడు మధుప్రియాదులను వరించక పోవుటకు గల కారణములను పేర్కొను సందర్భమున శ్రీ భీమన్నగారు ప్రదర్శించిన దర్శన వర్ణన శక్తులు ప్రశంసా పాత్రములు. కోకిల విరహ హృదయాల 'బొగ్గుల కుంపటి' యట. దానిగొంతు 'విషపు బాణాగ్రస్మ'ట. రసాలిని వసంతునితో పలికిన సందర్భమునందలి —

"తావితరగల షట్పదమ్ముల
నీవు వ్రాసిన ప్రేమలేఖలు" అను పంక్తులలో హృద్యమైన భావచిత్రము మెరయుచున్నది 'షట్పదమ్ముల' ప్రయోగములో శ్లేషపరిమళము ఘుమఘుమలాడుచున్నది.

వగరు, చేదు, పులుపు, తీపి — ఈ అన్ని రుచులు కలిసి ఉగాది పచ్చడి యైనట్లే కష్టసుఖాల సమ్మేళనమే జీవిత మను చక్కని సందేశము నందించు చున్న దీనాటిక.

# అనుసరణాత్మకములు

(పద్యగేయవచన మిశ్రనాటికలు)

**వరూథిని :**

శ్రీ మల్లవరపు విశ్వేశ్వరరావుగారు రచించిన పద్యగేయ వచనాత్మక మైన ఈ నాటికకు అల్లసాని పెద్దనామాత్యుని మనుచరిత్రమునందలి ద్వితీయాశ్వాసము ఆధారము. మూడు దృశ్యములుగా సాగిన ఈ నాటిక యందు మనుచరిత్రములోని 'వాలారుంగొనగోళ్ల', 'పేరు వరూథిని, 'ఎందేడెందము' అను మూడు పద్యములు గ్రహింపబడినవి.

శ్రీ విశ్వేశ్వరరావుగారు ఈ నాటికలో ప్రవరుని 'కైలాసయాత్రికుని' గాను, 'పుణ్యకైవల్య పథికుని' గాను, 'గిరికుమారీ విలాస సుస్మిత శిరీష పేశలు'ని గాను, వరూథినిని ప్రవరుని 'వరప్రసాదిని' గాను, హిమాద్రికందర మును మోక్షకాముకులకు 'ముక్తిదాయిని' గాను చిత్రించినారు. అందుకు సుముఖముగా ప్రమథులను, ఆకాశవాణిని, శివప్రార్థనను, కైవల్యచర్చను కథలో కల్పించినారు.

ఈ నాటికలోని పాటలలో - చెలికత్తెలు వరూథినిని నిదుర లేపునప్పటి —

"మలయ పర్వతసాను
వులనుండి దిగివచ్చి
కమ్మ తెమ్మెరకూన
కన్నురెప్పల పొంచె" అను గేయమును ప్రవరుడు హిమగిరిని

జూచి ఆనందముతో వర్ణించిన సందర్భమునందలి —

"హిమగిరీ ! హిమగిరీ ! హిమగిరీ !
ధౌత ధౌత కలధౌత శబలశిఖరీ !" అను గేయమును రమణీయముగా నున్నవి.

**సుగాత్రి :**

గేయవచన సమ్మిశ్రితమైన ఈ నాటిక కూడ శ్రీ మల్లవరపు విశ్వేశ్వర రావుగారిదే. ఐదురంగములున్న ఈ నాటిక పింగళి సూరన కళాపూర్ణోదయ కావ్య చతుర్థాశ్వాసమందలి సుగాత్రి శాలీనుల వృత్తాంతమునకు అనుసరణము.

సుగాత్రి, మాలతి, మాధవి, మధురిక, సుగాత్రి తల్లి, శాలీనుడు, కొందరు పట్టణవాసులు, కొందరు జానపదులు – ఈ నాటికయందలి పాత్రలు.

మూలకథకు రెండుమార్పులు ఈ నాటికలో చేసినారు నాటికాకర్తలు. ఒకటి – మూలకథలో శాలీనుడు ఒక్కడే తోటలో పనిచేయును. కాని ఇందులో అతనితోపాటు మరికొందరు జానపదులు కూడ పనిచేయుచున్నట్లు కల్పింప బడినది. ఇక రెండవమార్పు – సుగాత్రి తోటలో తనతో పాటు ఒళ్లువంచి చెక్కిళ్లపై చెమటలు కారుచుండగా పనిచేయుచున్నప్పుడు చూచి ఆమె సహజ సౌందర్యమునకు శాలీనుడు ముగ్ధుడై మదనోద్రేకమునకు గురైయై ఆమెను చేరదీసినట్లు మూలముననుండగా ఈ నాటికలో గాలివానలో తడిసివచ్చిన సుగాత్రి స్నిగ్ధగాత్రమును చూచి శాలీనుడామెను దరిచేర్చుకొన్నట్లు కల్పింప బడినది.

తన పెనిమిటిని రక్షించుమని సుగాత్రి శారదను ప్రార్థించు సందర్భము నందలి — "ఓ శారద ఓ వరమదయాశాలిని" అను సూరనపద్యమును ఈ నాటికలో చేర్చినవారు శ్రీ విశ్వేశ్వరరావుగారు. ఈ నాటికలో నున్న పద్య మిదియొక్కటే. ఈ నాటికయందలి తొమ్మిదిపాటలును కమ్మదనమును కుమ్మరించుచున్నవి. ఉదాహరణమునకు—

"సంజ అపరంజిలో
రంజిలెడి మంజులత
స్వర్ణ శృంఖలదాల్చి
చిక్కి స్రుక్కనదేల ?
విమల కాసారోర్మి
కలదేలు చిరుకలువ
హర్మ్యాంగణముచేరి
నవసి ముదుగున దేల ?
అమలిన ప్రేమార్ద్రిమౌనెడద ఈ జగతి
కుమిలిపోయే సంపదల దరిలి చెదునేల ?" అనుపాటను

పేర్కొనవచ్చును.

"నాలుగుగోడల నడిమి ప్రపంచం
నన్ను జడుని చేసింది
నాలుగు దిక్కులనేలు ప్రకృతియే
నన్ను పటకరించింది" అను గేయము శాలీనుని స్వభావమునకు పట్టిన మణిముకురము.

**భూతాలకొలిమి :**

ఆంగ్లమాతృకకు అనుసరణ రూపమైన ఈ రూపకమును శ్రీశ్రీ గారు రచించినారు. గేయవచనమయమై సంవాదాత్మకముగా సాగిన ఈ శ్రవ్య నాటికలో రెండే రెండు పాత్రలు – ఒక పురుషుడు (ఒక గొంతుక), ఒకస్త్రీ.

వధ్యుడై దహనము చేయబడిన ఒక వ్యక్తిని గూర్చి అతని ప్రియురాలు భూతాలకొలిమివైపు సాగిపోవుట ఈ రూపకమందలి విషయము.

వధ్యుడైన తన ప్రియుడు కడచిన రాత్రి ఆ భూతాలకొలిమిలో 'పూల దండ' వలె, 'పుష్యరాగం' వలె కనిపించినాడనియు,

"కొలిమి నిప్పుల్లాగ
సెగజిమ్ము కళ్లతో
మొగమంత పొగమారి
భగభగా వెలుగగా
నరకలోకం నుంచి" తనను చూడవచ్చినాడనియు, దగ్గరకు పోయి ఆతనిని ముద్దుపెట్టుకొనగా తన పెదవి చురికిందనియు ఆ స్త్రీ చెప్పును. ఆమె చెప్పిన తీరు చూడగా అతడొక చైతన్యమూర్తి యనియు, సమాజము నకు బలియైపోయెనని యు తెలియుచున్నది.

**ఆముక్తమాల్యద :**

శ్రీకృష్ణదేవరాయ ప్రణీతమైన 'ఆముక్తమాల్యద' లోని ఆముక్తమాల్యద (గోదాదేవి) కథను ఆధారముగా చేసికొని డా॥ వేటూరి ఆనందమూర్తిగారు ఈ నాటికను రచించినారు. ఇందులో పాత్రలపేర్లు ప్రత్యేకముగా పేర్కొన బడలేదు. కాని ఊహించుకొనవచ్చును. కథకుడు కథను వచనములో గేయ

ములో నడపుచుండును. అక్కడక్కడ గల పాటలనుబట్టి గోదాదేవి, ప్రగ్విణి, హారిణి, పెరియాళ్వారు (విష్ణుచిత్తుడు) ఈ నాటికలోని పాత్రలని తెలియును.

తన కూతురు అముక్తమాల్యద 'తనుగ్లాని'చేత దుఃఖితుడైన విష్ణుచిత్తుడు తన మనోనిర్వేదమును వెన్నునకు విన్నవించు సందర్భమున మూలమునమున్న - "దేవా - దేవరదాసియగు మదీయపుత్రి ......... దీని తెలంగెలింగింపవే" అను దీర్ఘవచనము ఈ నాటికలో స్వీకరింపబడినది. ఇందలి తొమ్మిది పాటలును సంగీత పారస్యమున కనుకూలముగా రచింపబడినవి.

**మంగళకైశికి :**

పద్యగేయ వచన మయమైన ఈ నాటికకూడ డా॥ వేటూరి ఆనంద మూర్తిగారిదే. అముక్తమాల్యద ప్రబంధమునందలి మాలదాసరికథ ఆధారముగా కూర్చబడిన ఈ రూపకము ఆంధ్రప్రదేశ్ హరిజన మహోత్సవాల సందర్భముగా 10-4-1976 నాడు ఆకాశవాణి హైదరాబాదు కేంద్రమునుండి ప్రసారితమైనది. ఈ రచనలో అముక్తమాల్యద యందలి కొన్ని పద్యములు గ్రహింపబడినవి. అన్నమాచార్యుల 'విడువవో మాయా', 'ఒడలిది నీకెందు ఉనికేలేదు' అను రెండు కీర్తనలను కూడ మాల దాసరినోట పాడించినారు డా॥ వేటూరి ఆనందమూర్తిగారు. సమకాలిక సామాజిక వాతావరణమునకు అనుకూలముగా నుండునని భావించి ఈ కీర్తనలను నాటికాకర్తలు గ్రహించినట్లు ఊహింపవచ్చును.

**గొడగూచి :**

పాలకూరికి సోమనాథుని బసవపురాణాంతర్గతమైన 'గొడగూచి' కథను గ్రహించి, పాటలను ద్విపదలను గూర్చి శ్రవ్య నాటికగా మలచినారు డా॥ వేటూరి ఆనందమూర్తిగారు. శివదేవుడు, అతని భార్య, వారి కూతురు - గొడగూచి ఈ రూపకమందలి పాత్రలు. ఇందలి కథ మధ్య మధ్య కథకుని కథా గానముతో నడచుచుండును.

ఈ నాటికలోని 'ఏలనామనవి కాదనే' అను గేయము రమణీయముగా ఉన్నది. ఈ గేయమునందలి ——

'కమ్మని పాలివి కాచితే లేదనా
వేళకాలేదనా వెచ్చబడలేదనా
తాళి ఒక్కింత నీ దరికి రాలేదనా
మీదుపోయినవనా మీగడే లేదనా
నే తెచ్చువేళ వన్నెరో చూచేరనా
పాట పాడాలనా భక్తి సేయాలనా
మాటలో నాలోని మనసు తెలియాలనా
పాలు రుచిలేవనా పాలుపోలేదనా
చాలునా! లేకనే చాలనే చాలనా!'' అను పంక్తులు గొడ

గూచి అమాయికత్వమునకు భక్తి రసార్ద్రితకు అద్దము పట్టుచునే శ్రీ ఆనంద మూర్తిగారి శైలీ సౌకర్యమును ప్రకటించుచున్నవి.

**మహాశ్వేత :**

శ్రీ నూరంపూడి భాస్కరరావుగారు బాణుని 'కాదంబరి' ఆధారముగా గేయవచనమిశ్రితమైన ఈ నాటికను రచించినారు. ఇది ఆకాశవాణి విజయవాడ కేంద్రమునుండి ప్రసారితమైనది రంగములని ప్రత్యేకముగా రచయిత చెప్పకున్నను నాలుగురంగములుగా ఈ రూపకము సాగినట్లు ఊహింపవచ్చును. చంద్రాపీడుడు. మహాశ్వేత, తరలిక, పుండరీకుడు, కపింజలుడు, దివ్యపురుషుడు ఈ నాటికయందలి పాత్రలు.

ఈ నాటికయందలి నాలుగు పాటలును సాహితీసంగీతమర్యాదలను సంతరించుకొన్నవి. ఉదాహరణమునకు – పుండరీకుడు మహాశ్వేతను ప్రేమించి తన విరహ బాధను మిత్రుడైన కపింజలునకు విన్నవించు సందర్భమునందలి —

"ఇదియేదో గ్రీష్మము కపింజలా!
ఇవి యేవో జ్వాలలు కపింజలా!
ఇనబింబమె అనలము జిమ్మెనో
కనుపింపని నిప్పులు రాల్చెనో
మనసే హోమాగ్నికి సమిధగ
తనువే ఈ వహ్నికి కట్టెగ
ఇదియేదో గ్రీష్మము కపింజలా!

ఇవియేవో జ్వాలలు కపింజలా !
ఏమేఘము వర్షించునో నీరము
ఏనాటికి శాంతిల్లునో తాపము
ఏమోమరి రాదేమో మహాశ్వేతా
ఏమోమరి రాదేమో మహాశ్వేత
ఏమో........ ............'' అను పాటను పేర్కొన

వచ్చును. ఈ నాటికలో వచన మధికముగానున్నను సంభాషణలు రసవంతముగా సాగినవి.

**ఎంకి అలక :**

శ్రీ నండూరి వేంకట సుబ్బారావుగారి 'ఎంకి పాటలు' ఆధారముగా శ్రీ పాలగుమ్మి విశ్వనాథముగారు కూర్చిన 'సంగీత రూపకము' 'ఎంకి అలక'. ఇందలి పాటలు నండూరి వారివే. పాటల కనుగుణముగా మధ్య మధ్య వచనము వచ్చుచుండును. ఎంకి నాయుడు బావలే ఇందలి పాత్రలు. కృత్రిమ నాగరక సమాజమునకు అతీతముగా సహజ ప్రవృత్తికి అతిసన్నిహితముగా నున్న వ్యక్తులు ఎంకి – నాయుడుబావ.

ఈ నాటిక ఆకాశవాణి హైదరాబాదు కేంద్రము నుండి ప్రసారితము

**కిన్నెరసాని :**

శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి 'కిన్నెరసాని' యందలి గేయము లను గ్రహించి నడుమ నడుమ సంధివచనములను చేర్చి శ్రీ పాలగుమ్మి విశ్వనాథముగారు ఈ నాటికను కూర్చి 1957 లో ఆకాశవాణి హైదరాబాదు కేంద్రము నుండి ప్రసారము చేసినారు.

**మేఘసందేశం :**

కాళిదాసుని మేఘసందేశ మాధారముగా గ్రహించి రమ్యములైన తీయని గేయములతో సుందరతా ప్రచురములైన వచనములతో ఈ నాటికను నిర్మించినవారు శ్రీ నార్ల చిరంజీవిగారు. ఇది ఆకాశవాణి హైదరాబాదు కేంద్రము నుండి ప్రసారితమైనది.

## (పద్యగేయ నాటికలు)

**మేఘసందేశం :**

పద్యగేయాత్మకమైన ఈ నాటికను రచించినవారు శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావుగారు. మేఘసందేశకావ్య మాధారముగా రచింపబడిన ఈ 'సంగీత రూపకము'ను కాళిదాస జయంతి సందర్భముగా ఆకాశవాణిలో ప్రసారముచేసి ఆ మహాకవి యెడగల అత్యంత గౌరవభావమును అక్షరరూపమున ప్రకటించినారు శ్రీ రజనీకాంతరావుగారు.

మేఘ సందేశ కావ్యమువలెనే ఈ నాటికకూడ 'కశ్చిత్కాంతా విరహా గురుణా స్వాధికారాత్ ప్రమత్తః' అను శ్లోకముతో ప్రారంభమగును. 'మేఘ సందేశం' నాటికయందలి పాత్రలు - కవి, యక్షుడు, ఆమె (యక్షిణి), రాజదూత, మేఘుడు.

మేఘ సందేశ కావ్యము తీరుగనే యక్షుని విరహముతో ఈ నాటికను ప్రారంభించినను సంగీతరూపక రచనా సంవిధాన దక్షులైన శ్రీ రజనీకాంతరావుగారు బృందగానములో —

"వలదు మాకీ విప్రలంభము
వలతుమువినగ కథా ప్రారంభము
కఠినశిక్షగా యక్షునికెందుకు
ఘటించెధనపతి కాంతావిరహము
యక్షుని కాంతానురక్తియెట్టిదో
శిక్షపడిన యపరాధమెట్టిదో" అని ప్రశ్నింపజేసి దానికి

సమాధానముగా **'Flash back'** కథా కథన సంవిధానమును ప్రయోగించి, నాటకీయతకు జీవముపోసి ఈ రూపకమును నిర్వహించినారు.

ఈ శ్రవ్యనాటికయందలి కవిపాత్రను కేవలము కాళిదాస శ్లోకపఠనమునకై ప్రయోగించి రూపక కథాకథనమునకు ఔదాత్య గాంభీర్యములను ఆపాదించుటయేగాక శ్రోతలకు కాళిదాస కవితావిశేషములను అనుభూతిచెందు నవకాశమును కల్పించినారు శ్రీ రజనీకాంతరావుగారు. ఒకవేళ నాటిక రంగస్థలముపై ప్రయుక్తమగుచో కవి పాత్రకు సమాంతరముగా నడచిన బృంద

గానముచేత కథా కథనమును నడిపింపవచ్చును రాజమాత పాత్ర కల్పనము నాటకీయతకు ఉపకరించుచు యక్షదంపతుల ప్రణయ సన్నివేశమును విషాద మయము చేయుచు నాటికకు తీవ్రతను ఆపాదించినది.

మంజరీద్విపదలతో తేటగీతులతో గేయములతో సాగిన ఈ నాటికలో యక్ష యక్షిణీ పాత్రలకు కేవలము గేయములే ప్రయుక్తములగుట ఒక విశేషము. మూలశ్లోకములను రసవంతముగా అనుసరించుటయేగాక మూలము నందు లేని భావములుగల కొన్ని గేయములను కూడ రసౌచిత్యములను దృష్టి యందుంచుకొని రచించినారు శ్రీ రజని. ఉదాహరణమునకు —

"నిలుమా సఖి నిలుమా కనకపుతామరలిదిగో
సరిసరి రావోయీ ఉపవనమందిర మదిగో" అను యక్షిణీ యక్షుల యుగళగీతమును.

"వొచ్చిందా తిరిగీ వొచ్చిందా
తొంగి చూసిన ములగసిరకి పొంగిపోయే తొలిమేగం
వొచ్చిందా తిరిగీ వొచ్చిదా" అను బృందగానమును పేర్కొనవచ్చును.

**మిథిల :**[1]

నాటికాకర్తలు 'కరుణశ్రీ' గారు. తులసీదాస మహాకవి విరచితమైన 'రామచరితమానస్' లోని సీతా కల్యాణ ఘట్టమును పురస్కరించుకొని ఈ నాటికను రచించినారు శ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రిగారు. రామలక్ష్మణుల లోకోత్తర సౌందర్య దర్శనముచే మిథిలాపురమంతయు ఆనందాశ్చర్యములతో నిండిపోవును. మరునాడు పుష్పోద్యానమున విశ్వామిత్రుని పూజకు పూలు తెచ్చుటకై వచ్చిన శ్రీరామలక్ష్మణులను సీతాదేవి చెలికత్తె చూచును. దుర్గాదేవీ పూజకై సీత చెలికత్తెలతో ఆ పూలతోటకు వచ్చి శ్రీరాముని చూచి ఆనంద తన్మయురాలగును. సీత —

"నల్లనల్లని స్వామి విల్లెక్కు పెట్టాలి
ఎల్లలోకాలు చేయెత్తి జయపెట్టాలి

1. ఈ నాటిక సంపూర్ణముగా లభ్యముకాలేదు. అక్కడక్కడ కొన్ని గేయములను సూచనలను అందించినారు 'కరుణశ్రీ' గారు.

కోదండరాముసిరిగులుకు పేరురముపయి
పూదండనై నేను పులకించిపోవాలి'' అని దుర్గాదేవిని ప్రార్థించును. తరువాత ధనుర్భంగము, సీతాకల్యాణము జరుగును ఇది ఈ నాటిక యందలి కథాంశము.

ఈ నాటికలో శ్రీ పావయ్యశాస్త్రిగారు తమ 'ఉదయశ్రీ' కావ్యమందలి 'ధనుర్భంగం' శీర్షికలోని కొన్ని పద్యాలను సందర్భోచితముగా అక్కడక్కడ ఉపయోగించుకొన్నారు.

"అదిగదిగో మిథిలాపురం-అది
అంబరచుంబితగోపురం
విదేహరాజుల రాజధానియగు
విజయశ్రీ పదనూపురం - అది
సదాసంపదల కాపురం - అది
సదా సంపదలకాపురం" వంటి రమ్యగేయ ఖండిక లీనాటికలో చోటు చేసికొన్నవి. 1-4-1960నాడు ఆకాశవాణి విజయవాడ కేంద్రము నుండి ఈ నాటిక ప్రసారితమైనది.

**వరూథిని :**

శ్రీ లంకాసూర్యనారాయణరావు ('లసూనా') గారు పెద్దన మను చరిత్రము నాధారముగా గొని ఈ నాటికను రచించినారు. నాలుగురంగములుగా సాగిన ఈ నాటికయందలి పాత్రలు - ప్రవరుడు, సిద్ధుడు, వరూథిని, చంద్రరేఖ, హారిణి, మాయాప్రవరుడు.

ప్రయోక్త అప్పుడప్పుడు కథా గానముచేయును. ప్రయోక్త చేయు ప్రవరుని శీలవర్ణనతో ప్రారంభమగు ఈ నాటిక స్వరోచిజననోత్సవముతో సమాప్తమగును. ఈ రూపకములో రచయిత వ్రాసిన సీసములు, తేటగీతులు పాటలు కాక, 'ఎవ్వతెవీవు' 'దానజపాగ్నిహోత్ర' అను రెండు పెద్దన పద్యములున్నవి.

శ్రీ 'లసూనా' గారి పద్యములందలి భావములన్నియు పెద్దన్నవే అయినను పాటలయందలి భావములు మాత్రము స్వతంత్రములు. ఉదాహరణమునకు ——

"తీవ సాగిచూచింది
[illegible]

బంగరు త్రావ
చెంగునరావ" అను పాటను పేర్కొనవచ్చును. ఈ పాట చెలికత్తెలు వరూథినికి వివిధాలంకరణములొనర్చుచు పరిహాసములాడు సందర్భమునందలిది.

## (గేయనాటికలు)

**ఉషస్విని :**

శ్రీ మల్లవరపు విశ్వేశ్వరరావుగారు రచించిన 'ఉషస్విని' గేయనాటిక పి. బి. షెల్లీ రచించిన 'ప్రామీథియస్ అన్‌బౌండ్' అను గేయరూపకమునకు ఆంధ్రీకరణము ఈ నాటికయందలి పాత్రలు - యుగపురుషుడు, కింకరనాయకుడు, కింకరులమూక, ధారుణి వారుణి, ప్రాచీదేవి.

తన నిరంకుశపాలనను ధిక్కరించిన స్వేచ్ఛాహృదయుడు యుగపురుషుని కాలాసురుడు బంధించి విపరీతముగా బాధింపగా, యుగపురుషుని ప్రాణేశ్వరి ప్రాచీదేవి తపస్సుచేసి ఆతనిని బంధవిముక్తిచేయుట ఈ నాటికయందలి కథాంశము.

'ప్రామీథియస్ అన్‌బౌండ్' నాలుగు అంకముల గేయరూపకము. శ్రీ విశ్వేశ్వరరావుగారి ఈ 'ఉషస్విని' మూడు దృశ్యములనాటిక. స్వేచ్ఛాస్వాతంత్ర్యములకు ప్రతీక 'ఉషస్విని'.

షెల్లీ స్వేచ్ఛాప్రియుడు. స్వాతంత్ర్యయోధుడు. అందుకే ఆతడు 'ప్రామీథియస్' చేత దేవతల నిరంకుశత్వమును నిరసింపజేసి స్వేచ్ఛామానవతలను ఎలుగెత్తిచాటు విప్లవగీతమును ఆలపింపజేసినాడు. మూలరూపకమందలి ప్రామీథియస్ ఈ 'ఉషస్విని' లోని యుగపురుషుడు. ప్రామీథియస్ వృత్తాంతమును గూర్చి ఆంగ్లోపన్యాసకులు శ్రీ గోపరాజు సాంబశివరావుగారు ఇట్లు వ్రాసినారు — "ప్రామీథియస్ దేవతలనుండి అగ్నిని భూలోకమునకు తెస్తాడు. ఇతడు మానవుల హక్కులకు ప్రాతినిధ్యం వహించిన వీరుడు. ఒక రాతికి కట్టబడి నిరంతరం బాధలకు లోనవుతాడు. ధైర్యం, గాంభీర్యం, ఓర్పుతో సర్వశక్తిమంతుడైన భగవంతుని (జూపిటర్) ఎదుర్కొంటాడు. అసూయ, కసి, ఆశ ప్రామీథియస్‌లో సనేమిరా లేవు. ఇతనిలో ప్రేమ మూర్తీభవిం

చింది. ప్రొమీథియస్ జూపిటర్ బెదరింపులకు లొంగడు. జూపిటర్ పాపానికి ద్వేషానికి ప్రతినిధి. ప్రొమీథియస్‌ని భూమాత ఆసియా, అతని వధువు ప్రకృతి సమర్థిస్తాయి. నిర్ణీత సమయంలో డెమోగోర్గన్ (ఆదిశక్తి) జూపిటర్‌ని అధికారము నుండి వెళ్లగొట్టుతుంది. శక్తిరూపుడు హెర్క్యులిస్ ప్రొమీథియస్‌ని విడిపిస్తాడు. ఆనాడు ప్రేమసామ్రాజ్యం స్థాపింపబడుతుంది. సింహాసనాలు, దేవాలయాలు, న్యాయస్థానాలు, కారాగారాలు. చరిత్రావశేషాలు, శిథిలాలుగా మిగిలిపోతాయి. మానవునికి ఇక రాజదండన భయముండదు. స్వేచ్ఛావాయువులు పీలుస్తాడు; అదుపుండదు. సమతాధర్మాన్ని పాటిస్తాడు. వర్గం, జాతి, దేశం అంతమవుతాయి. భయం, ఆరాధన, హోదా మాయమవుతాయి. మానవుడు తనకు తానే రాజవుతాడు. న్యాయం సాధుత్వం విజ్ఞానం వర్ధిల్లుతాయి. మానవుడు మానవునిగా జీవిస్తాడు."[1]

షెల్లీలో గాన్పించు కవితావేశము ఈ 'ఉషస్విని' రచనలోను అనుభూతమగును. ఇందుకు స్థాలీపులాకన్యాయముగా ప్రాచీదేవి వారుణితో పలుకు సందర్భము నందలి —

"ఏవేవీ నా వాలిక కన్నులు
లోలో మరిగే దృశ్యాలు
హేలా హాలపు రహస్యాలు
కరాళసత్యము కదిలే తెరపై
తరుణోషస్విని నృత్యాలవిగో
పశ్చిమగిరిపై ప్రాచీతారక
ప్రతిబింబించిన ముత్యాలవిగో
పాతాళాండము బీటలువారెనో
ప్రభాతడిండిమ ప్రతిధ్వనించెనో
ప్రతిరుతులేవో ప్రాకెడి ప్రాకెడి
ప్రతీచిసోదరి విన్నావా ?" అను పంక్తులను గమనింపవచ్చును

1. ఆంగ్ల సాహిత్య చరిత్ర - పుట 348. ప్రథమ ముద్రణ 1968. ప్రచురణ : నవజీవన్ బుక్ లింక్స్ - విజయవాడ-2

ఈ రూపకమంతయు గేయములతో నడిపించి చివరకు యుగపురుషుడు బంధవిముక్తుడైన సందర్భమునందు రెండే రెండు కంద పద్యములను ప్రయోగించినారు శ్రీ విశ్వేశ్వరరావుగారు. రెండు పద్యములు మాత్రమే ఉన్నందున ఈ నాటికను పద్యగేయాత్మకముగా గాక గేయైకముగనే గుర్తించినాను.

**నృత్యనాట్యచిత్రాంగద :**

విశ్వకవి రవీంద్రనాథ ఠాగూరు యువకుడుగా నున్నప్పుడు 'చిత్రాంగద' అను ఒక పద్యనాటిక రచించినారు. ఆ కథాంశమునే గ్రహించి అతడు వార్ధక్యమున 'నృత్యనాట్యచిత్రాంగద' పేరుతో ఒక గేయనాటికను రచించి ప్రదర్శింపజేసినారు. స్వరలిపితోకూడ ఆ గేయనాటిక సాహిత్యము వంగ భాషలో ప్రకటింపబడినది. దానిని శ్రీ మల్లవరపు విశ్వేశ్వరరావుగారు అదే పేరుతో తెనుగున వెలయించినారు.

ఆరు దృశ్యములుగా సాగిన ఈ నాటికయందలి పాత్రలు - అర్జునుడు, చిత్రాంగద, సఖీగణము, మదనుడు, అర్జునుని వన్యపరిచరులు, గ్రామవాసీగణము.

ఈ నాటికయందలి వనవర్ణనము, చిత్రాంగదార్జునుల విరహవర్ణనము, వారి ప్రణయ మనస్తత్త్వవర్ణనము రసోదాత్తముగా సాగినవి. చిత్రాంగదార్జునుల ప్రణయకథ ప్రసిద్ధమే అయినను మదన పాత్ర కల్పనము, వీరనారిగా చిత్రాంగద పాత్రను మలచిన తీరు నాటకీయతను, ఉత్కంఠను సంతరించి పెట్టినవి. చివరి దృశ్యమునందలి వసంతర్తువర్ణనము నాయికా నాయకుల శృంగార జీవనస్థితిని వ్యంజింపజేసినది. నాటికాంతమునగల సంస్కృత మంత్ర శ్లోకములు చిత్రాంగదార్జునుల ప్రణయ పవిత్రతను భాసింపజేసినవి.

'ప్రేమమున్ననారి' గా, 'శౌర్యమున్న పురుషుడు'గా, 'సింహాసన మందు సింహేంద్రవాహిని' గా చిత్రాంగద పాత్ర తీర్చిదిద్దబడినది. క్షణికమైన బాహిర సౌందర్యముకన్న శాశ్వతమైన అంతరమనస్సౌందర్యము మిన్నయని ఈ 'నృత్యనాట్యచిత్రాంగద' సందేశమిచ్చుచున్నది. రవీంద్రుని స్వరలిపి సాహిత్యమునకే అనువాదమైన ఇందలి గేయరచన నృత్యానుకూలమై మూల వంగ భాషా కవితాచ్ఛంద సౌందర్యములను ప్రకటించుచున్నది.

సుగాత్రి :

పింగళి సూరన కళాపూర్ణోదయ కావ్యమునందలి సుగాత్రీశాలీనుల కథ ననుసరించి ఈ నాటికను రచించినవారు ఆచార్య డా॥ సి. నారాయణ రెడ్డిగారు. మూడు దృశ్యములున్న ఈ నాటికయందలి పాత్రలు - సుగాత్రి, శాలీనుడు, సుగాత్రి చెలికత్తెలు.

ఈ నాటికయందు వాయుగానమును ప్రవేశపెట్టి శ్రీ నారాయణ రెడ్డిగారు కథాగమనమును వర్ణనను నిర్వహించినారు. ఇందలి వర్ణనలు సంయమనముతో సంక్షిప్తసుందరముగా సాగినవి. ప్రియుడు తనను పల్కరింపక పోగా మరలిపోవుచున్న సుగాత్రి —

"చండీశ్వరుని తపము
నుండి త్రిప్పగలేక
తిరిగిపోయెడు పార్వ
తి విధాన" ఉన్నదట.

పగలు పారవైచి నడుమున పయ్యెద బిగించిన సుగాత్రి —

"నీలజలధరావగుంఠ
నాలుదాటి వెలివచ్చిన
పూర్ణచంద్రబింబమువలె" కనిపించినది.

శోభనము నాటి తొలిరేయిని —

"ప్రణయతంత్రులు మ్రోయు
ప్రథమ సంగమవేళ"గా
"మదనుడు శరమ్ములకు
పదును పెట్టెడు వేళ"గా,
"...జీవిత చక్రములో
నిండు వసంతము"గా—వర్ణించిన తీరు శృంగారరస మధురము.

ఈ నాటిక యందు నవనవలాడు సూక్తులను పొదిగినారు శ్రీ నారాయణ రెడ్డిగారు. ఉదాహరణమునకు —

" సహృదయమ్మొందు నౌర
రాతిబొమ్మలోనైన"

"కాముకులు పఠియింప
గాలేని కావ్యమ్ము
సహజ సౌందర్యమే
సర్వదా సేవ్యమ్ము" వంటి వానిని పేర్కొనవచ్చును. ఈ నాటికయందలి సంభాషణలు శాలీమనిసౌందర్యాదర్శమువలె సహజ రమ్యములు.

ప్రసార ప్రదర్శనా సౌలభ్యమును సంతరించుకొన్నది ఈ నాటిక.

**గోకుల విహారం :**

నాటికాకర్తలు ఆచార్య డా॥ సి. నారాయణరెడ్డిగారే. పోతనభాగవతమునందలి దశమస్కంధము ఈ రచనకు మాతృక. గోపికలు, గోపకులు, యశోద, కృష్ణుడు, రాధ ఈ నాటికయందలి పాత్రలు.

శ్రీకృష్ణుని జననోత్సవము, ఆతని దుడుకుచేష్టలు, యశోద మందలింపులు, యమునాతీరమున రాధా గోపికల కృష్ణాన్వేషణము, వారి విరహము, చివరకు శ్రీకృష్ణుడు రాధాదులనేలుకొనుట అన్నియు కన్నులకు కట్టినట్లు చకచకా నడచినవి ఈ నాటికలో

యమునా తీరమున గోపికలవలె ఈ నాటికలో వర్ణనలు మెరయుచున్నవి. ఉదాహరణమునకు కొన్ని - కృష్ణుడవతరించినవేళ —

"బాలచంద్రుని గన్న
పాలసంద్రమువోలె
భానుమూర్తిని గన్న
పద్మాకరమువోలె" గోకులముప్పొంగినదట.

ఆ చిన్ని కన్నయ్య కన్నువిప్పినవేళ —

"తల్లిగోవులు పాల
జల్లులను కురిసినవి
పిల్లలేగలు పొంగి
క్రేళ్లురికి మసలినవి
కోడెగిత్తలు మూపు
జాడించి రొంకెసినవి" ఇందలి చివరి రెండు పంక్తులు సహజ మధురములు. శ్రీకృష్ణుని దుడుకు చేష్టలను యశోదతో చెప్పుచు ఒక గోపిక —

"లేదో యశోదమ్మ !
నీదాపునే యున్న
వల్లనయ్యాను తెలుసు
కొన్న తెల్లమ్మగును" అని యనును. 'తెల్లమ్మగును' అను
ప్రయోగము చమత్కారగర్భితము నాటికాంతమునున్న —

"లేలెమ్మో రాధికా !
రారమ్మో రాధికా !
ప్రణయకింకిణులు మ్రోసే
అమృతనాట్య వేదికా !
రారండీ నా వరాల గోపికలారా !
ఆరిపోని చిరస్నేహ దీపికలారా !
మన ప్రేమలు పూలగుండె
లను లేచు పరిమళమ్ములు
ఆకారవిరహితమ్ములు
అనుభవవైకవేద్యమ్ములు" అనుపాట ఈ నాటికయందలి రచనా
సౌందర్యమునకు నిదర్శనము

ఆకాశవాణి హైదరాబాదు కేంద్రమునుండి ప్రసారితమైన ఈ నాటిక
ప్రదర్శనమునకును అనుకూలము.

**మహాశ్వేత :**[1]

ఈ నాటికను రచించినవారు డా॥ దాశరథిగారు. సంస్కృత గద్య
కావ్యము 'కాదంబరి' లో నాయిక కాదంబరి ఉపనాయిక మహాశ్వేత. ఈమె
కాదంబరి సఖి గౌరీ హంసుల పుత్రిక. సార్థకాభిద. శ్వేతకేతుపుత్రుడైన
పుండరీకుని మనోహారిణి ఆమె వృత్తాంతము గ్రహించి ఈ గేయనాటికగా
మలచినారు శ్రీ దాశరథిగారు. ఇది ఆకాశవాణి హైదరాబాదు కేంద్రము
నుండి 1955 లో ప్రసారమైనది.

---

1. ఈ నాటిక పూర్తి ప్రతి లభ్యముకాలేదు. నాలుగు పాటలు మాత్రము లభించినవి. అందువలన ఇందలి విశేషములను తెలుపలేక పోవుచున్నాను.

"ఎవరు చూచినకలో
ఇదిలతుతారల్లు
ఎగసిరెక్కలు సాచి
ఎపుడు చూచెనో ॥

ఎవరు విన్నది గాథ
ఇది కోటిస్వర్గాలు
ఇరుల తెరలను చీల్చి
ఎపుడు వినెనో ॥

ఎన్నియుగముల మాట
ఇది ఎన్నడో ధాత
కన్నువిచ్చిన నాటి
కమ్మందవాలో ॥

ఏనాటికోర్కెయో
ఇది మొగ్గగాలేచి
నూనమైవాసనల
చుంబించునో ॥

ఎచటి సౌభాగ్యమో
ఇది పైడి గొడుగుగా
రచియించుకొనె మనో
రథములను బ్రదుకు ॥"

"శివజటాజూటమ్ము
చిమ్మినది గంగ
దశదిశలు గంగలో
తానాలు చేయంగ
...............

ఎండకాలపు టెండ
మండిపోయిన జగము
తుణనేచనమువనే

చల్లబడ్డది సగము
వైరాగ్యలోకమ్ము
వానలో తడిసింది
ప్రణయ ఘూసాంకురము
తలయెత్తి చూచింది" వంటి చరణములు ఈ నాటిక యందలి రమణీయ భావస్ఫూర్తికి ఉదాహరణములు.

**కవిత :**

ఇది శ్రీ నారపరెడ్డిగారి రచన. కవికోకిల దువ్వూరి రామిరెడ్డిగారి 'పండిత ప్రతిజ్ఞ' అను ఖండకావ్యము ననుసరించి శ్రీ రెడ్డిగారు ఈ నాటికను రచించినారు.

నిజమైన కవిత ప్రకృతిసౌందర్యమును, విశ్వజీవులవేదనను తనలో రంగరించుకొని ఎదఎదలో క్రొత్తభావములను రేకెత్తింపజేయుచు, ఏ సంకుచిత ధోరణులకు గురికాక, ఏ శుష్కవాదములకు తలయొగ్గక విశాలోదాత్తమానవ కల్యాణ దృక్పథముతో నిత్యనూతనముగా రసానందమును పంచిపెట్టుచు పాగుచుండునని ఈ నాటిక ద్వారమున శ్రీ నారపరెడ్డిగారు నిరూపించినారు.

ఈ నాటిక యందలి పాత్రలు - కంకాళకవి, వనకన్య, పండితుడు, కవిత. కంకాళకవి పాత్ర అభ్యుదయము పేరిట వర్గవిద్వేషమును రెచ్చగొట్టు అభివృద్ధివిధ్వంసక రాజకీయనియంతృత్వపు సంకుచిత భావమునకు ప్రతీక కాగా పండితుని పాత్ర ప్రగతి నిరోధకమైన ఛాందసభావమునకు ప్రతినిధి. ఇక వనకన్య పాత్ర మిగిలిన పాత్రల మనస్తత్వములను చర్యలను వ్యాఖ్యానించు వ్యాఖ్యాత్రిగా ప్రయుక్తమైనది.

వ్యాకరణాలంకార గర్భబంధ కవిత్వములవంటి సంకుచిత మానదండము లతో కవితను కొలుతునను సనాతన ఛాందస పండితుల భావమును, కవితను రాజకీయ సిద్ధాంతముల చట్రములో బిగింతునను అభ్యుదయ సాహిత్య పాక్షిక ధోరణిని ఈ నాటికయందు ఖండించినారు శ్రీ నారపరెడ్డిగారు అసలైన కవిత 'ఎండిపోయిన మ్రాకులను' చివురింపజేయునని, మానవతా భావములతో 'నరుని తుచ్ఛత్వంబు' ను కరగించునని, 'ఆశోపహత జీవి' లో ఆశను రేకెత్తించు నని, 'కష్టజీవుల కనుల' లో కాంతులను నింపునని, 'బానిస ఎద' లో క్రొత్త

భావాలను మొలకెత్తించునని, 'కర్కశ హృదయాల కరుణార్ద్రులు' పాలించునని కవిత్వము యొక్క విశ్వజనీనవిరాట్ స్వరూపమును వివరించినారు శ్రీ నారపరెడ్డిగారు.

ఈ నాటికయందలి శైలి ఆయా పాత్రల క్రమగుణముగా సాగినది.

**సీత :**

ఉత్తర రామచరిత మాధారముగా శ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రిగారు ఈ నాటికను రచించినారు. గోమతీనదీతీరములో సీతమ్మతల్లి తల్లిగర్భములో ప్రవేశించిన కరుణాత్మక గాథను ఈ నాటిక చిత్రించినది ఇందలి పాత్రలు - శ్రీరాముడు, కౌసల్య, సౌమిత్రి, భరతుడు, కైక, సుమిత్ర, ఊర్మిళ, మాండవి, శ్రుతకీర్తి, శత్రుఘ్నుడు, వసిష్ఠుడు, అరుంధతి, కుశలవులు, హనుమ ప్రజలు, వాల్మీకి, సీత

కరుణార్ద్రముగా ఈ నాటికను రచించి, సహృదయుల ఎదలలో జాలిని జాలువారించి 'కరుణశ్రీ' కలము పేరును సార్థకము చేసికొన్నారు శ్రీ పాపయ్యశాస్త్రిగారు. 'ఏకోరసః కరుణ ఏవ' అన్న భవభూతిని అనుభూతికి తెచ్చినారు శ్రీ శాస్త్రిగారు.

చిన్నచిన్న మాటలలో మహోన్నత భావములను పొదిగి తమ వర్ణనా వైదుష్యమును ప్రదర్శించినారు నాటికాకర్తలు. ఉదాహరణమునకు ఒకటి —

"శ్రీకారం చుట్టుకున్న
స్త్రీజాతి కథానిక వలె
ఆకారందాల్చిన లో
కైకశోక గీతికవలె"

"రసార్ద్రమై ప్రవహించే
రామాయణ రచనరీతి"

"ధర్మముతో దయలాగున" సీత వాల్మీకులవారి వెంట వచ్చినదట నాటికాంతముననున్న —

"సీతా సీతా సీతా
శ్రీరాముని కంఠధ్వని

మాతా మాతా మాతా

పాతాళమున ప్రతిధ్వని" అను పంక్తులందలి సారస్యము సహృదయైక వేద్యము.

కథా గమనమునకు, పాత్రల మనస్థితి వివరణమునకు ఈ నాటికయందు బృందగీతి ప్రయుక్తమైనది.

ఈ నాటిక ప్రసారమునకును ప్రదర్శనమునకును అనుకూలము.

**లవణరాజు కల :**

గురజాడ అప్పారావుగారి 'లవణరాజుకల' ను అనుసరించి శ్రీ లంకా సూర్యనారాయణరావు ('లసూనా') గారు ఈ నాటికను కూర్చినారు. రెండు దృశ్యములుగా సాగిన ఈ 'సంగీత నృత్యనాటిక' యందలి పాత్రలు – కన్నె, లవణరాజు, వృద్ధుడు, ద్వారపాలకుడు, తాపసి.

ఈ నాటికలో సందర్భానుగుణముగా గురజాడ వారి 'మంచిచెడ్డలు మనుజులందున' అను గేయ ముద్ధరింపబడినది. గురజాడ మహాకవి శతజయంత్యు త్సవ సందర్భముగా ఈ నాటిక ప్రదర్శింపబడినది.

**మధురానగరీగాథ :**

'మధురానగరిలో' అను సుప్రసిద్ధమైన పదమును ఆలంబనముగా చేసికొని ఈ 'నృత్యనాటిక' ను రచించినారు శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావుగారు. 'విశ్వవీణ' అను వీరి గేయనాటికల సంపుటి యందలి మొదటి నాటిక ఇది. వ్రజభామిని, గోపీబృందం, కృష్ణుడు ఇందలి పాత్రలు.

ఈ నాటికయందలి గేయములు సరళ సుందరములు.

"వ్రేపల్లెవాడలో నుండే

గోపగోపికలారా; లెండి;" అను గేయము వ్రేపల్లెలో తెల్ల వారుజామున కానిపించు దృశ్యమును సహజ రమ్యముగా చిత్రించినది.

"పూలతావుల మ తరుముకవచ్చే... దెవనిదా వేణుగీతి ? అను పంక్తిలోని పదచిత్రము ఎదలను మీటును.

"కన్నే పలపుల వంటి కమ్మని
వెన్నా ముద్దులు తేరిచితీస్తూ" అను చరణము లందలి ఉప
మానము సహృదయ హృదయాలను చవులూరించును.

"దాగి వెదకికొనుటతోనె తనివి తీరువలపు
ఆగియాగి ప్రేమసుధల నానుటయే పొలుపు"

అను సూక్తి శృంగారరసమధురమై శ్రీకృష్ణశృంగారకావ్యమునకు భాష్యము చెప్పుచున్నది.

"మధురానగరిలో - చల్లనమ్మబోదు" అను అతిప్రచురమైన జనరంజక పదమునకు కృష్ణుని సంవాదగేయమును చేర్చి శ్రీరజనిగారు తమ రచనా ప్రతిభను ప్రదర్శించినారు.

ఈ నాటి ప్రసార ప్రదర్శనములనందినది.

**అమృతవర్షిణి :**

ఇదియును శ్రీ: బాలాంత్రపురజనీకాంతరావుగారి నాటికయే. శ్రీహర్షుని నాగానందమునందలి గాథకు అనుసరణమిది. కరుణరసార్ద్రమైన ఈ నాటిక యందలి పాత్రలు - శంఖచూడుడు, అతని తల్లిదండ్రులు, జీమూతవాహనుడు గరుడుడు.

దినమునకొక సర్పమును పొట్టబెట్టుకొను గరుడునికి ఆహారముగా పోవు శంఖచూడునకు బదులుగా జీమూతవాహనుడు పోవుటయు, అతని సత్వసంపదకు, క్షమాగుణమున కాశ్చర్యానందములందిన గరుడుడు అమృతవర్షము కురిపించి జీమూతవాహనుని నాగులను బ్రతికించుటయు ఈ నాటికయందలి ఇతివృత్తము.

ఈ నాటికలో రిథాగమనమునకై బృందగీతి ప్రయుక్తమైనది. గరుడుడు వధ్యశిలపై వచ్చిపడు సందర్భమునందలి "రివ్వు రివ్వు రివ్వు రివ్వు రివ్వు మనుచును" అను గేయములోని—

"కాలరాత్రి కురులపాయగా
నీలి మబ్బు తెరలచాయగా
ఘనభోంతరమ్ము లదరగా
నాగులెల్ల బెదరి చెదరగా" అను పంక్తులు భయంకర దృశ్యమును

సాక్షాత్కరింపజేయుచున్నవి. ఈ నాటిక ఆకాశవాణిలో ప్రసారితమగుటయే గాక పలుమార్లు పలుచోటులలో ప్రదర్శింపబడినది.

**విజయ విధాత :**

కేనోపనిషద్గాథ ననుసరించి శ్రీ రజనీకాంతరావుగారు ఈ నాటికను సంతరించినారు. రెండురంగములుగా సాగిన ఈ నాటిక యందలి పాత్రలు - ఇంద్రుడు, సురవందిమాగధులు, ఋషులు, అప్సరసలు, దేవసైన్యము, అసుర సైన్యము. అసురాధిపుడు. సురబృందము, అప్సరోబృందము, అగ్ని, యక్షుడు, వాయువు, ఉమ.

రాక్షసులను గెలిచితినను విజయగర్వముతో విఱ్ఱవీగు ఇంద్రునకు ఉమామాత కనువిప్పు కలిగించి విశ్వేశ్వరుడే 'విజయ విధాత' అని ఉపదేశించుట ఈ నాటికయందలి ఇతివృత్తము.

ఈ నాటికయందు కథాకథన బృందగానమును ప్రయోగించి కథను నడిపించినారు శ్రీ రజనిగారు. ఇందలి గేయరచన వీరాద్భుతరసానుకూలముగా సాగినది అగ్నివాయువుల మాటలు శ్రీ రజనీకాంతరావుగారికిగల దృశ్య ప్రత్యక్షీకరణశక్తికి నిదర్శనములుగా నిలుచుచున్నవి.

"ఒకకీలా, మరియొకకీలా, ఇం
కొకకీలా నాలుకలై తేలగ
జ్వాలాకీలా మాలికలెన్నిటి
ప్రజ్వలించినా దహింపకున్నవి
హృదిలో ఒదిగిన దావానలములివే
కడుపున నడగిన బడబానలములివే
అగ్నిభూధరశతఘ్నిద్రవములివే
అణుమాపాస్త్రప్రళయజ్వాలలివే" అన్న అగ్ని మాటలు

"మందమధురసుమగంధవహుడనౌ
మలయానిలగతి వృథయా ? వృథయా ?
జగమ్ములను కల్లోలము చేసే
ఝంఝూగతులివె వృథయా వృథయా ?

ప్రళయకాల జీమూత ప్రచలత్
ప్రభంజనములివి వృథయా ? వృథయా ?
లయవిశ్వగగనాంతరాళ గో
ళాంతరక్షోభ వృథయా ?"— అనువాయువు మాటలు వారి శక్తులను చక్కగా చాటుచున్నవి. గేయమున నాటకీయతను రంగరించి రచన సాగించుట రససిద్ధులైన కవులకే సాధ్యము అట్టి రచనలో శ్రీ రజనీకాంత రావుగారు సిద్ధహస్తులనుట అతిశయోక్తి కాదు.

ఈ నాటిక శ్రీ రజనిగారి సంగీత సామర్థ్యమునకే ప్రదర్శిత మైనది.

**విర్ణేత :**

గిల్‌బర్ట్ అండ్ సల్లివాన్ వ్రాసిన 'ట్రయల్ బై జ్యూరి' ('Trial by Jury)' అను ఆంగ్లనాటకమునకు శ్రీ వావిలాల సోమయాజులుగారు గావించిన స్వేచ్ఛానుసరణము (A free adaptation) ఈ నిర్ణేత.

ఒక న్యాయస్థానమునందు జరిగిన సమస్యా వాద ప్రతివాదములను, న్యాయనిర్ణయమును చిత్రించు సన్నివేశము ఈ నాటిక. సమకాలిక న్యాయ వ్యవస్థను, యౌవనసౌందర్య ధనములకు వశమగు మానవబలహీన మనస్తత్వ మును, తద్ద్వారమున నుత్పన్నమగు సామాజిక సమస్యలను ఈ నాటిక వ్యంగ్య ముగా చిత్రించినది. ఇందలి పాత్రలు - వాది (స్త్రీ), ప్రతివాది (పురుషుడు) వాదివాది, పరిషత్తు, నిర్ణేత, దౌవారికుడు, వేత్రహస్తుడు.

"నిత్యసౌఖ్యమొదవిన నది
నిస్సారమ్మగును గదా
ఏ మార్పును లేనివలపు
ఎడద కరుచి నొసగుగదా"

"కాలమనెడి రాజరాజు
కడుగడుసరి - క్రూరాత్ముడు
ఏలుతుసామంతులైన
ఇల నిలువగనీడు సదా"

"వెలుగునీడలొకటొకటిగ
వెనువెనుకల వచ్చినపుడె

ప్రసవవల్లులకు జగమున
పరమసుఖద జీవనము"

"ఛాయాతపకలితముగా
పాగుబ్రతుకె సఖమయము" వంటి సూక్తులు ప్రకృతి తత్త్వమును ప్రపంచించుచునే ఈ నాటికయందలి పాత్రల మనస్తత్త్వమును వ్యంజించుచున్నవి.

వాది ప్రతివాదుల ప్రణయ జీవితమును, న్యాయనిర్ణేత గతజీవితమును, వాది సౌందర్యలావణ్యాతిశయమును శ్రీ వావిలాల సోమయాజులుగారు సహజ రమ్యముగా వర్ణించినారు.

ఈ నాటికలో కథాగమనమునకై 'స్వరమేళ' ప్రయుక్తమైనది.

**కవి :**

శ్రీ సూరంపూడి భాస్కరరావుగారు రచించిన ఈ నాటికకు మూలము 'మాఘునిగాథ'. ఈ విషాదాంతనాటికయందలి పాత్రలు – కవి, కవిభార్య, బ్రాహ్మణుడు, రాజు (భోజరాజు), రాణి, భటుడు, బిచ్చగాళ్లు. నాలుగు భాగములుగా ఈ నాటిక సాగినది.

ఆత్మాభిమానము కలిగిన ఒక కవి భోజరాజు ఆశ్రయమును కోరనందు వలన దారిద్ర్యబాధను సహింపలేక ఆ కవి భార్య కవి కవిత్వమును రాజుకు వినిపించి బండెడు ధాన్యమును తెచ్చుకొనును. కాని దారిలో అన్నార్తుల ఆర్తనాదములను విననోర్లక ధాన్యమునంతటిని దానముచేసి రిక్తహస్తములతో ఇంటికి పోవును. పేదల దుఃస్థితిని, తన ఆకలిబాధను భరింపలేక కవి ప్రాణములు విడుచును. భర్తృమరణమును జూచి కవి భార్యయు కన్నుమూయును. ఇది ఈ నాటికయందలి ఇతివృత్తము.

ఈ నాటికయందలి ప్రతిపాత్రయు అద్భుతముగా పోషింపబడినది. కళా తపస్విగా, స్వేచ్ఛాజీవిగా, ప్రకృతి ప్రియుడుగా, రాజాశ్రయపరాఙ్ముఖుడుగా కారుణ్యశీలిగా, మానవతామూర్తిగా కవి రస హృదయులను పులకింపజేయును. కవి భార్య కళాసాధకుని సహధర్మచారిణిగా, ధైర్యశాలినిగా దానదయా రూపిణిగా పతివ్రతగా తన బ్రతుకును చరితార్థము చేసికొన్నది. భోజుడు, అతని భార్య కావ్య కళాపోషకులుగా మన్నన లందుకొందురు.

"కావ్యగీతాళింప కల్యాణమయస్వప్న
శారదాంబినీగర్భ తటిత్కామినీ" అను వాగ్దేవి వర్ణనము.

"పూలకంటెను, గుమ్మపాలకంటెను, తేనె
జాలు కంటెను తీపికాలువలు పొంగేటి
కామధేనువు వంటి కవి గుండె కలదిచట" అను కవి హృదయ వర్ణనము, శ్రీ భాస్కరరావుగారి కవితా శక్తికి నిదర్శనములు.

"తనువుకంటెను శాశ్వతముగాదె రససిద్ధి?"

"చావు బ్రతుకులు రెండు నరిసాటి తుణికములె" వంటి సూక్తులీనాటికను మరింత అందగింప జేసినవి. ఈ నాటికలోని—

"కోటికావ్యములల్లి, కోటిమణులు గణించి
కోటి భూములనేలి కోటి సౌఖ్యములంది
యేమి సఫలము జగతికేమి శాంతి లభించు
మూగమానవకోటి మూల్గు మాన్పకయున్న" అను కవి వాక్కులు అభ్యుదయసాహిత్యపరమార్థమును మానవధర్మమును ప్రబోధించు ప్రభాబుక్కులు.

నాటికలో కవి కావ్యశక్తి ప్రదర్శన సందర్భమునందలి సంతృప్త పద్య గేయములు నాటికాకర్తకుగల ఛందస్సమదర్శనమును వ్యంజించుచున్నవి.

కరుణ రసాత్మకమైన ఈ నాటిక ఆకాశవాణి విజయవాడ కేంద్రము నుండి ప్రసారమైనది.

**ఉలూచి :**

చేమకూర వేంకటకవి కృత విజయవిలాస ప్రబంధ మాధారముగా శ్రీ టి. రామకృష్ణారెడ్డిగారు ఈ నాటికను రచించినారు. రెండురంగములుగా సాగిన ఈ నాటిక యందలి పాత్రలు - అర్జునుడు, ఉలూచి, చెలులు.

భాగీరథీతీరమున వ్రతశీలియైయున్న అర్జునుని సౌందర్యముచే మోహితయైన నాగలోక నివాసినియగు ఉలూచి, ఆతనిని పాతాళమునకు తీసికొనిపోయి వలచి వలపించుకొనుట ఈ నాటికయందలి కథాంశము.

'నేపథ్యాంతము' నుపయోగించి కథను కొంత నడిపించినారు శ్రీ రామకృష్ణారెడ్డిగారు ఈ నాటికయందలి గేయములు లలితసుందరములు. ఇందలి పాతాళలోకచంద్రశాలాశోభావర్ణనము మూలమునననుసరించినను క్లుప్తముగా మున్నది.

ఈ నాటిక 27-9-1968 నాడు ఆకాశవాణి హైద్రాబాదు కేంద్రము నుండి ప్రచారమైనది.

శ్రీ రామకృష్ణారెడ్డిగారు మార్కండేయ పురాణము ననుసరించి 'ఏకావళి' యను మరొక గేయనాటికను కూడ రచించినారు.

**తపస్సిద్ధి :**

కాళిదాసుని కుమారసంభవ కావ్యము ననుసరించి శ్రీ ధారా రామనాథ శాస్త్రిగారు ఈ నాటికను రచించినారు. ఇందలి పాత్రలు – రతి, మన్మథుడు, వసంతుడు, మలయానిలుడు, యక్షుడు, యక్షిణి, ప్రకృతి, మాయ.

వసంతుని సాయముతో రతి మన్మథులు పరమేశ్వరుని తపోవనమున అతని మనమున శృంగార తరంగాలు లేపగా మన్మథుని భస్మముచేసి పరమేశ్వరుడు వెడలిపోవుటయు, రతి పార్వతిని ప్రార్థించుటయు ఈ నాటికయందలి విషయము.

ఈ నాటికయందలి మలయానిలుడు ఋతురాజైన వసంతుని ఆజ్ఞచేరూపు దిద్దుకొన్నవాడు. ఇందలి ప్రకృతిపాత్ర వసంతుని ప్రభావముచే వెలుగులను, శృంగారపు తరగలను నింపుకొన్న ప్రకృతి చైతన్యమునకు ప్రతీక మన్మథ వసంతాదు లాడుచున్న మాయానాటికయందలి రహస్యమును గమనించిన మూర్తియే మాయ; ప్రకృతికి సోదరి, వసంతవనవిలాసముల తిలకించుచు విహరించిన ప్రియాప్రియులు యక్షిణీయక్షులు. మలయానిల – యక్ష – యక్షిణీ – ప్రకృతి – మాయా పాత్రలు శృంగారరసదీప్తి నుద్దేశించి కల్పితములైనవి. ఈ నాటికయందలి 'ప్రయోక్త' గేయవచనములలో కథను అచటచట ముందుకు కదలించును.

ఈ నాటికాకర్త సృష్టించిన శివుని ఫాలనేత్రజ్వాల భయంకరముగా లేదు. అది 'చల్లచల్లని వెలుగు'. ఆ వెలుగు 'మెల్ల మెల్లగ' వికసించి—

"వెన్నెలవలె కప్పురంపు
తిన్నెలవలె వలువరేకు
కన్నులవలె రతిరాజును
చుట్టిన"దట. 'మృతిసీమకు నెట్టిన' దట.

ఇందలి "రావేరావె రాగిణీ
రసభావ తరంగిణీ
పొదలెనదే అమని
జలదరించె నీవని" అను గేయము రమ్యముగా సాగి ప్రకృతిలో చెలరేగిన శృంగారమును వ్యక్తము చేయుచున్నది గేయరచనలో పటుత్వము మెరయుచున్నది.

**హంసదూత్యము :**

నాటికాకర్తలు శ్రీ ఎం కె రాముగారు. ప్రబంధములను నృత్యనాటికలుగా రచించవలెనను సంకల్పముగల శ్రీరాముగారి ప్రథమ ప్రయత్నము ఈ 'హంసదూత్యము'. ఇది శ్రీనాథుని శృంగార నైషధమందలి హంసదూత్యఘట్టమునకు అనుసరణము. 'హంసదూత్యము', 'రాయబార ఫలితము', 'నలరాయబారము' అను మూడు భాగములుగా సాగిన ఈ రూపకమందలి పాత్రలు - దమయంతి, చెలులు, హంస, నలుడు, దేవదూతికలు.

ఈ నాటిక యందలి గేయములు నృత్యానుకూలముగా రూపుదిద్దుకొన్నవి.

"హరివిల్లు కళలన్ని విరబూసె చెలిమేన
సెలయేటి పరవళ్ళ చొరవంత కనిపించె
చవులూరు భావాల సిరులకే విరిబంతి
భువిలోని దివికన్య అందాలదమయంతి"

"ఎవరుమీటినా మ్రోగును వీణియ
ఎవరు ఊదినా పాడును వేణువు
ఊదెదరొకరే నా గళశంఖము
అతని ఊహకే విరిసెను పల్లవి" వంటి చరణములు శ్రీ రాముగారి భావస్ఫూర్తికి ఉదాహరణములు.

**వసంతలక్ష్మి :**

ఆచార్య డా॥ సి. నారాయణరెడ్డిగారు రచించిన ఈ 'సంగీతరూపకము' ఆకాశవాణి హైదరాబాదు కేంద్రమునుండి ప్రసారితమైనది. వసంత ఋతుశోభ ఈ నాటికయందలి వస్తువు. వసనుడు, మందారము, మల్లిక. మాలతి, వసంత లక్ష్మి - ఇందలి పాత్రలు.

వసంతలక్ష్మి స్వాగతసందర్భమున పూలను పాత్రలుగా చిత్రించి సృష్టించిన భూమిక తెలుగు సంప్రదాయములను గుబాళింపజేయుచున్నది.

ఈ నాటికలోని మూడు పాటలును పువ్వులవలె నున్నవి. వానిలో—

"జేజేలమ్మ జేజేలు
వసంతలక్ష్మి! జేజేలు
హేమంతుని పాలనలో ఎన్నో
బాములు పొందితివమ్మా
శిశిరుడు చేసిన అన్యాయములకు
చివికిపోయినా వమ్మ" అను గేయము మకరందమధురము.

**కొండమంచి కడలిదాక - గోదావరిపది :**

శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావుగారు ఈ నాటికను రచించినారు. నలుగురు చిరంజీవులు, గోదావరి, పల్లెవాడు, పడవవాడు - ఈ రూపకము నందలి పాత్రలు.

నలుగురు చిరంజీవులకు గోదావరి ప్రత్యక్షమై గౌతమ మహర్షివలన తాను ఉదయించిన పౌరాణికగాథను చెప్పి, సహ్యాద్రిపైనుండి బయలుదేరి మహారాష్ట్ర ప్రాంతమునుదాటి, ఆంధ్రప్రదేశ్ ఉత్తర జిల్లాలుగడచి, మంజీర, పైన్‌గంగా, ప్రాణహిత, ఇంద్రావతి, శబరి, కిన్నెరసాని వంటి ఉపనదులను తనలో కలుపుకొని, భద్రాద్రిని సేవించి, పాపికొండలలో ఒదిగి కదలువరకుగల వివిధ ప్రదేశములను, అచటి విశేషములను పరిచయముచేసి అంతర్ధానమగును. తరువాత చిరంజీవులకు పల్లెవానికి, పడవవానికి మధ్య తీవెలు సాగిన సంభాషణము ద్వారమున గోదావరి సప్తగోదావరులుగా చీలి సముద్రములో కలియు చున్నట్లు వ్యక్తము చేయబడినది.

సంభాషణములను చాల మెలకువతో వెంట వెంట ఒక పాత్రనుండి మరొక పాత్రకు లాగుచు విసుగురాకుండ గోదావరి నదీతీరప్రాంత విశేషముల నన్నింటిని హృదయంగమముగా తెలియజేసినారు శ్రీ రజనీకాంతరావుగారు.

శ్రీనాథుని పద్యములను, భద్రాచలరామదాసు గేయ రచనలను, శ్రీ విశ్వనాథ సత్యనారాయణ – అడవిబాపిరాజుల గేయములను మరికొన్ని ప్రసిద్ధమైన పడవ పాటలను సందర్భానుగుణముగా ఈ నాటికలో ప్రయోగించినారు శ్రీ రజనీకాంతరావుగారు.

"ఈ సంగీతరూపకము 1972 వ సం॥ జపాన్ రేడియో (యన్ హెచ్.కె.) నిర్వహించిన అంతర్జాతీయ పోటీలో బహుమానము గెలుచుకొని తెలుగు సంగీత రూపకమునకు అంతర్జాతీయ ఖ్యాతిని సంపాదించి పెట్టినది".[1]

**వానకారుదొర :**[2]

నాటికా కర్తలు శ్రీ పాలగుమ్మి విశ్వనాథముగారు. పద్యగేయ వచనమయమైన ఈ 'సంగీతరూపకము' ఆకాశవాణి హైద్రాబాదు కేంద్రమునుండి ప్రసారితమైనది.

వర్షాకాల వాతావరణమును చిత్రించు ఈ నాటికలో సందర్భానుగుణముగా పూర్వకవుల పద్యములును, శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి, శ్రీ కొనకళ్ల వెంకటరత్నము, శ్రీ మల్లవరపు విశ్వేశ్వరరావు, శ్రీ 'శశాంక'గార్ల గేయములు ప్రయోగింపబడినవి.

**కృష్ణా - గోదావరి :**

శ్రీ కందుకూరి రామభద్రరావుగారు రచించిన ఈ నాటికను ఆకాశవాణి ప్రసారము చేసినది ఈ నాటిక వ్రాతప్రతి లభ్యముకానందున ఇందలి విశేషములను పేర్కొనలేకపోవుచున్నాను.

## (పద్యగేయ నాటికలు)

**తుమ్మెద :**

ఈ నాటికను రచించినవారు శ్రీ మల్లవరపు విశ్వేశ్వరరావుగారు. ఇది ఆకాశవాణి ప్రసారము నుద్దేశించి వ్రాయబడినది. తుమ్మెదకును తమ్మిపువ్వున

1. మంగళగిరి ప్రమీలాదేవిగారి – 'తెలుగులో పద్యగేయనాటికలు' – పుట 90.
2. ఈ రూపక విశేషములను నాకు తెలిపినవారు శ్రీ పాలగుమ్మి విశ్వనాథముగారు. నాటిక ప్రతి లభ్యముకానందున విశేషములను తెలుపలేకపోవుచున్నాను.

కునుగల ప్రణయమిందలి వస్తువు. తుమ్మెద, మల్లి, చెలులు, మందారం, సంపెగ, పద్మిని ఈ నాటికయందలి పాత్రలు.

పరాగ సౌరభమకరందాలు తగు పాళ్లలో కుదురుకొన్న పద్మినీహృదయములో తుమ్మెద ప్రణయాన్వేషణ పరాకాష్ఠ పొందినట్లు ఈ రూపకము హృద్యముగా అభివ్యక్తము చేసినది.

పూలను, తుమ్మెదను పాత్రలుగా గైకొని, మధుర భావములతో వాని యందు ప్రాణముపోసి సమ్మోహనమున ఒక ఉదాత్త ప్రణయతత్త్వమును ప్రకటించినారు శ్రీ విశ్వేశ్వరరావుగారు. అద్వయమైన పరమాత్మ విశ్వ ప్రకృతిలో ద్వైరూప్యమును పొంది ప్రణయలీల కొనసాగించుననియు, పురుషుడుగా ప్రకృతి శక్తిని, తుమ్మెదగా కుసుమానుశక్తిని అన్వేషించుననియు, రూపముచే రెండుగానే యుండి ఆత్మానుభూతి ద్వారమున ఏకత్వమును పొందుననియు ఈ నాటిక నిరూపించుచు సత్త్వగంధమును విరజిమ్ముచున్నది.

ఈ రూపకమందలి గేయములు హృదయంగమములు. లలిత లలిత పద ప్రయోగము నృత్య సంగీతములకు ఊపిరులు పోయుచున్నది. ఉదాహరణమునకు —

"చంచలమగు రెక్కలకొనల
సోకి పూలరేకుల
కోరగిలగ జేతును నే
కోరకముల చెక్కులనే
భయమేలా ఓ బాలా!
సిగ్గేలా ఓ సుమబాలా!" అను తుమ్మెదపాటను పేర్కొన వచ్చును. నాటిక ఆద్యంతములందు తేటగీతులు చోటుచేసికొన్నవి.

**రాధా మాధవము :**

గేయములతో సీసము – తేటగీతి పద్యములతో సాగిన ఈ నాటికను శ్రీ జి. విద్యాసాగర్ గారు వ్రాసినారు. ప్రకృతి పురుషుల ప్రణయ తత్త్వము ఈ నాటికలో నిరూపితమైనది. మధుపము, పరభృతము, సంపెగ, మల్లిక, మొల్ల, విరజాజి ఇందలి పాత్రలు – కవికుమారుడు, పూలకన్నెలు మాధవి, గడ్డిపూవు, మాధవస్వామి, వియోగిని, మలయ పవనుడు.

ఈ 'సంగీత రూపకము' నందలి కవిపాత్ర వాసంత విలాస వ్యాఖ్యానము వలై ప్రయుక్తమైనది. వియోగిని పాత్ర మూలమున "మాధవుడు పురుషుండు సమవర్తి, లరయ ప్రకృతి" అనియు, వీని సమ్మేళనము జరిగినపుడే "వాస్తవ మ్మున కామని వచ్చిన"ట్లనియు తత్త్వమును ప్రపంచించినారు ఈ రూపక కర్తలు. భరత వాక్యమున—

"రాధయైనేడు మారిన ప్రతిసుమమ్ము
విభునితో కూడి క్రీడించ వేడ్కపడెను
ప్రణవ హృదయాలలోని పరమసుఖాను
భూతి నవవసంతమ్ముగా పొలిచెజగతి" అని వ్యాఖ్యానించి ఈ నాటికాకర్తలు 'రాధా మాధవము' అను శీర్షికను సార్థకము చేసినారు.

ప్రణయ భావముతో పరవశించు ప్రసూనాది పాత్రలకు గేయములు మిగిలిన పాత్రలకు పద్యములు ప్రయుక్తమగుట ఈ నాటికయందలి ఒక విశేషము. గడ్డిపూవు నోట పలికించిన—

"దారిద్ర్యక్కమ గడ్డిపూవుగ
జననమందిన దాననోయీ
తేనెతావుల సోవలెరుగని
వట్టి విరుపేదన్
నీలిమంటల పొగలు కురిసెడి
శైశిరాంధ తమస్సులందున
ఆశనేనై కలువరించితి
మురళి పాటలకై
స్వీకరింతువా? లేదా? నా నయ
నాంచలమ్ముల జాలువారిన
బాష్పసుమముల గ్రుచ్చితెచ్చితి
నీకు కైనేయన్" అను ముచ్చటైన మూడు ముత్యాలసరాలు ఈ సంగీత రూపకమూర్తిని సమలంకరించుచు సౌందర్యము నినుమడింపజేయు చున్నవి

## (గేయనాటికలు)

**స్వాగతగీతి :**

డా॥ శ్రీమతి నాయని కృష్ణకుమారిగారు ఈ నాటికను రచించినారు. పుష్పకన్యలు, పిల్లతెమ్మెరలు, భృంగకులము ఈ నాటికయందలి పాత్రలు.

పుష్పకన్యలు, పిల్ల తెమ్మెరలు, భృంగకులము కలిసి 'రసపిపాసిని', 'రాగ రూపిణి' యగు వనలక్ష్మికి స్వాగతము పలుకుట ఈ చిన్ని నాటికయందలి ఇతి వృత్తము.

"ఆమె పదములం శోభ అచటి ప్రకృతి శోభ
ఆమె పెదవుల నవ్వు అచటి పువ్వుల నవ్వు
ఆమె గొంతుకపాట, అచటి పికములపాట
కాంతమై ఏకమై
కలసినవి మెలసినవి" వంటి పంక్తులు హృద్యములై వనలక్ష్మిని చక్కగా వర్ణించుచున్నవి.

"మునుసిగ్గు దొంతరలు మూగుకోరక రాశి
అరవిచ్చుకనుల నీ రాక కోరినవి
చక్కగా గోముగా సాగి విరిసిన పూలు
విసిగి నీ రాకకై వేసరిల్లినవి" వంటి చరణములు ముగ్[redacted]ల మానసిక స్థితులను వ్యంగ్యముగా వ్యక్తీకరించుచున్నవి ఈ నాటిక[redacted]దలి గేయములు లలిత మధురములు.

**నవ్వని పువ్వు :**

ఆచార్య డా॥ సి. నారాయణరెడ్డిగారి ప్రథమ గేయనాటిక [redacted]ని పువ్వు; ఇందలి పాత్రలు – కవి, మొగ్గ, తీగ, తుమ్మెద, పవనుడు.

కపట ప్రణయము చూపి అమాయికల జీవితములతో చెరల[redacted]ు కామాంధులను దృష్టిలో నుంచుకొని ప్రతీకాత్మకముగా ఇతివృ[redacted]ు నిర్వహించినారు శ్రీ నారాయణరెడ్డిగారు. ఒక తుమ్మెద మొగ్గను [redacted]ని పువ్వును) కవ్వించి నవ్వింపయత్నింపగా ఆ మొగ్గకు తల్లియైన తీగ త[redacted]ు కాపాడుకొనగలుగుట ఈ నాటికయందలి ఇతివృత్తము.

మధుపము, గంధవహుడు, మొగ్గ, పువ్వు, తీగ అను శబ్దములందలి పొడి పొడి అర్థములను గ్రహించి, వాని సంబంధము నూహించి, ప్రతిభతో ప్రాణము పోసి, పాత్రలను చేసి వాని యందు లోకజ్ఞతతో ప్రాపంచిక మానవ స్వభావ మును నింపినారు శ్రీ నారాయణరెడ్డి నాలుగు పాత్రల మధ్య నలిగిపోకుండా జాగ్రత్తగా మొగ్గను కాపాడి 'నవ్వని పువ్వు' ను సార్థకము చేసినారు. ఈ నాటికలో కవి పాత్ర ప్రబోధమునకు ప్రతీకాత్మకముగా కల్పింపబడినదే.

"చివురుటాకులలోన
రవల రేకులలోన
మంచు ముత్యాలుంచి
మంచి మధువులనించి
ఉదయభానుకరాల
సుధలు జారేవేళ
ప్రకృతి లక్ష్మి దివ్య
పాదపూజలు చేసి
ఎన్నొ నోములు నోచి
ఎన్నొ జాములు సైచి"

"జీవనాడులలోని
శీతాంబువులుపోసి
పాలవెన్నెలలోని
సచ్చిమీగడ దీసి
తనమేని పొరలనే
నునుపాన్పుగా జేసి
ఎంతొ గారాబుగా
ఎంతెంతొ డాబుగా" వంటి పంక్తులు అక్షర రమ్యతకును అర్థసౌందర్యమునకును భావగాంభీర్యమునకును ఉదాహృతులుగా పేర్కొన వచ్చును.

బహుజనాదరణమును పొందిన ఈ నాటిక ఆకాశవాణి హైదరాబాదు కేంద్రమునుండి ప్రసారమైనది. ఆంధ్రాభ్యుదయోత్సవాలలో ఉస్మానియా

విశ్వవిద్యాలయ మహిళాకళాశాల వారు దీనిని ప్రదర్శించినారు. కవులే గాక శ్రీ నారాయణరెడ్డిగారు మధురగాయకులు కూడ. వారు రస హృదయుల కోరికమేరకు అనేక సభావేదికలపై ఈ నాటికను గానము చేసినారు.

**వలపు రేడు :**

శ్రీ నారాయణరెడ్డిగారి 'నవ్వని పువ్వు' గేయనాటికల సంపుటి యందలి రెండవ నాటిక 'వలపు రేడు'. రేయి, కలువ, తార, చంద్రుడు ఇందలి పాత్రలు.

చంద్రునికిని రేయి - కలువ - తారలకును మధ్యగల ప్రణయము, రేయి - కలువ - తారలకు నడుమ చెలరేగిన సవతిపోరాటము ఈ నాటిక యందలి ఇతివృత్తము.

తారాపతి, రేరేడు, కలువల చెలికాడు అను చంద్రశబ్దమునకు గల ప్రసిద్ధ పర్యాయపదము లందలి పరమార్థమును గ్రహించి, రమణీయముగా చంద్రునికి ముగ్గురు భార్యలను కల్పించి, వారికి కలహాలు కల్గించి, కడకు ఒక్కచో చేర్చి నాటికను రక్తి కట్టించినారు శ్రీ నారాయణరెడ్డిగారు. లోకమున కానిపించు సపత్నుల ఈర్ష్యాద్వేషములను సహజ సుందరముగా చిత్రించుచునే చిట్టచివరకు సపత్నులకు సహన మవసరమను సందేశమును వ్యంగ్యముగా అందించినారు శ్రీ రెడ్డిగారు.

ఈ నాటిక ఆకాశవాణి హైదరాబాదు కేంద్రమునుండి ప్రసారమైనది.

**ఋతువుల రాణి :**

ఆచార్య సి. నారాయణరెడ్డిగారు 1955 లో ప్రచురించిన 'అజంతా సుందరి' అను గేయనాటికల సంపుటి యందలి మూడవ నాటిక ఇది. రెండు రంగములుగా సాగిన ఈ నాటికయందలి పాత్రలు - మాధవుడు, ఋతువుల రాణి, శిశిరుడు.

శిశిరఋతువు తరువాత వసంతము వచ్చును. ఇది ప్రకృతి సత్యము. ఈ సత్యము ధ్వనించునట్లు శ్రీ రెడ్డిగారు ఒక కథ అల్లినారు. తన ప్రేయసియైన ఋతువులరాణిని మాధవుడు శిశిరుని బారినుండి కాపాడుకొనుట ఈ నాటిక యందలి ఇతివృత్తము.

వసంత ఋతువునకు ప్రతినిధియైన మాధవుని నాయకునిగాను, వాసంత ప్రకృతిని నాయికగాను, శిశిర ర్తువును ప్రతినాయకునిగాను సృష్టించి కమనీయముగా ఈ నాటికను నిర్మించినారు శ్రీ నారాయణరెడ్డిగారు. ఈ నాటిక యందలి— "శిశిరసగ్నలతావళికి

ఘుసృణాంబరవిన్యాసం
చివికిన రస హృదయాలకు
నవయౌవన సందేశం" అను మధుమాసవర్ణన హృద్యము. వసంతభామినిని మాధవుని 'నీలనిశాజీవిత సౌదామని' అని వర్ణించిన సరణి రమ్యము. ఇందులోని భావచిత్రము తటిత్తులా తళుక్కుమనుచున్నది. ఋతువుల రాణి—"కొలనులోని అంచలా

మొయిలులోని మించులా" ఉన్నదట. రేండె రెండు ఉపమానములతో ఆకాశమును అవనిని ఏకసూత్రమున బిగించు కవితా శక్తి ఇది. పంచదార గొంతులు, మావిమోవి, చేదుచూపులు, పూలచేలము అనునవి రమ్యములైన పదబంధములు.

నాటికకు ఆద్యంతములందున్న బృందగీతి వసంతర్తుపరిచయముతోపాటు, ఇందలి శృంగారరసమును సూచించుచున్నది. వాయువుతో నాయిక నాయకునకు సందేశము పంపుట ఔచితీ భాసురము. దానివలన సందేశము వాయువేగముతో చేరుననియును, వసంతునకు గంధవహుడు ఆప్తుడనియును, అతడు మహాబలుడు కావున సందేశమునకు భంగము వాటిల్లదనియును ఊహించునట్లు చేసినారు శ్రీ నారాయణరెడ్డిగారు.

అంత్యప్రాసల అందాలతో మధుర భావసుగంధాలతో సాగిన ఈ నాటిక యందలి గేయములు నాటికను కవితా సంవాసితము చేయుచున్నవి.

ఋతువర్ణనలను గావించుచు ప్రత్యేక కావ్యములు రచించి వాని ద్వారమున లోకమునకు పెక్కు చక్కని సందేశములను కవితాత్మకముగా నందించు పద్ధతి కవి కులగురువు కాళిదాసుతో ఆరంభమైనది. అతని ఋతు సంహార కావ్యము అందుకు ప్రథమోదాహరణము. తెలుగులో కూడ ఋతువర్ణనా పరములైన కావ్యములెన్నియో వెలువడినవి. ఇది శ్రవ్యకావ్యముల విషయము.

మేఘము నుండి విముక్తుడైన రాకాచంద్రుడు-

"అప్పుడప్పుడె రచిత
మైనట్టి చెంగల్వ
పూలగుచ్ఛములీల
పొలిచె'' నట. ఇందలి ఉపమానము ఉల్లములో పరిమళ తరంగములు లేపును.

ఈ నాటికయందలి గేయములు సంగీత నృత్యానుకూలములై శ్రీనారాయణ రెడ్డిగారి కవితా హృదయమును ఆవిష్కరించుచున్నవి.

ఆకాశవాణి హైదరాబాదు కేంద్రమునుండి ప్రసారితమైన ఈ నాటిక తెలంగాణా రచయితల సంఘవార్షికోత్సవాలలోను- ఆంధ్రాభ్యుదయోత్సవాలలోను, బందరు మున్నగు ప్రాంతాలలోను ప్రదర్శితమై విశేష ప్రచార ప్రశంసల నందుకొన్నది.

**పద్మరాగం :**

నాటికా కర్తలు శ్రీ లంకా సూర్యనారాయణరావు (అమూనా) గారు. పద్మములకు భాస్కరునకు మధ్య పరిమళించిన ప్రణయమును చిత్రించు ఈ నాటికయందలి పాత్రలు-పద్మాలు, పద్మసామ్రాజ్ఞి, భాస్కరుడు.

వాయుగానము, నేపథ్యగానము ద్వారమున కొంతకథ ముందుకు నడచినది ఈ నాటికలో. నేపథ్యమునందలి రవిశివస్తుత్యాత్మకములైన శ్లోకములు తేటగీతులు నాటికకు దివ్యవాతావరణమును కలిగించినవి. ఈ రూపకమందలి గేయరచన సంగీత నృత్యకళామర్యాదలకు అనువైన సరణిలో సాగినది.

"దళముదళమున
దాచియుంచిన
సౌరభమ్ముల
హార తిరుగో'' వంటి కవితోక్తు లీనాటికలో చోటుచేసికొన్నవి.

ఈ నాటిక ఆకాశవాణి విజయవాడ కేంద్రమునుండి ప్రసారితమైనది. అఖిల భారత తెలుగు రచయితల మహాసభల సందర్భమున- 9-5-1960 నాడు

హైదరాబాదులోను, ఇంకను పదెనిమిది పర్యాయములు వివిధ నగరములలోను ఈ నాటిక ప్రదర్శింపబడినది.

డా॥ సి నారాయణరెడ్డిగారి గేయనాటికల ప్రభావము ఈ నాటికా కర్తపై కలదు. వారి 'వెన్నెలవాడ' ప్రభావము ఈ 'పద్మరాగము' పై పడినది. 'వెన్నెలవాడ'లో చంద్రుని మేఘము కప్పివేయగా ఈ పద్మరాగమున భాస్కరుని రాహువు కబళించును. అందు కలువలరాణి ప్రార్థనచే వాయువు మేఘుని మెడలుపట్టి త్రోసివేయగా, ఇందు పద్మసామ్రాజ్ఞి ప్రార్థనచే నాగభూషణుడు రాహు విఘాతమును తొలగించును.

**గులాబి ప్రసవించింది :**

శ్రీ బోయి భీమన్నగారి "చిత్రకళాప్రదర్శనం" అను గేయ నాటికల సంపుటియందలి ఒక నాటిక 'గులాబి ప్రసవించింది'. ఇది కవి భావనారమ్యమైన ప్రతీకాత్మకరచన. ఇందలి పాత్రలు-సీతాకోక చిలుక, గుడ్లగూబ, తులసి, కోకిల, నెమలి, ఆకుపురుగు, మేకపిల్ల, తోటకూరచెట్టు, క్రోటనుమొక్క, మందమారుతం, గోపిక.

ఉద్యానవనమందలి గులాబితీగ ప్రసవించగా, ఒక గోపిక ఆనందముతో వచ్చి గులాబిపువ్వును ముద్దుపెట్టుకొనుట ఈ నాటికయందలి కథాంశము.

ఈ నాటికయందలి పాత్రల సంభాషణలలో సమాజమునందలి భిన్నభిన్న వ్యక్తుల స్వభావములు సువ్యక్తమగును. ఒక స్త్రీ ప్రసవించునప్పుడు అన్యస్త్రీల హృదయములలో కలుగు భావములు సహజసుందరముగా ప్రకటింపబడినవి ఈ నాటికలో.

ఈ రూపకములో సీతాకోకచిలుక ఒక పరోపకారశీలికి ప్రతీక. కోకిల విశ్వమానవవేదనను తనవేదనగా అనుభవించి, దానిని కళారూపమున ప్రకటించు ఒక సత్‌కళాకారునికి ప్రతినిధివలె భాసించును. ఇందలి నెమలి పాత్రకూడ ఇట్టిదే. మేకపిల్ల, ఆకుపురుగు పాత్రలు రెండును లోకమే మైనను స్వార్థము మానుకొనని తిండిపోతులకు ప్రతిరూపములు. తులసి అభ్యుదయపథగామియైన ఒక సంస్కర్తకు సంకేతము. అదేవిధముగా తోటకూరచెట్టు ఒక సానుభూతిపరునికిని, క్రోటనుమొక్క వేదనానుభవములేని పోకిలాడియైన ఒక గొడ్రాలునకును,

గుడ్లగూబ కులతత్త్వసంప్రదాయశీలముగలిగి అభ్యుదయమును ప్రోత్సహింపని ఒక వ్యక్తికిని ప్రతీకలు.

ఈ నాటికయందలి వర్ణనములు సంక్షిప్తములు; ఉదాత్తములు; ఉజ్జ్వలములు. ఉదాహరణమునకు ఒకటి-రెండు.

"ఉదయారుణరాగాంబుధి
నోలలాడి పూర్వదిశా
భామిని రవిగన్నట్టులు" గులాబి ప్రసవించినదట.

ఉదయించిన గులాబి పువ్వు-

"దెసల అందములన్ని
పసుపుకుంకుమలన్ని
నెత్తావి సిరులన్ని
క్రొత్తకోరికలన్ని
ముద్దగా పుట్టుకొచ్చిన" దట
"నిరంతరము చూలాలు
నిత్యము బాలెంతరాలు
ప్రకృతిదేవి మందిరమొక
పరమానందకందము;
కడలిమీది కెరటాలే కానుపులు" వంటి సుందరసూక్తులెన్నో

ఈ నాటికయందున్నవి.

నాటికాంతమున గోపిక పలికిన-

"నిజము సౌందర్యమ్ము
ప్రజనసౌందర్యమే;
నవసృజనలోని ఆ
నందమే పరమమ్ము!" అను పలుకులే ఈ నాటికయందలి సందేశముగా గ్రహింపవచ్చును.

**సుమజన్మ :**

శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావుగారు రచించిన ఈ నాటికలో సుమ ప్రణయమును, సుమజన్మ ప్రత్యేకతయును చిత్రింపబడినవి. ఇందలి పాత్రలు-నాయిక, పూవు, మధుకము, కవి.

భావనారమణీయమైన ఈ నాటికయందు ప్రణయజీవిత ప్రాధాన్యము వ్యంగ్యముగా వ్యక్తీకరింపబడినది. ఇందలి బృందగీతులు, కవిపాత్రయు కథాగమనమునకు తోడ్పడినవి. నాయిక పువ్వుగాపుట్టి ఆనందించు సందర్భము నందలి-

"హాయి, హాయి
హాయినూయ లూగెదా
తళుకుతో, తావితో, కొమ్మను కొనరెమ్మపై
కులుకుతో బులుపుతో, తేనెసోనలొలుకుతో
హాయి హాయి హాయి :
వలపుతో, వాంఛతో, చివురుగుబురు పరుపుపై
పవళించిన కైపుతో, దవుదవ్వుల చూపుతో
హాయి హాయి హాయి;
హాయి నూయ లూగెదా'' అను పాట పువ్వు ఆనంద జీవితమును లలిత మనోహరముగా ప్రకటించుచున్నది.

**నళినభ్రమరి :**

ఈ నాటికయు శ్రీ రజనీకాంతరావుగారిదే. ఇది ఒక రసార్ద్ర సన్నివేశము భ్రమరుడు-నళిని ఇందలి పాత్రలు.

సూర్యోదయముతో కమల వికసనమును, సూర్యాస్తమయముతో కమల ముకుళమును జరుగునను. కవి సమయమును ఆధారముచేసికొని రచింపబడినది ఈ నాటిక, పువ్వులకును తుమ్మెదలకును ఉన్న నైసర్గికసంబంధమును కవులు ప్రణయముగా చిత్రించుట పరిపాటి. ఈ పరిపాటినికూడ దృష్టియందుంచుకొని ఈ నాటికారచనము జరిగినదని ఊహింపవచ్చును.

ఈ నాటిక రెండుపాత్రలతో నడచు చిన్న సన్నివేశమైనను మిక్కిలి హృద్యము ఇందలి గాలిపిల్లలబృందగీతి రమ్యాతిరమ్యము. వాయుస్వభావ

మును కవితాత్మకముగా వివరించినారు శ్రీరజనిగారు. సంగీత కళాతరంగ ములవలె నున్న విందలి గేయములు.

"మధుకరమే నా మనుగడ, నీ
కనికరమే లేనిచో నిచటె నా
బ్రదుకునకే విరుగడ;"

"చీకటి చెరయైన సరే, నీ
వాకిలి నా కమరపురి;" వంటి పంక్తులు శబ్దార్థమాధుర్యము

నొలికించుచున్నవి.

తాను కష్టములకు కన్నీళ్ళకు గురియగుచున్నను ఇతరులకు మాత్రము ఆనందమునే కలిగింపవలెనను ఒక పరార్థప్రాకులైన సజ్జనుని వ్యక్తిత్వమునకు ప్రతీక ఈ నాటికయందలి వళినిపాత్ర. ఆ పాత్ర సృష్టియే శ్రీరజనిగారు అందించిన సందేశము.

**వచ్చెని ఆమని వచ్చింది :**[1]

నాటికా కర్తలు శ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రిగారు, తెలుగు ఉగాదిని పురస్కరించుకొని రచింపబడిన ఈ నాటికలో వసంతవైభవము వర్ణితము. ఇందలి–

"మనసుతీయనై కలిసిపోయెనే
మాలతి బాలరసాలముతో
మధుర మధురముగ నవ్వసాగెనే
మల్లిక తరుణతమాలముతో" వంటి గేయఖండికలు వాసంత

సౌందర్యమును హృద్యముగా వర్ణించుచున్నవి.

ఈ నాటికలోని–

"భగవంతుడు సృష్టించిన మనిషీ !
పాపం చేస్తావెందుకూ ?

---

1. ఈ నాటిక ప్రతి పూర్తిగా లభ్యముకాలేదు. ఇందలి కొన్నిపాటలను కొన్నిసూచనలను మాత్రమే శ్రీశాస్త్రిగారు నాకు పంపినారు. అందువలన నాటికయందలి కథ పాత్రాది విశేషములను తెలుపలేకపోవుచున్నాను.

చిగురాకుల చిన్నారి బ్రదుకులను
చిదిపి చీల్చుతావెందుకూ ?" అను పంక్తుల ద్వారమున శ్రీ శాస్త్రిగారు మనిషిని మందలించి మనసులో మంచిని పెంచుమని ప్రబోధించినారు.

ఈ నాటిక 2-4-1965 నాడు ఆకాశవాణి విజయవాడ కేంద్రము నుండి ప్రసారమైనది.

**కలువరాణి :**

ఈ నాటికను శ్రీ టి. రామకృష్ణారెడ్డిగారు రచించినారు. కలువకు చంద్రునికి గల ప్రణయబంధమును చిత్రించు ఈ నాటిక మూడు దృశ్యములుగా సాగినది. ఇందలి పాత్రలు- కలువలు, కలువరాణి, చంద్రుడు, యామిని, రోహిణి, పవనము,

ఈ నాటికపై ఆచార్య డా॥ సి. నారాయణరెడ్డిగారి గేయ నాటికల ప్రభావమున్నట్లు తోచుచున్నది. ఈ నాటిక ఇతివృత్తముపై పాత్రసృష్టిపై సన్నివేశకల్పనపై శ్రీ నారాయణరెడ్డిగారి వలపురేడు, వెన్నెలవాడ, ఋతువులరాణి అను గేయనాటికల ప్రభావము సమష్టిగా పడినది. ఇట్లు ప్రభావితులైనను శ్రీ రామకృష్ణారెడ్డిగారు ఈ నాటిక కథానిర్వాహణలోను, రచనలోను తమ ప్రతిభను ప్రదర్శించినారు.

ఈ నాటిక ప్రదర్శనానుకూలము.

**ఋతురాగం :**

శ్రీ జె. బాపురెడ్డిగారి గేయనాటికల సంపుటియందలి నాటిక ఇది. ఋతువులను పాత్రలుగా కల్పించి గేయైకనాటికలు వ్రాయుటలో ప్రథములు డా॥ సి. నారాయణరెడ్డిగారు. వారి "ఋతువులరాణి" లో శిశిర వసంత ఋతువులు రెండు మాత్రమే పాత్రలుగా చిత్రింపబడగా శ్రీ బాపురెడ్డిగారి ఈ నాటికయందు ఆరు ఋతువులును పాత్రలైనవి. అందువలన ఋతువులన్నియును పాత్రలుగా గల్గిన మొదటి నాటిక ఇదియే.

వసంతాది షడృతువులవలన కాలస్వరూపము సమగ్రమగుచున్నది. ఒక్కొక్క ఋతువు ఒక్కొక్క ప్రభావమును ప్రసరించుచు మానవజీవితమునందు ప్రాధాన్యము వహించుచున్నది. ఏ ఒక్క ఋతువుతో ప్రకృతి ప్రగతిజీవ

నము పరిపూర్ణముగాదు. అన్నియును సమానములే. అన్నియును అనివార్యములే. ఈ విషయమునే శ్రీ బాపురెడ్డిగారు ఈ నాటికద్వారమున వ్యక్తము చేసినారు.

వర్షాసుందరి, శరద్బాల. హేమంతకాంత, శిశిరభామిని, వసంతకుమారి, గ్రీష్మరాగిణి, కాలపురుషుడు ఈ నాటికయందలి పాత్రలు.

విభిన్నములైన శక్తులు సమైక్యమై ఏకరూపత దాల్చినపుడే సమాజము సర్వతోముఖముగా అభ్యుదయము ననుసరించునను యాథార్థ్యమును శ్రీ రెడ్డిగారు ఈ నాటికలో వ్యంగ్యముగా హృదయంగమముగా అభివర్ణింపగల్గినారు.

స్త్రీలలో పరస్పరము ఈర్ష్యాసూయలు సహజములేనను అభిప్రాయము లోకమునందు ఏకారణముచేతనో ప్రచారమునందున్నది. సూక్ష్మముగ విచారించి నచో ఇందులో సత్యము లేశముకూడలేదు శ్రీ బాపురెడ్డిగారు సామాన్యాభిప్రాయమును దృష్టియందుంచుకొని ఋతుకాంతలు పరస్పరము దూషించుకొన్నట్లు వర్ణించినను వారందరును కాలపురుషుని హితోక్తికి తలయొగ్గినట్లు చిత్రించి తమ వివేచనాశక్తిని ప్రదర్శించినారు.

ఈ రూపకమందు శ్రీ బాపురెడ్డిగారి ప్రకృతివర్ణనా వైశారద్యము. కవితావేశము పదపదమున ప్రత్యక్షమగును

గ్రీష్మరాగిణి-

"శిరముపై చండరవి
భాండమ్మును వహించి
శివుని ఫాలాగ్నికి
లామాలలు ధరించి" వచ్చినదట. ఈ పంక్తులు శ్రీ రెడ్డిగారి భావనాశక్తికి నిదర్శనములుగా గ్రహింపవచ్చును. మబ్బుపడవలు, శంపాసర్పములు, వెన్నెలకోకలు, మంచుపైటవంటి హృద్యములైన పదబంధము లీనాటికలో చోటుచేసుకొన్నవి.

"పిల్లి పాలు పితుకునంటె
పిల్లలైన నమ్మగలరె?" వంటి సామెతలతో నాటిక సజీవముగా సాగినది.

ఆకాశవాణి హైదరాబాదు కేంద్రమునుండి ప్రసారితమైన ఈ నాటికను విశాఖ వైద్యకళాశాలా విద్యార్థినులు ప్రదర్శించినారు.

**ప్రేమయోగిని :**

నాటికాకర్తలు శ్రీ వేముగంటి నరసింహాచార్యులుగారు. తమ్మి దిన రాజు మధ్యగల ప్రణయమును చిత్రించు ఈ నాటికయందలి పాత్రలు- పద్మిని, ఉషోబాల, తమ్మి, దినరాజు.

తమితో దినరాజుకొరకు రాత్రియంతయు తపించు తమ్మిని 'ప్రేమ యోగిని' గా చిత్రించినారు శ్రీ వేముగంటివారు.



"మల్లెతీగలు పూల
జల్లు కురిసిన రీతి
గొల్లచేడెలు చేరి
చల్లజేసిన ఖ్యాతి" అని తూరుపున తెలవారిన తీరును వర్ణించిన నరణి రమణీయము. మోవిగిన్నెలు, పిలుపువీణెలు వంటి చక్కని పదబంధ ములు ఈ నాటి ను అలంకరించినవి.

**సహజీవనం :**

ఈ నాటికను వ్రాసినవారు శ్రీ ఎం. కె. రాముగారు. నిన్నమొన్న తెలుగుదేశమున బీభత్సమును లేపి ప్రగతిని కుంటుపరచిన ప్రత్యేక ఆంధ్ర రాష్ట్ర, ప్రత్యేక తెలంగాణా రాష్ట్రోద్యమములచే వ్యథితమనస్కులైన శ్రీ రాముగారు తెలుగులకు సమైక్యమును సహజీవనమును ప్రబోధించుచు ప్రత్యేక ముగా ఈ నాటికను రచించినారు: ఇందలి పాత్రలు- కమలములు, సూర్యుడు, కలువలు, చంద్రుడు.

కమలములు పగటివేళ వికసించినను, కలువలు రాత్రివేళ వికసించినను ఈ రెంటి ఉనికికి నీరే ఆధారము ఆ నీరు లేనప్పుడు రెంటికిని బాధలు తప్పవు. ఈ ప్రకృతిసత్యమును వేర్పాటు ఉద్యమములకు పులిమి శ్రీరాముగారు భంగ్యంతరముగా సమైక్యప్రబోధమును చేసినారు

రాత్రివేళ చంద్రునితోడి కలువల సుఖజీవనము చూడవోల్లని కమల ములు వానిని కొలనునుండి వెడలగొట్టవలెనని తమ ప్రియుడైన సూర్యుని

కోరును. సూర్యుడువానికి సమతను బోధించినను వినకపోవుటతో తానిచ్చిన మాట ప్రకారము గ్రీష్మములో కొలనులోని నీటి నింకిపం జేయును. తత్ఫలిత ముగా కలువలతోపాటు కమలములును వెలవెలబోయి తమ అపరాధమును మన్నించి రక్షించవలసినదని సూర్యుని వేడుకొనును. ఆతడు కరుణించి వానికి సహజీవనమును బోధించి వాని కన్నులు తెరిపించును. తరువాత కమలములు కలువలతోకలసి సహజీవనానందమున మురిసియాడును. ఇది ఈ నాటికయందలి ఇతివృత్తము.

ఈ నాటికయందలి గేయములు మృదుమధురములై నృత్యానుకూల ముగా పరుగుదీసినవి.

సూర్యుడు పలికిన-

"అనంగమూర్తినే వలపుతాపమ్మువ
ముంచివేగించినావు" అను మాటలు,

చంద్రుడు పలికిన-

"ఓ చవులూరు చలువల కలువా!
నీ తళుకుల కపోలపాళిపై
వలపు గీతుల వరుసలు కూర్చనా' అను మాటలును సరసభావ సంపన్నములు.

ఈ నాటిక ప్రదర్శనా విజయమును సాధించినది.

**గడ్డిపువ్వు :**

శ్రీ వడ్డెపల్లి కృష్ణగారు 'వెలుగుమేడ' అను గేయ నాటికల సంపుటి నొకదానిని ప్రచురించినారు. అందలి మొదటి నాటిక 'గడ్డిపువ్వు' తుమ్మెద, కలువ, సంపెంగ, మల్లె, మందారం, సన్నజాజి, విరజాజి, గులాబి, గడ్డిపువ్వు ఇందలి పాత్రలు.

కలువ, సంపెంగ, మల్లె, మందారం, సన్నజాజి, విరజాజి, గులాబి పూలచే తిరస్కరింపబడిన తుమ్మెదను గడ్డిపువ్వు అనురాగముతో ఆత్మీయతతో ఆహ్వానించుటయు, గతములో అహంకారముతో గడ్డిపువ్వు నిర్మల ప్రేమను

తృణీకరించినందులకు తుమ్మెద పశ్చాత్తాపపడి గడిపువ్వును పరరాణిగా చేసి కొనుటయు ఈ నాటికయందలి ఇతివృత్తము.

కులవర్గాదుల కంటె గుణము ప్రధానమనియు, బాహ్యమైన శారీరక సౌందర్యముకన్న అంతరమైన ఆత్మసౌందర్యము మిన్నయని ఈ నాటిక సందేశ మిచ్చుచున్నది. ఇందలి రచన సరళము

**ప్రణయోద్వేలము :**

ఈ నాటికయు శ్రీ వడ్డెపల్లి కృష్ణగారిదే. సూర్యుడు కలువను, చంద్రుడు కమలమును కామించుటయను విపరీత ప్రణయము ఈ నాటికయందు చిత్రితము. సూర్యుడు, కమలము కలువ, చంద్రుడు, కవి- ఇందలి పాత్రలు వెల వెల అమావాస్యనాడు చంద్రుడు సూర్యుని కలయుచుండునను సంప్రదాయము ఈ నాటికాకల్పనకు అవకాశమిచ్చినది.

"హద్దులు మీరక
బుద్ధులు వీడక
అంతా మసలిన
ఎంతో క్షేమం
లేకుంటే, చెల
రేగును ధూమం!'' అను 'కవి' మాటలే ఈ నాటికాసందేశము

**పూలకన్నెలు :**

నాటికాకర్తలు శ్రీవడ్డెపల్లి కృష్ణగారే. పూలహృదయమును చిత్రించు ఈ నాటికయందలి పాత్రలు- రకరకములగు పూలు, గులాబి, యువకుడు, తోటమాలి, పూజారి.

ఆనందప్రాప్తికై పూజార్థమై పూలను తెంపబోవు ఒక యువకుని బారి నుండి ఒక పూజారి బారినుండి రక్షించి తోటమాలి పూలకు ఆనందము కల్గించుట ఈ నాటికయందలి కథాంశము.

ఈ నాటికయందలి-

"ఆగుమాగుము ఓయి పూజారీ !
కోయబోకుము పూల చేజారీ !

తిలకించగా నీవు అర్చకుడివే
గమనించగా పుష్పహంతకుడివే"
"ఈ పూల నీ విధిని హింసించగా
ఏరీతి దైవమ్ము సహియించునో ?
మూఢత్వమునువీడి మేలుకో !
వేడుకో లోలోన భక్తితో !'' వంటి పంక్తులు హృదయంగమములై సందేశగంధమును గుబాళించుచున్నవి.

'కరుణశ్రీ' శ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రిగారి 'పుష్పవిలాపము' అను ప్రసిద్ధకవితా ఖండికచే ప్రభావితులై శ్రీ కృష్ణగారు ఈ నాటికను వ్రాసినారని ఊహించుట కవకాశమున్నది. నాటికయందలి పూలమాటలు కూడ ఈ ఊహను బలపరచుచున్నవి.

**కవికళ్యాణం :**

ఈ నాటిక కూడ శ్రీ వడ్డెపల్లి కృష్ణగారిదే. షడృతువులందలి ప్రకృతి విలాస విశేషములను చిత్రించు ఈ నాటికయందలి పాత్రలు - కవి, ప్రకృతి కాంత, ఆరుగురు ఋతుకన్యలు.

మానవకాంతలను వివాహమాడుటకు మనసొప్పని ఒక కవి కవితాగానమునకు ముగ్ధురాలైన ప్రకృతికాంత తన సంతానమైన ఆరుగురు ఋతుకన్యలను చూపి వానిలో ఇచ్చవచ్చిన కన్యను వివాహమాడుమని చెప్పగా కవి వసంతశరత్కన్యలను పరిణయమాడుట ఈ నాటికయందలి ఇతివృత్తము.

ప్రవహించు ఝరులను ప్రకృతికాంతయొక్క 'పదముల పారాణిగ' వర్ణించుట హృద్యముగానున్నది

ఈ నాటికపై శ్రీ జె బాపురెడ్డిగారి 'ఋతురాగం' అను నాటికా ప్రభావము నిండుగ ప్రసరించినది పాత్ర కల్పనములోను, పాత్రప్రవేశ క్రమములోను, అంతరమైన భావసరణిలోను గల సామ్యము లందుకు సాక్ష్యములు. అయినను శ్రీ వడ్డెపల్లి కృష్ణగారు కథను ప్రతిభావంతముగా కల్పనాసుందరముగా నిర్మించి ఈ కవి కల్యాణమును సంతరించినారు.

# ప్రబోధాత్మకములు

## (పద్యగేయవచన మిశ్రనాటికలు)

**మరోప్రపంచం :**

గేయ- వచన- వచనకవితామయమైన ఈ నాటిక శ్రీ శ్రీ గారి 'రేడియో నాటికల' లో ఒకటి.

సామాన్యమానవుని సమగ్రాభ్యుదయమును యువచైతన్యమును ప్రబోధించెడు—

"మరో ప్రపంచం
మరో ప్రపంచం
మరో ప్రపంచం పిలిచింది" అను గేయమునకు వ్యాఖ్యాన ప్రాయము ఈ నాటిక.

యువతీయువకులు, వృద్ధులు, ఇరవైఒకటవ శతాబ్దపు మానవుడు (కనుపాప) ఈ నాటికయందలి పాత్రలు.

ఈ నాటికయందలి యువతీయువకులు ఆశావాదనమునకు, భావ్యభ్యుదయ చైతన్యమునకు, వృద్ధులు "ఎముకలు కుళ్ళిన వయస్సు మళ్ళిన సోమరు"ల థోరణికని గతమును తప్ప భావిని చూడలేని నిరాశావాదమునకును, ఇరవైఒకటవ శతాబ్దపు మానవుడు శ్రీశ్రీగారు ఆశించిన భావి మానవసమాజమునకును ప్రతీకలు.

ఈ నాటికయందు సమకాలిక సమాజ వివిధ రంగముల దుఃస్థితి ఎత్తి చూపబడినది. ధనప్రాబల్యము, 'బ్లాకుమార్కెట్టు' స్తంభీభూతకవి లోకము, 'కుహనాప్రవక్తల' దంభసన్యాసుల అసత్యమార్గాలు గర్హింపబడినవి ఈ రూపకము ద్వారమున శ్రీశ్రీగారు అభ్యుదయాంకితమైన మరో ప్రపంచమునకు కదలుడని యువలోకమునకు నవప్రబోధముచేసినారు.

**చరిత్ర చెప్పని సందేశం :**

గేయవచనమయమైన ఈ నాటికకూడ శ్రీశ్రీగారిదే వారు తమ—

చేపట్టినందుకు వనకు సంతోషము కలిగినదనిచెప్పి 'ఆత్మ' విచారమును దూరము చేయును. ఇది ఈ నాటికయందలి కథాంశము.

ఈ నాటిక ఆద్యంతములందు బృందగానము ప్రయుక్తమైనది.

"నేను కృష్ణానదిని నిఖిలాంధ్రదేశాన
కొండకోనలు దూకి పండింతుబంగారు
గలగలా నడిచెదను కిలకిలా నవ్వెదను
బ్రతుకుబాటలపూలు పరచిపాడెదను" అను పాట కమ్మగా గల

గలా కదలినది

**మనిషి - యంత్రం :**

ఆచార్య డా॥ సి నారాయణరెడ్డిగారు రచించిన నాటిక ఇది. వారి గేయ నాటికలన్నింటిలో వచన కవిత కలసిన ఒకే ఒక్క నాటిక ఈ 'మనిషి-యంత్రం.' మిగిలినవన్నియు గేయైకములు లేదా గేయవచన మిశ్రితములు. ఈ నాటిక ఆకాశవాణి హైదరాబాదు కేంద్రము నుండి ప్రసారితమైనది.

మనిషి యంత్రమునకు బానిస కాకూడదని ప్రబోధించుచున్నది ఈ నాటిక. ఇందలి పాత్రలు-పక్షులు-మానవుడు-యంత్రము- పుష్పము.

తనను బానిసగా భావించిన మానవునిపై యంత్రము దాడివెడలి తనకు అడ్డువచ్చిన పుష్పమును నలిపివేయగా మానవుడు నిస్సహాయుడై నిలిచిపోయిన విషాదగాథ ఈ నాటికేతివృత్తము.

నాటికాద్యంతములందు వినిపించు పక్షులగానము రూపకకథాపరిణామమును సూచించుచు సందేశమును కవితామయముగా వ్యాఖ్యానించుచున్నది.

"యంత్రం ఒక మదపుటేనుగైతే
నీవు మావటీడువు కావాలి
యంత్రం ఒక వారిధియైపోతే
నీవొక వారధివై నిల్వాలి
అణుగోళమ్ములను పిండి
అమృతం ఒలికించాలి

కర్మాగారమ్ములందు
కళలను పలికించాలి
పూలలోని అమాయికత
ఆలంబము కావాలి
అమృతాంశుని త్యాగశీల
మాదర్శము కావాలి" అను పంక్తులు సందేశగర్భితములు.

ఈ నాటిక కవితాత్మకముగా సాగినది.

**అవిముక్తము** :

నాటికా నిర్మాతలు ఆచార్య డా॥ యస్వీ జోగారావుగారు. ప్రజ్ఞాత శేముషీ సంపన్నులగుదురు. కవిత్వతత్త్వవేదులకును రసికభావవిదులకును అనుభవ యోగ్యమయినది ఈ గేయనాటిక. మనస్సు, కాలము, స్వప్నము, ఊహా, ప్రణయము, కవిత్వము మున్నగు విషయములిందు పాత్రలు. ఆయా పాత్రలను ప్రతీకాత్మముగా కల్పనచేయుటలో ఆచార్య డా॥ యస్వీ జోగారావుగారు తమ కవితాశక్తిని పాండితీదీప్తిని ప్రదర్శించినారు. ఈ నాటికయందలి పాత్రలు- కవి కంకాళము మనఃకాంత, సంధ్యాదేవి. భగ్నమైన కవి మనసు నుండి బయల్వెడలిన ఊహావిహంగము, ఊహామృగము, స్వప్నాశ్వము, ప్రణయ దేవత, కవితాధ్వజము.

ఈ నాటికకు వేదిక శ్మశానము. కాలగర్భములో కలసిపోయిన కవి, కంకాళము రూపములో సాక్షాత్కరించును. ఈ కవిపాత్రయును ఇతర పాత్రలును కవితాతత్త్వమును ఉద్ఘోషించును కవిత్వమొక అనుభూతియనియును, కవిజనన మరణములతో దానికి సంబంధములేదనియు, అనుభూతి సాంతత్యమే కవితా పారమ్యమనియును, కవిమనోలోకము అనుభూతి జన్యమనియును, ఆ అనుభూతి నిరంతరము పరాత్పరుని సాక్షాత్కృతికి తపించుచుండుననియును డా॥ జోగా రావుగారు వివిధ పాత్రలచేత ప్రతిపాదించినారు జీవితమునకు శ్మశానమే అంతిమ దశయని ప్రజలు భావింతురు. కాని ఆ శ్మశానము కవితామరత్వమును ప్రకటించు వేదికగా కల్పించుటలో నాటికాకర్త విశిష్టమైన వైచిత్రిని కనబరచి యున్నారు. నాటికాంతమున—

"మరణము కాదు కాదు
జీవిత పరమావధి

మనోలయము !
మరణము కాదు కాదపవర్గమార్గ
పరమావధి
మనోలయము ! మనోలయము !'' అని శ్రీ జోగారావుగారు కవితా ప్రపంచము మనోజన్యమను యాథార్థ్యమును ప్రవచించినారు. కవి జీవితము లోకమునుండి విముక్తిచెందినను అతని సృష్టి-కవితాసృష్టి లోకానుభూతి నుండి విముక్తము కానేరదు. ఈ సత్యమునే నాటికకు శీర్షికగా నుంచి డా॥ జోగారావుగారు ధ్వన్యనుప్రాణితముగా కవిత్వము పట్ల తమకుగల అభిప్రాయమును సువ్యక్తపరచినారు.

కవితకు మృతిలేదు. అనగా అనుభూతికి మృతిలేదు. అనగా మనస్సునకే మృతిలేదు. ఆ మనస్సునందు లయించుటే కవితాలక్ష్యము. ఈ కవితాతత్త్వ విచారమును సుందరమైన పదములతో వచనగేయస్ఫూర్తితో డా॥ జోగారావుగారు వివరించినారు. నిజమునకు ఇందు కవిజీవితము కావ్యజీవితము ధ్వనిమార్గమున పయనించినవి.

కవిత్వము పురాజన్మ సంస్కార సంలబ్ధమైనదను ఆలంకారికుల అభిప్రాయమును ఈ దిగువ పంక్తులలో వ్యక్తపరచినారు శ్రీ జోగారావుగారు.

"ఎన్ని జన్మల సంస్కార
బలము కారణమొ
సన్నిహితం బీ జన్మకు
సాహిత్యము నా యెదకు.''

సాహిత్య స్వరూప స్వభావములను, ఉత్పత్తిహేతువులను, ప్రయోజనమును, లక్ష్యమును ఉద్ఘోషించుచు తమసాహిత్యశాస్త్రాధ్యయన సంజనిత సంస్కారమును ఋజువుచేయుచునే డా॥ జోగారావుగారు అశ్రుతపూర్వభావముల నిట్లు వ్యక్తపరచినారు.

"సత్యము సత్యము సాహిత్యములో
కలలు ఫలించును
కలలో పలవించిన నా మనసున
వికసించెను సాహిత్యము

నా బ్రదుకే భగవంతుని కల
నా మనసే యతని కవిత."

దండి-భామహ-అభినవగుప్త-ఆనందవర్ధనాదులైన సాహిత్యశాస్త్రవేత్తల సిద్ధాంతములకు ప్రతీకగా తమ కావ్యార్థమును నిర్మించిన ప్రతిభామూర్తులు శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారికి ఈ నాటికను అంకితమిచ్చి డా॥ జోగా రావుగారు ఔచిత్యమును ప్రదర్శించినారు. నిజమునకు ఈ నాటికయందలి భావములకును విశ్వనాథవారి కవితా తపస్సునకును సాదృశ్యమున్నదనుటలో అత్యుక్తిలేదు.

**అంధంతమః :**

శ్రీ సూరంపూడి భాస్కరరావుగారు ఈ నాటికను రచించినారు. వచన బహుళమైన ఈ నాటికలో ఐదు పాటలున్నవి.

లోకమునందలి అంధతమస్సును బంధురజ్యోతిస్సును పరిచయముచేయుచు ఈ రూపకము సమస్త లోకము శాంతిసౌఖ్యసాధనకై కృషిచేయవలయునని ప్రబోధించుచున్నది. నరుడు, దేవి బాలబాలికలు, కన్యలు, యువతీయువకులు, సేనానాయకుడు, సేన, జనులు మహారాజు, సేనాధిపతులు ఈ నాటికలోని పాత్రలు.

ఈ నాటిక సమాజమందలి భిన్నభిన్న చేతనానంద వ్యక్తులను, అధికార దాహచిత్తులను, హింసాప్రవృత్తులను, అసమానతాపీడిత ప్రజాదుఃస్థితులను ప్రతిబింబింపజేయుచునే మానవతా శక్తులైన శాంత్యహింసా సౌజన్యములను ఉద్ధరింపవలయునను సందేశమును వ్యంగ్యముగా వ్యక్తము సేయుచున్నది.

**భూమిదానం :**

గేయవచనమయమైన ఈ నాటికను రచించినవారు శ్రీ మల్లవరపు విశ్వేశ్వరరావుగారు. మూడు దృశ్యములుగా సాగిన ఈ నాటిక యందలి పాత్రలు- హేమంతయ్య, నౌకరు, దివాన్జీ, భూపాలయ్య, పాలేరు. కుట్టివాడు (వెట్టి), వసంతకుమార్ (గ్రీష్మకిశోర్), రైతులు.

గ్రీష్మకిశోర్ అను ఒక జమీందారు కొడుకు తండ్రి సమ్మతితో ఉగాది సందర్భముగా ఉదారముగా తనభూమిని రైతులకు పంచి 'దున్నేవానిదే భూమి' అను సిద్ధాంతమును నిరూపించుట ఈ నాటికయందలి ఇతివృత్తము.

ఈ రూపకమందలి ఆరుపాటలలో—

"చిగురించిన చెట్టెవరిది ?
నగవొలికే పూలెవరివి ?
పండిరాలు ఫలమెవరిది ?
తోటమాలివానిదా ?
తోటకు అధికారిదా ?
పూచికాచు పైరెవరిది ?
పైరుపండు భూమెవరిది ?
భూమిదున్ను దుక్కెవరిది ?
పాటుపడే కాపుదా ?
మేటి జమీందారుదా ?" అను పాట చెమటోడ్చు శ్రామికులకు బంగారుపీట వేయుచున్నది.

## చైతన్యతరంగం :

నాటికాకర్తలు డా॥ వేటూరి ఆనందమూర్తిగారు. కవి, సమీరుడు, వాహిని, శిల ఈ రూపకమందలి పాత్రలు.

ప్రణయరాహిత్యము జడత్వము; ప్రణయము ఉభయనిష్ఠము అను తత్త్వములను ఈ నాటిక భంగ్యంతరముగా ప్రతిపాదించుచున్నది.

ఈ నాటికయందలి 'వాహిని' పాత్ర చైతన్యమునకును, శిలపాత్ర జడతకును ప్రతీకలు శక్తిమతీ కోలాహలుల, పార్వతీ పరమేశ్వరుల ప్రణయకథాచ్ఛాయలు ఈ నాటికలో కనిపించుచున్నవి.

ఈ నాటికయందలి మూడు పాటలలోను—

"గుండెరాయిగ కొండరాయిగ
ఉండినానే కోమలీ !
దండిమమతలు నిండుమనసులు
మెండుకొనె నేడేచెలీ !
తలపు లెరుగక తనువుకరుగక
మెలగినానే కోమలీ !

వెంపుతంపులు గనుపుట్టకలు
అటముకొనె నేడే చెలీ!" అను పాట హృద్యము.

**గొడ్లకు లేవాల :**

గేయవచనాత్మకమైన ఈ నాటికను శ్రీ దేవీప్రియగారు రచించినారు.

దోపిడికి మూలమైన భూస్వామ్యవ్యవస్థను నిర్మూలించవలెనని ఈ నాటిక ప్రబోధించుచున్నది

సత్తెయ్య, శివంగి, ఎర్రమనుషులు (ఇద్దరు), జాంచ, గుండా, భూస్వామి (పెద్దదొర) ఈ 'నృత్య సంగీతరూపకము' సందలి పాత్రలు.

ఈ నాటికలోని చెట్టు భూస్వామ్యవ్యవస్థకును, సత్తెయ్య పీడిత, గ్రామిక జనావళికిని ప్రతీకలు.

ఉర్దూ, ఇంగ్లీషు పదాలు కలసిన జానపదుల పదప్రయోగము ఈ నాటికకు శోభను కలిగించినది. ఇందలి పాటలలో 'సూరీడు' గీతము శ్రీ సుగమ్‌బాబు గారిదైనట్టు రచయిత పేర్కొన్నారు.

"ఈ రచనకు చైనా విప్లవసాహిత్యంలో ఒక ప్రత్యేకతను సంపాదించుకొన్న **'Fisherman's revenge'** అనే **Peking opera** కొంతవరకు **inspiration"** అని నాటికాకర్తలు శ్రీ దేవీప్రియగారే తెలిపినారు.

"దొంగగొడ్డుకు గంగ్రగొడ్డలి
తప్పు మందికలేదు లేదు
కుత్తుకలు తెగగోయకుంటె
కాట్లకుక్కల మార్పురాదు
దియిటీలు ఎలగాల
గొడ్లల్లు లేవాల
గొడ్డుచాకిరిపీడ
జాంచబతుకుల చీడ
ఇరగ దై పోవాల" వంటి చరణములు నాటికా ప్రబోధమును సార్థకరించుకొన్నవి.

**ఆరనిజ్వాల :**

గేయవచనమయమైన ఈ నాటికను రచించినవారు శ్రీ పటుకూరి ప్రసాద్‌గారు. ఈ నాటిక పలుమార్లు ప్రదర్శింపబడినది.

నిరాశావాది. అతివాదులు (ఇద్దరు), అభ్యుదయవాది, కొందరు ప్రదర్శకులు ఈ రూపకమందలి పాత్రలు

సంఘ పురోభివృద్ధిని కుంటుపరచుచున్న ఆర్థిక వైషమ్యములను రూపుమాపుటకు ప్రారంభింపబడిన కొన్ని ఉద్యమాల స్వరూప స్వభావాలు ఈ నాటికలో అభివర్ణితములు.

"ఈ జ్వాల ఆరేదిలేదురా
ఉజ్జ్వల జగత్తుగా మారునందాక
ఈ జ్వాల ఆరేదిలేదురా
ఎందరో త్యాగాల బత్తులందించారు
ఎందరో రక్తాన్ని చిందించి నిలిపారు
కణం కణం రగులుతూ
కణం క్షణం పెరుగుతూ
లోకాల చీకట్లు పోకార్చునందాక
వర్గాలు లేని అపమార్గాలు కవరాని
స్వర్గాలు భువికొచ్చి ప్రజలకందేదాక" అను గేయము ఈ నాటికా ప్రబోధమును సువ్యక్తపరచుచున్నది.

**జనశ్రేణి కదిలింది :**

సామ్యవాద సమాజ స్థాపనను ప్రబోధించు ఈ నాటికను రచించినవారు శ్రీ కె రాజేశ్వరరావుగారు. గేయవచన మిశ్రితమైన ఈ 'నృత్యనాటిక' యందలి పాత్రలు - రైతు, భూస్వామి, కార్మికుడు, నిరుద్యోగి, రైతుకూతురు, ధాన్యలక్ష్మి, వ్యాపారి.

ఈ నాటికలో వ్యాఖ్యాత అక్కడక్కడ కథా వ్యాఖ్యానమును సాగించును.

"ఈ దేశం కాదిప్పుడు
అన్నపూర్ణ పుట్టినిల్లు
దారిద్ర్యం తాండవించు
దౌర్భాగ్యమువల్ల కాదు" వంటి పంక్తులు సమాజ దుఃస్థితిని చూచిన ఈ నాటికాకర్త ఆవేదనకు ప్రతిబింబము

## (పద్యగేయ నాటికలు)

**మహోదయం :**

తెలుగు ప్రజల సమైక్యమును ప్రబోధించు ఈ గేయరూపకమును రచించిన వారు శ్రీ చెరుకుపల్లి జమదగ్ని శర్మగారు గోదావరిసీమ, కృష్ణాసీమ, పెన్నా సీమ, తుంగభద్రాసీమ, మంజీరాసీమ, అర్ణవఘోష, ఆకాశవాణి ఈ 'నేపథ్య గేయరూపకము' నందలి పాత్రలు.

గోదావరిసీమ, కృష్ణాసీమ, పెన్నా సీమ, తుంగభద్రాసీమ, మంజీరాసీమ తమ తమ ప్రాంతముల గొప్పతనమును చాటుకొనుచు మితిమీరిన అభిమాన మును, ప్రశుతిమించిన ప్రాంతీయతను ప్రకటించుకొనును. కాని అనైక్యభావ మును గని అర్ణవఘోష బాధపడుచు 'ఝురుల వేర గిరులుగీసి ధరణిని' ప్రక్కలు చేయవద్దని వానికి ప్రబోధించును. ఒకవేళ తన 'మురళి' 'ఘోష' ముచ్చటగా లేకున్నచో 'మిసిమివన్నె'ల ఆకాశవాణి మాటలనైనను ఆలకింపు డని ఆ సీమలను కోరును. అపుడు ఆకాశవాణి వానికి 'వ్యక్తిగత రాజసము'ను విడిచి ఒకరి కౌగిలిలో మరొకరు పరవశించవలెనని సమైక్యమును ప్రబోధిం చును. ఆ ప్రబోధము నాలకించి ఆ సీమలన్నియు ఐకకంఠ్యమును ప్రకటించును. చాలనాళ్లకు వానిలో ఐక్యమహోదయమైనందుకు ఆకాశవాణి ఆనందించును. ఇది ఈ నాటికయందలి ఇతివృత్తము.

ఈ నాటికయందలి 'నాంది'లోని "ఆంధ్రజనతా మహోదయమూ" అను గేయమును శ్రీ మానాప్రగడ శేషశాయిగారు రచించినట్లు శ్రీ శర్మగారు తమ 'మనవి'లో తెలిపినారు. 'నాంది' తరువాత 'స్థాపన' [illegible] నాటికలో చోటు చేసికొన్నది 'స్థాపన' లో—'ఇమ్ముగ కాకుళమ్ము[illegible] న శ్రీ [illegible]నాథ వారి 'ఆంధ్ర ప్రశస్తి'యందలి పద్యమును, 'తుంగ[illegible]సీమ'లో—[illegible]గా

సంగమ మిచ్చగించునె' అను పద్యమును ('కొంచెం మార్పుతో') ఉటంకింప బడుట ఔచిత్యమును అభివ్యక్తము సేయుచున్నది.

ఉత్పల శార్దూల వృత్తములు, సీసము, తేటగీతు లీనాటికలో ప్రయుక్తములు. గేయములన్నియు కవితావేశముతో కదను త్రొక్కినవి.

"ప్రౌఢాంధ్రకవిలోక పోషకపయఃపూర !
గాఢధిషణాధాన పుష్కలసుధాధార !
విజయిష్ణు వీరాంధ్ర విభవహేతుకసార !
విజయవాటీ కనకదుర్గా పదోదార !" వంటి కృష్ణవేణీ

స్తుత్యాత్మక గేయ పంక్తులును—

"వైరివీరహృదయాలు తూటుగా
దూరులేయు నిశితాస్త్ర జాలమటు
భంగసంఘ నిర్ఘోష మొప్పగా
రింగురింగుమని దూసిపోయెదవు
పాకినోజ్జ్వలనేత్రా !

గాఢాంభోమయగాత్రా !" వంటి తుంగభద్రా ప్రశంసా పరమైన చరణములును శ్రీ జమదగ్ని శర్మగారి ప్రతిభాపాండిత్యములను చవి చూపుచున్నవి. ఆకాశవాణి ఘోషించిన—

"ఆకాశమున లేదు, అర్ణవమ్మున లేదు
అవనిలోనే కలదు సీమావిభాగమ్ము
అవని రసమయమయితె అందులోనూ తొలగు
ఆ కొద్దివేర్పాటు కూడా
మిమ్ము మీరెఱుగుటకే మీకు వ్యక్తిత్వమ్ము
తత్త్వమ్ములో లేదు భేదం
మితిమీఱితే అదియె భేదం !"

"………సర్వాంధ్ర
వాహినుల్ బాహువుల్ సాచి
వ్యక్తిగత రాజసము విడిచి
కౌగిళ్ళలో పారవశ్యమ్ము పొందాలి

లోగిళ్లలో దివ్యజీవనము నింపాలి
అపుడు కాదే తెలుగువెలుగూ
విపుల విశ్వము నిండి వెలుగూ!" అను పంక్తులు ప్రబోధ గర్భితములు.

**సాక్షాత్కారం :**

ఆచార్య డా॥ యస్వీ. జోగారావుగారు ఈ నాటికను రచించినారు. ఒక రమణీయ కల్పనకు అక్షరరూపము ఈ రూపకము. ఇందలి పాత్రలు - కవి, శిల్పి ఊహాసుందరి, (ఆకాశవాణి).

ఒక కవికిని ఒక శిల్పికిని స్వప్నమునందు ఒక ఊహాసుందరి కనిపింపగా వారామెను ప్రియురాలుగా భావించి సమాహ్వానింతురు. కాని ఆమె తాను ఆత్మవనియును, కళలందును ఊహాలందును మాత్రమే సాక్షాత్కరింతుననియును, దేహములకు అతీతముగా నుండుటలోనే తన సార్థకత ఉన్నదనియు చెప్పి అంతర్ధానమగును ఇది ఈ నాటికయందలి ఇతివృత్తము

ఈ రూపకమందలి గేయములు పద్యములు మధురమంజులములు. 'శిల్పి' పాత్రకు గేయములు మాత్రమే ప్రయోగించి, 'కవి' నోట గేయములతో పాటు పద్యములను కూడ పలికించుట రచనాశిల్పమందలి ఒక వైలక్షణ్యము. ఇందలి 'ఆకాశవాణి' పాత్ర కథా వ్యాఖ్యానమునకును సన్నివేశ పరిచయమునకును ప్రయుక్తమై నాటికకు రమ్యతనాపాదించినది. ఆ పాత్ర పలికిన మాటలు కవితాసుందరములై రూపకమునకు కల్పనా సౌందర్యమును కలిగించినవి.

శిల్పసుందరి చూపును వర్ణించెడు—

"ఆ చపలాయతాక్షి మధురాధరచారుకపోలమధ్య రే
ఖా చతురస్మితావధి దృగంచలచంచల కజ్జలాక్తల
జ్జాచణమైన చూపు పరసప్రతికార సమర్థమార్గనా
రాచము భంగి నెట్టయెదురై చను నాయెద గాడి పారెడిన్"

అను పద్యము కవి పాత్రకు సముచితమై ఆచార్య జోగారావుగారి ప్రతిభా పాండిత్యములను ప్రతిబింబింప జేయుచున్నది.

శిల్పి కవులు ఊహాసుందరిని వర్ణించిన సందర్భమునందలి—

"నా ఆశాకాశములో
వికసించిన రాకాశశి"
"నా కలయే మరి నలువకు రాగా
నాకమునుండి సరాసరి
నాకై వచ్చిన నారీమణి యిది!" అను చరణములు హృదయంగమములు.

"లోకమన్నదిలోపపంకిల
మూహయన్నది మోహజనకము
ఊహ లోకపుటుచ్చు దగిలిన
లోపములకది లోకువగును" వంటి పంక్తులు సందేశసంవాసిత ములు.

శ్రవ్యముగాను దృశ్యముగాను ఈ నాటిక ఆస్వాదనీయము.

**శాంతిపథము :**

నాటికాకర్తలు శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావుగారు. నరుడు, నారి, స్త్రీ బృందం. పురుష బృందం ఈ నాటికయందలి పాత్రలు. ఇందులో ప్రత్యేకమైన కథ అనునదేమియులేదు. ఇందలి 'నరుడు' 'పురుషోత్తముడు' గాను 'నారాయణాపరదైవము'గాను, 'యుగధర్మముల ప్రవర్త'గను, 'నారి' 'ధరాతరుణి'గాను, 'సనాతన ప్రకృతి'గను పేర్కొనబడినారు.

"వెలుగుచీకటులటు, విశ్వప్రకృతియందు
మంచిచెడుగు లనుభవించు నరుడు
చెడుగు మరపుతెరల అడుగున బడవైచి
మంచివైపు చనుట మాన్యపథము"
"ద్వేషముడిపి రాగమొందజేయునెదో
అదే, అదే శాంతిపథం!
శోకముడుగ సౌఖ్యమందజేయునెదో
అదే, అదే శాంతిపథం" అను పలుకులే ఈ నాటిక అందించు విశ్వజనీన సందేశము.

ఈ నాటికలో కందములు, ఆటవెలదులు చోటుచేసికొన్నవి. గేయము లన్నియు లలితపదసంఘటితములై రమ్యభావసము పేతములై అంత్యప్రాసలతో అందగించుచున్నవి. ఉదాహరణకు—

"గిరగిర తిరిగే భూగోళం !
ఇరులు వెలుతురూ సమపాళం !
ఏది ఆదియో ఏది అంతమో
ఎరుకకందదే యీ ప్రకృతి !
సగము వెలుతురై సగము చీకటై
జగతిసాగునే తన ప్రగతి !
గతమునిరులలో కలిపివేసి, ఆ
గతములోని వెలుగానచేసి, ప్ర
స్తుతము పవలురే వెలుగు చీకటుల
అతికికొంచు పయనించు నీ జగతి !" అను బృందగానమును పేర్కొనవచ్చును.

**కవ్యాకుమారి :**

శ్రీ నోరి నరసింహశాస్త్రిగారి నాటిక ఇది. "గంగానదీజలము కావేరి జలములతో కలుపుటకు ఉద్దేశించినట్లు పత్రికలలో చదివిన 1957లో దీనిని ప్రారంభించి, అది సాధ్యమని నిర్ధారణ చేసినట్లు ప్రకటించిన 1972లో ఈ రచన పూర్తిచేయబడినది" అని శ్రీ శాస్త్రిగారే ఈ నాటికకు ముందు తెలపియున్నారు. రెండు భాగములుగా సాగిన ఈ సంవాదాత్మక నాటికలోని పాత్రలు— పాంథుడు, కుమారి.

ఈ నాటికయందలి కుమారి పాత్ర కావేరినదికి సంకేతముగను, పాంథుని పాత్ర సమైక్యభారతాదర్శమునకు సంకేతముగను ఊహించుటకు అవకాశ మున్నది.

ఈ నాటికయందలి వర్ణనలు రమ్యములు.

"ఎంత బేలవు కన్య
ఇటులోడగ నీవు

శివుడనైతే గంగ
శిరమందు పొంగదా
గళసీమ మెరయదా
గరళనీలాంకంబు
వామార్ధభాగమున
భామ వెలుగొందదా
హరినైన పాదమున
పరువెత్తదా గంగ
హృదయమున శ్రీదేవి
పదపీఠముండదా
సిగయందు బహువర్ణ
శిఖిపింఛమాడదా" వంటి పంక్తులు హృద్యములు.

"నెమ్మికటు తనువెల్ల
నిండినవి నీ కనులు
మిలమిలని మెరసెడిని
మీలవలె నీ కనులు
నిర్నిమేషంబులై
నిలిచినవి నీ కనులు
మృగియతులటు ముఖము
మీరినవి నీ కనులు
గిరి కన్యవో-నీవు-జలకన్యవో
సురకన్యవో-కాక-వనకన్యవో" అను కుమారి కన్నుల వర్ణన క్రమాలంకారభాసురము.

ఈ నాటికలో ఖండగతిలో కదలిన గేయములు, తేట గీతులు, ఆటవెలదులు, కందములు ప్రయుక్తములైనవి. ఇందు పాంథుని పాత్రకు గేయమును, కుమారి పాత్రకు పద్యములను ప్రయోగించి, చిట్టచివరకు ఒక కందమును రెండు సంస్కృత శ్లోకములను పాంథునినోట పలికించినారు శ్రీ శాస్త్రిగారు. గంగా స్తుత్యాత్మక సంస్కృత శ్లోకములతో నాటికను ముగించుట శుభాంతసూచకము.

## (గేయనాటికలు)

**బుద్ధుడు - కాపుపడతి :**

పరమధర్మమైన అహింసను ప్రబోధించు ఈ నాటికను రచించినవారు శ్రీ దువ్వూరి సూర్యనారాయణ మూర్తిగారు. ముత్యాలసరములలో నడచినది ఈ నాటిక. ఇందలి పాత్రలు— తల్లి (కాపుపడతి), కోడి, కోడిపిల్లలు, బుద్ధుడు.

ఒక కాపుపడతి బుద్ధుని జ్ఞానోపదేశముచేత కోడినిచంపి పిల్లలకు వండి పెట్టు హింసాప్రవృత్తిని మానుకొని, గతములో తాను అట్టిహింసకు పాల్పడి నందుకు పశ్చాత్తాపపడుటయు, చావు తప్పినకోడి తనపిల్లలతో కలసి సుఖముగా నుండుటయు ఈ నాటికయందలి కథాంశము.

ఈ నాటికయందలి కాపుపడతి బుద్ధునితో హింసాతత్త్వమును గూర్చి వాదించుచు ప్రశ్నించిన వైఖరియు, అందుకు బుద్ధుడిచ్చిన సమాధానమును సహృదయుల నాలోచింపజేయును.

"యజ్ఞములలో మేకపోతుల
నెంతో బలవంతముగ చంపర?
నీ అహింసాసూత్రమప్పుడు
నిద్దరోయిందా?" అని కాపుపడతి బుద్ధుని ప్రశ్నింపగా అతడు–
"కటిక గుండెలు కర్మవాదుల
కపటవేద కుతంత్ర మయ్యది
దేవతలు పశుమాంసమిమ్మని
దేవురించేరా?" అని సమాధాన మిచ్చును. కాయగూరలు ధాన్యధాన్యములు తినుట హింసయేయైనను మనిషికన్నులకది కానిపింపదని బుద్ధుడనును.

"కాయకసరులు తిన్ననిండే
మాయపొట్టకు మాంసమెందుకు?
నిండుజీవము నిట్లుతిండికి
చెండగానేలన్?" వంటి మాటలు విశ్వజనీన ప్రబోధ గర్భిత ములు. 'ఆత్మవత్సర్వాణి భూతాని' - 'మా హింస్యాత్' వంటి దేవభాషా సూక్తులు సందర్భోచితములై బుద్ధ పాత్రలోని దివ్యత్వమును భాసింపజేసినవి.

**దగ్ధశాంతి :**

ఆచార్య డా॥ సి. నారాయణరెడ్డిగారి నాటిక ఇది. అభ్యుదయకవులైన శ్రీ నారాయణరెడ్డిగారు ఈ నాటిక ద్వారమున యుద్ధవిముఖతను, శాంతి ప్రియతను ప్రబోధించినారు. ఇందలి పాత్రలు- శాంతి, మానవుడు, దానవత, అపరిచిత కంఠాలు.

శాంతిని నిర్మూలించు దానవతాశక్తులు విజృంభణమును మానవు డెదుర్కొనలేని విపత్కరపరిస్థితి ఈ నాటికయందలి ఇతివృత్తము.

ఈ నాటికయందలి గేయములు కవితావేశముతో కదనుతొక్కినవి. ఉదాహరణమునకు - దానవత పలికిన,

"పచ్చని జీవనవాటుల
ప్రళయాగ్నులు కురిపించీ
వెచ్చని శాంతి కపోతీ
పక్షాలను తెగద్రుంచీ
భూవక్షంలో విషధుని
పొంగులు పారిన్నాదే
నరరుధిర స్రోతస్విని
పరుగులు తీసిన్నాదే
నశియించును విశ్వశాంతి
నాకపుడే మనశ్శాంతి" అను మాటలను,

"లోకంలో క
ల్లోలం లేపీ
మానవతా మం
దారం నలిపీ
ప్రపంచశాంతిని
భగ్నంచేసే
ప్రఫుల్లకాంతికి
బాటలుమూసే
దానవతా నీ
దారుణకాండలు

సహించలేమిక
వహించలేమిక" అను మానవుని మాటలను పేర్కొనవచ్చును.
ఈ నాటికాద్యంతములందు 'అపరిచితకంఠాలు' ప్రయోగించి భయంకర సమర ఘోషను సృష్టించినారు శ్రీ రెడ్డిగారు.

"ప్రపంచమును నిమిషములో భస్మీపటల మొనర్చునంతటి పటుతరమైన మారణాయుధాలతో క్రీడలాడు అగ్రరాజ్యముల ధోరణిని అభ్యుదయ కవులు సహింపలేకపోయిరి. యుద్ధ వ్యతిరేకతను పాటలలో గేయనాటికలలో ప్రకటించిరి"[1] అను డాక్టరు నారాయణరెడ్డిగారి సిద్ధాంత గ్రంథమునందలి మాటలకు చక్కని ఉదాహరణము ఈ 'దగ్ధశాంతి'.

విశ్వశాంతి పరిరక్షణము మానవుని కర్తవ్యమని ప్రబోధించు ప్రయోజనాత్మకమైన నాటిక ఇది.

**భిన్నస్వరాలు :**

ఈ నాటికయును డా॥ సి. నారాయణరెడ్డిగారిదే. కవిత్వాదికళలన్నియు శ్రామికవర్గచైతన్య చిత్రణమున కంకితము కావలెనను అభ్యుదయ కవితా ప్రబోధ దృక్పథమునకు రూపకల్పనము ఈ నాటిక. ఇందలి పాత్రలు - కళాజీవి, ప్రణయిని, అనాథ.

ఒక యువ కళాజీవి క్షణికములైన 'అల్పకామినీ సుఖాల' నాశింపక 'శ్రమజీవుల మోడు బ్రతుకులను' చిత్రించుటయే తన కళాప్రయోజనమని గ్రహించి అందుకు పూనుకొనుట ఈ నాటికయందలి ఇతివృత్తము.

'లోకం' నోట నాటికాద్యంతములందు —

"జీవన సంధ్యాగీతం
భిన్నస్వర సంకేతం
. . . . . . . . . . . . . . . .
కామినీదృగంతాలు స్వర్గలో
కాలమాట మరపించూ

---

1. ఆధునికాంధ్ర కవిత్వము-సంప్రదాయములు-ప్రయోగములు : పుట 603.
ప్రథమ ముద్రణ జనవరి 1967.

వేదవాని కన్నీటిమంటలో
రాతిగుండె ద్రవియించూ" అను గీతమును పలికించి నాటిక యందలి విషయమును కవితాత్మకముగా సూచించినారు శ్రీ నారాయణరెడ్డి గారు. వారు 'ప్రణయిని' పాత్రతో భావకవిత్వలక్షణమును, 'అనాథ' పాత్రతో అభ్యుదయ కవిత్వ లక్షణమును ధ్వనింపజేసినారు.

ఈ నాటికయందలి గేయములు లలితసుందరముగా ఒకచో, వేడిగా, వేగముగా మరొకచో నడచినవి.

"నా కనుల వెలిగించు
నవ దీప కళికా !
నా భావిజీవనా
నందాల మొలకా !
నీవిలోకనవాహి
నీ తరంగాలలో
కనులారగాంతు మో
హన జీవలాస్యాలు
నీ దరస్మిత వల్ల
కీనిక్వణాలలో
ఆలింతునానా క
ళాలలితభాష్యాలు" వంటి పంక్తులు ఈ నాటికయందలి కవితా సౌందర్యమునకు నిదర్శనము.

**అజంతాసుందరి :**

నాటికా కర్తలు డా॥ సి. నారాయణరెడ్డిగారే. కాల్పనికేతివృత్తము గల ఈ నాటికయందు కళాకారుని జీవనము చిత్రింపబడినది. ఇందులో పాత్రలు రెండే - శిల్పి, శైలబాల.

తాను చెక్కిన ఒక అప్సర స్సుందరీ ప్రతిమయే స్వప్నమునందు సజీవ ముగా సాక్షాత్కరింపగా శిల్పి ఆమెపట్ల మోహపరవశుడగుటయు ఆమె అతనికి కళాపారమ్యమును ప్రబోధించి అందకుండపోవుటయు ఈ నాటికయందలి ఇతి వృత్తము.

కళ స్వప్రయోజనమునకు సాధనమను భ్రమకు ఇతివృత్తములోని స్వప్నము సంకేతము. శిల్పికి స్వప్నభంగమగుట భ్రమావరణము తొలగిపోవుటకు సంకేతము.

ఒక కళాకారుని 'భ్రాంతి'ని, ఆతనిలోని 'ప్రణయసమ్మోహము'ను 'సౌందర్యదాహము'ను ఈ నాటికలో కమనీయముగా చిత్రించినారు శ్రీ నారాయణరెడ్డిగారు.

"అంబరగంగా ఫేనస
మన్వితమ్మౌ నీ దేహము
సందర్శన మాత్రమ్మున
కందిపోవుగాదె చెలీ!"
"నా రాతిబ్రతుకు మం
దారాలు పూచినది"
"శిలలలో విమల చం
చలలు నిల్పిన శిల్పి
రాలలో నందన వ
నాలు నాటిన శిల్పి"
"నీ మేఖలాకింకి
ణీ మంజుల ధ్వనులు
నా శిలామయ జీవ
నమున కుపదేశనులు" వంటి చరణాలు శ్రీ రెడ్డిగారి కవితా స్ఫూర్తికి ఉదాహరణాలు.

ఈ నాటికయందు నేపథ్యకంఠమును ప్రయోగించి సన్నివేశ పరిచయమును నిర్వహించినారు నాటికా కర్తలు.

"నిగ్రహము లేకున్న
నీ కళార్చన సున్న
సంయోగమే లేని
సౌందర్యమే మిన్న
సృష్టియే తనకు సం
తుష్టిని ప్రసాదించు

ప్రతిఫలము నాశించి
బ్రతుకడు కళాజీవి" అను పలుకులే ఈ నాటిక కళాప్రపంచమున కిచ్చు సందేశము.

**పునరాగమనం :**

విద్వాన్ శ్రీ ప్రయాగ కోదండరామశాస్త్రిగారి నాటిక ఇది. ఆకాశవాణిలో ప్రసారమైన ఈ నాటిక ఒక చక్కని ఊహాచిత్రము. "జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపిగరీయసీ' అను ఆర్యోక్తికి హృదయంగమమైన కళారూపము ఈ నాటిక. ఇందలి పాత్రలు - 1 వ ఆత్మ, 2 వ ఆత్మ, పరమాత్మ. తల్లినేల.

ఒకనాడు ధరిత్రిపై ఉదయించి, మాతృమూర్తి ఒడిలో కదలాడి, ఆమె వాత్సల్యామృతమును గ్రోలి, ఎదిగి, మాతృభూమిని ప్రేమించి, శరీరాలు వదలి ఆత్మలుగా పైకెగసి, నిరామయమైన నిశ్చలమైన స్వరావరణలో 'తారాతతి గ్రహ సమూహమన్నీ వెనవైచుకొన్న ఆకర్షణ వలయంలో' యుగాలు గడిపిన రెండు ఆత్మలు విసిగిపోయి 'ఎటకో ప్రసరించాలని' మనసు కలుగగా మరల ధరిత్రిపై ఉదయింపవలెననుకొని పరమాత్మ యొద్దకు పోయి తమ కోరికను విన్నవించును. ఆతని అంగీకారముతో ఆ రెండు ఆత్మలు ఊర్ధ్వలోకాలన్నిటిని దాటి తల్లినేలపై అవతరించి తమ స్నేహమును వదలలేక తల్లికి కవలపిల్లలుగా జన్మించును ఇది ఈ నాటికయందలి కథాంశము.

ఈ నాటిక మొదట తుదిని 'ప్రకటన' లను ప్రయోగించి సన్నివేశమును పరిచయము చేసినారు శ్రీ కోదండరామశాస్త్రిగారు. ఊర్ధ్వలోకముల పరిస్థితిని, భూమిపై నవతరింపబోవు ఆత్మల కుతూహాల చిత్తస్థితిని వర్ణించు సందర్భములందు శ్రీ కోదండరామశాస్త్రిగారు ప్రదర్శించిన ప్రతిభా పాండిత్యములు ప్రశంసా పాత్రములు ఆత్మలు రెండు 'అంతరాళము'ను 'శబ్దమూలము, ను, పాలపుంతను, గ్రహాలను, సూర్యమండలమును, చంద్రమండలమును, మేఘమండలమును దాటుచున్నప్పుడు చేసిన వర్ణనలు సహజ సుందరములై, శాస్త్ర సమ్మతములై ఆయాలోకముల తీరుతెన్నులను సహృదయుల కనులముందు నిలుపుచున్నవి. ఉదాహరణమునకు - పాలపుంత విశేషాలను వర్ణించిన సందర్భమునందలి___

"అదిగో అటుచూడు చుక్క
లొక్కటిగా గూడుకట్టు

గగనం మెఱుగప్పుకున్న
అల్లికలై మల్లికలై
అదే అదే పాలపుంత
చుక్కల పూ పాలవెల్లి
ఉదయించే కోటిసూర్యు
లొదిగియున్న తల్లిగుండె!
చిటిలిపెటిలి పడిపోయే
పొగిలిరగిలి తెగిపోయే
ఎన్నిచుక్కలా విరులై
ఎంతో కాంతి కావిరులై
అణువులు బ్రహ్మాండములై
ఆకాశం క్రమ్మినవో
...............''

"ఆకాశం విరబూచిన
తెలిమల్లెల పందిరివలె
ఎల్లఎడల విరిసిన పు
ప్పొళ్ళ ధూళివెల్లువవలె
చూడుమిప్పుడెంత వింత
సోయగమొలికించునో'' వంటి చరణములను పేర్కొన
వచ్చును. ఈ నాటికలో అక్కడక్కడ ఆణిముత్యాల వంటి సూక్తులు తళతళలాడును.

''అంతేలే జీవులు తమ
అవధు లధిగమించలేరు''
"తల్లి ప్రేమ - తల్లిపిలుపు
కడుపు కాల్చుకున్న చిచ్చు
కననీయని పచ్చవలపు'' వంటివి అందుకు నిదర్శనము. శ్రీ శాస్త్రి గారు ఊహకు తగిన ఉక్తిని కల్పించి, జీవము పోసి, కవితామూర్తిని కళకళ లాడింపగల రనుటకు ఈ నాటిక ఒక ఉదాహరణ.

**అభ్యుదయం :**

ఈ నాటిక కూడ శ్రీ ప్రయాగ కోదండరామశాస్త్రిగారిదే. ఆర్థికమైన, హార్దికమైన అభ్యుదయమును ప్రబోధించు ఈ నాటికయందలి పాత్రలు - కవి, నారి. నరుడు, 'వివిధ స్వరాలు' (కార్మికులు).

కష్టించి పనిచేసి కరవులను ఎదిరింపవలయుననియు, జన్మభూమిని స్వర్గముగా భావింపవలయుననియు ప్రబోధించు కవి మాటలు వినక, అవి వట్టి ఊహాలే యని తలంచి ఒక నారి, ఒక నరుడు పల్లెను విడిచి పట్నము చేరి, అక్కడి కార్మిక శ్రమను, సంపదను చూచి కవి మాటలు నిజమేయని గ్రహించి, మరల వారు తమ పల్లెకు వచ్చి, కృషి చేసి, పంటలు పండించి సుఖముగా కాలము గడపుట ఈ నాటికయందలి కథాంశము.

ఈ నాటికయందలి గేయములు ధారాగంభీరముగా ఉదాత్త మధురముగా సాగినవి

"తరతరాల చీకటితెర
తొలగి వెలుగు వెల్లువలై" అను 'కవి' గేయమునందలి—

"ధరాధూళికప్పుకున్న
దరిద్రుడే మహాత్ముడై
అధోజగత్సహోదరుల
వ్యథాజీవితం కథయై
ఎత్తుకున్నశిరస్సు హిమవన్నగాగ్రమై
వెన్నెలలు విరిసీ... త్వమసియని
కిన్నెరలు మొరసీ" వంటి చరణములను ఉదాహరణములుగా గ్రహింపవచ్చును.

"ఆశకంతులేదయినా
ఆశలేని బ్రతుకు లేదు"
"ప్రాణమునకు ప్రాణికినీ
నడుమనున్న తొడిమ అదే"
"ఊరి చెలమనీరు చాలు
బ్రతుకు చివురులెత్తుటకు" వంటి కవితోక్తులు ఈ నాటికను సమలంకరించినవి.

నాటికకు చివరగల—

"నమో భరతమాత !

నమః క్రాంతిజాత !" అను భరతమాతృ ప్రశంసాగేయము సంగీత సాహిత్యనృత్యములకు ప్రయోగ.

సమైక్యము, శ్రమశీలము, మాతృదేశభక్తి, స్వేచ్ఛాసక్తి వంటి సుగుణములు అభ్యుదయమునకు సాధనములని ఈ నాటిక ద్వారమున చాటినారు. శ్రీ ప్రయాగ కోదండ రామశాస్త్రిగారు.

ప్రసార ప్రదర్శనముల కనుకూలము ఈ నాటిక.

**సంక్రాంతి :**

శ్రీ ప్రయాగ కోదండరామశాస్త్రిగారి మరొక నాటిక సంక్రాంతి. యుద్ధవైముఖ్యమును అణుశక్తి సద్వినియోగమును ఈ నాటిక ద్వారమున ప్రబోధించినారు అభ్యుదయ కవులైన శ్రీ శాస్త్రిగారు. ఇందలి పాత్రలు— కవిత, జనత, ప్రభుత, సేనాని, శాస్త్రవేత్త, అంగారకుడు.

భూమి గ్రహమునందేకాక ఇతర గ్రహములందును మానవుల వంటి వారుండవచ్చుననియును, వారు మనకంటె శాస్త్రవిజ్ఞానమునందు ఆరితేరిన వారనియును కొందరు శాస్త్రజ్ఞులు ఊహించియున్నారు. ఆ ఊహను ఆధారము చేసికొని కల్పింపబడినది ఈ నాటికేతివృత్తము.

అంగారక గ్రహజీవులు భూప్రవేశము చేసి, ప్రజాహితము తలపెట్టక సామ్రాజ్యకాంక్షతో శాస్త్రవేత్త సహాయముతో గ్రహాంతరప్రవేశమునకై ప్రయత్నించు 'ప్రభుత' ను మందలించి తను లోకమునకు వెడలిపోవుట ఈ నాటిక యందలి కథాంశము.

ఈ నాటికలో కవికిగల దర్శనశక్తి, జనతలో నిజాయితినిచాటు ధైర్యము, రాజుల అవకాశవాదము. వారి యుద్ధోన్మాదము, శాస్త్రవేత్తల విజ్ఞాన దుర్వినియోగపరత్వము చక్కగా చిత్రింపబడినవి.

**మాట-మౌనము :**

నాటికా కర్తలు శ్రీ దేవులపల్లి వేంకటకృష్ణ శాస్త్రిగారు. ప్రకృతి పురుషుల పరమమైత్రిని అవినాభావసంబంధమును కవితా మనోహారముగా చిత్రించి

నారు ఈ నాటికలో శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు. స్త్రీ, పురుషుడు ఇందలి పాత్రలు. ఒకే ఒక్క యుగళగీత సన్నివేశమైన ఈ 'సంగీతచిత్రము' ఆకాశవాణి హైదరాబాదు కేంద్రము నుండి ప్రసారమైనది.

శబ్ద రహస్యమును, నాదమునందలి విశ్వరూప సౌందర్యమును ఎరిగిన కవులు శ్రీ కృష్ణశాస్త్రిగారు. వారి శబ్దము, భావము ఎదను కదిలించి అందులో సంగీత తరంగములను సృష్టించి రసానందమును కలిగించును.

పురుషునితో స్త్రీ పలికిన—

"అకుగుసడుల ఆలకించు బాటను నేను
పులుగురొదల దాచుకొన్న గూటిని నేను" అను మాటలయందలి భావము రమణీయము. అదేవిధముగా పురుషుడు పలికిన—

"నీ యెడద పాల్కడలి మరగి
నురుగునై విరిగి
నీ కటక కింకిణుల తొరగి
నేను గలగలను
నీ చెరగు అంచులను విరిగి
నేను మిలమిలను'' అను పలుకులందలి పదచిత్రములు పరమ సుందరములై స్త్రీ పురుషుల అన్యోన్య బంధమును స్పష్టముచేయు చున్నవి.

"తామసి మౌనమ్మైతే
తారక మాట
తీవియ మౌనమ్మైతే
పూవే మాట
పొలతుక మౌనమ్మైతే
పురుషుడు మాట
ఓరిమి మౌనమ్మైతే
కూరిమిమాట"వంటి చరణములు ఉదాత్త తత్త్వమును కవితలో పొదిగిన వైఖరికి నిదర్శము.

**శాంతిపథము :**

ఈ నాటికను రచించినవారు శ్రీ జి. రాములుగారు. సమకాలికాంత ర్జాతీయాశాంతి వాతావరణమును, అగ్రరాజ్యముల మారణాయుధ నిర్మాణ

ప్రయోగోన్ముఖతను ఈ నాటికయందు చిత్రించి, చివరకు నెహ్రూ పంచశీలసూత్రములు సుస్థిరశాంతిస్థాపన సాధనములని చాటినారు శ్రీ రాములుగారు. ఈ నాటిక యందలి పాత్రలు- అశాంతిలోకము, ధనికవర్గము (అమెరికా) వైజ్ఞానికుడు (రష్యా), త్రిమూర్తులు, భారతమాత

'అశాంతిలోకము' శాంతినన్వేషించుచు అమెరికా, రష్యాదేశములందు పర్యటించి, తరువాత త్రిమూర్తుల సన్నిధికి చేరుకొని, వారు చెప్పగా భరత మాత యొద్దకువచ్చి ఆమెను ప్రార్థించును. పండితనెహ్రూ పంచశీల సూత్రాలను పంచాక్షరిగా భావించినచో శాంతి మెచ్చి వచ్చి భూలోకమున వెలయునని భరతమాత అశాంతిలోకమునకు చెప్పును. ఇది ఈ నాటికయందలి కథాంశము.

**దివ్వెల వంగీతం :**

ఈ నాటిక ద్వారమున ఆచార్య డా॥ సి. నారాయణరెడ్డిగారు సమతమ ప్రబోధించినారు. ప్రియుడు, ప్రేయసి, తారలు, దివ్వెలు ఈ నాటికయందలి పాత్రలు. ఇందులో దివ్వెల సన్నివేశముతోపాటు ప్రేయసీ ప్రియుల శృంగార సన్నివేశమొకదానిని హృద్యముగా కల్పించి నాటికీయతకు అవకాశము కల్గించినారు శ్రీ నారాయణరెడ్డిగారు.

దీపావళివేళ మింటవెలిగే తారలు నేలపైనగల మట్టిదివ్వెలను, తారాజువ్వలను వెక్కిరించగా, దివ్వెలుకూడ తారలను ధిక్కరించును ఈ విధముగా పరస్పరము తారలు దివ్వెలు కలహించు దృశ్యమును ప్రేయసీ ప్రియులు తిలకింతురు. ఆ సమయమున 'వాయుగానం' వినిపించిన—

"ఆకాశమే అమావాస్య
చుక్కలే దివ్వియలూ
ఆకృతులే వేరువేరు
ఆత్మమాత్రమొకటే" అను సందేశమును విని, వారిలో 'యౌవన దీపమాల' వెలుగగా ప్రేయసీ ప్రియులు నిష్క్రమింతురు. ఇవి ఈ నాటిక యందలి సన్నివేశములు.

ఈ నాటికయందు తారలను వర్ణించిన తీరు హృద్యము. తారలు—

"మింటిశిరసుపై ఒంటిగమెరిసే
శాశ్వతతేజస్సౌధము జేర్చగ
వెలసిన పూవుల దారుల"ట!

ఈ నాటికయందు వాయుగానమును ప్రవేశపెట్టి, తన్మూలమున తారల, దివ్వెల కలహమును పరిష్కరించి వానికి సందేశము నందించినారు శ్రీ నారాయణరెడ్డిగారు. 'వాయుగానం' లోని వచస్సులే ఈ నాటికయందలి ప్రబోధము.

**యుగాది :**

నాటికాకర్తలు శ్రీ లంకా సూర్యనారాయణరావు ('లసూనా') గారు. మానవ విజ్ఞానమంతయు శాంతిస్థాపనకు, జగత్కల్యాణ కార్యక్రమమునకు ప్రయుక్తము కావలెనని ఈ నాటిక ప్రబోధించుచున్నది. ఇందలి పాత్రలు–భయం, పృథివి, మానవత.

అణ్వాయుధాలతో తనను బద్దలుచేయకుండ కాపాడవలసినదని ప్రార్థించు 'పృథివి' కి, ప్రకృతిసంపద వెలికితీయుటలోను, శాంతి ధర్మ సత్య స్థాపనలోను తన శాస్త్రవిజ్ఞానమును ప్రయోగింతునని 'మానవత' వాగ్దానము చేయుట ఈ నాటికయందలి ఇతివృత్తము.

సన్నివేశ పరిచయమునకును ఆగామి మహోదయ సూచనకును ఈ నాటికాకర్తలు 'వాయుగానము' ను ప్రయోగించినారు.

**చిత్రకళా ప్రదర్శనం :**

ఈ నాటికను రచించినవారు డా॥ బోయి భీమన్నగారు. 'చిత్రకళా ప్రదర్శనం' ఒక రమణీయ కల్పన. ఒక హృద్యమైన సన్నివేశము. ఇందలి పాత్రలు–చిత్రదత్తు, కళ, మంజీర, మార్దంగం. చివరి రెండు పాత్రలు చిత్రాలు. ఆయినను నాటికాకర్త వానికి జీవము పోసినారు.

ఒక యువ కళాకారుడు ఒక సుందరిని చిత్రకళా ప్రదర్శనములో కలసికొనుట, ప్రదర్శనయందలి రెండు చిత్రముల కారణముగా ఒకరినొకరు ప్రేమించుకొనుట ఈ నాటికయందలి ఇతివృత్తము.

'చిత్రప్రదర్శనం' లోని రమణీయాంశము మంజీర–మార్దంగం అను చిత్రములకు ప్రాణముపోసి వానిచే మానవబుద్ధులు 'మోహితములు కృతకములు' అని ని[illegible]పింప యత్నించుట. జీవమునిచ్చుకొన్న ఆ పాత్రలు రెండు–ఒకరి తర[illegible] మరొకరు రంగముపైకి ప్రవేశించి భాషించిన తీరు హృదయంగమము

నేపథ్యంలోని —

"రమ్యచిత్ర ప్రద
ర్శనము మానవులకిది !
సగసమానవ ప్రద
ర్శనము చిత్రములకిది !
ఒండొరుల జూచుకొని
ఉల్లములు పెంచుకొని
ఆనంద పారమ్య
మందుకొని, తరియింప
కళ అందులో ఆత్మకలశం
లలిత
కళ అందులో ఆత్మకలశం !" అన పంక్తుల ద్వారమున శ్రీ భీమన్నగారు ఆనంద సంధాయకమైన మార్గములలో కళ అమృతప్రాయమైనదని తన్మూలమున మానవుడు హృదయమును పెంచుకొని కళావాస మానవతిని ప్రదర్శించవలెనని ప్రబోధించినారు.

**అంధకారంపై విజయం :**

ఈ నాటికకూడ డా॥ బోయి భీమన్నగారిదే. నరకవధ వృత్తాంతమును, దీపావళి ప్రాధాన్యమును వివరించుచు అదే సమయమున మనదేశముపై దురాక్రమణచేసిన చైనాను భారతవీరులు త్రిప్పికొట్టిన విజయఘట్టమును ఈ నాటిక చిత్రించుచున్నది. ఇది నేపథ్య గేయరూపకమైనందున ప్రత్యేకముగా పాత్రల పేర్లులేవు. తెరవెనుక పాట వినిపించుచుండగా రంగస్థలముపై ప్రదర్శన సాగుచుండును.

ఈ నాటికయందలి 'నరకుడు' చైనాకును, 'అంధకారం' నరకుని దౌష్ట్యమునకు ప్రతీకలు. 'మానవత్వపు మేటి విలువల' ను మంటగలుపుచు 'ప్రాణదేవత పంచశీల' ప్రక్కటెముకలు విరుచుచు నరకుడు దురాక్రమణ చేయగా భారతదేశమందలి 'ఒకొక యువకుడు ఒకొక కృష్ణుడు' గా, 'ఒకొక యువతీ ఒకొక సత్య' గా, 'ఒకొక దీపం ఒకొక బాణం' గా పరాక్రమించి ఆ నరకు రక్కసుని నరికివేసినారు. అంధతమస్సును చీల్చివేసినారు.

"ఉమానాథుని కాటపట్టి
హిమగిరీంద్రుడు జబ్బచరిచెను !
రమానాథుని రూపమున స
ర్వ భారతమును నడుము కట్టెను !
పశులు, పతులు, తరులు, వాగులు
ప్రకృతి మొత్తం తోడురాగా
నరకుముట్టడి త్రిప్పికొట్టగ
ఉరిమి ముందుకు నడిచెను !" వంటి చరణములు వీరరస

స్ఫూర్తికి ఉదాహరణములై శ్రీ భీమన్నగారి కవితావేశమును వ్యక్తచేయు చున్నవి.

"మానవుడిలో దాగియుండిన
దానవుడు పెచ్చెగినప్పుడు
మానవుడిలో నిద్రపోయే
మాధవుడు లేచును చివాలున" అను పంక్తులే ఈ నాటికా

సందేశము.

**నవశక్తి :**

'నవశక్తి' నాటికా కర్తలు శ్రీ కందుకూరి రామభద్రరావుగారు. ఆకాశ వాణి హైదరాబాదు కేంద్రమునుండి ప్రసారమైనది ఈ నాటిక. ఇందలి పాత్రలు-(సూత్రధారుడు కాక)- నర నారులు, భూదేవి, అగ్ని, వాయువు, మాయ, ప్రకృతిదేవులు.

అగ్ని, వాయువు తమ తమ శక్తులు గొప్పవని తమనెవరును ఆపలేరని అహంకరించగా భూదేవి వారిని మందలించి మానవలోకమునకు వారి శక్తి యుక్తుల నొసగి సాయపడవలసినదిగా హితబోధ సేయును. ప్రకృతి దేవులు నర నారులే మాయా మనస్సుతో వినాశనమును తలపెట్టుచున్నారని తెలుపుదురు. వెంటనే మాయ తనను నిందించుట పాడికాదనియు, సకలశక్తులకు ఆదిశక్తి జగ దంబయనియు చాటిచెప్పును. పృథ్వీ-నరనారులు సకలశక్తిదాత్రియైన జగన్మా తను స్తుతింతురు. 'ప్రకృతిదేవుల వరము లమర' కల్యాణ దృక్పథముతో ప్రవ

ప్రవర్తింతుమని సర్వమంగళ సన్నిధిని శపథమొనరింతురు. ఇది ఈ నాటికయందలి కథాంశము

"పొగకీలల మాలలు
ఊగ జ్వాలల డోలలు
... ... ... ... ...
విస్ఫులింగములెగసి చిమ్మగ
ప్రస్ఫుటమ్ముగ పొగలు క్రమ్మగ
నాల్కలాక సమంటుకొనగా
ఉల్కలవనికి రాలి దహా" అను 'అగ్ని' ఆర్భాటములలో

"ఆకాశంబుకు విసరి
ఆవరించెద దెసలు
అరచేతిలో నుంతు
అఖిలప్రాణుల గొంతు" అను వాయువు వాక్కులలో - వేడి, వేగము, జిగి బిగి నిండి ఆ ప్రకృతిశక్తుల తీక్ష్ణతను ప్రస్ఫుటము సేయుచున్నవి.



ఈ నాటికయందు గేయములతోపాటు ద్విపదలు కూడ చోటుచేసికొన్నవి. ఈ నాటికలోని పాత్రలు స్వర్గమర్త్యలోకములకు సంబంధించినవి. కాని ఇతివృత్తము మాత్రము ఆధునిక కాలమునందలి అభ్యుదయము, ఐకమత్యము నవచైతన్యము వంటి భావావేశములకు మనికిపట్టుగా నున్నది.

**కల్యాణయాత్ర :**

శ్రీ జె. బాపురెడ్డిగారి నాటిక ఇది. మానవుడు సర్వశక్తులను తనలో లీనము చేసికొని సమన్వయ శీలముతో బ్రదుకును కొనసాగింపవలయునని శ్రీ బాపురెడ్డిగారు ఈ నాటిక ద్వారమున ప్రబోధించినారు. ఇందలి పాత్రలు - మానవుడు, ప్రకృతి, ప్రేయసి, మాతృదేవి, కష్టజీవి, భాగ్యదేవత, దేశమాత. ఆకాశవాణి హైదరాబాదు కేంద్రమునుండి ఈ నాటిక ప్రసారమైనది.

ఈ నాటిక మానవుని మనసులోని భావఘర్షణకు అక్షరరూపము. ప్రకృతి సౌందర్యమొకవంక, ప్రణయిని ఒకవంక, తల్లిప్రేమ ఒకవంక, కష్టజీవులొకవంక. భోగభాగ్యములొకవంక. మాతృదేశమొకవంక మానవుని ఆకర్షించుచుండగా, ఈ అందరిని సమాదరించి, అన్ని ఆకర్షణలను సమన్వయించుకొని జీవితమును

రసాత్మకముగను, సుఖంకరముగను, ఆర్ద్రముగను, శివంకరముగను మలచుకొనుటయే జీవితధ్యేయముగా నుండవలయునను సందేశమునకు నాటికా రూపము కల్పించిన తీరు పరమ రమణీయముగా నున్నది.

నాటిక యందలి గేయరచన పాత్రానుకూలముగా సాగినది.

"నాలో విషనాగఫణాలను

నాట్యము చేయిస్తారేలా ?" వంటి పంక్తులు మానవుడు పొందిన బాధా తీవ్రతను చక్కగా వ్యక్తీకరించుచున్నవి. ఈ నాటికపై డా॥ సి. నారాయణరెడ్డిగారి 'భిన్నస్వరాలు' అను గేయనాటిక ప్రభావము కొంత ఉన్నట్లు కానవచ్చుచున్నది.

**విజయహేల :**

విజయమునకు ప్రతీకమైన విజయదశమి ప్రాశస్త్యమును వివరించు ఈ నాటికను రచించినవారు శ్రీ జె. బాపురెడ్డిగారు. ఇందలి పాత్రలు - విజయదశమి, నాలుగుకంఠాలు (ఇద్దరు పురుషులు - ఇద్దరు స్త్రీలు కావచ్చును). విజయదశమి శక్తి స్వరూపిణియైన దేవికి సంకేతముగా గ్రహింపబడినది.

మాయాదేవి మహాకాళీ దుర్గాది నవావతారములెత్తి మధుకైటభ మహిషాసుర దుర్గాద్యసురులను హతమార్చి లోకకల్యాణము గావించిన విజయదశమికి నరనారులు స్వాగత మిత్తురు. అలనాటి కోదండరాముడు, ఆ తరువాత పాండవులు, నిన్నటి గాంధీతాత సాధించిన విజయపరంపర విజయదశమి ఆశీరమృతమువలననేయని ఆ దేవిని ప్రశంసింతురు. అజ్ఞానమును, దారిద్ర్యమును, స్వార్థమును, శత్రు దురాక్రమణమును ప్రతిఘటించి నిర్మూలించుటలో శక్తినొసంగి విజయమును కలిగింపవలసినదిగా వారామెను ప్రార్థింతురు. శ్రామికులకు, శాస్త్రజ్ఞులకు, కళాసాధకులకు విజయమును ప్రసాదించవలసినదిగా విజయదశమిని వేడుకొందురు. ధర్మమునకు జయము కలుగునని పలికి విజయదశమి వారి నాశీర్వదించును. ఇది ఈ నాటికయందలి కథాంశము.

ఈ నాటికయందు శ్రీ బాపురెడ్డిగారి అభ్యుదయ దృక్పథము, లోకకళ్యాణకాంక్ష, శాంతికాముకత, శ్రమశీలము, ఆత్మశక్తి, దేశభక్తి చక్కగా వ్యక్తమగుచున్నవి. అందుకే వారు—

"అణ్వాయుధశక్తి కన్న
ఆత్మబలమ్మే మిన్న
బాంబు బలముకాదు, దేశ
భక్తిని పెంచాలన్నా !" అని విజయదశమి ముఖతః ప్రబోధము గావించినారు.

"మీరు ధర్మయోధులైతే
నేను విజయకోట నౌదు
మీరు శాంతివల్లులైతే
నేను విజయవాటి నౌదు" వంటి పంక్తులు హృదయంగమములు. ఈ నాటిక ఆకాశవాణి హైదరాబాదు కేంద్రము నుండి ప్రసారమైనది.

శ్రీ బాపురెడ్డిగారు ఈ నాటికయందలి కొంతభాగమును గ్రహించి, దానికి ఇరువది సూత్రముల ఆర్థిక కార్యక్రమమును జతపరచి 'విజయవీణ' పేరుతో 14-10-75 నాడు ఆకాశవాణి హైదరాబాదు కేంద్రమునుండి ప్రసారము చేసినారు.

**ప్రగతి పథం :**[1]

నాటికాకర్తలు శ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రిగారు. సమకాలిక సమాజ దుఃస్థితిని ప్రతిబింబింపజేయుచు సంఘసముద్ధరణకు గాంధివంటినాయకుల ఆవశ్యకతను నొక్కివక్కాణించుచున్నది ఈ నాటిక. ఇది ఆకాశవాణి విజయవాడ కేంద్రమునుండి ప్రసారితము.

"కదిలిస్తేసరిచాలయ్యా
పదవులు పందిరి మంచాలయ్యా
చేదెక్కిన నాయకుల మనస్సులు
చిలుమూరే కంచాలయ్యా"
"నిరుపేదల గతి కావగరాదు
అధికార్లకు మతి అసలేలేదు" వంటి పంక్తులు సమకాలిక సమాజమునకు అద్దము పట్టుచున్నవి. నిజాయితి 'హుళ్లికి హుళ్లి' అయిన సమాజము

1. ఈ నాటికప్రతి (వ్రాతప్రతి) పూర్తిగా దొరకనందున, ఇందలి ఇతివృత్త పాత్రాది విశేషములను పేర్కొనలేకపోవుచున్నాను.

"కుశ్లీన కిశ్లీ" వలె నున్నదని అభివర్ణించినారు 'కరుణశ్రీ' గారు. నవయుగ భారతబాలలను—

"నవచైతన్యం నాట్యం చేసే
నవీనరత్నశాలలు"గా వర్ణించిన తీరు హృదయంగమము.

"ఎఱ్ఱకోటపై ఎగిరే జండా
ఏమి చెప్పెరా చిన్నోడా ?
నీకేమి చెప్పెరా బుల్లోడా ?
శౌర్యం త్యాగం సమైక్యభావం
ఒత్తి చెప్పెనే చినదానా !
ఎలుగెత్తి చెప్పెనే పిలదానా !" అను పాట జానపదుల గేయ

శైలిలో తీవెలుసాగి ఈ నాటికకు అందమును నవదరించినది.

**స్వప్నబాల :**

నాటికాకర్తలు శ్రీ టి. రామకృష్ణారెడ్డిగారు. ఒక కవి నిర్మల ప్రణయ భావనాలోకమునకు రూపకల్పనము ఈ నాటిక. మూడు దృశ్యములుగా సాగిన ఈ రూపకమునందలి పాత్రలు— కవి, స్వప్నబాల, ధనకాంత, కీర్తికాంత, చిత్రరథుడు.

కవి ఊహాలో మెరసిన సుందరి ఆతని స్వప్నమునందు అమరకాంతగా సాక్షాత్కరించి సురాలయమునకు కొనిపోవును అట నందనవనమున కవిముందు సురబాల నృత్యము సేయుచుండగా చిత్రరథుడను ఇంద్రుని అనుచరుడు మానవునితో ప్రణయము పనికిరాదని చీకటిని సృష్టించుటతో కవి కల కరగిపోవును. ఇది ఈ నాటికయందలి కథాంశము.

ఈ నాటికయందు స్వప్నబాల కవిశీలమును పరీక్షించు సందర్భమున ప్రవేశపెట్టిన ధనకాంత-కీర్తికాంతల ద్వారమున నిజమైన కవి ధనకీర్త్యాశలకులొంగి తన వినిర్మలభావప్రకటనమును మానలేడని శ్రీ రామకృష్ణారెడ్డిగారు చక్కని సందేశమిచ్చినారు.

స్వప్నబాల సౌందర్యమును, నందనోద్యానమును, అభిసారికా వేషవిలాసాదులను సుందరముగా వర్ణించి నాటికయందలి 'కవి' పాత్రకు న్యాయమును గూర్చినారు శ్రీ రెడ్డిగారు.

"వలగాలి తేజీల
జలదాల రథములో
చంద్రలోకముచేరి
సరసాల తేలుదము"

"పొంగారు రంగారు
గంగా తరంగాల
కమలాలె నావలై
కదల పయనించుదము" వంటి పంక్తులు ఈ నాటికాకర్త భావస్ఫూర్తికి నిదర్శనము. ఈ నాటికయందలి గేయములు సంగీత నృత్యానుకూలములు.

ఈ 'స్వప్నబాల' నాటికపై డా॥ సి. నారాయణరెడ్డిగారి "స్వప్నభంగము" అను కావ్యముయొక్కయు, వారి 'అజంతా సుందరి' అను నాటికయొక్కయు, ప్రభావమున్నట్లు కానిపించుచున్నది. ఈ నాటిక పలుమార్లు విజయవంతముగా ప్రదర్శింపబడినది.

**భారతరాణి :**

ఈ నాటికను రచించినవారు శ్రీ అందె వెంకటరాజముగారు. సమకాలిక దేశ దుఃస్థితిని చిత్రించుచు కులమత వర్గభేదాలులేని రామరాజ్య స్థాపనావశ్యకతను ప్రబోధించుచున్నది ఈ నాటిక. ఇందలి పాత్రలు- భారతరాణి, రాజకీయ నాయకుడు, వర్తకుడు, రైతు, వేదాంతి, వీరయోధుడు, శాస్త్రజ్ఞుడు, కార్మికుడు, ఉపాధ్యాయుడు, కళాకారుడు.

ఉత్తమ కళాకారుడు దేశమును బాగుపరచగలడను తమ దృఢాభిప్రాయమును ఈ నాటిక ద్వారమున వ్యక్తపరచినారు శ్రీ వెంకటరాజముగారు.

శ్రీ అందె వెంకటరాజముగారు సామ్యవాదమును చిత్రించుచు 'సమత' అను మరొక నాటికను రచించినారు.

**మూలస్తంభాలు :**

నాటికా కర్తలు శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావుగారు. ఈనాటి బాలబాలికలు రేపటి సమాజసౌధమునకు మూలస్తంభాలవంటి వారనియు ఉజ్జ్వల

మైన జాతిమనుగడకు వారి శీలవంతమైన నడత ముఖ్యమనియు ఈ నాటికచాటు చున్నది. ఈ సంగీత నృత్యనాటిక యందలి పాత్రలు- గొల్లభామ, పంతులు, అభినవకుమార్, సుకుమార్, అనసూయ, ప్రియంవద, ప్రేమలత, ప్రిన్సిపాల్, ఇంకను కొందరు విద్యార్థినీ విద్యార్థులు.

పిల్లల స్తంభాల ఆటను "రేపు సమాజంలో ప్రగతికి గుంజులాట"గా వ్యాఖ్యానించినారు శ్రీ రజనీకాంతరావుగారు. ఈ నాటికయందు మొదట పాఠశాలా వాతావరణమును, తుదకు కళాశాలా వాతావరణమును చిత్రించి, విద్యార్థుల సహజ మనఃస్థితికి- ఈమధ్య తెలుగుదేశమును కల్లోలపరచిన తెలంగాణా - ఆంధ్ర ప్రత్యేక రాష్ట్రోద్యమ దుష్ఫలితాల వలన విద్యార్థిప్రపంచమున చెలరేగిన అక్రమచర్యల దుఃస్థితికి అద్దముపట్టినారు నాటికాకర్తలు. విద్యార్థుల తెలివి వెర్రితలలువేయగా వారిలో దైవముపట్లను, గురువులపట్లను కలుగు నిర్లక్ష్యవైఖరి, తోటి విద్యార్థులను గేలిసేయు ధోరణి, పరీక్షాప్రశ్న పత్రములను తెలిసికొను అల్లరిచర్య, పరీక్షలలో పెద్దఎత్తున జరుగు 'నకళ్ళు', సమ్మెల అక్రమమార్గానుసరణలు, కుడిఎడమల వర్గవిభేదాలు మున్నగునవన్నియు ఈ నాటికయందు చిత్రించి చివరకు—

"వోటుహక్కు లభియించేవరకూ
చదువులు నేర్చే విద్యార్థులకు
కుడియెడమలతో కూడదు జోక్యం
క్రమశిక్షణతో చదువే ముఖ్యం" అని ప్రబోధించినారు శ్రీ రజనిగారు.

ఈ నాటికయందలి విద్యార్థుల ప్రార్థన - స్వాతంత్ర్యసమర ప్రసక్తి సందర్భములు నాటికాకర్తల నిర్మాణాత్మకదృష్టిని వ్యక్తముసేయుచున్నవి. నాటికలో పంతులు పలికిన—

"కుదురేదో స్తంభాలకు
మదురేదో మేడలకూ
గదులేవో దీపాలకు
కుదరించే శ్రమనాది" వంటి పలుకులు ఉపాధ్యాయుని పవిత్ర కర్తవ్యమును ఉదాత్తముగా తెలుపుచున్నవి. శ్రీ రజనీకాంతరావుగారు విద్యా

స్థులస్థాయినీ అర్థముచేసికొని నృత్యానుకూలముగా ఇందలి గేయరచన సాగించినారు.

ఆకాశవాణిలో ప్రసారితమైన ఈ నాటిక విజయవంతముగా ప్రదర్శింపబడినది.

**శాంతి :**

అహింసా మార్గమున విశ్వశాంతిని స్థాపింపవలయునని ప్రబోధించు ఈ 'సంగీత నృత్యనాటిక' ను శ్రీ రెడ్డి చినవెంకటరెడ్డిగారు రచించినారు. ఇందలి పాత్రలు- వేదవాక్కు, ఖురాన్ వాక్కు, బైబిల్ వాక్కు, అహింస, హింస, (కథకుడు)

మతములన్నియు శాంతి, సత్యము, అహింస, సమత, మానవత అను మంచి మార్గములనే బోధించునను విశ్వసత్యమును వేదవాక్కు, బైబిల్ వాక్కు, ఖురాన్ వాక్కు అను పాత్రలచేత వ్యక్తపరచినారు శ్రీ రెడ్డిగారు.

**విశ్వాంతర్యామి :**

ఈ నాటికయును శ్రీ రెడ్డి చినవెంకటరెడ్డిగారిదే. ప్రతివ్యక్తి యందును దైవశక్తి కలదను దృక్పథముతో సమతను ప్రబోధించుచున్నది ఈ నాటిక. ఇందలి పాత్రలు- వాణి, ప్రకృతి, పాపం, దైవవాక్కు, సనాతనుడు, సత్యవాది.

**వెలుగుమేడ :**

నాటికా రచయితలు శ్రీ వడ్డెపల్లి కృష్ణగారు మానవుని సంస్కరించి, అతనిని ప్రగతిపథాన నడిపించుచు శాంతికాముకునిగ సిద్ధముచేయవలెనను గాఢాభిలాషను శ్రీ కృష్ణగారు ఈ నాటికయందు వెలిబుచ్చినారు ఇందలి పాత్రలు- కవి, ఈర్ష్య, సోమరి.

కవిని వెక్కిరించిన ధిక్కరించిన ఈర్ష్య, సోమరి ఇద్దరు "న్యాయం ధర్మం నాలుగు గోడలుగ నిత్యజీవనం సత్యశాంతులుగ" కవి కట్టిన వెలుగు మేడను చూచి, అతని మాటలు విశ్వసించి బుద్ధిగా కవిదారికివచ్చుట ఈ నాటిక యందలి కథాంశము.

**శాంతి సందేశం :**

ఈ నాటికయును శ్రీ వడ్డెపల్లి కృష్ణగారిదే. ఇందలి పాత్రలు - భరతమాత, బాలలు, బాపూజీ, పేదలు, నాయకులు, కాలేజీ విద్యార్థులు, యువకవి.

సమకాలీన సాంఘిక రాజకీయ సాహిత్య సమస్యలకు గాంధీయదృక్పథముతో చూపిన పరిష్కారము ఈ నాటికయందు సూచింపబడినది.

ఈ నాటికయందలి "బాపూ! నువ్వెపుట్టిన రోజు" అను గేయముపై ఆచార్య డా॥ సి. నారాయణరెడ్డిగారి "బాపూ! నీ పుట్టినరోజు" అను గేయ ప్రభావము స్పష్టముగా కానిపించుచున్నది.

**పాలికేక :**

నాటికా కర్తలు శ్రీ ఎం. కె. రాముగారు. ఈ చిన్న 'నృత్యనాటిక' యందలి పాత్రలు- సంస్కర్త, కొందరు అనుయాయులు.

దేశభక్తిని, సమైక్యమును ప్రబోధించు ఈ నాటిక నాటి ప్రభుత్వము ప్రారంభించిన ఇరువది సూత్రముల ఆర్థిక కార్యక్రమమును కూడ రేఖా మాత్రముగా ప్రస్తావించినది

ఈ నాటిక యందలి

"పూలన్నీ తోటలో కలిసే వికసిస్తాయి
గువ్వలన్నీ నింగిలో గుంపుగ విహరిస్తాయి
పశువులు కూడా పచ్చిక మందగా మేస్తాయి
ప్రకృతిలోనే ఐక్యత వలె చింపుతున్నాయి" వంటి పంక్తులు సమైక్యమును చాటుచున్నవి. ఈ నాటిక ప్రదర్శనీయము.

ఇంతవరకు నాకు లభించిన గేయనాటికలను పేర్కొని రేఖామాత్రముగా వానిలోని ఇతివృత్తమును, కవితా సౌందర్యమును, అవి అందించిన సందేశమును ప్రయోగ విశేషములను తెలుపుటకు ప్రయత్నము చేసినాను. వీనిలో కొన్ని ఆకాశవాణివారు ప్రసారము చేసినవి. కొన్ని అముద్రితములు. కొన్ని ముద్రితములు.

గేయనాటిక తెలుగు సాహిత్యమునందు పూర్తిగా నూత్నప్రక్రియ కాకపోయినను ఇటీవల ఇది సంతరించుకొన్న అందచందములు అపురూపములు. కవితాపారమ్యమున శిఖరప్రాయులైన మనీషివతంసులెందరో ఈ ప్రక్రియను చేపట్టి చరితార్థతను కల్పించినారు. కనుక ఈ గేయనాటికల అధ్యయనము,

పరిశీలనము, అవగాహనము లేనిదే ఆధునిక సాహితీమర్యాదలను సంపూర్ణముగా అవగతము చేసికొనలేము; ఈ ప్రక్రియలో సాక్షాత్కరించిన కవితామూర్తిని దర్శించుకొనలేము. ఆయా రచయితలు రచించి ప్రయోగించిన గేయ నాటికలను ఒక్కొక్కటిగా విపులముగా సాహిత్యశాస్త్ర దృక్కోణములతో పరిశీలించవలసిన అవసరము అత్యావశ్యకముగానున్నదని భావించుచున్నాను. నేను చేసిన పరిచయము దిఙ్మాత్రమైనదే, గేయనాటికావతరణమును గూర్చియు దాని స్వరూపస్వభావములను గూర్చియు పరిశీలించుటయే ప్రస్తుతము నా లక్ష్యము.

౦—౦

# బాలల గేయనాటికలు

సాహిత్యము సర్వజనాదరణీయ మను అంశము యథార్థమే అయినను మానవుని జీవితములో వివిధావస్థలకు సంబంధించిన మనస్తత్వము, అవగాహన శక్తి ఏకరీతిగా నుండవు. సాహిత్యము మనోవికసనముకును విజ్ఞాన విలసనమునకును తోడ్పడగలిగినప్పుడే దాని ప్రయోజనము సంపూర్ణముగా సిద్ధించును. బాల్యమునుండియే బాలబాలికలలో రసానుభూతికి వలసిన సాహిత్య సంస్కారము అలవడిననేగాని ముందు ముందు వారి హృదయములు పరిపక్వములు కావు. కందుకూరి వీరేశలింగము పంతులుగారి కంటె పూర్వమువున్న సాహితీ స్రష్టలు మన తెలుగుదేశమున బాలల సాహిత్యము పట్ల తూష్ణీంభావమును వహించియుండుటకు కారణము తెలియదు. కాని పండితుల ఆదరాభిమానములకు నోచుకొనని జానపద సాహిత్యమునందు బాలబాలికల మనోవికాసమునకు దోహదమును కలిగించు గేయములు, కథలు, పొడుపుకథలు అనేకములున్నవి. కాని వానిని సృజించిన జానపదులకు వివేక విజ్ఞానము అంతగా అలవడియుండని కారణమున ఆ గేయాదులలో విజ్ఞానముకంటె వినోదముపాలే ఎక్కువగా ఉన్నది.

పశ్చిమ దేశములలో వయస్తారతమ్యమును దృష్టియందుంచుకొని అనేక విధములైన సాహితీ ప్రక్రియలు కొన్ని శతాబ్దములనుండియే సృష్టియగుచున్నవి. బాలబాలికలకు వినోద విజ్ఞానములందించు కవితలు, కథలు, నాటకములు, నవలలు మున్నగు ప్రక్రియలలో గ్రంథములు అసంఖ్యాకములుగా వెలువడుచున్నవి. మనోహరమైన ముద్రణము, సామాన్యునికి కూడ అందుబాటులోనున్న ధరలు కారణముగా ఆ పుస్తకములు విశేషప్రాచుర్యము నందుకొనుచున్నవి. ఉత్తమమైన బాలసాహిత్యము సమున్నతమైన దేశభవిష్యత్తుకు పునాది.

బాల సాహిత్యమునకు వీర-అద్భుత-హాస్యరసములు, చమత్కారజనకములైన శబ్దాలంకారములు. అలతి అలతి వాక్యములు, సరళసుందరములైన

పదములు ప్రత్యేకలక్షణములు. పిల్లల మనస్తత్వమును గుర్తెరిగి వానికి అందు బాటులోనుండు పద్ధతిలో రచనలు సాగుచుండును.

కందుకూరి వీరేశలింగము పంతులుగారు బాలలకొరకు ప్రత్యేక రచన లుండవలెనని గుర్తించిన అధునాతనరచయితలలో ఆద్యులు. వారి 'ఈసపు నీతి కథలు', 'స్త్రీ నీతిదీపిక', ముఖ్యముగా పేర్కొనదగినవి. గురజాడ అప్పా రావుగారు వ్యావహారిక భాషాశైలిలో పిల్లలకొరకు అనేక గేయములు రచించి యుండిరి. బాలసాహిత్యమును సముద్ధరించి, ప్రయోజనకరముగ తీర్చిదిద్ది, ఒక ప్రత్యేకమైన సాహిత్యశాఖగా మలచిన ఖ్యాతి శ్రీ గిడుగు సీతాపతిగారికే దక్కినది శ్రీయుతులు మాగంటి బాపినీడు, చింతా దీక్షితులు, వేంకటపార్వతీ శ్వర కవులు, నాళం కృష్ణారావు, వేటూరి ప్రభాకరశాస్త్రి, వేదుల సత్యనారా యణశాస్త్రి శ్రీశ్రీ, దేవులపల్లి కృష్ణశాస్త్రి, వింజమూరి శివరామారావు, సి నారాయణరెడ్డి, నార్ల చిరంజీవి, దాశరథి, కరుణశ్రీ, ఉత్పల సత్యనారా యణాచార్య, మిరియాల రామకృష్ణ, అంతటి నరసింహము, రెడ్డి రాఘవయ్య, ఇల్లిందల సరస్వతీదేవి, కె. రామలక్ష్మి, గంగరాజు సుశీలాదేవి, బి.వి. నరసింహా రావు, నండూరి రామమోహనరావు, కాశింఖాన్, జె. బాపురెడ్డి మడిపడగ బలరామాచార్య వల్లభనేని కాశీవిశ్వనాథము, కవిరావు, సమతారావు మున్నగువారు బాలసాహిత్యమునందు అనేక ప్రక్రియలు చేపట్టి వినోదవిజ్ఞాన ములను అందజేసిన చరితార్థులు.

తెలుగు బాలబాలికలకు విశిష్టమైన సాహిత్యమును సృష్టించి, బహు భంగుల వారికి అలవడజేసి బాలసాహిత్య పథనిర్దేశకులుగా ప్రఖ్యాతిల్లిన శ్రీ న్యాయపతి రాఘవరావు (బాలల అన్నయ్య), శ్రీమతి న్యాయపతి కామేశ్వరి గారలు బాల బాలికలకు 'సూరీడు' 'జాబిల్లి' [1] అయినారు.

అపారమైన సాహిత్యసృష్టి ఇటీవల బాలలకొరకు జరిగినను గేయనాటికా ప్రక్రియను ప్రప్రథమముగా చేపట్టి, విజయవంతముగా బాలబాలికలతో ప్రయో గించినవారు శ్రీ న్యాయపతి రాఘవరావుగారు. శ్రీ రాఘవరావుగారి కంటె పూర్వము గిడుగు సీతాపతిగారును మరికొందరు రచయితలును గేయకథలను

1. 'బాలభారతి'-'మా మాట' లో డా॥ ఇరివెంటి కృష్ణమూర్తిగారు. ప్రచురణ. యువభారతి (1977)

వెలయించియుండిరి. గేయకథలే అయినను అందులో నాటకీయత లేకపోలేదు. పాత్రలపేర్లు, వాని సంభాషణములు ఈ గేయకథలు కొన్నింటిలో సామాన్య రూపకములలో నున్నట్లే ఉన్నవి. కాని ఈ గేయకథలు గేయనాటికా సంకేత మును పొందలేదు. శ్రీ న్యాయపతి రాఘవరావుగారు తాము మద్రాసులో నున్నప్పుడు 1942లోనే తోడేలు-మేకపిల్ల అను గేయనాటికను రచించి మొట్ట మొదటిసారిగా ప్రయోగించినారు. ఆ తరువాత పుంఖానుపుంఖముగా వారు గేయనాటికలెన్నింటినో రచించి బాలబాలికలచేత రంగస్థలమునందును ఆకాశ వాణియందును ప్రయోగించినారు. బాలానంద సంఘమును స్థాపించి, బాలల గేయనాటికలను ప్రోత్సహించుటకై 1944-45 ప్రాంతమున దసరా ఉత్సవాల సందర్భమున పోటీలు నిర్వహించారు.

ఇక తెలుగులో వెలసిన బాలల గేయనాటికలను గూర్చి సంక్షేపముగా వివరింతును

శ్రీ న్యాయపతి రాఘవరావుగారు బాలబాలికల ఆలోచనా పరిధులను, అలవాట్లను, ఆటపాటలను, ముద్దుముచ్చటలను ఎరిగిన మనీషులు. పిల్లల మన స్తత్త్వమును సునిశితముగా పరిశీలింపగల సామర్థ్యమున్నవారు కనుకనే ఆయా రచనలలో పిల్లల ఊహకందని అంశము, నోటికందని మాట కానరావు. ఉన్న తాదర్శములు కూడ చిలుకపలుకుల వలెకాక, పిల్లల పలుకులవలెనే భాసించును. వీరు రచించి ప్రయోగించిన గేయనాటికలను పేర్కొని అందలి విశేషములను వివరింతును.

'తోడేలు-మేకపిల్ల', 'పొట్టిబావ-చిట్టి మరదలు', వేగుచుక్క, పూర్ణమ్మ కథ నాన్న-పులి శ్రీరామజననము, కుంటి-గ్రుడ్డి, దోమా-దీపము, మురళీ-మంత్రగాడు, కుందేలు-తాబేలు, పాలరాయి, బొమ్మలపెళ్ళి, చిలుకమ్మపెళ్ళి, ఎలుకమ్మపెళ్ళి- ఇత్యాదులు శ్రీ రాఘవరావుగారి గేయనాటికలు పశుపక్ష్యా దుల స్వరూప స్వభావములను, ప్రకృతిలక్షణములను బాలబాలికలకు తెలియ జేయుచునే చక్కని నడవడిని బోధించుటలో శ్రీ రాఘవరావుగారు కడు నేర్ప రులు. తెలుగు లోగిళ్ళలోని ఆచార సంప్రదాయములను, ప్రత్యేకించి పిల్లలకు సంబంధించిన సంబరాలను కొన్ని గేయనాటికలలో వారు తెలిపినారు.

దాహమును తీర్చుకొనుటకు నదికివచ్చిన మేకనుచూచి నీటిని మింగివేసెనని తోడేలు దానిని మ్రింగుట 'తోడేలు-మేకపిల్ల' యందలికథ. సంక్రాంతి పండుగకు వచ్చిన బావతో మరదలు హాస్యాలాపము 'పొట్టిబావ-చిట్టిమరదలు' లోని విషయము. వేగుచుక్క మొలవగానే అందరు మేల్కొన్న సంగతి 'వేగుచుక్క' యందలి కథ. ఏదేని ఒక క్రొత్త విషయమును తెలిసికొనదలచినపుడు పిల్లల మనోముకురము మీద ప్రతిఫలించు తలపుల వెలుగురేకలు సహజసుందరముగా ఈ నాటికలో చిత్రితములైనవి. గురజాడ అప్పారావుగారి 'పూర్ణమ్మకథ'ను శ్రీ రాఘవరావుగారు గేయనాటికగా మలచి ప్రయోగించినారు. అదియే పూర్ణమ్మకథ. అబద్ధములాడిన పిల్లవాడు చివరకు పులివాతపడిన ప్రసిద్ధమైన ఉదంతము. 'నాన్న-పులి'లోని వస్తువు. 'శ్రీరామజననము' ఎల్లరెరిగిన రామకథాంశమే. సికిలవారి మడుకుతనము, బాలభటోద్యమము (Scout movement), వికలాంగులకు వృత్తివిద్యా శిక్షణము భూమికగా మలచబడిన నాటిక - 'కుంటి-గ్రుడ్డి'. తల్లిమాట వినని బిడ్డకు హానితప్పదను నీతిని అన్యాపదేశముగా ప్రబోధించు గేయనాటిక 'దోమా-దీపము'. 'Pied piper' అను జర్మనుకథ ఆధారముగా అల్లబడిన నాటిక 'మురళీ-మంత్రగాడు', తన మంత్రశక్తి సమన్వితమైన మురళితో నగరమును ఎలుకలబారినుండి తప్పించిన ఒక మాంత్రికునికి, నగరజనులు ప్రతిఫలము మాటయిచ్చినమేరకు ఈయకపోగా, ఆ నగరమునందలి బాలబాలికలను ఆ మాంత్రికుడు వెంటగొనిపోయిన ఉదంతము ఇందలి వస్తువు. 'కుందేలు-తాబేలు' కథ ప్రసిద్ధమైన పంచతంత్ర కథలలోనిదే. రాత్రివేళ భూమిపై దిగిన సూర్యచంద్ర కిరణ బాలబాలికలలో ఇద్దరు మాత్రము ఇలపై నిలిచిపోయి పాలరాయిగా మారిన ఊహాసుందరమైన ఇతివృత్తము 'పాలరాయి'. 'మూడు పెళ్ళిళ్ళు' అను నాటికా సంపుటిలో 'బొమ్మలపెళ్ళి' ఒక గేయనాటిక. లక్ష్మీమాధవులు వధూవరులుగా బాలబాలికలు పెళ్ళివారుగా ఆడిన గేయనాటిక ఇది. సంపదకన్న సౌశీల్యము మిన్నయన్న సందేశము నందించునది ఈ నాటిక. ఈ నాటిక శ్రీ న్యాయపతి రాఘవరావు, శ్రీమతి న్యాయపతి కామేశ్వరిగార్ల సంయుక్తరచన. పక్షులు, లతలు చేసిన పెండ్లి 'చిలుకమ్మపెండ్లి' అను నృత్యనాటికగా రూపుదిద్దుకొని విశేషప్రశంసలకు పాత్రమైనది. దీనికి మూలము కీ॥ శే॥ డా॥ గిడుగు సీతాపతిగారి 'చిలుకమ్మపెండ్లి' అను గేయకథ. తన జాతిని

మరచిన ఎలుకకు జ్ఞానోదయమగుట 'ఎలుకమ్మ పెండ్లి' అను నాటికలోని వస్తువు. ఇందుకొన్ని ప్రకృతిశక్తులను గూర్చిన పరిచయమున్నది.

డా॥ సి. నారాయణరెడ్డిగారు పిల్లలకొరకు 'తోటతల్లి' ('సమతాఫలం') అను నాటికను రచించినారు. పిల్లల ఆటపాటలు భూమికకాగా, ప్రకృతి అందచందములను అనుభవించు అధికారము అందరకును కలదనియును మానవులందరు సమానులే అనియును ప్రబోధమును కలిగించు నాటిక ఇది.

శ్రీ అలపర్తి వెంకట సుబ్బారావుగారు ముద్దు ముచ్చట, ఎవరి మామ, ఉంగరం బొంగరం, తమాషా జవాబులు. బాబు - తల్లి అను చిన్నచిన్న సంవాదాత్మకములగు నాటికలను రచించినారు. ఇవి 'పిల్లవర్గోని' అను వారి బాలగేయ సంపుటిలో ప్రకటితములు.

శ్రీ 'లవణం' గారి 'బాల నాటికలు' అను సంపుటి యందలి 'అల్లరి పిల్లలు' అను నాటికలోని కొన్ని సంభాషణలు గేయాత్మకముగా సాగినవి. ఇందు వచనమధికము

'బాలబంధు' శ్రీ బి. వి. నరసింహారావుగారు ప్రియదర్శి, కొండమీద ఇల్లు, గులాబీలు అను నాటికలను రచించినారు. 'ప్రియదర్శి' అను నాటిక 'ప్రియదర్శి' అను గేయ సంకలనము నందున్నది. ఇది చారిత్రాత్మకము. కళింగ యుద్ధము తర్వాత అశోకుని హృదయ పరివర్తనమును, బౌద్ధమత దీక్షాగ్రహణమును వర్ణించు ఘట్టములిందున్నవి. ఒక వృద్ధ వీరమాత "నాబోటి ముదుసలుల - నందరిని కడతేర్చి - కడుపు చిచ్చులనార్పి - కట్టుకోపుణ్యమ" ను మాటతో అశోకుని హృదయము ద్రవించిన ఘట్టము కరుణ రసార్ద్రము. ఈ నాటికలో ముదుసలి తల్లి తన వీరకుమారునితో పల్కిన -"నిను పెంచిన ఈ విశాల - నిర్మలధాత్రీమతల్లి - ఋణము దీర్చుకొశక్తిని - పణము పెట్టి రణ స్థలిని" అను మాటలు ఆదర్శ వీర మాతృమూర్తిత్వమును చాటుచు బాల బాలికల గుండెలలో దేశభక్తి వీరమును ప్రదీప్తము చేయుచున్నవి.

'కొండమీద ఇల్లు' 'బాలలోకం'అను సంపుటిలోనిది. దీనిని శ్రీ నరసింహా రావుగారు గేయనాటిక అనకున్నను గేయనాటికాలక్షణమునకిది లక్ష్యముగా ఉన్నది. నక్క, తోడేలు, ఎలుగుబంటి ఇందలి దుష్ట పాత్రలు. కప్ప, చుంచు,

కోడిపుంజు, ముళ్లపంది – ఇవి ఉత్తమ స్నేహ పాత్రలు. సజ్జనులు సమైక్య భావముతో శత్రువుల బారినుండి తమను తాము సంరక్షించుకొనగలుగుదురను సందేశము నందించు నాటిక ఇది.

జాతిరత్నము పండిత జవహరులాల్ నెహ్రూగారి జన్మదినోత్సవమును పిల్లల పండుగగా జరుపుకొనుట ఇటీవల మన దేశములో నెలకొన్న సత్సంప్రదాయము. ఈ వేడుకల సందర్భముగా రచింపబడిన నాటిక 'గులాబీలు'. ఈ నాటికయందలి పాత్రలు పెద్దగులాబీలు, చిన్నగులాబీలు, తోటమాలి, బాటసారి. "ప్రపంచమే ఒక గులాబి తోటై – ప్రతిమనిషీ ఒక గులాబి పువ్వై – గులాబి పువ్వుల గుబాళింపులా – మనిషి జీవితము మారిననాడు – లోకము నాకము కాగలదు ముమ్మాటికి స్వర్గము కాగలదు" అను సందేశపరిమళము నందించు నాటిక 'గులాబీలు.'

శ్రీ యం ప్రభాకరరావుగారు 'పాపాయి తువ్వాయి' అను గేయ సంపుటిని ప్రచురించినారు. అందులో 'చుక్కలు – రెక్కలు', 'తల్లి – బిడ్డ', 'జాలరిబాల', 'తుమ్మెదలు – తేనెటీగలు' అను గేయనాటికలున్నవి.

చంద్రమండలము నందలి విశేషములను బాలురకు తెలుపుటకు మిక్కిలి మనోహరమైన శైలిలో రచింపబడిన గేయనాటిక 'చుక్కలు – రెక్కలు'. ఆధునిక విజ్ఞాన విశేషములు, రాకెట్టు ప్రయాణము ఇందు వర్ణింప బడి యుండుట చేత పిల్లలలో వైజ్ఞానిక సంస్కారమును అలవడజేయుటకు రచయిత ప్రయత్నించినాడని ఊహింపవచ్చును.

తల్లికిని బిడ్డకును జరిగిన సంవాదముద్వారమున పిల్లిఅలవాట్లను స్వభావమును తెలుపుచు ఇంటిదొంగను ఈశ్వరుడుకూడ పట్టలేడను సామెతను హృదయంగమముగా వివరించినారు శ్రీ ప్రభాకరరావుగారు 'తల్లి – బిడ్డ' అను గేయ నాటికలో.

సముద్రములో ఆణిముత్యాలు, రతనాలు లభించునను కవిసమయమును, స్వాతిచినుకులు ముత్యపుచిప్పలో పడి ముత్యములగునను సాంప్రదాయక విజ్ఞాన విశేషములను బాలబాలికలకు చక్కగా తెలియజేయు నాటిక 'జాలరిబాల'.

తుమ్మెదలు, తేనెటీగలు, సీతాకోక చిలుకలు, కోకిల పాత్రలుగా, కలసియున్నచో కలదు సుఖమనియును పోరు నష్టమనియును నీతిని బోధించు నాటిక

'తుమ్మెదలు – తేనెటీగలు'. రణదాహమును అభిశంసించుచు శాంతిమార్గమును ప్రేరేచు సందేశము ఈ నాటికయందు ధ్వనించుచున్నది.

శ్రీ చింతా హనుమంతరావుగారు 'తోడేలు – గొఱ్ఱెపిల్ల' అను సంవాదాత్మకమైన గేయనాటికను వ్రాసినారు. ఇది 'అభినయ గేయములు' అను సంపుటిలో ఉన్నది.

జాతీయోద్యమములో పాల్గొన్న దేశభక్తులు శ్రీ వల్లభనేని కాశీ విశ్వనాథముగారు 'తాతా మనుమడు' 'అమ్మా కొడుకు' అను గేయ కావ్యములు రచించినారు. ఇవి సంవాదాత్మకముగా సాగి నాటకీయతను సంతరించుకొన్నందున గేయనాటికలవలెనే భాసించుచున్నవి. ఈ కావ్యములు భారతదేశ స్వాతంత్ర్యసమరమును, జాతీయ కాంగ్రెసు సాగించిన స్వాతంత్ర్యోద్యమమును చక్కగా వివరించుచు భావి భారత పౌరులైన బాలబాలికల హృదయాలలో వినిర్మల దేశభక్తి బీజములను నాటుచున్నవి.

శ్రీ వింజమూరి శివరామారావుగారు 'బాల వికాసం' అను చక్కని నృత్యగేయనాటికను రచించినారు. బాలబాలికలందరు తమ దేశమును, ధర్మమును, దైవమును సేవించుచు సమైక్య దృక్పథమును, క్రమశిక్షణను అలవడ జేసికొనవలయునని ప్రబోధించు నాటిక 'బాల వికాసం.' పాఠశాలను పూదోటగను, బాలబాలికలను పూలుగను, అధ్యాపకుని తోటమాలిగను చిత్రించుట ఈ నాటికలోని హృద్యాతిహృద్యమైన అంశము.

శ్రీ సమతారావుగారు 'గేయ కథలు' అను సంపుటిలో కొన్ని గేయ నాటికలను కూడ చేర్చి ప్రచురించినారు. 'సాలీడు-ఈగ' 'పండుగనాడు', 'నక్కగారి అక్కసు', 'రాముడు - చంద్రుడు', 'చట్టప్రకారం' అను సంవాదాత్మకములైన వానినికూడ వారు గేయకథలన్నారు. కాని వీని లక్షణములను పరిశీలించినమీద వీనిని గేయనాటికలనుటలో సాహసము లేదనుకొందును.

"ఉబ్బు మాటలకు తబ్బిబ్బయి మీరుచ్చులలో పడబోకండి" అను చక్కని నీతిని ఉపదేశించిన నాటిక 'ఈగ – సాలీడు'.

ప్రపంచములోని ఆర్థిక సామాజిక వైషమ్యాల నిర్మూలనమునుగూర్చి జిజ్ఞాసను పురికొల్పుట 'పండుగనాడు' అను నాటికయందలి ఉద్దేశము. ఇందలి పాత్రలు, సంఘటనలు మిక్కిలి సహజములు.

కుందేటిని పొట్టబెట్టుకొనుటకు సముకట్టిన నక్కతానే ఉచ్చులో చిక్కుకొని పోయిన ఉదంతముద్వారమున "ప్రజలను దోచే దుష్టప్రభువుల - జిత్తులఎత్తులు సాగవ" ను ప్రజాస్వామ్యస్ఫూర్తిను కలిగించు నాటిక 'నక్కగారి అక్కసు'.

ప్రకృతి అందరిసొత్తు, చందమామ అందరికి మామ అన్న సత్యమును పరమ రమణీయముగా అతిసహజముగా తెలుపు గేయనాటిక 'రాముడు - చంద్రుడు'.

తాము పలికినదే సత్యము, చేసినదే ధర్మము అనుచు సంఘముపై పెత్తనము చెలాయించు బలవంతులను వ్యంగ్యముగా చిత్రించిన వైనము 'చట్టప్రకారం' అను గేయనాటికలో కనిపించును. నక్కలు, కుక్కలు, తోడేళ్ళు, కుందేళ్ళు, పులులు, గబ్బిలాలు, కోతులు, కొండచిలువ ఇందలి పాత్రలు. ఇంగ్లీషులో 'Jungle law' అను ఒక పదబంధమున్నది. బల మెవనిదో చట్టము వానిదగునని ఈ పదబంధమున కర్థము. ఈ నాటికకు ఊపిరి ఈ పదబంధమని ఊహింపవచ్చును.

శ్రీమతి గంగరాజు సుశీలాదేవిగారి గేయనాటిక 'యశోద - కృష్ణుడు' సంవాదాత్మకము. ఇందులో వెన్నదొంగయైన శ్రీకృష్ణుని పట్టుకొనలేని యశోద భూమిక రమణీయము.

శ్రీ బాపురెడ్డిగారు నవభారత నిర్మాత పండిత జవహర్‌లాల్ నెహ్రూ జన్మదినోత్సవ సందర్భమును పురస్కరించుకొని 'చాచా నెహ్రూ' అను రమ్య గేయనాటికను రచించినారు. "హిమవన్నగశిఖరం వంటి చాచాజీ బ్రతుకులోయల్లో వికసించే పసిపాపల ఆలోచనలలో పాలుపంచుకోవటం ఈ గేయనాటికలోని ఇతివృత్తం" అని శ్రీ రెడ్డిగారే తెలిపినారు. ఈ నాటికయందలి పాత్రలు గులాబీలు, బాలబాలికలు, చాచాజీ, సమకాలిక సమాజమునందలి స్వార్థము, సంకుచితత్వము, వంచన అభ్యుదయ సాధనలో ఆటంకములుగా నిలిచిన దుఃస్థితిని ఎత్తిచూపుచున్నది ఈ నాటిక. "పారతంత్ర్యమును ఏ రూపముననున్న చీల్చండి- కులమత నిర్మిత విభేద-కుడ్యాలను కూల్చండి" అనుచు భావిపౌరులగు బాలబాలికలను ఈ నాటికద్వార ప్రబోధించినారు శ్రీ బాపురెడ్డిగారు.

నాకు లభించిన ముద్రితాముద్రిత బాలల గేయనాటికలను పరిశీలించి వివరించితిని. నా దృష్టికి రానివి కొన్ని ఉండవచ్చును. బాల గేయ నాటికల

స్వరూప స్వభావములను దిఙ్మాత్రముగా తెలుపుటకు చేసిన నా ఈ ప్రయత్నము నిశ్శేషమును సమగ్రమును కాదని సహృదయులకు మనవి చేసికొనుచున్నాను. తెలుగుగేయనాటికలను అనుశీలించవలసి వచ్చినప్పుడు బాలనాటికలను కూడ స్పృశించుట సముచితముగ నుండునను అభిప్రాయముతో ఈ ప్రకరణమును వ్రాసినాను. ఈ సందర్భమున ఇతోధికమైన పరిశోధన జరుగుటకు అవకాశమున్నదని ఊహించుచున్నాను.

---

# సినీమా గేయనాటికలు

సినీమా కళ సర్వకళలకళల సమాహారము. అన్ని కళలను సామాన్యు డాస్వాదించలేడు. అతడుత్కళాస్వాదనతత్పరు డైనంతమాత్రమున చాలదు. ఆస్వాదించవలెనను కోరిక ఎట్లున్నను వానినిచూచుటకై నను ద్రవ్య మవసరము. ప్రత్యక్షముగా భరతనాట్యమును చూడదలచుకొన్నవాడు ఎంతోకొంత వ్యయ పరచవలసియే ఉండును. వివిధ దేశముల ప్రకృతి సౌందర్యమును తిలకించవలె నన్నను, మహోన్నత ప్రమాణములందుకొన్న సంగీత నృత్య నిపుణుల ప్రదర్శన ములో పాల్గొనవలెనన్నను సామాన్య మానవునికి ద్రవ్యాభావ మొకటి పెద్ద ఆటంకమై నిలుచును సామాన్యునికి కూడ సినీమా వలన ఈ కళానుభూతి సాధ్యమైనది. సామాన్యనాటకరంగముపై ప్రయోగించుటకు వీలులేని దృశ్యముల నెన్నింటినో సినీమాలో చూపవచ్చును. సినీమా కూడ రూపకము నకు ప్రతిరూపమే అయినను దీనికున్న వ్యాప్తి అత్యధికము. రేడియోలో శ్రవ్య గేయనాటికలు అంతగా ప్రభావోపేతములు కాకపోవచ్చును. ప్రత్యక్షముగా సురుచిరవేషములతో సమలంకృతమైన వేదికపై పలువన్నెల విద్యుత్కాంతు లతో నటులు ఆడుచు పాడుచు గేయనాటికాప్రయోగము చేయుచున్నపుడు కలుగు ఆనందము అనన్యసామాన్యము. రేడియో, సినీమా, టెలివిజన్ ప్రబల మైన ప్రచార సాధనములు.

నాటకములవలెనే గేయనాటికలు కూడ వెండితెరకెక్కి అపూర్వమైన శోభను సంతరించుకొన్నవి. సాంకేతికమైన సాహాయ్యము అనల్పముగా సినీమా లలో లభ్యమగుటకు అవకాశమున్నది కనుక గేయనాటికా రచయితలు తమ రచనా సామర్థ్యమును యథోచితముగా ప్రదర్శించుకొనగలుగుదురు. తెలుగు సినీమాలు ప్రారంభమైనప్పటినుండి గేయనాటికలు అందు ప్రయోగింపబడి ఉండెనేమో నాకు తెలియదు అన్ని సినీమాలకు సంబంధించిన 'వెండితెర సంభాషణలు – పాటలు' లభ్యమగు స్థితిలో లేవనుట అందరు ఎరిగిన అంశమే. నాకు లభ్యమైన కొన్ని గేయనాటికలున్న తెలుగు సినీమాలను ఉదాహరించు చున్నాను.

'పెండ్లిచేసిచూడు', 'పెద్దమనుషులు', మున్నగు తెలుగు చిత్రములలో చాలా గేయనాటికలున్నవి. ఇటీవల ఆచార్య డా॥ సి. నారాయణరెడ్డిగారు బంగారు మనిషి, మొనగాడు, నిండుదంపతులు, రంగేళీరాజా, మాయనిమమత, మనుషుల్లో దేవుడు, ఆరాధన మున్నగు సినిమాలకు గేయనాటికలు రచించినారు. స్వప్నవాసవదత్త, అభిజ్ఞాన శాకుంతలము, మనుచరిత్రము వంటి మహా కావ్యాలనుండి వస్తువును గ్రహించి, సామాన్యునికి కూడ అందుబాటులో నుండు సరళమైన భాషలో గానన్పత్యాభినయ యోగ్యముగా మలచి హృదయంగమముగా రచించినారు శ్రీ నారాయణరెడ్డిగారు. సుప్రసిద్ధ నటీనటులతో ఉన్నత ప్రమాణములందుకొన్న సంగీతాభినయములతో నయనానందకరమైన ఛాయాగ్రహణ కళావిన్యాసములతో బహువర్ణ సమంచితములై ఈ గేయనాటికలు సరసుల హృదయములపై చెరగని ముద్రలు వేసినవి. మునుముందు టెలివిజన్‌లో ఈ గేయనాటికలు సాధింపగలుగు ప్రయోజనములకై సహృదయులెల్లరు ప్రతీక్షించుచున్నారు.



# 10. గేయనాటికల స్వరూప స్వభావములు

నాట్య శాస్త్రమునందు భరతుడు నిర్వచించిన నాటకాది దశవిధరూపకములకు భిన్నములై సంగీత సాహిత్యాభినయములకు త్రివేణీసంగమములై విలసిల్లిన నాటికాపట్టిక శ్రీ గదితపారిజాతాది నృత్య సంగీత ప్రధానములైన రూపక విశేషములను లాక్షణికులు నృత్త ప్రకారములనియును, రాగ కావ్యములనియును, గేయరూపకములనియును పేర్కొనిరి. ఇట్టి రూపక విశేషములను విశ్వనాథుడు సాహిత్య దర్పణమున తొలిసారిగా ఉపరూపకములని నామకరణము చేసినాడు. ఇట్లు ఈ జాతికి చెందిన ఉపరూపకములుగా వ్యాప్తి చెందుటచేత ఇవి సామా అను భ్రాంతికి పలువురు లోనైనట్లు కానిపించును ప్రధానములుగా సంస్కృతములో వెలసిన విశిష్టరూపకములు. తెలుగులో దాదాపు ఆ ఉపరూపకములవంటివే శతాధికసంఖ్యలో కడచిన నాలుగైదు దశాబ్దములనుండి గేయనాటికలను పేర రచింపబడుచున్నవి.

**గేయనాటికలు - పర్యాయపదములు :** తెలుగు గేయనాటికాకర్తలు తమ గేయనాటికలను వివిధనామములతో సమలంకరించినారు. శ్రీ శివశంకరస్వామివారు 'పద్యగేయనాటిక' లనియును 'గేయనాటికల'నియును ఈ విశిష్ట ప్రక్రియకు సంకేతము నిచ్చినారు. శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావుగారు 'గేయనాటికల'నియును 'సంగీత నాటకాల'నియును 'గేయనాటకాల'నియును వ్యవహరించినారు. కాని తమ 'విశ్వవీణ' అను గేయనాటికల సంపుటి యందు 'నృత్యనాటికల'ను కూడ చేర్చినను వాని నన్నింటిని గేయనాటికలుగానే పేర్కొన్నారు. శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు తమ 'పాముపాట' అను 'సంగీత కృతి'ని 'సంగీత రూపకము' అన్నారు. శ్రీ వోగి నరసింహశాస్త్రి, శ్రీ వావిలాల సోమయాజులుగారలు తమ గేయనాటికలకు 'గీతినాటికలు' అని పేరుపెట్టినారు. శ్రీ సూరంపూడి భాస్కరరావుగారు తమ గేయ నాటికలను 'గీతికానాటిక' అని అచ్చొత్తించినారు డా॥ సి. నారాయణరెడ్డిగారు గేయ నాటికలను గేయ నాటికలనియును 'సంగీత రూపకము' లనియును 'నృత్యగేయ రూపకముల'నియును సూచించినారు. డా॥ యస్వీజోగారావుగారు వీనిని 'గేయ నృత్యనాటికలు' గను 'గేయ రూపకములు' గను పేర్కొనుటయేగాక "ఇట్టి

రూపక ప్రక్రియకు వ్యవహారసౌలభ్యార్థము 'అప్సరస' అని వ్యపదేశము చేసిన బాగుగ నుండు"నను అభిప్రాయమును వ్యక్తపరచినారు. సంగీత నృత్యములు లేని అప్సరస్సాక్షాత్కారము అసంభవము కావున ఈ రెంటికిని ప్రాముఖ్యమున్న గేయనాటికను 'అప్సరస' అని సంకేతించుటలో ఔచిత్యమున్నదని ఆచార్య డా॥ జోగారావుగారి హృదయమై ఉండును. శ్రీ దేవులపల్లి వేంకటకృష్ణశాస్త్రిగారు గేయ పద్యవచన సంయుతములైన శ్రవ్యనాటికలను 'గేయాత్మకము'లని 'సంగీత చిత్రము'లని సంకేతించినారు. డా॥ జోయి
న్నగారు తమ గేయనాటికలను 'నృత్య గేయరూపకములు'గా 'సంగీత
ాటికలు'గా 'నృత్యగానసాహితి'గా, 'సంగీత నృత్య నాటకములు'గా
రు. శ్రీ బాపురెడ్డిగారు 'గేయనాటిక' అనియు 'నృత్యరూపక'
మను న్నారు. శ్రీయుతులు ఆచారి - ఉపశ్రీగారలు 'సంగీత రూపక' మన్నారు. శ్రీ చెరుకువల్లి జమదగ్నిశర్మగారు 'నేపథ్యగేయరూపకము' అని తమ గేయనాటికను పేర్కొన్నారు. డా॥ నండూరి రామకృష్ణమాచార్యగారు గేయ పద్య మిశ్రితములైన తమ నాటికలను 'నృత్యరూపకములు' అని అన్నారు. ఈ విధముగా నేటి గేయనాటికాకర్తలు గేయనాటికలకు చేసిన వివిధ నామకరణములు నాటి ఉపరూపకములలో ప్రాధాన్యము వహించిన నృత్య గేయములను తలపునకు తెచ్చి గేయనాటికలకు 'నృత్యము' అనివార్యమని భంగ్యంతరముగా చెప్పుటకు ప్రయత్నించినారు.

**ప్రక్రియావైవిధ్యము** : గేయనాటికలను ప్రక్రియాదృష్టితో పరిశీలించినప్పుడు ఆరు విధములుగా కానిపించుచున్నవి. 1. గేయపద్య వచనాత్మకములు 2. గేయపద్యాత్మకములు. 3. గేయవచనాత్మకములు. 4. గేయవచన కవితాత్మకములు 5. గేయపద్యవచన కవితాత్మకములు. 6. గేయాత్మకములు.

గేయనాటికలన్నియు స్థూలముగా దృశ్యనాటికలుగను, శ్రవ్యనాటికలుగను ప్రయుక్తములగుచున్నవి. అయినను ఒక విశేషమున్నది. సౌలభ్యమును బట్టి కొన్ని శ్రవ్యనాటికలు దృశ్యములుగా కూడ ప్రయోగింపబడుచున్నవి.

**ఇతివృత్త విభాగము** : గేయనాటికలలోని ఇతివృత్తమును నాటికాకర్తలు విభజించి, ఆ విభజనమునకు వేర్వేరు పేర్లను పెట్టినారు. ఎవరును ఒక నియతిని పాటించినట్లు కనబడదు. శ్రీ శివశంకర స్వామివారు తమ గేయనాటిక

లను రంగములుగానే విభజించినారు. ఒక్క నాటికను ('రత్నాకరము') మాత్రము పూర్వోత్తర విభాగములుగా విభజించినారు. ఇక ఇతర నాటికా కర్తలు రంగములుగను, సంఖ్యాత్మక విభాగములు (1, 2, 3,...) గను, 'దృశ్యములు'గను, 'సన్నివేశములు'గను 'తరంగాలు' గాను, 'అంకములు' గాను తమ నాటికలందలి ఇతివృత్తమును విభజించినారు. శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావుగారు 'చండీదాసు'అను తమ గేయనాటికను 'పూర్వరంగము'తో ఆరంభించి, ఐదు రంగములను ప్రవేశపెట్టి, 'ఉత్తరరంగము'తో ముగించినారు. ఈ రంగవిభజనమందు ఒక విశిష్టప్రయోగము చేసినారు. శ్రీయుతులు ఆచారి-ఉషశ్రీగారలు. వారు ఆయారంగములందలి కథాంశమునుబట్టి ఆయా రంగములకు శీర్షికలను సమకూర్చినారు. శ్రీ ఎం. కె. రాముగారు వీరి అడుగు జాడలలో నడిచినారు.

సంప్రదాయసిద్ధములైన రూపకములలో కానిపించు ఐక్యత్రయము (కార్యైక్యము-Unity of action, కాలైక్యము-Unity of time, స్థలైక్యము-Unity of place), పంచసంధులు గేయనాటికలలో అరుదుగా గోచరించును. అయినను పంచసంధులలో ఏ ఒక్కటియును లేని రూపకమును ఊహింపజాలము కదా ! నేటి గేయనాటికలలో ఇతివృత్తమునకు అంతగా ప్రాముఖ్యముండదను అంశమును ఇదివరకే చెప్పియుంటిని. సంధ్యంగములు కథాగమనమును అవగాహనము చేసికొనుటకు తోడ్పడును. కథయే పరిపుష్టముగ లేనప్పుడు ఇక ఆ అంగములజోలికి రచయితకాని సామాజికుడుకాని పోవలసిన అగత్యమేది? ప్రాచీనలాక్షణికులు చెప్పిన నాటికాలక్షణములకును ఈనాటి నాటికలకును కేవలము నామములోనే సామ్యమున్నది. ఇక గేయనాటికలు పోయిన, పోవుచున్న పోకడలకును లాక్షణికులు చూపిన మార్గములకును పొత్తుకుదుర్చుట నిర్హేతుకము.

**సంకేత పదములు :** గేయనాటికా కర్తలలో పలువురు రూపప్రక్రియకు సంబంధించిన సంప్రదాయసిద్ధములైన కొన్ని సంకేతపదములను - నాంది, స్థాపన, సూత్రధారుడు, నటి, ప్రవేశిక, అంకము, భరతవాక్యము వంటివానిని ఉపయోగించినను అన్ని సందర్భములందును సంప్రదాయ సిద్ధమైన నిర్వచనమునుగాని ప్రయోజనమునుగాని దృష్టియందుంచుకొని వారట్లుచేసియున్నట్లు తోచదు, ఫలశ్రుతి, ప్రయోక్త, వ్యాఖ్యాత వంటి వ్యవహార క్షుణ్ణములైన పదములను నాటికలలో ఆయా చోటులలో సార్థకముగానే ప్రయోగించినారు.

నేపథ్యగానము, బృందగీతి, స్వరమేళ, వాయుగానము, కథాకథన బృంద గానము, ఆకాశవాణి, ప్రకటన, సంధివచనము, ప్రయోక్తవంటి కొన్ని సంకేత పదములు ఈ గేయనాటికలలో కవులు ప్రయోగించి సంప్రదాయసిద్ధములైన రూపకములలోని విష్కంభ ప్రవేశకాది సూచ్యార్థములవలన కలుగుప్రయోజనములను సాధించినారు. ఈసందర్భమున కూడ ఒకనియతి లేక తమకు తోచిన సంకేతమును వాడుకొన్నారు. జరిగినవియు జరుగబోవునవియు అయిన కథాంశములను సూచించుటకును, ఇతివృత్తమును సంక్షేపించుటకును. నృత్యసంగీతముల ద్వారా అంతగారక్తికట్టించలేని సన్నివేశములను ప్రేక్షకులకు తెలుపుటకును ఈ సంకేతములను కర్తలు ప్రయోగించినారు.

**వస్తువైవిధ్యము :** గేయనాటికలో ఇతివృత్తము రేఖామాత్రముగా నుండి అది కొన్ని రసవత్తర సన్నివేశములుగా విభక్తమగును. నవలలో వ్యక్తిసమగ్ర జీవితము ప్రతిబింబించును. కథానికలో ఒకటి రెండు సన్నివేశములలో పాత్రల మనస్తత్త్వము వ్యక్తమగును. ఈ రెంటికిని గల భేదమే నాటకమునకును గేయనాటికకును కానిపించును. గేయనాటికలలో పౌరాణిక, చారిత్రిక, సాంస్కృతిక ప్రబోధాత్మక అనుసరణాత్మక ప్రాకృతిక సాంఘిక ఇతివృత్తములు కనిపించుచున్నవి. బాలబాలికలకు ప్రత్యేకించి గేయనాటికలున్నవి. నేటి సినిమాలలోను గేయనాటికలను ప్రవేశపెట్టి ఈ ప్రక్రియకు ఎనలేని ప్రజాదరణమును కవులు కలిగించుచున్నారు. అన్ని సాహిత్య ప్రక్రియలకును ఇటువంటి విభజనము సహజమే కాని మొదటి పదునైదు నిమిషములలోనే రక్తికట్టించి నాతిదీర్ఘముగా నిర్వహించుటలో గేయనాటికకున్న ప్రత్యేకత గమనింపదగినది.

**రసము :** సంగీతము సాహిత్యాభినయములతో పెరుగులిడునపుడు ఏ రసమునైనను పోషింపగలదు. గేయనాటికలలో శృంగారాది నవరసములు పుష్టిగా పోషింపబడినను తెలుగు సాహిత్యమునందు హాస్యరసము అరుదు అను అంశము ఈ ప్రక్రియలో కూడ మనకు కనిపించకమానదు.

**భాష :** గేయనాటికలకు ఆద్యులైన శ్రీ శివశంకరస్వామివారు తమ నాటికలను సులభగ్రాంథిక భాషలోనే రచించినను ఆయన తరువాత వెలసిన గేయ నాటికాకర్తలలో పలువురు వ్యావహారిక గ్రాంథికభాషలను సమ్మిశ్రితము చేసియో లేక కేవలగ్రాంథికమును కేవలవ్యావహారికమును ప్రయోగిం

ఛియో నాటికారచనమును కొనసాగించినారు. పాత్రోచితభాషను కూడ ప్రయోగించవలెనను ఉద్దేశ్యముతో జానపదభాషను మాండలికములను ఉపయో గించిన సందర్భములు కూడ మనకు కనిపించును

**అన్యప్రక్రియా సాంగత్యము :** సినిమాలలో బుర్రకథ, హరికథ, యక్ష గానము వీధిభాగవతము, గేయనాటిక ప్రవేశించినట్లే గేయనాటికలో కూడ సంగీతాత్మకములైన కారణముచేత ఈ ప్రక్రియలు ప్రయుక్తములైనవి.

**పాత్రల పరిమితి :** ప్రప్రథమ గేయనాటికా కర్తలైన శ్రీ శివశంకర స్వామివారు, సఫల ప్రయోక్తలైన శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావుగారు గేయనాటికలలో పాత్రలసంఖ్య ఐదారింటికి మించకూడదని అభిప్రాయపడినను నేను పరిశీలించిన గేయనాటికలలో ఈ సమంజసమైన సూచనకు అపవాదములు కూడ లేకపోలేదు.

**ప్రదర్శనకాలము :** గేయనాటికలలో ఇతివృత్తము సుదీర్ఘముగ ఉండ కూడదు కనుక తక్కువ సమయములో ప్రదర్శనము ముగియవలెను మూడు గంటలకు మించి ఉండకూడదని శ్రీ శివశంకరస్వామివారు అభిప్రాయపడి నారు. ఒకరిద్దగు తప్ప రెండుగంటల ప్రదర్శనకాలమునకు మించిన రచనలు చేయలేదు ప్రదర్శన కాలము అరగంటకు మించని నాటికలును ఉన్నవి.

**రాగతాళ నిర్దేశము :** ఒకరిద్దరు తప్ప గేయనాటికాకర్తలు ఎవరుగాని తమ నాటికలలోని గేయములకు రాగతాళ నిర్దేశము చేసియుండలేదు.

డా॥ పి. ఎస్. ఆర్. అప్పారావుగారు ఆంగ్లమునందలి **'Melodrama'** అను సంకేతపదమునకు 'గేయరూపకము' అను అర్థమువ్రాయుచు "గేయ ప్రధానమైన రూపకమును 'మెలోడ్రామా' అందురు. 1599 లో ఇటాలియన్ నాటకకర్త రినూసిని ప్రప్రథమముగా ఈ జాతి రూపకమును రచించెను. ఇది వంద పండ్ల వరకును 'ఒపెరా' గానే చలామణి అయినది. జి ఎఫ్. హేండెల్ అనునతడు తన రూపకములకు రెండుపేర్లను వాడెను. అత్యాశ్చర్యకరములైన సంఘటనములు, తీవ్రములైన ఉద్వేగముల ప్రతిపాదనము, సుఖాంతమగుట అనునవి ఇందలి ముఖ్యలక్షణములు. క్రీ. శ. 18 వ శతాబ్దినాటికి ఈ జాతిరూపక

కములు సర్వలక్షణ సంపన్నములై ఆంగ్లనాటకరంగమున స్థిరపడినవి. ఆహ్లాద రూపకమునకు ప్రహసనమెట్టిదో, విషాద రూపకమునకు 'మెలోడ్రామా' అట్టిది ...... అతిలోక విషయములు (**Supernatural element**) ఇందు ప్రాధాన్యమును వహించును......"[1] అని వివరించినారు. ఈ వివరణమును బట్టి చూడగా 'మెలోడ్రామా' అనునది కూడ 'ఒపెరా' యే కాని 'ఒపెరా' వలె అది విస్తృత ప్రయోజనమును సూచించుటలేదు. అతిలోక విషయములకును ఆశ్చర్యకరములైన సంఘటనలకును మాత్రమే పరిమితమై అనివార్యముగా గేయబద్ధము కాని సంగీత ప్రాధాన్యమంతగాలేని 'మెలోడ్రామా' ను ఈ నాటి గేయనాటికకు సమానార్థకముగా భావించుటకు వీలుపడదు. కావున నేడు తెలుగులో వెలువడుచున్న సంగీత రూపకములనబడు గేయనాటికలకు ఇంగ్లీషులోని 'ఒపెరా' (**Opera**) అను పదమే సమానార్థకముగా గ్రహించుట సమంజసము.

'ఒపెరా' అను సంకేత పదమునకు బ్రిటానికా విజ్ఞాన సర్వస్వమునందు వివరణమిట్లున్నది—

**"Opera (Italian for 'work'), a drama set to music, as distinguished from plays in which music is merely incidental"[2].**

ఎవ్రీమాన్స్ విజ్ఞాన సర్వస్వము (**Everyman's Encyclopaedia**) నందు 'ఒపెరా'కు నిర్వచనమిట్లున్నది;—

**"Opera, drama of any description in which the text is wholly or partly sung and accompanied by an orchestra"[3].** కన్సైజ్ ఆక్స్ఫర్డ్ నిఘంటువు (**Concsire oxford dictionary**) నందు 'ఒపెరా' అను శబ్దమునకు అర్థమిట్లు వివరింపబడినది :

1. నాట్యశాస్త్రము - అనువాదము : పుట 552-553.
2. The Encyclopaedia Britannica - Page 121 vo-20. 13th edition 1926.
3. Everyman's Encyclopaedia - Page 310, vol-9. 5. th edition 1967,

"Opera : dramatic performance or composition of which music is an essential part"[1]

చేంబర్ ఆంగ్లనిఘంటువులో 'ఒపెరా' పదమునకు 'Musical drama' అను అర్థము వ్రాయబడినది [2]

The shorter oxford English dictionary లో 'ఒపెరా' కు వివరణ మిట్లున్నది;—

"Opera – a dramatic performance in which music forms an essential part, consisting of recitatives, arias and choruses, with orchestral accompaniment and scenery"[3]

Webster's dictionaryలో 'ఒపెరా' అను పదమునకు అర్థమిట్లున్నది:—

Opera : a drama set to music and made up of vocal pieces with orchestral accompaniment and orchestral overtures and interludes"[4]

The oxford companian to the theatre అను గ్రంథములో 'ఒపెరా' నిర్వచనమిట్లున్నది;—

"Opera is a dramatic compositon, intended to be represented on the stage, in which vocal and instru mental music plays an essential part. In a stricter sense, opera has been defined as a drama of which everyword is sung"[5]

శంకరనారాయణ ఇంగ్లీషు - తెలుగు నిఘంటువునందు 'ఒపెరా' అను శబ్దమునకు "సంగీత నాటకము, యక్షగానము – a musical drama" అను

---

1. The Concise Oxford Dictionary of Current English – Reprinted in India Page 848. (1968)
2. Page – 749 – Chamber's Twentieth Century Dictionary – Second Reprint 1970
3. Page 1452 – Oxford University Press 1973;
4. Page 591 – Webster's Seventh New Collegiate Dictionary – Indian edition –second Reprint – APril 1971
5. The Oxford Companian to the Theratre - Page 585

అర్థములున్నవి.[1] సంగీత ప్రధానమైన యక్షగానమును కూడ 'ఒపెరా' గా సంగీత నాటకముగా గుర్తించుట ఇందలి విశేషము.

ఇట్లు ఉదాహరింపబడిన వివరణములను అర్థములను పరిశీలించినచో జంత్రగాత్ర సంగీతములతో ప్రదర్శితమగు రూపకమే 'ఒపెరా' గా ఆంగ్ల సాహిత్యమునందు వ్యవహృతమగుచున్నట్లు భావింప వచ్చును.

తెలుగులో గేయనాటికలను ఎవరును నిర్వచించలేదు. కాని భరతుని నాట్యశాస్త్రమునకు ఆంధ్రానువాదమును వెలయించిన డా॥ పి.ఎస్.ఆర్. అప్పారావుగారు పాశ్చాత్యదేశములందలి కొన్ని ప్రధానరూపక భేదములను గూర్చి వివరించుచు—

"**Opera** (సంగీత రూపకము) - జంత్రగాత్ర సంగీతములు ప్రధానములైన రూపకము 'ఒపెరా' అనబడును. సూటిగా చెప్పవలెనన్నచో ప్రతిమాటను గానముచేయు పద్ధతిని 'ఒపెరా' అనవలెను..."[2] అని వ్రాసినారు.

సంగీత సాహిత్యముల సమన్వయ స్వరూపము గేయము. అభినయ రూపము నాటిక. నృత్యము అభినయాంశము. నృత్యగేయముల సంబంధము అవిభాజ్యము. అందువలన సంగీత సాహిత్య నృత్యాభినయములు గేయ నాటికాంశములు. ఈ అంశములను దృష్టియందుంచుకొని గేయాత్మకమైన నాటికను గేయనాటికయని నిర్వచింపవచ్చును.

---

1. An English – Telugu Dictionary–By P. Sankaranarayana–M, A; M.R.A.S. Revised and enlarged by. Gidugu sithapathi; Dr, Chilu Kuru Narayana Rao, M. A. Phd, Vedam Lakshmi Narayana Sastry B, A. B.ol– **Page** (907)–New revised and enlarged Tenth edition (1972).

2. నాట్యశాస్త్రము : అనువాదము–పుటలు–553–554.

# 11. గేయనాటికా ప్రయోగము

సహృదయులు లేనిదే కవితకు సార్థకత లేనట్లు ప్రేక్షకులు లేనిదే రూపకమునకు సాఫల్యములేదు. రూపకమును ప్రయోగింపవలసిన సందర్భమున పాటింపవలసిన సూత్రములనెన్నింటినో భరతుడు నాట్యశాస్త్రమునందు విశదపరచి ఉన్నాడు. అభినయము, రంగాలంకరణము, నటీనటులు, వాద్య సంగీతము, ప్రేక్షకులు ఇత్యాది విషయములను గూర్చి భరతుడు చేసిన సూచనలు నేటికిని ఉపాదేయములు. గేయనాటిక కూడ రూపక విశేషమే కనుక రూపక ప్రయోగమునకు వలసిన లక్షణములు దీనికిని సమన్వయించును. కాని గేయనాటిక సంగీతాత్మకమును, ఇతివృత్తమునకంతగా ప్రాముఖ్యము లేనిదియును, సామాన్యునికి అందుబాటులో నుండు వచనము ఇందు లేకపోవుటయును అగుటచేత నటుల అభినయమునందును, రంగాలంకరణమునందును, సంగీతాభిరుచిగల ప్రేక్షకులను సమకూర్చుకొనుట యందును మిక్కిలి జాగరూకత వహింపవలసియుండును.

నేను అనేక గేయనాటికలను రేడియోలో వినియున్నాను. అవి శ్రవ్యములు కాబట్టి రంగమునందు ప్రయోగింపవలసిన రీతులతో మనకు పనిలేదు. ప్రదర్శన యోగ్యములుగా ఆయా రచయితల చేత పేర్కొనబడిన శతాధిక గేయనాటికలను ప్రయోగదృష్టితో పరిశీలించిన మీదట, కొన్నింటిని రంగముపై ప్రదర్శింపగా చూచిన పిమ్మట, గేయనాటికను సఫలముగా ప్రయోగించుటకు నాకు తోచిన కొన్ని అంశములను ఈ దిగువ ఉదాహరించుచున్నాను.

**అభినయము:** వచనమును అభినయించుట వేరు గేయమును అభినయించుట వేరు. గేయనాటిక అనగా గేయాభినయమే. గేయాభినయము గేయమువలెనే రాగతాళగతి విన్యాసములపై ఆధారపడియుండును. ఈ రాగతాళగతి విన్యాసము నృత్తనృత్యములకు అతిసన్నిహితము. అందువలననే గేయనాటికలలో నృత్య పరిమళము గుబాళించుచుండుట సహజము. నృత్య సంబంధమైన గతివిన్యాసములో అధికముగా నాట్యధర్మి ప్రయుక్తమగుచుండును. భరతుడు ఈ విషయమును విస్పష్టము చేసినాడు. నాట్యధర్మి యననేమో వివరించుచు భరతుడు—

"మామూలుగా నడిచివెళ్ళుటకు బదులు లలితములైన అంగవిన్యాసము లతో, చతుస్త్రాలాది పరిమిత పాదగతులతో నృత్తమునందువలె నడచుట నాట్యధర్మియగును."[1] అని సూత్రీకరించెను. ఈ సూత్రమునకు ప్రయోగ రూపమే గేయనాటిక. గేయనాటికను గూర్చి భరతుడు ప్రత్యేకముగా చెప్పక పోయినను నేటి గేయనాటికా స్వరూపమును ఇది దిఙ్మాత్రముగా సూచించు చున్నది.

గేయాభినయము నృత్యమువలె భాసించుటచే గేయనాటికాభినేతలు నాట్యశాస్త్ర విదులై ఉండవలెనని బహు గేయనాటికాకర్తలును ప్రయోక్త లును అయిన శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావుగారు అభిప్రాయ పడినారు.[2] "గేయరూపకము నాటక రంగస్థలమున జయప్రదము కావలయునన్నచో నటులు నాట్యవేత్తలు కూడ కావలసియున్నది" అని డా॥ పి ఎస్.ఆర్. అప్పా రావుగారు తెలిపియున్నారు.[3] శ్రీ శివశంకరస్వామి, శ్రీ బాలాంత్రపు రజనీ కాంతరావు, డా॥ సి. నారాయణరెడ్డి, డా॥ యస్వీ. జోగారావు, డా॥ బోయి భీమన్న మున్నగు వారి గేయనాటికలను పరిశీలించినపుడును గేయనాటికా నటులు నృత్యకళావిదులై యుండవలెననుట అనివార్యమని తోచును. తమ గేయనాటికా సంపుటి 'అప్సరస' లోని 'కృతజ్ఞత' లో డా॥ యస్వీ జోగారావు గారు గేయనాటికా ప్రక్రియకు 'అప్సరస' అను నామకరణము సేయుట ఉచితమని భావించుటను చూడ గేయనాటికలకును నృత్యమునకును అవినాభావ సంబంధము కలదనుట స్పష్టము. కేవల నృత్యనాటికలో నున్నంత నాట్యధర్మి మాత్రము గేయనాటికలో నుండుటకు అవకాశము స్వల్పము. నాటకాది రూపకములలోని నాట్యధర్మి లోకధర్ముల ప్రయోగమునకంటె గేయనాటికల లోని అభినయము రాగతాళముల కనుకూలముగా చేయవలసి యుండును. కనుక లోకధర్మి అభినయమునందలి సహజత్వము అంతగా గోచరింపక నాట్య

---

1. "లలితై రఙ్గవిన్యాసైస్తథోత్క్షిప్తపదక్రమైః
నృత్యతే గమ్యతేయచ్చ నాట్యధర్మీతు సాస్మృతా" - నాట్యశాస్త్రము-పదమూడవ అధ్యాయము. ఈ శ్లోకమునకు ఆంధ్రానువాదము-డా॥ పి.ఎస్.ఆర్. అప్పారావు గారి నాట్యశాస్త్రము. పుట 383.

2. విశ్వవీణ-ఉపోద్ఘాతము-సంగీత నాటకాలు-పుట XX: ప్రచురణ: డిసెంబరు 1964.

3. తెలుగు నాటక వికాసము-పుట-496, ప్రచురణ: 1967.

ధర్మియందలి మనోజ్ఞతకే అవకాశ మధికముగా ఉండును. నృత్యగేయముల పొంకైన సమ్మేళనము గేయనాటిక అను అవగాహనము మనకేర్పడిన తరువాత అభినవగుప్త హేమచంద్ర శారదాతనయ విశ్వనాథులు చెప్పిన ఉపరూపక ములకును నేటి గేయనాటికలకును సామ్యములే విశేషముగా కనిపించుచున్నవి. కారణాంతరములవలన ఉపరూపకముల రచనా ప్రయోగములు మృగ్యము లై పోయినవి. ఈనాటి గేయనాటికలకు ఆనాటి ఉపరూపకములు సాక్షాత్తుగా మూలములు కాకపోయినను ఈ ప్రక్రియ అతివినూత్నమనియును పాశ్చాత్యుల ప్రసాదమనియును చెప్పుటకు వీలుపడదు.

**సంగీతము :** **Poetry is muscal thought** అను కార్లైలు అభిప్రాయము సంగీత సాహిత్యములకు గల సంబంధమును స్పష్టపరచుచున్నది. శ్రవణ తర్పణము సేయలేని సాహిత్యమునకు అంతగా ప్రాచుర్యముండదేమో ! విన గలిగిన తర్వాతనేకదా మననము ? ఈ కారణముచేతనే పదకర్తలు వాగ్గేయ కారులు, హరికథా నిష్ణాతులు జనసామాన్యమునకు చేరువైనంతగా మహాకావ్య ప్రణేతలు కాలేకపోయివారు. బమ్మెర పోతన భాగవతము నాదసౌందర్య విలసిత మగుటచేతనే కాబోలు సామాన్య ప్రజల హృదయములందు నాటుకొని పోయినది.

సాహిత్యమునకు సంగీతము వాహనము. గేయనాటికలలో మూడంశము లకు ప్రాముఖ్యమున్నది. ఒకటి సంగీతము; రెండు సాహిత్యము; మూడు అభినయము. ఈ మూడింటిలో ఏది కొరవడినను గేయనాటికా స్వరూపమే మారిపోవును. వీనిని సుందరముగా సమన్వయించుకొనుటలోనే గేయనాటికా కర్త సాఫల్యము ఇమిడి యున్నది.

గేయ నాటికలో పాత్రలు కేవలము సంగీతము వినిపించుటకు రంగము నందవతరించరు. హావభావప్రకటనమునకును గేయమునందలి సాహిత్యాంశ మునకును ఈ రెండింటికి అనుకూలమైన సంగీత కల్పనమును గేయనాటికలలో గమనింపదగిన అంశములు.

గేయనాటికలలోని గీతములకు సరళమధురములైన బాణీలుండవల యును. పాటలలోని పదములు సర్వసామాన్యములై ఉండవలయును. అందరి కిని అర్థమగు పదములనేరుకొని వానితో కవితాస్ఫూర్తిని సముత్పన్నము సేయ

గల ప్రతిభావ్యుత్పత్తులు గేయనాటికా కర్తలకు అత్యావసరము. నేను ప్రథమ గేయనాటికా కర్తలు శ్రీ శివశంకరస్వామివారితో చర్చించినపుడు హృదయ వాదులే గేయనాటికను విజయవంతముగా రచింపగల్గుదురను అభిప్రాయ మును ప్రకటించినారు. పాటలలోని పల్లవులు చరణములు దీర్ఘములై ఉండ కూడదు. ముఖ్యముగా పల్లవి ఎన్నిమారులు ఉచ్చరించినను దానియందలి పద ముల అర్థముల సౌందర్యము గాంభీర్యము చమత్కారము సమసిపోకుండ చవులూరించవలెను. గేయనాటికలలో ఉండదగు సంగీతమును గూర్చి శ్రీ శివ శంకరస్వామివారు దీర్ఘములైన రాగాలాపనలు త్యాజ్యములనియు, సముచిత పదప్రయోగము మృదుమధుర స్వరకల్పనము గేయనాటికా విజయమునకు తోడ్పడగలవనియును నాతో నుడివిరి.[1] శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావు గారు గేయనాటికలో సంగీతాంశమును గూర్చి తెలిపిన భావములను ఇట ఉదా హరించుచున్నాను. గేయనాటికా కర్తలును ప్రయోక్తలును సంగీత శాస్త్ర మర్మజ్ఞులును అయిన శ్రీ రజనీకాంతరావుగారి అభిప్రాయములకు విశేషముగ విలువ కట్టవలసిన అవసరమున్నది.

"ఏపాత్ర కాపాత్ర తన పాట ఏదో పాడుగ్గా తాను పాడుకొంటూ ఉంటే మిగిలిన పాత్రలు స్తబ్దంగా నిల్చుండో కూర్చుండో వుండే ఘట్టాలుండకూడదు. పాత్రల పాటలలోనే సంభాషణలూ, కథాగతీ (action) సంఘటనలూ సాగి పోతూవుండాలి. ఒక్కొక్కచోట కథ మెల్లిగా సాగేబరువైన ఘట్టాల్లో బరువైన పాటలు ఉండాలికాని మిగిలినచోట్ల లయాన్వితంగా త్వరితంగా సాగిపోయే సంవాద గేయాలూ, లయలలో ఛందాలలో మార్పులు చేసుకుంటూ పోవాలి. మధ్యమధ్య ప్రకటనా వివరణా అక్కరలేకుండానే స్థలనిర్దేశమూ, పాత్రనిర్దే శమూ, సమయసూచనా తెచ్చిపెట్టుకొన్నట్లుకాకుండా సహజంగా గేయసంభా షణలో సాగిపోవాలి. కథాకథనము (Narrative) చెయ్యడానికీ, ఒక్కొక్క సంఘటనలో కలిగించిన రసాన్ని తీవ్రపరచేసి సుస్థిరం చెయ్యడానికి బృంద గానాలను (Choruses) ఉపయోగించాలి. ఈ బృందగానాలను పాడే గాయక బృందం కథలో ఆయా ఘట్టాలలో సహజంగా సమకూడే పాత్రలైనా కావచ్చు లేదా, ఏ సంబంధమూలేని వట్టి ఆఖ్యాతృ బృందం కావచ్చు... అంతమందీ చక్కగా పాడేవారిని సమకూర్చుకోవడం నిర్వాహకుని పూచీ.

1. చూ. అనుబంధము 1 (క) (శ్రీ శివశంకరస్వామివారితో గోష్ఠి)

సంగీత నాటకంలో సంగీత నిర్వాహకుని బాధ్యతే గురుతరమైనది... నిర్వాహకుడు ఈ బాణీలకు కొన్ని తారతమ్యాలను ఏర్పాటు చేసుకొని, తన ఇతి వృత్తాన్నిబట్టిగాని, దేశకాలములనుబట్టిగాని, తన నాటకంలోని వేరువేరు ఘట్టాలలో పాత్రల ఉత్తమ మధ్యమాధమములని ప్రాచీన శాస్త్రాలలో చెప్ప బడిన వర్గాలలో ఆ యా వర్గాలకి చెందిన పాత్రలకు, ఆయా సన్నివేశాలలోని రసాలకు, అనుగుణమైన సంగీతపు బాణీలను కూర్చుకోవలసి ఉంటుంది. ప్రతి ఒక్క బరువైన పాటకూ రెండోమూడో తేలికగా రక్తిగా సాగిపోయే వరుస లుండాలి." [1]

**వాద్యసంగీతము :** గేయనాటిక ఆరంభమునుండి అంతమువరకు అవ్యవధాన ముగా ఏదో ఒక స్థాయిలో వాద్యసంగీతము వినిపించుచునే ఉండవలయును. వివిధ వాద్యవిశేషముల సహాయముతో పాత్రల మనఃస్థితులకు సూచకముగా ఇతివృత్తమునందలి వాతావరణమును ధ్వనించునట్లును వాద్య సంగీతము నిర్వహింపబడవలయును.

"యత్రాభినేయం గీతంస్యాత్ తత్రవాద్యం నయోజయేత్
అంగహారప్రయోగేతు భాండవాద్యం విధీయతే
సమంరక్తం విభక్తంచ స్ఫుటం శుద్ధప్రహారజం
నృత్తాంగగ్రాహివాద్యజ్ఞై ర్వాద్యం యోజ్యంతుతాండవే"[2]

("గీతమును అభినయించునపుడు వాద్యమును ప్రయోగించరాదు. కాని అంగహార ప్రయోగములందు అనగా శుద్ధ నృత్తమునందు భాండవాద్యమును తప్పక ప్రయోగించవలెను. సమమును, రక్తమును, విభక్తమును స్ఫుట మును, శుద్ధప్రహారజమును, నృత్తాంగగ్రాహియును అగునట్లుగా వాద్యజ్ఞులు తాండవమందు వాద్యమును ప్రయోగించవలెను. ఇట గీతవాద్యములు నృత్తాను సారముగా ప్రయుక్తములైన పిమ్మట ఆ నర్తకి నిష్క్రమించవలెను.")

—నాట్యశాస్త్రము డా॥ పి. ఎస్. ఆర్. అప్పారావుగారి
అనువాదము. పుట 123.

భరతుడు రూపకారంభమునందు ఉన్ముఖీకరణమునకు సంబంధించిన నృత్త గీత వాద్య ప్రయోగములనుగూర్చి ముఖ్యముగా చెప్పిన అంశములివి. కాని

1. విశ్వవీణ–ఉపోద్ఘాతము–సంగీత నాటకాలు. పుటలు–xix, xx.
2. భరతుని నాట్యశాస్త్రము–4 వ అధ్యాయము. శ్లో. 276, 277, 278.

గీతమునకు కావలసిన వాద్యమెట్లుండవలయునో దీనివలన తెలిసికొనవచ్చును. పాట పాడునపుడు అందలి సాహిత్యము అవగతమగుటకు కాబోలు వాద్య సంగీత ముండకూడదని భరతుని మతము. కాని ఏదో విధమైన వాద్యసంగీత లేశములేనిదే గేయనాటిక అనిపించుకొనదు. నేటికాలమున విద్యుచ్ఛక్తి సాహాయ్యముతో కొన్ని వాద్య విశేషముల వలనను, దూరశ్రవణ (Loud speaker) యంత్రాది సాధనములవలనను అపూర్వములైన ధ్వనివిశేషములను సృష్టించుటకు అవకాశమున్నది. సాధ్యమైనంత సూక్ష్మముగ సాధ్యమైనంత ఉద్ధృతముగ మనము వాద్యసంగీతమును కల్పించుకొనవచ్చును. వాద్యప్రాధాన్యమును గూర్చి భరతుడు మరొక్క సందర్భమున ఇట్లు సూచించినాడు—

"వాద్యేతు యత్నః ప్రథమంతు కార్యః
శయ్యాం హి నాట్యస్యవదంతి వాద్యం
వాద్యే చ గీతే చ హి సుప్రయుక్తే
నాట్యప్రయోగో న విపత్తిమేతి" 1

("—మొదట వాద్య విషయమున ప్రయత్నము చేయవలెను. నాట్యమునకు వాద్యమే శయ్య అని చెప్పుదురు. వాద్యగీతములు సుప్రయుక్తములైనచో నాట్యప్రయోగము భంగమును పొందదు.")

—నాట్యశాస్త్రము. డా॥ పి. ఎస్. ఆర్. అప్పారావుగారి అనువాదము. పుట 850

సామాన్య రూపకమాత్రమునకే వాద్యసంగీత ప్రాధాన్యమింతగా నుండగా సంగీతాత్మకమైన గేయనాటికలో దాని ఆవశ్యకతను గూర్చి వేరగా చెప్పవలసిన అవసరము లేదనుకొందును. ఇక శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావుగారు గేయనాటికయందలి వాద్యసంగీత ప్రయోగమునుగూర్చి వివరించిన తీరును ఉదాహరించుట ఇట అప్రస్తుతముకాదు— "నేపథ్యజంత్ర సంగీతం ఉండీ ఉండనట్లుగా వినిపిస్తూ, పాటలలోని మాటలను స్పష్టంగా తెలియనిస్తూ, గాత్రములు పాడని సమయాల్లో ఆయా రసావేశాన్ని ఉత్తేజపరచి సుస్థిరపరుస్తూ ఏ స్వరసంపుటికి పక్క ఏ స్వరాలు పలికిస్తే ఎక్కువ ఫలితం ఉండగలదో దాన్ని సాధించాలి."2

1. నాట్యశాస్త్రము-34 వ అధ్యాయము, శ్లో. 259. (బొంబాయి ముద్రణ) 1943.

2. విశ్వవీణ: ఉపోద్ఘాతము-సంగీత నాటకాలు-పుట XX.

**రంగాలంకరణము** : ప్రాచీన రూపకములలో రంగాలంకరణమునకు అంతగా ప్రాముఖ్యములేదు. రంగమునందే కక్ష్యావిభాగముచేసి ఆయా స్థలవిశేషములను సూచించెడివారు. రూపకేతివృత్తమునకు కావలసిన వాతావరణమంతయును అభినయము ద్వారమున సూచింపబడవలసినదే. ఈ అంశము మనకు భరతుని నాట్యశాస్త్రమువలననే తెలియుచున్నది. తొలి గేయనాటికా కర్తలు శ్రీ శివశంకరస్వామివారు రంగాలంకరణమునకు అభినయమువే సాధనముగా వినియోగించుకొనవలెనను భరతుని మతముతో ఏకీభవించియుండిరి. నేటి రూపకముల రంగాలంకరణమునకు సంబంధించినంతవరకు పాశ్చాత్యులే ఆదర్శము.

సామాన్యరూపకములకంటె గేయనాటికా ప్రయోగమునందు రంగాలంకరణము అద్భుతముగా ఉండదగును గేయనాటికా ప్రదర్శనమునకు సమయము మిక్కిలి పరిమితము. కనుక ఆయా స్థలవిశేషములను వర్ణించుటకు గేయము నాశ్రయించుట సాధారణముగా అంత సమంజసముకాదు. దర్శన మాత్రమున ఇతివృత్తమునకు సంబంధించిన దృశ్యము సాక్షాత్కరించవలెను. విద్యుచ్ఛక్తి సాహాయ్యమున ఆయా పరిస్థితులకు అనుగుణమైన వెలుగునీడలను, వెన్నెలను, మబ్బులను, మెరుపులను, జలపాతములను, నదీనదములను వానిలోని సంచలనములను చూపించవచ్చును పాశ్చాత్యదేశములలో ముందుగానే తీసిన సినీమాను రంగమువెనుకనుండి తెరపై ప్రసరింప (focus) చేసి రూపకమును మరింత ప్రభావోపేతముగా ప్రదర్శింపగల్గుచున్నారు. గేయనాటికను ఇట్టి అద్భుతములను ఊతగాగొని చిత్తాకర్షకముగా నయనందకరముగా ప్రయోగింపవచ్చును. సత్కృత్తుగా అట్టి ప్రయత్నములు భారతదేశమున జరుగుచున్నవి. మొత్తముపై సామాన్యరూపకములకంటె రంగాలంకరణము అద్భుతముగా నుండుట గేయనాటికా ప్రయోగవిజయమునకు అత్యావశ్యకము.

**నటీనటులు** : భరతుడు నాట్యశాస్త్రమునందు నటీనటులకుండవలసిన లక్షణములను పేర్కొనుచు వారు 'కుశలులు', 'విదగ్ధులు' 'ప్రగల్భులు' 'జితశ్రములు' నాట్యాలంకారచణమైన కైశికీవృత్తివిశారదులునునై ఉండవలెనని సూత్రించెను. ఈ సూత్రపరిధిలోనికి దశరూపకములే కాక గేయనాటికలు కూడ వచ్చుటకు వీలున్నది గేయనాటికకును కైశికీవృత్తికిని అవినాభావ సంబంధమున్నదను అంశమును నేనిదివరకే నిరూపించియుంటిని. నేటి గేయ

నాటికకను నాటి ఉపరూపకమునకును కైశికీవృత్తియే బీజమన్నను సాహసము కాదు.

గేయనాటికలలోని నటీనటులు గాయకులై నృత్యవిశారదులై సుశిక్షితులైన అభినేతలై ఉండవలెనను అంశమును శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావు గారు సూచించియున్నారు— "సంగీత నాటకాలలో పాడే గాయకులందరికీ తమ వాచకం (పాటలు) కుణ్ణంగా వచ్చి ఉండాలి. ఒక్కొక్క వ్యక్తి తన పాటలను కుణ్ణంగా పాడగలిగి ఉండడమేగాకుండా మొత్తంమీద సాముదాయిక కృషిగా నటులు అంతా యంత్రపుచక్రాలవలె ఒకరికొకరు అతికి, పరస్పర సహకారముతో జయప్రదం చేయవలసి ఉంటుంది ............నాట్యమూ గానమూ రెంటింటిలోనూ కృషి చేసిన నటబృందము సంగీతనాటకాలకు చాలా అవశ్యకం"1

**సమయము (ప్రదర్శనకాలము)**: గేయనాటికలలో ఇతివృత్తము ప్రధానముగా ఉండకపోవుటవలన కథాసంబంధియైన ఉత్కంఠను కలిగింపవలసిన అగత్యముండదు. ఈ కారణముచేతనే ప్రదర్శనకాలము సాధ్యమైనంత తక్కువగా ఉండవలెను. అనుక్షణము గేయలయానుగుణమైన హస్తపాదాద్యాంగికాభినయము ఎడతెగక ఉండుటవలన నటులు అలసిపోవుటకు అవకాశమున్నది. కనుక గేయనాటిక సుదీర్ఘముగా ఉన్నచో అభినయము రానురాను పలుచబడవచ్చు. శ్రీ శివశంకర స్వామివారు గేయనాటికలు సుదీర్ఘముగ ఉండకూడదనియు గంట రెండుగంటలుండినచో మంచిదనియును ఎంతమంచి విషయము ప్రతిపాదితమైనను యామము (మూడు గంటలు) దాటకూడదనియును మొదటి పదునైదు నిమిషములలో నాటిక రక్తి కట్టవలెయుననియును అభిప్రాయపడియున్నారు. సాధారణముగా ఏకాంకిక (one act play) ప్రయోగమునకు వలసినంత సమయము (30-45 నిమిషములు) గేయనాటికకు కూడ ఉండిన బాగుగనుండును.

**ఆహార్యము**: సామాన్య రూపకములలో వలెనే ఆయా పాత్రలకు అనుగుణమైన వేషధారణము గేయనాటికలలో ఉండవలసినదే కాని వీనిలో నృత్యము అనివార్యమగుటవలన నృత్యమునకు అడ్డువచ్చు ఆహార్యము పరిత్యాజ్యము.

1. విశ్వవీణ. ఉపోద్ఘాతము_సంగీతనాటకాలు పుట XX : ప్రచురణ : డిసెంబరు 1964.

**ప్రేక్షకులు (సామాజికులు) :** సామాన్య రూపకములకంటె గేయ నాటికల ప్రేక్షకులు కొంచెము విజ్ఞులై ఉండవలసిన అవసరమున్నది. వారు సంగీతప్రియులై కవితాత్మతో పరిచయము కలిగినవారై ప్రతీక పరిజ్ఞానవిలసితులై ఉండవలెను. ఏలన ఈ ప్రక్రియలోని కథ సమగ్రముగా ఉండదు. భావములు వచనమునందుండవు. గేయములోని వ్యంగ్యస్ఫూర్తితో అన్యాపదేశముతో ప్రతీకలతో ఛందస్సౌందర్యముతో ప్రేక్షకులకు పరిచయముండవలసిన అవసరమున్నది. పాత్ర లన్నియును గేయరూపమున తమ భావములను ప్రకటించుట అసహజమైన అంశమే. ఈ అసహజమైన స్థితికి అతీతముగా రసాస్వాదన చేయగలుగుశక్తి పండితులకే ఉండును. ఒండు రెండు సన్నివేశములను ఆధారముగా చేసికొని గౌణముగా నున్న ఇతివృత్తమును అవగాహన చేసికొనగలవాడు ఊహాశాలిగా నుండవలసినదే.

నేటియాంత్రిక సమాజమున సామాన్యులకే కళాస్వాదనమునకు సమయము దొరుకకున్నది. అట్టిచో ప్రాజ్ఞులైనవారు గంటలకొలది కూర్చొని ప్రదర్శనమును అనుభవించలేరు. విజ్ఞుడైనవానికి లభించిన కొద్ది సమయములోనే ఆతని ఆనందానుభూతికి వీలు కలుగవలయును. కనుక సంగీత కవిత్వాదికళలలో చక్కని అధ్యయనమున్నవారు ఆయా కళలయందభినివేశమున్నవారు గేయ నాటికనే అభిలషింతురనుటలో సాహసములేదు. ఈ కారణముచేతనే గేయ నాటికా రచనము ఇతర ప్రక్రియలకంటె అరుదుగనే సాగుచున్నది. ప్రయోగ మంతకంటెను అరుదుగా నుండుట మన అనుభవము. రచనాప్రయోగములు ఉండుటకు మరొక కారణము ప్రదర్శనమునకు కావలసిన ఏర్పాట్లు అధిక వ్యయప్రయాసలతో కూడుకొనియుండుట. సామాన్యులు అభిమానించని పక్షమున ప్రదర్శకులకు ఆర్థికముగా లాభదాయకము కాకపోవచ్చును. అట్లని ఇది కేవలము విజ్ఞులకే పరిమితమనుటయు పొసగదు. కొన్ని సందర్భములలో ఇతి వృత్తము మాట ఎట్లున్నను, కవిత్వాంశము మనసున కెక్కకపోయినను సామాన్యులు గూడ అక్షర రమ్యతను, ఆటపాటలను, రంగాలంకరణమును విని కని వినోదించుటకు అవకాశమున్నది. లోకమర్యాదలను సమగ్రముగా అవగాహనము చేసికొని రచింపబడు గేయనాటికలు పండిత పామరరంజనము చేయగలవను మాట నిజము. మొత్తము మీద నాటికా నిర్మాణకౌశలము మిక్కిలి ప్రధానమైనది.

# 12. గేయనాటికలలో కావ్యత్వము

అనుభూతి లయబద్ధమై శబ్దాకృతిని దాల్చినపుడు కవితాసంకేతము పొందును. లయాత్మకముగా లేని భావములలో కవిత్వాంశము ఉండకపోదు. కాని దానికి శ్రవణతర్పణగుణముండదు సహృదయుడు మాటిమాటికి మననము చేసికొనలేడు. పద్యరూపమైన భావముకంటె గద్యరూపమైన భావము మార్పులకు చేర్పులకు గురియగుచుండుట సర్వసామాన్యమైన విషయము. కవుల గద్యములకంటె పద్యములకే ప్రాచుర్యమెక్కువ. సామెతలు ప్రాయికముగా గద్యరూపమున నున్నను యతిప్రాసాది ఛందోమర్యాదలు వానికి ఉండుటవలన అవి బ్రతుకగలుగుచున్నవి. శ్రవ్యకావ్యములందు గాని దృశ్యకావ్యములందు గాని గద్యమెంత సుందరముగ నున్నను సహృదయులకు విన్నప్పుడే ఆనందము కలుగును గాని వారి మనఃఫలకములపై చెరగని ముద్రలుగా నిలిచిపోవు. ఇక పల్లవులతో చరణములతో పాడుకొనుటకు అనుకూలముగ నున్న గేయముల గూర్చియు వాని ప్రాశస్త్యమును గూర్చియు నేనింతవరకే విశదీకరించియుంటిని. రూపకములదు పద్యగేయ ప్రయోగము నాట్యధర్మియే. అందును పద్యమునకన్న గేయమునకే నాట్యధర్మి లక్షణములు అధికము. గేయములందలి చరణములు పద్యములో వలెగాక చిన్నవియును పెద్దవియును ఉండి నటనాకౌశలమునకు విశేషావకాశమును కల్పించును కేవలము కథాసూచనమునకు అనువైన గేయములతో గేయనాటిక రూపొందినచో అది అంతగా రాణించదు. నాట్యధర్మి లోకభిన్నమును ప్రతీకాత్మకముగను ఉండును. గేయనాటికలు నాట్యధర్మికి అతి సన్నిహితము లను అంశమును డా॥ పి.ఎస్.ఆర్. అప్పారావు గారు తెలిపియున్నారు.[1] అందువలన గేయనాటికలలో కవితాత్మ సాక్షాత్కరించనిచో ప్రదర్శనార్హత ఎట్లున్నను అది కావ్యముగ కూడ మనజాలదు. గేయనాటికలకు ఆద్యులైన శ్రీ శివశంకరస్వామివారు అవి ప్రదర్శనకు నోచు

---

1. "ఇంక పద్యనాటికలు, గేయనాటికలు నాట్యధర్మికి సన్నిహితములుకాగా నేటి సాంఘిక ప్రహసనములు. రేడియోనాటికలు మొదలగునవి లోకధర్మికి సన్నిహితములగుచున్నవి". తెలుగునాటక వికాసము : పుట : 602.

కొనలేక పోయినను వ్యుత్పన్నులైన సహృదయులు చదువుకొని ఆనందించగలుగుదురని నాతో ననియుండిరి.[1]

తెలుగు సాహిత్యమునందు విద్వత్కవులుగా పేరుపొందిన శ్రీ శివశంకర స్వామి, శ్రీ విశ్వనాథ సత్యనారాయణ, శ్రీ నోరి నరసింహశాస్త్రి, శ్రీ దేవులపల్లి వేంకటకృష్ణశాస్త్రి శ్రీ దాశరథి, శ్రీ నారాయణరెడ్డి, శ్రీ వానమామలై వరదాచార్యులు, శ్రీ బోయి భీమన్న, శ్రీ బంధ్యాల పాపయ్యశాస్త్రి, శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావు శ్రీ యస్వీ జోగారావు, శ్రీ కె.వి.ఆర్. నరసింహము, శ్రీ నండూరి రామకృష్ణమాచార్య ప్రభృతులు గేయనాటికా ప్రక్రియను చేపట్టినప్పుడు అందులోని గేయములు కవితాత్మను వీడిపోలేవుగదా!

లాక్షణికులు కావ్యములను దృశ్య శ్రవ్య కావ్యములుగా విభాగించి యుండిరి. దృశ్యకావ్యమనగా రూపకము రూపకమును కావ్యముగా గుర్తించినపుడు దానికి రూపాంతరమైన గేయనాటికను కావ్యవిశేషముగా గుర్తించుటలో విప్రతిపత్తి ఉండకూడదు. ప్రతిభావంతుడైన కవి పనితనమువలన ఆతని కవితాత్మ నృత్యవాద్య సహితములైన చతుర్విధాభినయనములతో మరింత సుందరముగా సాక్షాత్కరించును. కవితామర్యాదలను తలస్పర్శిగా చూడలేనివారికి ఆటపాటలవలన కలుగు ఆనందమే మిగులును. వ్యుత్పన్నుడైన సహృదయునికి కావ్యానందము అనంతరూపములతో అనుభూతమగును ఇది గేయనాటికలోని విశిష్టత. ఇది గేయనాటికలో కవిత్వమునకున్న విశిష్టత.

సాధారణ రూపకములలో నాట్యాత్మకు అంతగా అవకాశము లేకపోవుటచేతను, సరళముగా లోకవృత్తము యథాతథముగా ఎక్కువగా గద్యములో ఉండుటచేతను ప్రతీకాత్మకమైన రచనకునుకాను మాటబొమ్మ (Images) లను కల్పించుటకును వీలుండదు. గేయనాటికలలో సంభాషణమంతయును గేయబద్ధముగా లయాత్మకముగా కవితాప్రవంగా సాగిపోవుటచేత అందులో కవితాసంవాసితములగు భావములు, వర్ణనలు కవితాసంబంధులైన శబ్దార్థధ్వన్యాది చమత్కృతులు అనివార్యములగును. కవితాలక్షణములతో అంతగా పనిలేని పంక్తులు ఉత్తమ గేయనాటికలలో అరుదని చెప్పుటలో సాహసము లేదనుకొందును. సంభాషణలలో భావనామధురములును సంక్షిప్తములును అగు వర్ణన

2. చూ - అనుబంధము 1. (క).

లును విశ్వజనీనమైన సూక్తులునుండుటవలన గేయనాటికలు సర్వత్ర ఉత్తమ కావ్యత్వమును గుబాళించుచుండును. అందుచేతనే శ్రీ దాశరథిగారు—

"గేయనాటికలు
కావ్యవాటికలు
రమ్యచేటికలు
రత్నపేటికలు"[1] అన్నారు. ఇటీవల సాంఘిక, రాజకీయ సంస్కరణలను దృష్టిలో ఉంచుకొని వ్రాసిన ప్రబోధాత్మకములైన గేయనాటికలలో కవిత్వాంశము కొంచెము కొరవడక తప్పదు. కాని సిద్ధహస్తులైన కవులు వ్రాసిన గేయనాటికలలో రసనిర్భరములైన పంక్తులనేకములను రాశిపోసి చూపవచ్చును. 'గేయనాటికా వైవిధ్యము' అను ప్రకరణమునందు అయా గేయనాటికలలోని కవితాసుందరములైన పంక్తులను కొన్నింటిని ఉదాహరించియుంటిని. ప్రస్తుతము మహో కావ్యశోభను సాక్షాత్కరింపజేయగాజాలు కొన్ని గేయఖండికలను ఉదాహరించి గేయనాటికలలోని కావ్యత్వమును నిరూపించుటకు యత్నింతును.

"నిజగళంబున హరుడు విషమును
నిలిపి మృత్యుంజయుండయ్యెను
అగ్నిదగ్ధుండయ్యు బ్రతికిన యాతడెవ్వడగున్?"
నా మతంబున, సాటియెరుగని
నాయకుండొక మనసిజుండే!
అతనుడయ్యును నడపులోకము లాత్మపాలనలో"

—శ్రీ శివశంకరస్వామి వారి 'పలితకేశము'.

మహాదేవప్రభువు ఆదేశముచే అతని సేవకురాలు విశాఖ మన్మథస్తుతిపరముగా గానముచేసిన గేయపంక్తులివి.

హరుడుగళమున అగ్నిసదృశమైన గరళమును నిలిపికొన్నను మృతుడు కాలేదు. మృత్యుంజయుడైనాడు. ఆ మృత్యుంజయుని నేత్రాగ్ని హోత్రమునకు గురియై మన్మథుడు దగ్ధుడైనాడు. అతనుడైనాడు. అయినను అతని ప్రభావమునకు హరుడు గురికాక తప్పలేదు. అతనుని ప్రణయసామ్రాజ్యపాలనకు ఆటంకము కలుగలేదు. ఎందుచేత? ఫాలాగ్ని జ్వాలలలో దగ్ధమైనది మన్మథుని తనువే

1. 'బాపురెడ్డి గేయనాటికలు' - పీఠిక - పుట vii ముద్రణ 1973.

కాని అతని ఆత్మకాదు. ఆత్మ అనశ్వరము కదా! ఈ రమ్యార్థమునంతను శ్రీ శివశంకరస్వామిగారు 'ఆతనుడు' 'ఆత్మపాలన' అను శబ్దములలో ధ్వనింపజేసినారు. మరొక విశేషము. హరుడు గళమున విషమును నిలుపుకొన్నాడు. కాని మ్రింగలేదు. అందువలన అతడు మరణించలేదు. మ్రింగినచో మరణించెడువాడేమో! గరళమును మ్రింగనందువలన మరణించని హరుని కన్న అగ్నిదగ్ధుడైనను సజీవునివలెనే ఆత్మశక్తిని ప్రసరించుచున్న మరుడే మిన్న.

"నా మహింబున సాటి యెరుగని
నాయకుండొక మనసిజుండే" అని కావ్యోక్తి అనుట అందుచేతనే.

'పంచబాణసమానుడు'ను నాయకుడును అయిన మహాదేవప్రభు మహోత్సవ రంజనార్థము పంచబాణుని స్తుతిసేయుచు, ఆతనిని 'సాటియెరుగని నాయకు'నిగా వర్ణించుట ఔచితీశోభితము ఇట్లు చిన్నచిన్న పంక్తులలో సమున్నతరమణీయార్థమును, కవితామర్యాదలను పొదుగుటచేతనే గేయనాటికు కావ్యత్వము సిద్ధించుచున్నది

"నీ హస్తగతమైన నీలకౌశేయ
బద్ధమనోజ్ఞ ప్రబంధమ్ము సఖుడ
రాధికా దృఢపరిరంభమందున్న
గోవిందుపోలిక గోచరించినది"

—శ్రీ శివశంకరస్వామివారి 'పద్మావతీ
చరణచారణచక్రవర్తి'

లక్ష్మణసేనభూపతి సభాభవనమునందు కావ్యగానము చేయుటకై జయదేవకవి తన గీతగోవిందకృతిని పట్టుకొని బయలుదేరు సందర్భమున అతని మిత్రుడు పరాశరుడు అతనితో పలికిన పలుకులివి.

గీతగోవిందప్రబంధమును నీలిపట్టు వస్త్రములో చుట్టి చేతియందు పట్టుకొన్నాడు జయదేవుడు. అపుడాతని చేతియందలి 'నీలకౌశేయబద్ధమనోజ్ఞ ప్రబంధమ్ము' రాధిక బిగికౌగిలిలో ఒదిగిన గోవిందునివలెనున్నదట!- ఎంత హృద్యమైన ఉపమానము! కౌశేయమునకు 'నీల' అను విశేషణము వేయుటలోనే కవి ప్రతిభ ప్రకాశించుచున్నది. గోవిందుడు నీలవర్ణుడుగదా!

'గీతగోవిందము' రాధాగోవిందుల లీలలను వర్ణించు శృంగార ప్రబంధము. దానిని జయదేవుడు చేతిలో పట్టుకొన్న సన్నివేశమును రాధికా పరిరంభ మందున్న గోవిందునివలె నున్నదని శృంగారరసాత్తముగావర్ణించుట హృదయం గమమైన అంశము ఇట్టి హృద్యమైన కవితాంశమే సహృదయులకు ఆలోచ నామృతమును ప్రసాదించి కావ్యమునకు అమరత్వమును సిద్ధింపజేయును. శ్రీ శివశంకరస్వామివారి 'దీక్షితదుహిత'లోని—

"నాకలోకాంగనా వీటి కాకరండ
మండితోన్నత నవసుధాఖండమట్లు
విరియుచున్నాడు శశి యుడువీధియందు
కళలు, త్రిజగదుద్దీపన కారణుండు" అను పద్యములోని భావన

సరసము, సముచితము, సరసవాణి తమలపాకులకు సున్నము రాయుచు నిచ్చుచుండగా తాంబులము వేసికొనుచు దీక్షితులు పలికిన ఈ పద్యమునందలి చంద్రవర్ణన సన్నివేశౌచిత్యమునకు వన్నెలుదిద్దుచునే సుధాకరమండలమును చుంబించుచు అప్పయదీక్షితుల రమ్యభావనాపటిమకు అక్షరనిదర్శనమై ఆ అలంకారికవతంసుని అతులమునందు నిలుపుచున్నది. పై పద్యమందు అలవోకగా దొరలిన శబ్దాలంకారము శ్రవణపేయము. ఇట్టి పద్యపారిజాతములే కావ్య వనమును నిరంతరము పరిమళింపజేయునవి.

శ్రీ శివశంకరస్వామివారి 'యక్షరాత్రి'లోని—

"తాటంకములు గండదర్పణమ్ములయందు
ప్రతిఫలించుచునుండ బాలభానుద్యుతుల్
స్థూలముక్తాహారశుభ్రరోచిః పటలి
పంగవల్లి కరీతి సంజిల్లుచుండగా,
సంపన్నమై శుక శ్యామచేలచ్ఛవుల
భవదీయతనుసీమ ప్రాభాతికారామ
మధ్యసంస్థిత దేవమందిర ప్రాంగణ
ప్రభల దలపించినది ప్రాణప్రియా, నేడు!" అను పంక్తులందలి

'నితంబవతి' వర్ణనమును, 'రత్నాకరము' లోని—

తావకా కర్ణాంతలోచన
ధాళధళ్యము చేకనాతని

వజ్రపంజర సన్నిభంబగు ప్వాంతమానాడే—
కరగిక్రమముగ పూవుదేనియ
కరణిసారళ్యంబు మధురిమ
సంక్రమింపగ త్వన్ముఖమ్మున జాలువారెనుతే"! అను చరణము లందలి భ్రమర వర్ణమును పిశాగంధబంధురములే.

"ఊర్వశీ ఆదిప్రేయసీ!
తిలోత్తమా, మధుకలస్వనీ!
రంభా, సౌందర్యైకదంబా!
జ్వాలన్నిశ్చల ప్రణయవర్తికీ మేనకా!
విశ్వప్రాణమూర్తులారా
రంగన
కలకంఠ కంఠులారా
శరదిందు వందనలారా
నిర్జగ
సౌందర్య సదనలారా"

—(శ్రీ) బాలాంత్రపు రజనీకాంతరావుగారి 'మేనక'

విశ్వామిత్రుడు తీవ్ర తపస్సులో నున్నాడని దూత చెప్పగా విన్న ఇంద్రుడు క్రుద్ధుడై అతని తపస్సు భగ్నము చేయనెంచి ఊర్వశీతిలోత్తమాదులను పేరు పేరున పిలిచిన సందర్భములోనివి ఈ చరణములు.

ఊర్వశీ రంభాదుల అందచందములను కళావిలాసములను కవితా రేఖలతో అంత్యప్రాసల వర్ణములతో తీర్చిదిద్దిన వైనము కమనీయము. వీనిలో 'జ్వాలన్నిశ్చల ప్రణయవర్తికీ,' మేనకా!" అను సంబుద్ధిభావికథాసూచకము. విశ్వామిత్రుని తపస్సును భంగము చేయలేక రంభాదులు వెడలిపోయినను మేనక మాత్రము నిశ్చలమై విశ్వామిత్రుని నిజప్రణయాధీనుని చేయువరకు కదలలేదు. ఇట్లు వస్తుధ్వనిని గర్భీకరించుకొన్న సంబుద్ధి ప్రయోగము నాటికాకర్త ప్రతిభా వ్యుత్పత్తులను ప్రకటించుచు కావ్యగౌరవమును ఇనుమడింపజేయుచున్నది.

"మనప్రేమ
సస్య సౌందర్యధామములలో

ప్రభవించి ప్రభవించి
నగ్న మరుసీమమగునో
కగ్నసుమ ధామమగునో;
మన ప్రేమ......
కల్లోలినీతరంగములన్
పయనించి పయనించి
శీర్ణ సికతాద్రి యగునో
పూర్ణ కలశాబ్ధి యగునో;
మన ప్రేమ......
కాలగాఢాగ్ని కీలలలో
తపియించి తపియించి
దగ్ధ తరు కాండమగునో
ముగ్ధ మధుభాండమగునో;
మన ప్రేమ......
దీర్ఘ ఝంఝూ మారుతములన్
ప్రసరించి ప్రసరించి
విరహ విశ్వాసమగునో
సరస దరహాసమగునో,
మన ప్రేమ.........
సువిశాల గగనవీధులలో
విహరించి విహరించి
ప్రణయస్వేచ్ఛావిహగామి యగునో
నిరవధిక సౌఖ్యధానియగునో!"

—శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావుగారి 'చండీదాసు'.

దివ్యప్రేమను అర్థము చేసికొనలేని మూఢాచారపరాయణులైన 'సాంఘికులు' తమ ప్రణయమును భంగముచేయ సమకట్టిన సందర్భములో రామినీ చండీదాసులు తమ ప్రేమ ఫలించునో లేదో అని తలపోయుచు కలతపడు సన్నివేశము సందలిది ఈ గేయము.

ఈ గేయమునందు శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావుగారు ప్రదర్శించిన రచనాశిల్పము అనన్యసాధారణము. శబ్దార్థములు సౌందర్యశిఖరాంచలమును స్పృశించిన సన్నివేశమునకు ఈ గేయమొక ఉదాహరణము. 'నమ్రమరుసీమము', 'కమ్రసుమధామము', 'శీర్ణసికతాద్రి', 'పూర్ణకళశాబ్ధి', 'దగ్ధతరుకాండము', 'ముగ్ధమసుఖాండము', 'విరహనిశ్వాసము', 'సరసదరహాసము' వంటి సుందర పదబంధముల ద్వారముగ నాయికానాయకుల ప్రణయసాఫల్య వైఫల్య విరుద్ధభావములు హృదయంగమముగా వ్యక్తీకరింపబడినవి. చివరి చరణములందలి 'ప్రణయస్వేచ్ఛాప్రభగామి', 'నిరవధికసౌఖ్యధాని' అను కేవల సాఫల్యసూచక పదబంధప్రయోగమువలన రామినీచండీదాసుల భవిష్యత్సఫల ప్రణయజీవితము ధ్వనింపజేయబడినది. ధ్వనియే కదా కావ్యాత్మ. గేయములో 'ప్రభవించి', 'ప్రభవించి' 'పయనించి' 'పయనించి' అని ఒకే క్రియను రెండు పర్యాయములు ప్రయోగించుటవలన భావతీవ్రత, సంగీతసౌందర్యము సాధింపబడినవి.

శ్రీ బాలాంత్రపు వారి గేయనాటికలన్నిటియందును సంగీతసాహిత్యములు చెట్టపట్టాలు పట్టుకొని సాగిపోవుచుండును.

"చివురు టాకులలోన
రవల రేకులలోన
మంచు ముత్యాలుంచి
మంచి మధువులనించి
ఉదయభాను కరాల
సుధలు జారే వేళ
ప్రకృతి లక్ష్మీదివ్య
పాదపూజలు చేసి
ఎన్నొ నోములునోచి
ఎన్నొ బాములు సైచి
నిన్నుగనె నీతల్లి
నిండుమమతల వెల్లి
జీవనాడులలోని

శీతాంబువులు పోసి
పాల వెన్నెలలోని
పచ్చిమీగడ దీసి
తనమేని పొరలనే
నునుపాన్పుగా జేసి
ఎంతో గారాబుగా
ఎంతెంతో డాబుగా
కడుపార పోషించె
మనసార ప్రేమించె
ఓ చిన్ని మొగ్గా!
ఓ కన్నె మొగ్గా!''

—డా॥ సి. నారాయణరెడ్డిగారి 'నవ్వనిపువ్వు'

'ఎన్నో నోములునోచి' మొగ్గను కని 'ఎంతోగారాబుగా' పెంచి పోషించిన తీగతల్లి వాత్సల్యమును మమతను సౌమ్యశబ్దాలతో పరిమళభావములతో వర్ణించి నాటికను కావ్యసౌందర్యసౌగంధ్యాలతో అలంకరించినారు. శ్రీనారాయణ రెడ్డిగారు. తనపాపను సుకుమారముగా లాలించి పాలించి అలరించు ఒక మాతృ మూర్తిని పై పంక్తులలో బొమ్మగీసి చూపినారు శ్రీ రెడ్డిగారు. శ్రీ రెడ్డిగారి కవితాత్మ వారి గేయనాటికలన్నియందును పదపదమున పరమరమణీయ ముగా ప్రత్యక్షమగుచుండును. ఉదాహరణమునకు వారి 'భిన్నస్వరాలు'లోని

''జీవన సంధ్యాగీతం
భిన్నస్వర సంకేతం
కాటుకక్రమ్మింగిన కారుమబ్బులో
వెలుగునురుగు పారాడూ
పాలవన్నె శంపాపథాలలో
నీలినీడ నడయాడూ''

'అజంతాసుందరి' లోని —

''ఓ అజంతాసుందరీ
ఓ దిగంతమనోహారీ

నాలోని శ్వాసం
ధ్యాత్రోణిమల మూపి
నిండుపున్నమల సం
దించిన విభావరీ!
ఓ అజాతాసుందరీ
ఓ దిగంతమనోహరీ!
నీ మేఖలాకింకి
ణీ మంజులధ్వనులు
నా శిలామయ జీవ
నమున ఉపసేచనులు
నిలువెల్ల కనులతో
నిన్ను చూచెదనన్న
సురనాథుడను గాను
పరమాత్ముడను నేను"

'ఋతువులరాణి' లోని—

"మధుమాసం మధుమాసం
మృదుసుమాల పెదవులపై
నిదురలేచు దరహాసం
మధుమాసం మధుమాసం
శిశిర నగ్నలతావళికి
ఘుసృణాంబర విన్యాసం"
"ఓ వసంతభామినీ
ఓ విలాసగామినీ
రావే నా నీలనిశా
జీవిత సౌదామని"

'దివ్వెల సంగీతము' లోని—

"మింటిశిరసుపై ఓంటిగమెరిసే
శాశ్వత తేజస్సౌధము జేర్చగ

వెలసిన పూవుఃదారులం
వెన్నెలరాయని దారలం" వంటి గేయఖండికల నెన్నింటినో చూపవచ్చును. వీనియందలి రీత్యలంకారవస్తురసధ్వన్యాదుల వైభవమునుగూర్చి ఎంతయేని వ్యాఖ్యానింపవచ్చును. శ్రీ రెడ్డిగారి నాటికా వాటికలలో చైత్రలను పుక్కిలించు గేయమల్లికలు కొల్లలు కొల్లలు

శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి నాటికలయందలి పాటలన్ని రసార్ద్రకవితారాకాసుధాకరతరుణకిరణాలే. సిదర్శనమునకు ఒకటి రెండు గేయకిరణాలనిట చూపింతును.

"ఎందుకయా సాంబశివా!
ఎవరునీకు చెప్పారయ!
ఈ అల్లరిచేతలూ—
ఈ బూడిదపూతలూ' ॥ఎందు॥

అలలతోటి ?ంగబట్టి
తలపాగా చుట్టి—
నెలవంక అనే మల్లెను
కలికితురాయిగ పెట్టి ॥ఎందు॥

తోలుకట్టి పటకాగా
కాలాహిని కుట్టి
కేలత్రిశూలం పట్టి
ఫాలమందు కీలపెట్టి ॥ఎందు॥

రుద్రుడవో-కారుణ్యాస
ముద్రుడవో యేమో!
ఎందుకయా ఈ దాసుని
కందవయా దయామయా! ॥ఎందు॥

—'శివక్షేత్రయాత్ర'

అంత్యప్రాసల ముక్తాయింపులలో నాదమాధురితో సాగిన ఈ గేయము శివుని స్వరూపమును మనోజ్ఞముగా చిత్రించుచున్నది. గంగను 'తలపాగా' గా

'నెలవంక' ను మల్లెపూల 'కలికితురాయి'గా అలంకరించుకొన్న పరమేశ్వరుని ప్రతిభానేత్రముతో దర్శించిన శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి కల్పనము కమనీయము. కల్పనచేతనే కదా కవిత తీవెలుసాగి పూవులు పూచునది! గేయమును శ్రవణపేయముగా తీర్చిదిద్దుటలో అగ్రేసరులు శ్రీ శాస్త్రిగారు. పదములకున్న నాదశక్తిని ఎరిగినవారు. వారి కావ్యములందువలెనే వారి నాటికలలోను భావము, భాష సరసముగా కాపురము సేయుననుటకు ఉదాహరణముగా వారి 'శర్మిష్ఠ' లోని—

"చలితచలిత మచ్చరణకటకమం
జీరగళ్స్రుత శింజితమ్ము నిను
పిలిచిపిలిచినా, పలుకరించినా
చలియింపదు జడశిలయో? నీ యెద!" అను పంక్తులను చూపవచ్చును

"పాడుకరవులకు బాణాలు—మా
పంటచేలకివి ప్రాణాలు
కాపు కన్నులకు ముత్యాలు—వరి
కట్టిల నోళ్లకు చనుబాలూ" — శ్రీ వానమామలై వరదాచార్యుల వారి 'రైతురాజు'

వర్షాలను ఇంత మధురముగా మనోజ్ఞముగా వర్ణించుగేయము నాన్యతో దర్శనీయము. వర్షాలను 'వరి కట్టినోళ్లకు చనుబాలు' గా ఊహించుటలో కవిత పరిమళించి అంచులు దాటినది. కావ్యకర్త దర్శన వర్ణన శక్తుల కీగేయము నిదర్శనము.

"కామిని!
యతుగాన ఘంటాపథ
గామిని!
మా కొలువుకు రమ్ము రమ్ము
మాకందమహాశాఖిక
కొరకువచ్చు కోకిలవలె
ప్రియమేఘోదయాభిముఖ
మయూరాభిసారికవలె

మహోకవి కావ్యమువలె
మా కొలువుకు రమ్మురమ్మ" — డా॥ యస్వీజోగారావుగారి
'అప్సరస'

గాన నాట్యకళాకల్యాణియైన జక్కులపురంధ్రి 'కామిని' ని ప్రభువు మాణిభద్రుడు తన రాజాస్థానమునకు ఆహ్వానించు సన్నివేశమునందలివి ఈ చరణములు. మామిళ్లకు, కోకిలలకు, నీరదాలకు నెమళ్లకు గల రాగబంధము సహజమను కవిసమయములను ఈ గేయములో నిబంధించి, వాని మూలమున కామినీ భవిష్యత్ప్రణయగాథను ధ్వనింపజేసినారు డా॥ యస్వీజోగారావుగారు. అంతే కాదు కోకిలశబ్దముచే కామినిగానము, మయూర శబ్దముచే నాట్యము కావ్య శబ్దముచే కామినీ కవితారసజ్ఞతను వ్యంజింపజేసినారు విద్వత్కవులు శ్రీ జోగారావుగారు. ఇట్లు ఇందలి కవిసమయములు వస్తుధ్వనిని సాధించినవి. ఇట్టి పట్టులే కావ్యోత్కర్షకు హేతుభూతములు. శ్రీ జోగారావుగారి 'సుమబాణము' లోని —

"రతిమన్మథుల ప్రణయలాస్యముల
రవ్వల మువ్వల రవళుల రువ్వులు
తెమ్మెరవలపులు తుమ్మెద బువ్వలు
గువ్వలబాసలు పువ్వులహో

......................

ముగుదలకొప్పుల మొగిళుల మెరుపులు" అను పువ్వుల వర్ణనము మనోహరము. ఈ విధముగా కవితా మకరందముల నొలుకు గేయములు శ్రీ జోగారావుగారి నాటికలలో పెక్కు తావులలో తావులీనుచుండును.

"ఇవురులోపల సన్నయీనె తోచినయట్లు
కవురు నామెయి వింతకాంతి తోచినదమ్మ
లేమావి పూచిన లీల నా కనుతుదన్
లేమలారా! పిసాళించెనేజిగులతో" — శ్రీ విశ్వనాథ
సత్యనారాయణగారి 'పాముపాట'

తనకు యుక్తవయస్సురాగానే తండ్రి తనకు పెండ్లిసేయ సమకట్టినాడని నాయిక త్రైలోక్యసుందరి నాగమ్మ అను జానపదకాంతతో చెప్పిన సన్నివేశము

వందలివి ఈ పంక్తులు. త్రైలోక్యసుందరికి యౌవనమురాగా ఆమె తనువులో ఒక వింత కాంతి 'ఇవురులోపలి పన్నయీనె తోచినయట్లు' తోచినదని వర్ణించిన వైనము శ్రీ విశ్వనాథవారి ప్రకృతి సూక్ష్మ పరిశీలనాశక్తికి నిదర్శనము.

"ఓ పతివ్రతలార ! ఓ తల్లులార !
ఓ భారతీయ ధాత్రీభద్రలార !
ఇంతలో నాచెవికి నేమూఁనో యుండి
వింతయౌ ఈలగా వినిపించెనమ్మా !
ఆ యీల నా గుండె లోయలో దూరాన
కోయిలకూతగా కుసిలించెనమ్మా !
ఆ యీల నా గుండె యంతరాంతరమందు
మ్రోయించెనమ్మ సమ్మూర్ధవేణువులు
ఆ యీల నా గుండె యవిసి ముక్కలలోన
వాసించెనమ్మ సంపంగివాసనలు" — 'పాముపాట'

పాము రూపముననున్న తనపతి బుసకొట్టగా ఆ ఫూత్కారము త్రైలోక్యసుందరికి 'ఈల'గా, 'కోయిలకూత'గా 'సమ్మూర్ధవేణువు' మ్రోతగా వినిపించినది; ఆమె గుండెలో సంపంగి వాసనలను వాసింపజేసినది. పతి ఏ రూపమున మన్నను దైవమే అని భావించు భారతీయ పతివ్రతామతల్లి నిర్మల ప్రణయ హృదయమును ఈ పంక్తులలో మనోహరముగా ధ్వనింప జేసినారు కవిసమ్రాట్టు శ్రీ విశ్వనాథ వారు. 'ఓ పతివ్రతలార, ఓ భారతీయధాత్రీ భద్రలార' అను సంబుద్ధులు సాభిప్రాయముగా ప్రయుక్తములైనవే. ఒక జాతి ఉత్తమ సంస్కృతి మాహాత్మ్యమును ఉదాత్త వ్యంగ్యమర్యాదతో ప్రకటించుట ఉత్తమ కావ్యలక్షణములలో నొక అంశము.

'భూమాత పాలిండ్లు
ఈ పాలచేలు,
గ్రోలు కొలదిగ చేపు
కొంకల పాలు
శక్తిగల బిడ్డకే యువకుడా!

చన్నిచ్చు ప్రీతితో యువకుడా!
తల్లి వైనను బిడ్డ
త్రావకయె కుడుపునా?
పండైన రసధార
పిండకయె కల్గునా
పీడనమ్మునగాక యువకుడా!
మనసు
ప్రియమార కరగదో యువకుడా!''

—డా॥ బోయి భీమన్నగారి 'మానవుని మరొక మజిలీ'

పాలవంటలనందించు చేలను 'భూమాత పాలిండ్లుగా' దర్శించుట రమ్యాతి రమ్యము. గేయమునందలి ఉత్తరభాగము మానవునికి ఉండవలసిన శ్రమశీలము నిత్యజీవితములో కానిపించు వస్తువులను చూపించి సహజ సుందరముగా ప్రబోధించినారు శ్రీ బోయి భీమన్నగారు. కవితా పరిమళమును పొదుగుకొన్న గేయమిది. 'మానవుని మరొక మజిలీ' లోని—

"ఖరకరాగ్రము సోకి
నేరలు తీసిన నేల
చంద్రకుంభము వంచి
సాగు చేసేము
ప్రతిగడ్డి పోచనూ, ప్రియురాలా!
బాలెంత జేసేమె, ప్రియురాలా!" అను పంక్తులు కవితా మనోహరములు. చంద్రుని కుంభముగా కల్పనము సేయుట భావనారమ్యము. అమృతాంశుకుంభమునుండి జాలువారునది అమృతరసమే కదా! అందుకే ప్రతి గడ్డిపోచ 'బాలెంత' కాక తప్పదు.

"నేనుషస్సతిని; వేదత్రయీ సంస్తుత్య
మానభాస్వన్మయూఖాళీ విరాజితను
అంధతమసావృతాఖిలలోక కల్యాణ
సంధాయకానంత శక్తి విభ్రాజితను
కాంచనాంబర శుభ్ర కాంతిచ్ఛటాపూర
చుంబితాంబర ధరాధర దరీగహ్వరను''

— డా॥ కె. వి. ఆర్. నరసింహము గారి 'ఉషోరాగము'

'ఉపస్సుందరి'ని ఉదాత్తముగా జటిల సమాసములతో ప్రబంధధోరణిలో వర్ణించి నారు డా॥ నరసింహముగారు. పాండితీవైభవముతో దరులనొరసి ప్రవహించిన కవితాఝరీతరంగము లీ చరణములు.

(డా॥) నరసింహముగారు మరొకచోట—

"చెక్కిళుల నొకమారు
చెందొవలు పొంగారు
లేగులాబుల తీరు
లేతచివురుల సౌరు" అని ఉపస్సుందరి చెక్కిళులను వర్ణించి

నారు. మొదట పేర్కొన్న పంక్తులు సంస్కృతసమాసభూయిష్ఠములు కాగా ఈ చరణములు అచ్చతెలుగు పలుకుల ముత్తియములతో కదలాడుచున్నవి.

"కృష్ణయ్యా! కృష్ణయ్యా!
నా కన్నులమిన్నులలో
నడయాడే మొయిలుమొల్క
నా లోపలి తేనె పల్కు
లాలపించు రామచిల్క" — డా॥ దాశరథిగారి 'రాధప్రేమ'

రాధ తన ప్రియుడైన మాధవుని వర్ణించుచున్న సందర్భమునందలివి ఈ పంక్తులు. 'కన్నులమిన్నులు' కమనీయమైన రూపకము. మేఘశ్యాముడైన కృష్ణుని 'మొయిలుమొల్క'గా వర్ణించుట ఔచితీసంశోభితము. కృష్ణుని రాధ తన లోపలి రామచిల్కగా చెప్పినందువలన రాధాహృదయము పంజరము లేదా గూడు అగుచున్నది. చిల్కలేని పంజరమెందుకు ? పంజరమును శరీరముగను చిలుకను ఆత్మగను వర్ణించుట వేదాంతతత్త్వమునందు కానిపించు అంశము. ఆత్మలేని శరీరము వ్యర్థమే కదా! ఇట్లు సింగారపు చిన్ని చిన్ని పలుకులలో సమున్నత వేదాంతతత్త్వము పొదుగబడినది. మొల్క. పల్కు, చిల్క అను అంత్యప్రాసలవలన ఈ గేయము మరింత శోభించుచున్నది. శబ్దార్థ సౌందర్య సరస సమ్మేళన స్వరూపము ఈ గేయము.

"నెమ్మికటు తనువెల్ల
నిండినవి నీకనులు

మిలమిలని మెరిసెడిని
మీలవలె నీకనులు
నిర్న మేషంబులై
నిలిచినవి నీకనులు
మృగియతుంటు ముఖము
మీరినవి నీకనులు
గిరికన్యవో-నీవు-జలకన్యవో,
సురకన్యవో-కాక-వనకన్యవో?

—శ్రీ నోరి నరసింహశాస్త్రిగారి 'కన్యాకుమారి'

'పాంథుడు' 'కుమారి'ని చూచి ఆమె కన్నులను వర్ణించిన సన్నివేశమునందలివి ఈ చరణములు. క్రమాలంకారము వలన ఈ కన్నులవర్ణన కళకళలాడు చున్నది.

"శ్రీకారం చుట్టుకున్న
స్త్రీజాతి కథానికవలె
ఆకారం దాల్చిన లో
కైక శోక గీతికవలె"

"భగీరథుని రథం వెనుక
ప్రవహించే సురనదివలె
అరుంధతీ ఋషునివెనుక
అరుదెంచే నందినివలె"

"హిమవద్గిరి వెంటవచ్చు
ఉమాదేవి చందమ్మున"

"రసార్ద్రమై ప్రవహించే
రామాయణరచన రీతి"

"ధర్మముతో దయలాగున" సీత వాల్మీకులవారివెంట వచ్చినదట. పై పంక్తులు శ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రిగారి 'సీత'లోనివి, సీత ఒక్కొక్కరికి ఒక్కొక్క విధముగా కానిపించిన తీరును వివిధోపమాలంకారముల ద్వారమున 'కరుణశ్రీ' గారు కవితాత్మకముగా చిత్రించినారు. ఉపమానములన్నిం

టను ఒక రసాత్మకత, ఒక పవిత్రత, ఒక ఉదాత్తత నిండియున్నవి. ఇట్టి ఉపమాలంకార వైవిధ్యప్రయోగమువలన కావ్యశోభ శతపత్రమువలె విరిసి అందగించును.

"శ్రీ స్వయంభూస్వామి చికిలి చిచ్చుటకన్ను
చటులకాలానలచ్ఛటలు గురిసిన యట్లు
ఏకవీరాదేవి భీకరభ్రుకుటీత
రంగభంగిమములు ప్పొంగి పొరలినయట్లు
కాకతమ్మ కరాళకంఠహుంకారాలు
విశ్వరూపము దాల్చి వెల్లి విరిసినయట్లు" కాకతీయ సైన్యాలు

కదలిసాగి దేవగిరిరాజుపై దండెత్తినవి. పై పంక్తులు 'కరుణశ్రీ' గారే రచించిన 'రుద్రమదేవి' లోనివి. శబ్దమును మించిన అర్థము, అర్థమును మించి శబ్దము కదనుదొక్కిన సరణి ఈ గేయకవితలో రవణించుచున్నది.

"తలపుపాలకడలిచిలికి
వలపువెన్న ముద్దచేసి
నిండుగుండె వెండికుండ
కోరికోరి కూర్చినాను
ఆరగింప రారదేర
కోడెవయసు సొగసుకాడ"

—డా॥ కందూరి రామకృష్ణమాచార్య గారి
'జ్యోత్స్నాభిసారిక'

ముగ్ధయైన 'రాగిణి' తన 'వలపువెన్న'ను స్వీకరించుమ్మని శ్రీకృష్ణుని పిలుచు సందర్భములోనివి ఈ చరణములు. వెన్నదొంగకు 'వలపువెన్న'ను అందించుట హృద్యము. ఇందలి రూపకములు సహృదయహృదయోద్దీపకములు.

"కడలిలోని నీరు, మబ్బు
కడవలతో మోసితెచ్చి
మండిపోవు పుడమితల్లి
గుండెసేద దీర్చినాను
వర్షాసుందరి నేను

ఇల
కర్షకతో కానందము నేను"

—శ్రీ బాపురెడ్డిగారి 'ఋతురాగం'

'వర్షాసుందరి' తన ప్రాశస్త్యమును తానే చాటుకొను సన్నివేశమందలివి ఈ పంక్తులు. 'మబ్బుకడవలు' మనోజ్ఞమైన రూపకము. ఈ రూపకమువలన పంక్తులలో చక్కని శబ్దచిత్రము రూపుదిద్దుకొన్నది. కవి కల్పనాశక్తిచేతనే శబ్దచిత్రాలు ఆకృతిని దాల్చి ఆత్మను నింపుకొనును.

గ్రీష్మరాగిణి—"శిరముపై చండరవి
ఖాండమ్మును వహించి
శివుని ఫాలాగ్నికీ

లామాలలు ధరించి" వచ్చినదట ఈ పంక్తులు 'ఋతురాగం' లోనివి. 'శిరముపై చండరవిఖాండము వహించి' అను పంక్తులందలి 'రవిఖాండము' వలన ఏర్పడిన శబ్దచిత్రము హృదయంగమము. ఇట్టి రమణీయ శబ్దచిత్రమువలన కావ్యము కళకళలాడుచుండును.

గేయనాటికలలో విశ్వజనీనమైన సార్వకాలీనమైన ప్రబోధ సూక్తులు అరుణకిరణాలవలె సహృదయ హృదయ పద్మాలను అలరించుచున్నవి. వీనితో వేదాంతము, సాహిత్యవిమర్శ, స్నేహ దయాధర్మ సమతా సహకారాది ఉదాత్త గుణ మహితమైన సంస్కృతి, రసజీవనము, కళాజగన్నియమములు ఇంకను వివిధములైన అనుభూతులు ప్రతిఫలించుచున్నవి. ఇవన్నియు రసజ్ఞుల హృదయతంత్రులను మీటగా జాలినవే; కావ్య ప్రాశస్త్యమునకు వన్నెలు దిద్దునవే. ఉదాహరణమునకు కొన్నింటిని ఇట పేర్కొందును.

"ఈ వింతలోకమ్ములో ఓ సఖా
ఏది వాంఛింతుమదియే
ఎండమావులరీతిగా ఓ సఖా
ఎలయించుకొని పోవునే" — (శ్రీ శివశంకరస్వామి వారి 'యక్షరాత్రి')

"వాంఛాలతికా వాగురలోనే
చేతోహరిణము చిక్కువడునుగద" — ('యక్షరాత్రి')

"లలనవోలె ప్రాకృతమ్ము లలితమ్మైయగుమగాని
సర్వముఖాధ్య శక్తి సంస్కృతమ్మునకె చెల్లు"— ('యత రాత్రి')

"దయనెరుం'ని ధర్మశాస్త్రమ్ములేల" — ('దీక్షితసంహిత')

"డాగి వెదకికొనుటతోనె తనివితీరు వలపు
ఆగియాగి ప్రేమసుధల నానుటయే పొలుపు"—(శ్రీ బాలాంత్రపు
రజనీకాంతరావుగారి 'మధురానగరీ గాథ')

"విగ్రహము లేకున్న
నీకార్చన సున్న
సంయోగమే లేని
సౌందర్యమే మిన్న
సృష్టియే తనకు సం
తుష్టిని ప్రసాదించు
ప్రతిఫలము నాశించి
బ్రతుకడు కళాజీవి" — (డా॥ సి. నారాయణరెడ్డిగారి
'అజంతా సుందరి')

"చేదుచిలికే జీవితమ్ములు స్వాదుతానిలయమ్ములు
మధువులొలికే మాటబొమ్మలమాటు నాగఫణమ్ములు" —
(డా॥ సి. నారాయణరెడ్డిగారి
'మనిషి-యంత్రం')

"మట్టిదివ్వెలైననేమి
పసిడి ప్రమిదలైననేమి
స్నేహయుతములైనచాలు
జీవితాల వెల్గించును" — (డా॥ సి. నారాయణరెడ్డిగారి
'దివ్వెల సంగీతం')

"శ్మశానమున
హేమంతవసంతాలు సమానం
నిశావేళ
ఇతులూ మిణుగురులూ సమానం" — (డా॥ యస్వీ. జోగా
రావుగారి 'అవిముక్తము')

లను చేర్చి 70 వృత్తములకు మాత్రమే లక్ష్యలక్షణములను చూపెను. తెలుగు లాక్షణికులు దాదాపు మూడువందల ఛందస్సులకు మాత్రమే లక్ష్యలక్షణ సమన్వయము చేయగల్గినారు.

ఛందస్సుల సంఖ్య నియతమైనను కాకపోయినను వానిని స్థూలముగా రెండు విధములుగా విభజింపవచ్చును. ఒకటి పద్యచ్ఛందము, రెండవది గేయ చ్ఛందము. పద్యచ్ఛందము అక్షరనిష్ఠము. గేయము మాత్రానిష్ఠము. పద్య చ్ఛందస్సులను లయాన్వితముగా పఠనము చేయుట కవకాశమున్నది. గేయ చ్ఛందములు లయతోపాటు రాగతాళముల నాశ్రయించుటచేత గానము అని వార్యమగును. కనుక గేయమునకున్న గానయోగ్యత పద్యమునకు లేదు. ఈ కారణముచేతనే పాదములు కలిగినది. పద్యమనియును, గాన యోగ్యమగునది గేయమనియును వ్యుత్పత్త్యర్థములను పొందినవి.

గేయనాటికయని వ్యవహృతమగుచున్న సాహితీప్రక్రియలో గేయాత్మక ములు, గేయపద్యాత్మకములు, గేయపద్యవచనమిశ్రితములు అయిన నాటిక లున్నవి. వానియందుపయుక్తములైన ఛందోరీతులను ఇట వివరింతును.

**గేయనాటికలలో పద్యప్రయోగము :**

శార్దూల - మత్తేభ - చంపక - ఉత్పల - మత్తకోకిల-ఉత్సాహాది బహుళ ప్రచురములైన వృత్తములును, కందము, సీసము, ఆటవెలది, తేటగీతి వంటి జాత్యుపజాతులును ద్విపదలును, మంజరీ ద్విపదలును గేయనాటికలలో ప్రయుక్తములైనవి. స్రగ్విణీ - స్వాగత-తోటక - శాలినీ-వనమయూర-దోదక-ద్రుత విలంబిత - ప్రమితాక్షర - రథోద్ధత-వియోగినీ-భుజంగప్రయాత- పంచ చామర వృత్తముల ప్రయోగము క్వాచిత్కముగా నున్నది.

నాటకాది రూపకములలో శార్దూలాది వృత్తములు ఉదాత్తభావము లను ప్రకటించుపట్ల ఉపయోగించినట్లే గేయనాటికలందును వృత్తములు రస నిర్భరములైన ఘట్టములందును ఉదాత్తభావమయములైన సన్నివేశములందును ప్రయోగింపబడినవి. తార్కాణమునకు కొన్నింటిని ఇట పేర్కొందును-

శ్రీ శివశంకరస్వామివారి 'కవిప్రియ' నాటికయందు - యామినీ బిల్హ ణుల అనురాగనైర్మల్యమును గుర్తెరిగి బిల్హణుని రాజోచితములైన అలంక్రియ

లతో కైసేసి తోడుకొని రమ్మని కోటిపాలుని కాజ్ఞాపించినప్పుడు మదనభూపతి పలికిన మాట శార్దూలవృత్తముగా ఇట్లవతరించినది—

"బాలార్కద్యుతిమత్కిరీటము శిరోభాగమ్ము మీదన్, మణి
ప్రాలంబంబురమందు కాంతులెసగన్, భద్రేభయానమ్ముపై
నీలచ్ఛత్రము క్రింద భిక్షుని నిదాఘార్ద్రోత్సవశ్రీలతో
ఆలోకింపగ పౌరులెల్ల కొనిరమ్మా, కోటిపాలాగ్రణీ!"[1]

శ్రీ దేవులపల్లి వేంకటకృష్ణశాస్త్రిగారి 'ధనుర్దాసు' అను నాటికలో - శ్రీ మద్రామానుజుల ఆదేశోపదేశముల ననుసరించి ధనుర్దాసు శ్రీరంగేశుని దర్శించి నపుడు అతివేలమైన భక్తిరసావేశముతో—

"నా తండ్రీ! చిరదగ్ధజాంగలము ప్రాణమ్మిద్ది; యుష్మత్కృపా
న్వితస్ఫీత కటాక్షవీక్షణము ప్రావృణ్మేఘమాలా నిశ
చ్ఛీత స్రోతము ఒకమారయిన వర్షింపంగదే! ఆరునే
మో తృష్ణాగ్ని? రవంతచల్లబడునేమో జీవమో యీ ప్రభూ!"[2]

అని ప్రార్థించినప్పటి సన్నివేశమందలి ఈ పద్యము మరొక ఉదాహరణము.

డా॥ నండూరి రామకృష్ణమాచార్య విరచితమైన 'గోదావరి' అను నాటికలో తండ్రి ఆనతిని కాదని గీటుదాటిన గోదావరినిఉద్దేశించి నందీశ్వరుడన్న పలుకులు—

"క్వణదణుకింకిణీకలిత కాంచన కంకణ కాంచిద్యొరణన్
మణిమయ శింజినీ ప్రకటనర్తనగాన ఝుళంఝుళద్ విలా
సిని యయి జాళువా చిలిపి సిగ్గుల మేలిముసుంగు జార్చుచున్
ప్రణయిని ఆర్షకన్య పొరపాటున వాలెను తండ్రి గీటుపై!"[3]

అను రమణీయ భావసౌరభముల విరజిమ్ము 'చంపకము'గా రూపుదిద్దుకొన్నది.

శ్రీ శివశంకరస్వామివారు 'వ్రతభంగము' అను నాటికలో జాత్యుప జాతులతో పాటు స్రగ్విణీ - స్వాగత - తోటక - శాలినీ - వనమయూర -

1. కవిప్రియ-పుటలు-742-743. శ్రీ శివశంకర కృతులు-ద్వితీయ సంపుటి (1952)
2. ధనుర్దాసు-పుటలు 25-26-కృష్ణశాస్త్రి స్వర్ణోత్సవ సంపుటి-ప్రథమ ముద్రణ (1975)
3. 'గోదావరి' - నృత్యనాటిక - పుట 15 ('నృత్యనాటికలు' సంపుటి-ప్రచురణ 1969.)

దోదక - ద్రుతవిలంబిత - ప్రమితాక్షర - రథోద్ధత వృత్తములను ప్రయోగించి ఛందో వైవిధ్యమును ప్రదర్శించినారు. వీనిలో స్వాగత వృత్తప్రయోగ సందర్భమున వృత్తనామౌచిత్యము రేఖా మాత్రముగా భాసించుచున్నది. ఈ స్వాగత వృత్తములు 'వ్రతభంగము' ఐదవ భాగమందున్నవి. ఈ నాటికలోని నాయకుడు తనకు ఆప్తురాలైన 'అంబ' యను నామె యొద్దకు వచ్చును. అపుడామె అతని ఆగమనమును గూర్చి అడుగును. ఈ సందర్భమునందే ఐదు స్వాగతవృత్తములు ప్రయుక్తములైనవి. ఉదాహరణమునకు వానిలో కొన్నింటి నిట పేర్కొందును——

"ఫాలభాగమున భస్మకణంబుల్
చాలదీర్చితివి సాంద్రముగానే!
మేలికుంకుమము మెత్తితివో హా,
ఆలయాగతుడవంచు దలంతున్,
ఇప్పురంబునకు నెప్పుడు రాకో?
చెప్పవేటికి విశేషము లేవో
ఒప్పవోయి వినయోక్తుల నేచో
నప్పు దెచ్చితివహా, నవసాధూ!"[1]

శ్రీ శివశంకరస్వామివారు 'వ్రతభంగము' మొదటి కొన్ని భాగములలో ఒక్కొక్క భాగమునందు ఒక్కొక్క ఛందమును ప్రయోగించి కొంత వైలక్షణ్యమును చూపినారు. అందలి నాలుగవ భాగములో నాలుగు 'శాలిని' వృత్తములు ప్రయుక్తములైనవి. ప్రతిపాదమునందును మ, త, త, గ, గ అను గణములుండు శాలినీ వృత్తములో యతిస్థానము ఏడవ అక్షరము.[2] కాని శ్రీ స్వామివారు నాలుగు వృత్తములందును ఎనిమిదవ అక్షరము యతి స్థానముగా పాటించినారు ఉదాహరణమునకు ఒక దానినిట చూపింతును——

1. 'వ్రతభంగము - ఐదవ భాగము - పుట 172 (శ్రీ శివశంకర కృతులు - ప్రథమ సంపుటి ప్రథమ ముద్రణము (షష్టిపూర్తి) 1952.

2. "ధీరశ్రేష్ఠుల్ సన్నుతింపంగ వీంద్రా, ధారంబై ధాత్రిన్మతాగాగణాప్తిన్ దోరంబై భూభృద్యతుల్ సంఘటింపన్, నీరేజాక్షా శాలినీవృత్త మొప్పున్." అప్పకవీయము - చతుర్థాశ్వాసము - పుట 229. వావిళ్ళవారి ప్రచురణ - మద్రాసు 1962 (ఆరవ ముద్రణ)"

"సద్యోగ్రలబ్ధిన్ సుందరిశ్యామలాబాలా!
విద్యాశాలన్ తోడనే స్వీకరించెన్
ఉద్యోగంబున్ దూరమౌనుత్తరాదిన్
ఆద్యంబేతన్మంగళం బంచు నెంతున్."[1]

'వ్రతభంగము'లో శ్రీ శివశంకరస్వామివారు స్రగ్విణీ-స్వాగత - తోటకాది వృత్తలను ప్రయోగించుటకు కారణము వీనిలో గేయముండుటయే. ఈ వృత్త ములలో కొన్ని చతురస్ర గతిలోను, మరికొన్ని ఖండగతిలోను సాగును. తోటక-దోదక-ప్రమితాక్షరవృత్తములు చతురస్రగతిలోను, స్రగ్విణీ-వనమయూర వృత్తములు ఖండగతిలోను నడచును.

శ్రీశివశంకరస్వామివారికి సంస్కృతవృత్తములపై నున్న అభిమానమును ఈ వృత్తప్రయోగము సూచించుచున్నది

శ్రీ మల్లవరపు విశ్వేశ్వరరావుగారు తమ 'బిల్హణీయము' అను గేయ నాటికలో బిల్హణుడు వియోగవ్యథితమనస్కుడై వధ్యస్థలమున ప్రియురాలైన యామినీపూర్ణతిలకను జ్ఞప్తికి తెచ్చుకొను సన్నివేశములో నాలుగు వియోగినీ వృత్తములను ప్రయోగించి వృత్తనామౌచిత్యమును పాటించినారు. ఉదా హరణమునకు వానిలో నొకదాని నిట పేర్కొనుచున్నాను.

"సుమకోమలి దివ్యనేత్రనో
త్సుకదృక్పాత ఝరిన్ పవిత్రమై
తరలించిన మచ్ఛరీరమున్
మరణమ్మింక చలింపనేర్చునే!"[2]

వియోగిని వృత్తమునకు "బేసి పాదంబుల స-స-జ గురువులును, సరిపాదంబుల స-భ-ర-వ గణములున్ను, బేసి పాదంబుల ఆఱింట, సరిపాదంబుల యేడింట యతి".[3] శ్రీ మల్లవరపు విశ్వేశ్వరరావుగారు వియోగినీ వృత్తగణములనే పాటించినారు గాని యతిని పాటించలేదు

1. 'వ్రతభంగము-ఆ-వభాగము-పుట 174. (శ్రీ శివశంకర కృతులు-ప్రథమ సంపుటి (షష్టిపూర్తి ముద్రణ) (1952.)

2. అముద్రితప్రతి.

3. ఆంధ్రవాచస్పత్యము (నిఘంటువు) తృతీయ సంపుటము-పుట 139 (1959. ప్రచురణ) (ద్వితీయ ముద్రణ. )

శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి 'పాముపాట' అను సంగీతరూపకము నందు నాయిక అయిన త్రైలోక్యసుందరి తన భర్త భుజంగమను విషయమును తెలుపబోవు సందర్భమున నాగమ్మ అను జానపదకాంత నాయికతో పలుకు పలుకులు భుజంగప్రయాత వృత్తముగా సాగినవి.

> "బలేగా అన్నావు బాలామణీ
> సరేయేమియన్నారసాధుల్ చెలీవారు"[1]

త్రైలోక్యసుందరి భర్త భుజంగమని ధ్వనింపజేయునుద్దేశముతో ఈ వృత్త చరణములను నాటికాకర్తలు ప్రయోగించి తమ ఛందఃశిల్ప వైదుష్యమును ప్రదర్శించినారు. ఈ వృత్తము ఖండగతిలో నడచునట్టిది. ఈ కారణముచేతనే కవి భుజంగప్రయాతమున ప్రతిపాదమునకుండు అక్షరగణనియతినే కాక వానికి సరియగు మాత్రలను కూడ దృష్టియందుంచుకొన్నారు. మొదటి పాదమునందు నాలుగు 'య' గణములకు మారుగా య, త, త, గ ఉన్నవి. అనగా 20 మాత్రలు కాక 17 మాత్రలే ఉన్నవి. 'య' గణమునకును 'త' గణమునకును మాత్రలు సమానమే కావున ఇందు లయ కుంటువడలేదు. ఇక రెండవ పాదమునందు నాలుగు 'య' గణములపైన ఒక లఘువు నిలిచినది. అనగా 21 మాత్రలున్నవి. విశ్వనాథవారు గానసౌలభ్యమునకై ఈ మార్పును చేసినట్లు ఊహింపవచ్చును. ఇందు రెండే పాదములుండుటకు కారణము పాత్రసంభాషణములో భావవిస్తృతిని బట్టి పాదములను నడపుట. ఈ వృత్త పంక్తులందలి ర–ల ప్రాసము సలక్షణమే. రెండవ పాదమున యతియు పాటింపబడినది.

విశ్వనాథవారి ఈ 'సంగీత రూపక'మందే పంచచామర వృత్తము కూడ ప్రయోగింపబడినది.

> "మునీంద్ర చంద్ర! యెన్ని తీర్థములను మున్గినానో
> ఫణీంద్రరూపమితడుగాని పాయునట్లులేదే
> మునీంద్రుడైన శృంగిమాట మోసమేమో యో ప్రభూ!
> కడగి కనులనీళ్ళు తుడువగా వచించెనేమొకో!"[2]

---

1. 'పాముపాట'-పుట 14, ప్రచురణ-1955.
2. పాముపాట-పుట-32-33.

ఈ వృత్తమునకు ప్రతిపాదమునందును జ, ర, జ, ర,జ,గ, అను గణములు నియతముగా నుండవలెను. మాత్రా దృష్టితో చెప్పినచో 24 మాత్రలుండ వలెను ఈ వృత్తమును గాన యోగ్యము చేయుటకు కాళోలు విశ్వనాథవారు మొదటి రెండవ నాలుగవ పాదములలో 23 మాత్రలను, మూడవ పాదమున 25 మాత్రలను వేసినారు. ఈ విధముగా వారు మాత్రలనే దృష్టియందుంచు కొనిరి కాని గణములను కాదు. పంచచామరము త్ర్యస్రగతిలో నడచు వృత్తము. గేయచరణములందలి మాత్రలు నియతముగా నుండక అవి రాగముకొరకు ఒకప్పుడు తక్కువగను ఒకప్పుడెక్కువగను ఉండుట సహజమే.

శ్రీ నోరి నరసింహశాస్త్రిగారు తమ "భాగవతావతరణము" అను పద్యగేయ నాటికయందు మత్తకోకిల వృత్తములు కొన్నింటిని సలక్షణముగా ప్రయోగించి, మరికొన్నింటిలో కొంత మార్పుచేసి ప్రయోగించినారు.

"హోత పైలుడు నీవిశంపకులోద్భవుం డధ్వర్యుడు
ద్గాత జైమినియయ్యెయాగ మొకండు సాంతంబౌనొకో
భూత మొక్కటి చేయ వీరికి పూని విఘ్నారంభమున్
చేతులాడునొ నోళులాడునొ చెప్పవేనేదేనిచోన్"

మత్తకోకిల వృత్తమునందలి ప్రతిపాదమునందును ర, స, జ, జ, భ, ర అను గణములుండవలెను కాని శ్రీ శాస్త్రిగారు వీనికి బదులు ర, స, జ, జ, మ, వ, అను గణములను ప్రయోగించినారు. అనగా భ,ర అను గణములకు బదులు మ,వ అను గణములు ప్రవేశించినవి. మిశ్రగతిలో నడచు ఈ వృత్తములో మాత్రలు మాత్రము సమముగనే ఉన్నవి. భ, ర, లకును మ, వ లకును మాత్రలు సమానమే. అందువలనే నడక కుంటువడలేదు. శ్రీ శాస్త్రిగారు మాత్రా సమత్వవిషయమును తెలిసియే ఈ ప్రయోగము చేసినారు.

వాచికాభినయమునకు సరిపడునట్లుగా ఒక పద్యపాదమునో రెండు పద్య పాదములనో ప్రయోగించు పద్ధతిని గేయనాటికలలో శ్రీ శివశంకర స్వామి వారే ప్రారంభించినారు వారి 'పద్మావతీచరణ చారణచక్రవర్తి' 'దీక్షిత దుహిత' మున్నగు నాటికలలో ఈ ప్రయోగమునకు లక్ష్యములున్నవి. ఈ పద్ధతిని అనుసరించిన వారిలో శ్రీ సూరంపూడి భాస్కరరావు ('కవి' అను నాటిక) ఆచారి-ఉపశ్రీ ('రాగ హృదయం' అను నాటిక) మున్నగువారు ఉన్నారు.

ఆచారి-ఉపశ్రీల 'రాగహృదయం'లో మరొక్క వింత ప్రయోగము న్నది. పద్య పాదమును ఆదినుండి కాక నడుమ ఎక్కడనుండియో ఎత్తుకొని కొంతవరకు నడిపి దానిని గేయచరణములతో కలిపివేయుట అనునది ఆ ప్రయోగము. అది ఇట్లు సాగినది!

"అతిలోక మనోజ్ఞ భావ
భంగ్యంతర వ్యంగ్యవైభవ
రసాంచిత కావ్యకథా సరోజపత్రాంత
తుషారబిందు కళికావృత దివ్యలోచన
విలోలాలక లోలలోచన
విపంచిధారణి మనోవినోదిని
వాణీ........."1

'అతిలోక' నుండి 'కళికావృత' వరకు ఇందలి చరణములు ఉత్పలవృత్తసుమదళ ములే.

ఆద్యంతములు గేయచరణములుగను నడుమ పద్యపాద భాగములను చేర్చి రచించు ప్రయోగము కూడ వీరు ఈ నాటికయందే చేసినారు—

"ఓ విలోలాలక
ఓ లోలలోచన
వసంతరాగ సుపమోజ్జ్వల
బాలరసాల శాఖికావాస
లతా వినూత్న ప్రసవాసవ
మత్తచలద్విరేఫమాలా
సదృశ ప్రభాలక
ఓ విలోలాలక
ఓ లోలలోచన"2

ఆద్యంతములందున్న గేయచరణముల మధ్య ఒదిగియున్న రేఖాంకిత భాగములో 'ఉత్పల'సౌరభములు గుబాళించుచున్నవి. నృత్యాభినయములకు భంగమురాని సరణిలో పద్యమునెంతవరకు ఉపయోగించుకొనవచ్చునో తెలిసికొన్న ఈ ప్రౌఢ

1. 'రాగహృదయం' - 17 ప్రచురణ : ఫిబ్రవరి 1957.
2. 'రాగహృదయం' - పుట 16.

కవులు గేయ పద్యములకు తీయని రాగబంధమును నేర్పరచగలిగినారు. ఇదే దీని ప్రయోజనమని ఊహించుట కవకాశమున్నది.

గేయ నాటికలలో పద్యముల ప్రయోగార్హతను గూర్చి కొంత వివరింతును.

దీర్ఘములైన వృత్తములకంటె ఆటవెలది, తేటగీతి, కందము, మంజరి ద్విపద వంటి హ్రస్వచ్ఛందస్సులు గేయనాటికలలో ప్రయోగార్హములని శ్రీ శివశంకర స్వామివారు అభిప్రాయపడినారు. ఈ ఛ్ఛందస్సుల పాదములు పొట్టివిగ నుండును చిన్నపాదములు సంగీతమునకు మిక్కిలి అనుకూలముగనుండుట చేతనే శ్రీ శివశంకర స్వామివారు తమ పద్యగేయనాటికలలో వీనిని ప్రయోగించినారు. శ్రీ స్వామిగారిని ఆదర్శముగా గ్రహించి శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి, శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావు, శ్రీ మల్లవరపు విశ్వేశ్వరరావు, శ్రీ నోరి నరసింహశాస్త్రి, డా॥ సి. నారాయణరెడ్డి, డా॥ బోయి భీమన్న, అచారి-ఉమశ్రీ వంటి గేయ నాటికాకర్తలు కలువురు ఈ ఛందస్సులను విశేషముగా వాడినారు. ఒకటి రెండు సందర్భములందు మాత్రము దీర్ఘచ్ఛందములగు సీసములను శార్దూలమును శ్రీ శివశంకర స్వామిగారు ప్రయోగించినారు.

గేయ నాటికాకర్తలలో శ్రీ శివశంకరస్వామివారితో పాటు శ్రీ నిశ్వనాథ, శ్రీ నోరి నరసింహశాస్త్రి, శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావు, శ్రీ మల్లవరపు విశ్వేశ్వరరావు, శ్రీ బోయిభీమన్న, శ్రీ కె. వి. అర్. నరసింహము వంటివారు మంజరీ ద్విపదను తమ నాటికలలో విశేషముగా ప్రయోగించినారు. ద్విపదకంటెను మంజరీద్విపద గేయమునకు అతి సన్నిహితముగా ఉండుటయే ఇందుకు కారణము

గేయ నాటికాకర్తలు కొందరు ఛందఃప్రయోగ విషయమున ఒక విశేషమును సాధించుటకు ప్రయత్నించినారు. ఒక్కొక్క పాత్రకు ఒక్కొక్క విధమైన ఛందస్సు వాడుటయే ఈ విశేషము. దీనికి ఆద్యులు శ్రీ శివశంకరస్వామిగారే. వారి ప్రప్రథమ పద్యగేయనాటిక (శిష్యురాలు-1924)లో శిష్యురాలి సంభాషణమంతయు తేటగీతిలోను, మీరాబాయి సంభాషణము ముత్యాలసరాలలోను, రూపగోస్వామి సంభాషణము ఆటవెలదిలోను జరుగును. శ్రీ స్వామిగారి 'గురుశిష్యులు'లో దేవశర్మకు కందము, శిష్యుడైన విపులునికి ఆట

వెలసి, రుచీదేవికి ముత్యాలసరములును సమకూర్చినారు ఈ ప్రయోగవిశేష మునే వారు పద్మావతీచరణచారణ చక్రవర్తి, కవిప్రియ, నోణకజాయ, రాజ జామాత, ప్రభువాక్యమువంటి నాటికలలో పాటించినారు వీనిలో చివరకు కొంత సడలింపు కనిపించుచున్నది నాటికలు చిన్నవైనప్పుడు దీనికి కట్టువడి, పెద్దవైన ప్పుడు అంతగా పట్టించుకొనలేదు శ్రీ స్వామిగారు శ్రీ నోరి నరసింహశాస్త్రి గారు తమ 'భాగవతావతరణము' నందును 'షణ్ణవతి'యందును 'కన్యాకుమారి' యందును ఇట్టి ఛందఃశిల్పమును ఆశ్రయించినారు వారు భాగవతావతరణము నందు వేదవ్యాసుని స్వగతములు శార్దూలమునందును అన్యులతో భాషించు నపుడు కందమును ప్రయోగించినారు ఇక పైలునికి తేటగీతి, వైశంపాయను నకు ఆటవెలది, జైమినికి ముత్యాలసరాలు, సుమంతునికి ఉత్సాహమత్తకోకిల ములు, రోమహర్షణునకు మంజరీద్విపద, నారదునకు ఉత్పలమాల, శ్రీశుకునకు గేయము (చతురశ్రగతి) వాడినారు ఈ ఇరువురు కవులే ఈ శిల్పమును పాటించినవారు వాద్యబృందమునకు, ఆయా పాత్రల సంభాషణకు అనుకూల మైన స్వర కల్పనకు ఈ శిల్పము వలన సౌలభ్యము చేకూరును వివిధచ్ఛందో గతులకు అనుకూలమైన సంగీత కల్పనము వలన ప్రేక్షకులకు విసుగు జనింప నీయక వారిని ఈ శిల్పము ఆకట్టుకొనుచుండును

## గేయనాటికలలోని మాత్రాచంద్ధములు

గేయచ్ఛందస్సులలో కావ్యనిర్మాణమును కొనసాగించు పద్ధతికి ఆధునిక యుగముననే అంకురార్పణము జరిగినది నన్నయకు పూర్వమునుండియు గేయ ములు, పదములు పలురూపములలో నున్నవే కాని వివిధములైన గేయచ్ఛంద స్సులను కథాసూత్రముతో సమన్వయించి చెప్పట ఇటీవల జరిగిన ప్రయత్నమే శ్రీ గురజాడ అప్పారావు, శ్రీ రాయప్రోలు సుబ్బారావు, శ్రీ విశ్వనాథ సత్య నారాయణ శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులు, డా॥ సి నారాయణరెడ్డి మున్నగువారు రసవంతములైన గేయ కావ్యములను వెలయించి మహాకావ్య నిర్మాణమునకు గేయములుకూడ యోగ్యములే అని నిరూపించినారు గేయ చ్ఛందస్సులలో మలచిన శ్రవ్యకావ్యములే రసస్ఫూర్తికి కారణములగుచుండగా దృశ్యకావ్యములింకను ప్రసన్నతను కలిగించుననను అభిప్రాయము బలపడి గేయ నాటికా రచనకు కవులు ఉద్యుక్తులైనారు. గేయకావ్యములన్నింటియందును ప్రయుక్తములైన త్ర్యస్రచతురశ్రాదిగతులలో నడచు రగడభేదములనే గేయ నాటికలయందును నాటికాకర్తలు ప్రయోగించినారు తొలి గేయనాటిక

'పలితకేశము' ముత్యాలసరములలో నడచినది. పలితకేశము తర్వాత శ్రీ శివ శంకర స్వామిగారు ముత్యాలసరములతోపాటు, త్ర్యస్ర, చతురశ్ర, ఖండ, మిశ్ర, సంకీర్ణగతులలో గేయనాటికలను రచించినారు. గేయనాటికకు ఆద్యులైన శ్రీ శివశంకరస్వామిగారి అడుగుజాడలలో గేయనాటికా కర్తలందరును త్ర్యస్రాది గతులను ఆశ్రయించినారు. శ్రీ శివశంకర స్వామివారి తర్వాత ముత్యాలసరాలను ప్రయోగించిన వారిలో శ్రీ నోరి నరసింహశాస్త్రి, శ్రీ వావిలాల సోమయాజులు, డా॥ బోయి భీమన్న, డా॥ కె.వి.ఆర్. నరసింహముగారలు పేర్కొనదగిన వారు.

కొందరు పాత్రను, సన్నివేశమును దృష్టియందుంచుకొని కీర్తనలు (శ్రీ విశ్వనాథవారి 'పాముపాట'), జావళులు (డా॥ సి. నారాయణరెడ్డిగారి 'తరతరాల తెలుగు వెలుగు', డా॥ జోగారావుగారి 'అప్సరస', శ్రీ కృష్ణశాస్త్రి గారి 'గౌతమి') భజనలు (శ్రీకృష్ణశాస్త్రిగారి ధనుర్దాసు-శివక్షేత్రయాత్ర,) తత్త్వములు (శ్రీ కృష్ణశాస్త్రిగారి ధనుర్దాసు). స్త్రీల పాటలు (శ్రీ కృష్ణశాస్త్రిగారి ఏడాది పొడుగునా), తుమ్మెద పాటలు (శ్రీ బోయి భీమన్న-మెరుపులో మెరుపు), జోల పాటలు (శ్రీ కృష్ణశాస్త్రిగారి శ్రీ ఆండాళ్లు) మున్నగు వానిని ప్రయోగించినారు. ఇవన్నియు సంగీతానుగుణముగ మాత్రల హెచ్చు తగ్గులలో త్ర్యస్రాదిగతులలో నడచినవే.

గేయ నాటికలలో ప్రయుక్తములైన గేయములను స్థూలముగా ఇరు తెరగులుగా విభజింపవచ్చును. పల్లవిలేక, పాదనియతిలేక, తాళబద్ధముగ సమ మాత్రలతో సాగిపోవునవి కొన్ని ఇక పల్లవిలోను చరణములోను మాత్రల ఎక్కువ తక్కువలతో రాగాత్మకముగా సాగిపోవునవి మరికొన్ని. ఈ రెండు విధములైన గేయప్రయోగమునకు కూడ శ్రీ శివశంకర స్వామిగారే ఆద్యులైనను, పల్లవితో కూడి పాటలవలె సాగిపోవు గేయములను గేయనాటికలలో సుందరముగా తీర్చిదిద్దిన ఖ్యాతి శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావుగారికే దక్కినది. శ్రీ రజనీకాంతరావుగారు స్వయముగా సంగీత విద్వాంసులును, వాగ్గేయకారులును అగుటచేత ఈ విధములైన గేయములకు తమ గేయనాటికలలో సముచితమైన స్థానమును కల్పించి కృతకృత్యులగుటయేగాక అనేకులకు ఆదర్శప్రాయులైనారు. డా॥ సి. నారాయణరెడ్డి, డా॥ దాశరథి, శ్రీ మల్లి

వరపు విశ్వేశ్వరరావు, డా॥ కె. వి. ఆర్. నరసింహము, డా॥ నండూరి రామకృష్ణమాచార్య శ్రీ జె. బాపురెడ్డి, శ్రీయుతులు ఆచార్య-ఉషశ్రీ ప్రభృతులు ఈ రెండు రకములైన గేయములను సమర్థముగా రచించి గేయనాటికా ప్రక్రియకు సాహిత్యమునందు ఒక విశిష్ట స్థానమును కల్పించగలిగినారు. ప్రాయికముగా గేయనాటికా కర్తలందరును సంప్రదాయ సిద్ధములైన యతి ప్రాసమర్యాదలనే పాటించినారు.

## గేయనాటికలలో వచనకవితా ప్రయోగము :

గణబద్ధముకాని, మాత్రాబద్ధము కాని వాక్యరచనా విన్యాసము వచనమనవచ్చును. కాని ఈ వచనమే అప్పుడప్పుడు లయబద్ధముగా సాగినచో వచన కవితాస్ఫూర్తి కలుగును. కొందరు వచన కవితాప్రయోక్తలు ఆ లయనుకూడ గుర్తించిన వారు తారు. గేయనాటికలలో వచనమే కాక వచనకవిత కూడ ఎడనెడ చోటుచేసికొన్నది. కాని గేయనాటికయందలి వచనము కాని వచన కవిత గాని రాగాత్మకముగా సాగిపోనిచో రసభంగమేర్పడుటకు అవకాశము మున్నది. కనుక గేయనాటికయందలి వచనము రాగలయాన్వితముగా నుండుట అభిలషణీయము. గేయనాటికలలో గేయములతో పాటు వచన కవితలను కూడ ప్రయోగించినవారు. శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావు (విశ్వవీణ), డా॥ సి. నారాయణరెడ్డి (మనిషి-యంత్రం), డా॥ యస్వీ జోగారావు (సాక్షాత్కారము, అవిముక్తము), డా॥ బోయి భీమన్న (చాండాలిక) గారలు.

కేవల పద్య నాటికలు, కేవల వచన కవితా నాటికలు నా పరిశీలనా పరిధిలో లేని కారణమున వానిని గూర్చి నేనిట ప్రస్తావించుట లేదు.

ఇక గేయనాటికలయందలి గేయముల గతి వైవిధ్యము రససృష్టి కెట్లు తోడ్పడినదో వివరింతును.

## గతివైవిధ్యము-రసపోషణము :

రససృష్టికిని ఛందఃప్రయోగమునకును ఉన్న సంబంధమును గూర్చి భరతుడు నాట్యశాస్త్రమునందు వివరించియున్నాడు. వాచికాభినయము అత్యంత ప్రధానమైన అంశము. అది సమర్థముగా నిర్వహింపబడినప్పుడే రూపకము జయప్రదమగును. వర్ణాది వృత్తపర్యంతమైన ఛందోవిధానమును వివరించి ఛందముల రసానుకూల ప్రయోగమునుగూర్చి భరతుడుచేసిన సూచనలను వివరించుట అప్రస్తుతము కాదు.

"లఘ్వక్షర ప్రాయకృతం ఉపమారూపకాశ్రయం
కావ్యం కార్యంతు నాట్యజ్ఞైః వీరరౌద్రాద్భుతాశ్రయం
గుర్వక్షర ప్రాయకృతం, బీభత్సే కరుణే తథా
కదాచిద్వీరరౌద్రాభ్యాం, యదాధర్షణజం భవేత్
రూపదీపకసంయుక్తం, ఆర్యావృత్తసమాశ్రయం
శృంగారేతురసే కార్యం, మృదువృత్తం తథైవచ
ఉత్తరోత్తరసంయుక్తం, వీరే పాఠ్యంచయద్భవేత్
జగత్యతి జగత్యాతు, సంకృత్యాచైవయోజయేత్
యుద్ధసంఫేటయోస్తద్జ్ఞైః, ఉత్కృతిః పరికీర్తితా
కరుణే శక్వరీచైవ, తథాచాతిధృతిర్భవేత్
యద్వీరే కీర్తితం ఛందః తద్రౌద్రేఽపి ప్రయోజయేత్
శేషాణామర్థయోగేన, ఛందఃకార్యం ప్రయోక్తృభిః"[1]

ఈ శ్లోకములలో భరతుడు రసానుకూలమైన అక్షర విన్యాసనియమమును గూర్చియు అక్షర సంఖ్యానియమమును గూర్చియు వివరించినాడు. గేయ చ్ఛందస్సులకు అక్షర సంఖ్యానియమము వర్తించదు. ఇక అక్షర విన్యాస నియమము వృత్తములకే కాక గేయములకు కూడ వర్తించును. నిజమునకు లయాత్మకమైన అక్షరవిన్యాసమే రసావిష్కరణమునకు దోహదము కలిగించు నట్టిది. లఘ్వక్షరములుగల ఛందము వీరరౌద్రాద్భుతరసములకును గుర్వక్షర ములుగల ఛందము కరుణబీభత్సములకును ప్రయోగింపవలెనని భరతుని సూచన.

ఇక స్వరములకు సంబంధించిన ద్రుత-మధ్య-విలంబితలయలు రసాను కూలముగా ప్రయోగింపబడవలెనని సూత్రించుచు హాస్యశృంగారములయందు మధ్యలయమును, కరుణమునందు విలంబితలయయు, వీరరౌద్రాద్భుత బీభత్స భయానకములందు ద్రుతలయయు, ప్రయోగింపబడవలెనని భరతుడు స్థూల ముగా సూచించెను.[2] వాగుచ్చారణవృత్తులైన ఈ ద్రుతాదులు పాత్రల ఇచ్ఛా ద్యోతకములై వాని మనోభావములను వ్యంజించుచుండును. క్షేమేంద్ర మమ్మ

1. నాట్యశాస్త్రము - xvi - 114 - 119.
2. "తత్రహాస్యశృంగారయోర్మధ్యలయః కరుణే విలంబితః
వీరరౌద్రాద్భుత బీభత్స భయానకేషుద్రుతః" నాట్యశాస్త్రము xvii - 131

టాదులు రసానుగుణమైన వృత్తప్రయోగౌచిత్యమును గూర్చి ఎన్ని సూచనలు చేసినను సాహిత్యమునందు ఆ సూచనలను అనివార్యముగా పాటించిన సందర్భములు తక్కువ మహాకవులు తమ ప్రతిభా సామర్థ్యములచే ఏ వృత్తమునైనను రసానుగుణముగా రచింపనేర్తురను అంశమును గూడ క్షేమేంద్రుడే ప్రతిపాదించియున్నాడు రసానుగుణమైన వృత్తమును రచింపకపోవుట కూడ ఒక కావ్యదోషముగా మమ్మటుడు సూత్రీకరించినాడు ఎందరెందరు లాక్షణికులు ఎన్నెన్ని విధముల వృత్త ప్రయోగౌచిత్యమును గూర్చియు, వృత్తమునకును రసమునకును గల సంబంధమును గూర్చియు చర్చలు చేసి ప్రమాణములను సూచించినను సంస్కృతకావ్య ప్రపంచమునందు ఈ విషయమున అపవాదములనేకములున్నవి ఇక తెలుగు కావ్యములలోని ఛందఃప్రయోగౌచిత్యమును గూర్చి పరిశీలించినచో లాక్షణికులు సూచించిన రసానుగుణమైన వృత్తప్రయోగమునకు లక్ష్యములు అక్కడక్కడ కనిపించునే గాని వారి సూచనలకు అక్షరశః లొంగి రచింపబడిన సందర్భములు సర్వత్ర కానరావు శిరోమణి శ్రీ సన్నిధానము సూర్యనారాయణ శాస్త్రిగారు కావ్యాలంకార సంగ్రహవ్యాఖ్యానమునందు హతవృత్తమును కావ్యదోషమును వివరించుచు — "ఆంధ్రమున బూర్వకవులెవ్వరును నీ వృత్తములకు రసములకు సంబంధము గలుపలేదు, సామాన్యముగా వీరరౌద్రములకు మత్తేభశార్దూలములు వాడిరి కాని శృంగారాదులకుంగూడ నా వృత్తములను వాడిరి మొత్తముమీఁద నాంధ్రమున రసనియమము లేకుండనే వృత్తములను వాడిరి ........కరుణాదులలో హాస్యాది విరుద్ధ రస వ్యంజకములగు వృత్తములను వాడి రసదోషమును చేయలేదు ఏలననఁ గవులెల్లరను గ్వాచిత్కముగ భుజంగ ప్రయాతము, పృథ్వీవృత్తము మొదలగు వానిని వాడినను నత్యధికముగా ఉత్పలమాల, చంపకమాల, మత్తేభము, శార్దూలము, కందము, గీతము, ఆటవెలది, సీసము అను నీ యెనిమిది వృత్తములనే వాడిరి"[1] అని వ్రాసినారు

శార్దూల మత్తేభాదులైన ఎనిమిది పద్యములలోనే సర్వరసములను ఆంధ్రకవులు పోషించినట్లు శ్రీ శాస్త్రిగారి పై వ్యాఖ్యానము విశదము చేయుచున్నది ఆంధ్ర కావ్యములలో వివిధ చ్ఛందస్సులు రససంబంధియైన

1. కావ్యాలంకార సంగ్రహము - పుట 481 - (తృతీయ ముద్రణ - 1965)

ఒక నియతిలేక ప్రయుక్తములైనట్లే గేయనాటికలలోని గేయములకు కూడ ఒక నియతి లేనట్లు కానిపించుచున్నది. రసములన్నియు ముఖ్యములైన త్ర్యస్ర, చతురస్ర ఖండ, మిశ్ర, సంకీర్ణము లను అయిదుగతులలోనే పోషింపబడినవి. నవ రసములను కేవలము ఐదు గతులలో పోషించుచు, సహృదయులకు విసుగు జనింపకుండ వారి చిత్తములను రసార్ద్రము చేయుట కష్టసాధ్యము. సంగీత ప్రాధాన్యముగల గేయపాదములు చిన్నవిగా నుండుటవలన మాత్రల సంఖ్యను ఇచ్ఛ వచ్చిన రీతిని పెంచుటకు వీలులేకపోవుట సంగీతసాహిత్యమర్మజ్ఞులు ఎరుగనిదికాదు. అందువలనే 3, 4. 5,6,7, 9, మాత్రలలో మాత్రమే గతులేర్పడినవి. మాత్రా సంఖ్యను ఎంత పెంచినను పాడవలసి వచ్చినపుడు మాత్రము త్ర్యస్రాదులలో ఏదో ఒక గతిలోనే సాగవలసియుండును. వృత్తచ్ఛందములలో కావ్య రచన చేయవలసివచ్చినపుడు ఛందస్సౌలభ్యము మాత్రాచ్ఛందములకంటె సమధికమగుట అందరు ఎరిగిన విషయమే. పద్యములకున్న ఇట్టి విస్తృతవైవిధ్యము గేయములకు లేనందువలననే పరస్పర భిన్నములైన రసములను కూడ గేయనాటికలలో నాలుగైదు గతులలోనే నడిపింపవలసిన అగత్యమేర్పడినది. గేయనాటికలలో ఆయా రసములకు ఆయా గతులే నియతములు కావను అంశమును సోదాహరణముగా నిరూపింతును.

## త్ర్యస్రగతి

**శృంగారము :**

(i) "పట్టమహిషివగుదు నీవు ప్రాణేశ్వరి, అచిరమ్మొగ
పరిచారిక రాదగినది పాదసంవాహాముకకు
నిన్ను గాంచినంతలోనె నిఖిలశ్రమవాసె ప్రియా!
నీమధురాలింగనమున నిర్వృతియే ప్రాణేశ్వరి!"
(జ్యోతిష్సింగు-అలకతో;-శ్రీ శివశంకర
స్వామి వారి 'వరపరీక్ష'లో)

(ii) "సుందరమో ఈ జగమ్మె
నందనమోయీ ఆ
నందింతము యుగయుగాలు
హాయిగనోయీ"—(మేనక-విశ్వామిత్రునితో;
శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావుగారి 'మేనక'లో)

(iii) "నీ మృదుల కపోలయుగళి
నాశించితి రావే
నీ మంజులహాసరవళి
నాశించితి రావే"— (చంద్రుడు-కలువతో;
డా॥ సి. నారాయణరెడ్డి గారి
'వలపురేడు'లో)

(iv) "తడిసిన నీ కనుదమ్ముల
తళుకులలో మెరవాలని
పొంగిన నీ కోపాగ్నిత
రంగాలను దూకాలని"— (శ్రీవత్స-స్నేహతో;
డా॥ బోయి భీమన్న గారి
'పైరుపాట'లో)

(v) "అహో సహజమహోరాశి
సుమసన్నిభ సుందరాంగి
నీ లాస్య విలాసమ్ముల లాలసమై
పూలతోట పులకించెను"— (విప్రనారాయణ—దేవ
దేవితో; డా॥ యస్వీ
జోగారావుగారి 'సుమబాణము'లో)

**కరుణము :**

(i) "జీవితేశునయ్యయ్యో చేతులార చంపుకొంటి
బ్రతికియుండి ఫలంబేమి ప్రాణంబులు విడుతునిపుడె
ప్రేమకు బలియయినవాడు ప్రియుపవిత్రరక్తములో
కలియుగాక నా రుధిరము కటారి కారుణ్యమునను"
—(అలకాదేవి-మరణించిన తన భర్తను చూచి;
శ్రీ శివశంకరస్వామివారి 'వరపరీక్ష'లో)

(ii) "దుస్సహా మీ శాపమయ్యొ దుర్భరము వియోగమయ్యొ
నిస్సహాయుడే తానెటు నిగ్రహించుకోగలడో"
(యక్షిణి తనలో; శ్రీ బాలాంత్రపు రజనీకాంత
రావుగారి 'మేఘసందేశం'లో)

(iii) అయ్యయ్యో మనరాజును
ఆవరించె మేఘుడు
మనబాధామయగాథను
వినువాడింకెవ్వడు" — (కలువ - కలువరాణితో;
డా॥ సి. నారాయణరెడ్డిగారి
'వెన్నెలవాడ'లో)

(iv) "ఏమిప్రభూ! ఏమిప్రభూ!
ఎంతఘోరవార్త వింటి
ఇది నిజమా ఇది నిజమా
మురళీధర మహాకవికి
భవదీయ సభానభోరవికి
ఆకస్మికమవ్యాజము
నతిఘోరము ఉరిశిక్షా
తక్షణమే మహాకవిని
రక్షింపుము........" — (కామిని-మాణిభద్ర
మహారాజుతో; డా॥ యస్వీ జోగారావుగారి
'అప్సరస'లో)

**వీరరౌద్రములు :**

"తెండి నా ధనుర్బాణాల్
తెండి నాదు హలాయుధం
ముగ్ధ సుభద్ర విడిపింతు
ప్రముచ్చగు పార్థుని వధింతు
....................

ఒరే బంధు విద్రోహీ
నిలు నా పాదములత్రాహి
త్రాహి పాహి పాహియనుచు
పడరా పార్థా! అపార్థా!"— (బలరాముడు-అర్జు
నునితో; శ్రీ రజనీకాంతరావు
గారి 'సుభద్రావిజయము'లో)

**బీభత్సభయావకములు :**

(i) "ఖరాసి సదృశఘనదంష్ట్రా
గ్రశదనంతవహ్ని శిఖా
కరాళమృత్యు దీప్తవదన
గహ్వరమున జనియించితి
......................
కనద్ధ్వనత్ కాలకూట
కటుకఠోర గర్జారవ
భయదభైరవ ఘోరఘాల
నయనమ్మున శయనించితి
రటద్దంత పటపట రవ
కుటిల ముఖమ్ములు దనరగ"— (విలయపాత్ర;
(డా॥ కె. వి. ఆర్. నరసింహము
గారి 'శోణితపారణ'లో)

(ii) "సమరఘోష సమరఘోష
దానవతావికట ఘోష
చీకటి గుండెల జ్వలియిం
చే కోష్ణ రుధిరపిపాస
దారుణ సామ్రాజ్యాంధుల
ఆరని మారణ దురాశ" —(అపరిచితకంఠాలు;
డా॥ సి. నారాయణరెడ్డి 'దగ్ధ
శాంతి'లో)

## చతురస్ర గతి

**శృంగారము :**

(i) "వేరొకతీయని వృత్తాంతమ్మును
ఎరుకపరచుచో నేమి బహూకృతి"(యామిని-కవితో)
"మధురోదంతము మధుర బహూకృతి
బడయంజాలుట ప్రణయిని ధ్రువమే" (కవి-యామి
నితో; శ్రీ శివశంకర
స్వామి వారి 'కవిప్రియ'లో)

(ii) "నీపై మోహము నోపలేనె సఖి
నీపరుపక్కడ నిలువవె భామా
........................
సాకులు చూపి చల్లని జాబిని
సమ్మతించవనే భామాభామా"—(కృష్ణుడు-భామతో;
శ్రీ రజనీకాంతరావుగారి
'మధురా నగరిగాథ'లో)

**కరుణము :**

"లేశమాత్రమును లేదే ఊపిరి
విడిచిన చిన్నెయు ప్రేతలనకటా
.....................
అయ్యో అయ్యో అయిపోయినదే
ఇంకేమున్నది ఈ లోకములో
.....................
నా కోసమె కద నాథా. యీ గతి
జవ్వనమందే సంప్రాప్తించెను
చూడకున్న నను సుఖముగనుందురె
మృత్యుదేవతను మీ పాలికినే" —(అలక-జ్యోతి
స్సింగును చూచి; శ్రీ శివ
శంకరస్వామి వారి 'వరపరీక్ష'లో)

రౌద్రము :

ఖడ్గము ఖడ్గము ఖండఖండములు
కావింపగవలె కలుషవర్తనుల
ఉపపతి కౌగిట నున్న పుంశ్చలిని
ఖండింపగవలె ఖడ్గము ఖడ్గము'' —(జామాత పాత్ర;
శ్రీ శివశంకరస్వామిగారి
'రాజజామాత'లో)

(ii) "పులిపులి పులిపులి బొబ్బిలి బెబ్బులి
కణకణమండే నిప్పులపిడికిలి
పటపట పటపట పండ్లుకొరికెరా
ఛటఛట ఛటఛట ముందు కురికెరా''— (బుర్రకథ
కథకుని పాత్ర; డా॥ సి.
నారాయణరెడ్డిగారి 'తరతరాల వెలుగు వెలుగు'లో

వీరము (ధర్మవీరము) :

"హరహర హరహర అక్రమమార్గమె
ప్రబలమయ్యెనే బ్రాహ్మణకులమున
శాస్త్రంబేటికి? సదాచారమే
వృద్ధాచారము వృద్ధాచారము"—(వృద్ధబ్రాహ్మణ
స్వరమేళ; శ్రీ శివశంకర
స్వామిగారి 'దీక్షితదుహిత'లో)

ఖండ గతి

శృంగారము :

(i) "స్వీకరింపుడు నన్ను జీవితేశా! యింక
ప్రణయబాధలు నేను పడలేను పడలేను
(పాదముల మీద వ్రాలి)

బిగియార కౌగింట ప్రీతిజేర్పకయున్న
ఈ దాహమెటులారు హృదయేశ హృదయేశ"
(యామిని-కవితో; శ్రీ శివశంకరస్వామిగారి
('కవిప్రియ'లో)

(ii) "ఏ తంత్రి నీ మధురహృదయో" — (వైణికుడు సుందరితో)
"ఏ శ్రోత నీ హృదయగీతియో" — (సుందరి వైణికునితో)

"ఈ విశ్వవీణ తంత్రులజంట మనహృదయములు యీ
మనరాగసార సరంగ యే యీ విశ్వసరణి" (ఇద్దరు)
— (శ్రీ రజనీకాంతరావుగారి 'విశ్వవీణ'లో)

(iii) "రావేల రేరాణి
ననరాగవాణి
నీ నీల నవవేణి
లో నిర్చిపోనీ (చంద్రుడు-రేయితో)
"రానె వచ్చితినోయి
నా ప్రేమ సపాయి" (రేయి-చంద్రునితో; డా॥ సి. నారాయణరెడ్డిగారి 'వెన్నెలరేడు'లో)

(iv) నెలవంక సిగపైన
నిలుపుకొని రానా
వలపు మెరపులతీవ
కలుపుకొని రానా'' —(భీముడు ద్రౌపదితో; శ్రీ సోమయాజులుగారి 'సౌగంధిక'లో)

**కరుణము :**

(i) "ఉపవసించుట జేసి ఓ నాథ, ఓ నాథ
ఒడలుతూలుచు నున్నదో నాథ ఓ నాథ

నిమ్న భాగాలపై నిజదృష్టి ఓనాథ
నిలుపబోకుడు నాథ నిలుపబోకుడు నాథ''
—(అలక-జ్యోతిస్సింగుతో; శ్రీ శివశంకరస్వామి
గారి 'వరపరీక్ష' లో)

(ii) ఏ దూరసీమనో, ఏ విపిన భూమినో
ఈ విరహమెన్నాళ్లు ఎటు సైచునో ప్రభుడు''
— (యక్షిణిపాత్ర; శ్రీ బాలాంత్రపు
రజనీ కాంతరావుగారి 'మేఘసందేశం'లో)

(iii) ''శిశిర హస్తాలలో
చిక్కువడియున్నాను
అసహాయురాలనై
అలమటిస్తున్నాను
గడియలో బ్రతుకు సం
కమ్ములో దిగునయ్య
తడవుసేయక వచ్చి
విడిపించి పోవయ్య'' — (ఋతువులరాణి పాత్ర;
డా॥ సి. నారాయణరెడ్డిగారి 'ఋతువులరాణి లో)

వీరము :

(i) ''జలధి గర్భాంతరో
జ్జ్వలశక్తి ముక్తాళి
కలతారహారసం
క్తులు కానుక పెట్టినా'' —(భీముడు-ద్రౌపదితో;
శ్రీ వావిలాల సోమయాజులుగారి 'సౌగంధిక' లో)

(ii) ''శిశిరుడా నీ యాట
చెల్లబోదిక పైన
అగ్నిబాణాలు సం
ధించితిని హస్తాన'' —(మాధవుడు - శిశిరునితో;
డా॥ సి. నారాయణరెడ్డిగారి 'ఋతువులరాణి'లో)

రౌద్రము :

"కత్తికి బాసికము కట్టి కట్టించినారూ
ఉత్తమాటలు చెప్పి ఉరిబెట్టినారూ
రేపుమాపనిచెప్పి త్రోపెట్టనేను
మగవాని చూపించిమరి కదలుడంటి"

—(త్రైలోక్యసుందరి-నాగమ్మతో; శ్రీ విశ్వనాథవారి 'పాముపాట'లో)

## మిశ్రగతి

శృంగారము :

(i) ప్రథమవారమె దృష్టిమీకై
బడినయప్పుడె చెప్పశక్యము
కాని భావంబేదొ నాలో కలిగె ప్రాణేశా"

—(మం॥ శాంబ-చంద్రమౌళితో; శ్రీ శివశంకరస్వామి వారి 'దీక్షితదుహిత'లో)

(మిశ్రగతిలో సాగు 'ముత్యాలసరాలు'లో నడిచిన గేయమిది)

(ii) "ఓ భువన మోహనవైణికా; నా
హృదయనాథుడ వీవెకా; నా
తనువు తనువో; మనసు మనసో,
తరుణసుందర; భవ్యవీణా
తన్మయములై పోయెనోయ్, చే
కొనుము నను నీ దాసినోయ్..."

—(సుందరి వైణికునితో; శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావు గారి 'విశ్వవీణ'లో)

(iii) "అనిర్వచనీయమిది, ఓహో
అమృతమునకే అమృతమో
..... ..............
ఓ జగన్మథుమోహినీ! నా
యాగమము నీ కోసమేనే

కంఠమున కలకంఠములతో
కందొవల యొప్పు వెన్నెలలతో
అధరమున శీధురసములతో
అఖిలసౌందర్యగుచి నీవే"

—(వసంతుడు-గోపికతో; డా॥ బోయి భీమన్నగారి 'వసంతస్వయంవరం'లో)

**కరుణము :**

(i) "కవివతంసుడు నాకు గురువే
కాడు ప్రాణప్రియుడు తండ్రీ!
పలుకులేటికి నాకు సాక్షాత్పరమ దైవతమే
.....................
ప్రాణవల్లభుడయిన కవినే
పతిగబడయని పక్షమున మీ
పాదసన్నిధియందు విడిచెద ప్రాణములు తండ్రీ"

—(యామిని-మదనభూపతితో;
శ్రీ శివశంకరస్వామివారి 'కవిప్రియ'లో)

(ii) "ఎందుపోయెను నీదు ప్రాణము
సుందరీ నా సుందరీ!
ఎదుటనుండి నీకు మాటలు
విదేటి న్యాయము సుందరీ!
మందభాగ్యుడ నిన్నొకతె గృహ
మందు వదలితి సుందరీ!

—(వైణికునిపాత్ర; శ్రీ బాలాంత్రపు
రజనీకాంతరావుగారి 'విశ్వవీణ'లో)

త్ర్యస్రాదితులలో భిన్నరసములను పోషింపవచ్చునని నేనింతవరకు సోదాహరణముగా వివరించితిని. అట్లని గేయనాటికాకర్తలు ఒకే గతిలో నాటికలను నిర్వహింపలేదు. గతులలో వైవిధ్యమును వారు చూపగలిగినారు. ఏదో ఒక గతిలో మొత్తము నాటికను నిర్వహించుటకు అవకాశమున్నది. కాని గేయనాటికాకర్తలు గతులలోను అక్షరసంయోజనములోను విశేషవైవిధ్యమును చూపి రసోపస్కారకముగా తమ రచనము తీర్చిదిద్దినారు. త్ర్యస్ర, చతురస్ర,

ఖండ, మిశ్ర, సంకీర్ణగతులను నాటికాకర్తలు మార్చిన
లోని ఔచిత్యమును పరిశీలించవలసియున్నది. పాత్రధారి
మార్పులు కలిగినప్పుడు ఆయా మార్పులకు అనుగుణమైన
బంధములను ప్రయోగించినపుడు రసాపకర్షణమునకు అవ

గతుల మార్పులకు మరొక కారణమున్నది. అవసర.
శ్రవ్యకావ్యములలో ఛందోవైవిధ్యమును పాటించి కవులు పా
కలిగించకుండ జాగ్రత్తపడిరి. గేయనాటికలలో సంగీతాభినయముపాట' తొలి
చెట్టపట్టాలు పట్టుకొని సాగవలసియుండును అభినయము లయమును అత్త
మార్పు వచ్చినపుడు గతిలో మార్పు రాకున్నచో సామాజికునికి చిత్తములో కలిగిన
సహజము. ఎంత సంగీత విద్వాంసుడైనను ఎంత గళమాధుర్యము ప్రవహించు
ఒకే రాగములో ఒకే కృతితో సంగీతసభను రంజింపచేయ లేడు.
రంజనమునకై వైవిధ్యము అనివార్యము అదే విధముగా గేయ
వివిధ గేయ ఫణితులను ప్రయోగించి నాటికాకర్త అభినయ సంగీత రెండు
వైవిధ్యమును సాధించి సామాజికులను రసాభిగమ్యులను చేయును. ను, ఆమె
లాస్యాది నృత్య సన్నివేశములు గేయనాటికలలో వచ్చినప్పుడు ఆయా పంక్తులు
రీతులకనుగుణముగా గతిపరివర్తనము అనివార్యము కదా' ప్రాయికసక్రోధ
నృత్య సన్నివేశములందు 'ద్రుతలయ సమన్వితమైన చతురశ్రగతినే భావకవి
ప్రయోగించినారు.

**భావానుగుణమైన గతి పరివర్తనమునకు కొన్ని ఉదాహృతులు:**

“పోవుదమల కా' పోయెను బడలిక
ప్రాభాతిక మృదు పవనముచే, నీ
పలుకు తేనెచే' ప్రావించినచో
గమ్యస్థానము కల్యాణమెగా'”[1]

ఈ పంక్తులు శ్రీ శివశంకరస్వామి వారి 'వరపరీక్ష' లోనివి. జోత్స్న
సింగు అను వీరక్షత్రియకుమారుడు పరీక్షకు అంగీకరించి, తన ప్రియురాలు
అలకాదేవిని ఎత్తుకొని, దిండకొండ పర్వతాగ్రము చేరుటకు ప్రయత్నించుచు
మార్గమధ్యమున అలసిపోయి, ఒక శిలాఖండమునకు ఆనుకొని బడలిక తీర్చుకొని

1. వరపరీక్ష-ద్వితీయ రంగము-పుట 524. శ్రీ శివశంకర కృతులు-ద్వితీయ సంపుటి. షష్టిపూర్తి ప్రథమ ముద్రణ 1952.

కంఠశోష ప్రియురాలుతో పలికిన సందర్భములోనివి పైన కంద.

ఆధా
అట్లా ద్రుతలయలోను సాగిన ఈ చరణములు జ్యోతిస్సింగు భావమును సూచించుచున్నవి. కొంత దూరముపోగానే ఎ తన ప్రియురాలుతో దీనముగా ఇట్లనును —

**కరుణము :** సీమ భాగమ్మునకు ప్రియురాలా !

(i) త్తువా మెల్లగా ,,
అడుగువేయుటయన్న ,,
అతికష్టమయినదో ,,
పాదరతులు విడుతు ,,
పదము జారకయుండ ,,
తల తిరుగుచున్నదో ,,
తరువానుకొందునా ,,1

కలిగిన జ్యోతిస్సింగు బాధను ప్రకటించు ఈ చరణములు ఖండ నవి. ఇందలి దీర్ఘాక్షరప్రయోగసంజనిత విలంబితలయ జ్యోతిస్సింగు వ్యంజించుచున్నది. ఈ విధముగా ఒక సన్నివేశములో ఒక పాత్ర వచ్చు భావపరివర్తనకు అనుకూలముగా గేయరచనలోని గతి పరి నిర్వహింపబడినది.

రపరీక్షనుండియే మరొక ఉదాహరణము.

"పత్రికయేటికి పంపితినయ్యో
ఆహ్వానము మృతికంపిన తీరున !
దుర్గేశ్వరుని నిజదుహితకు నొసటను
వైధవ్యంబే వ్రాసియున్నదా?''2

తన భర్త జ్యోతిస్సింగు మరణించిన విషాద ఘట్టమును గాంచి అలకా విలపించిన సందర్భములోనివి ఈ పంక్తులు. వైధవ్యము ననుభవింపవలసి

---

1. వరపరీక్ష - ద్వితీయ రంగము - పుట 525. శ్రీ శివశంకర కృతులు. ద్వితీయ సంపుటి షష్టిపూర్తి ప్రథమ ముద్రణ 1952.
2. వరపరీక్ష-తృతీయ రంగము-పుట 533. శ్రీ శివశంకర కృతులు-ద్వితీయ సంపుటి షష్టిపూర్తి ప్రథమ ముద్రణ.

"అపుడు రాణిదాసి నడిగినట్లుగ నేను
ఒకరి మొగము చూచుచోరు నిలువబడిరి
మోసలాడ! యింట మేలు కనిపించియుండి
కలతలేక కాపురంచేయ నచ్చిన నక్క
అప్పుడు నాకపనమ్మకము కలిగెనే
అంతలోపల కోపము మదిదెంచెనే"1

ఈ పంక్తులు శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి 'పాముపాట' తొలి రంగము లోనివి. త్రైలోక్యసుందరి తన భర్త పాము అను విషయమును అత్తమామలు తనకు చెప్పకుండ ప్రవర్తించిన తీరును తత్ఫలితముగా తనలో కలిగిన భావ విశేషములను నాగమ్మ, లక్ష్మమ్మ అను జానపదకాంతలకు వివరించు సందర్భములోనివి.

పై పంక్తులలో మొదటి నాలుగు త్ర్యస్రగతిలోను తరువాతి రెండు పంక్తులు ఖండగతిలోను నడచినవి. త్రైలోక్యసుందరి అమాయికతను, ఆమె అత్తమామల మనోరహస్యభావ ప్రవర్తనను త్ర్యస్రగతిలోని పంక్తులు సూచింపగా తన అత్తమామలపట్ల త్రైలోక్యసుందరికి కలిగిన అవిశ్వాసక్రోధ భావములను ఖండగతిలోని పంక్తులు తెలుపుచున్నవి. ఈ విధముగా భావపరివర్తనమును బట్టి గతిపరివర్తనమేర్పడినది.

"స్వాతంత్ర్యము నిలువరింపు
పంజరమున కులుకు చిలుక
పలుకు పలుకు మంజులమే
కానీ యొక కాన పులుగు
పిలువరింత కది సమమా
రాణివాసనమునకు నేను
రాను రాను మహారాజ
రాజాలను మహారాజ!"
"రాజా! రసరాజ్యబిడౌజా
యోజింపుము మహారాజా

1. పాము పాట-పుట-14. మొదటి కూర్పు-ముద్రణ 1955.

రాజులు మాపై మోజులు పడితే
రాణులు బేజారెత్తెదరేమో!''1

ఈ పంక్తులు డా॥ యస్వీ జోగారావుగారి 'అప్సరస' లోనివి. 'కామిని' యను ఒక్కులపురంధ్రి సౌందర్యగాననాట్యవైభవములను గాంచి మాణిభద్ర మహారాజు, అతని ఆస్థానకవి మురళీధరుడు ఆమెను రాజాస్థానమునకు ఆహ్వా నింతురు. రాజాస్థానములలో స్వేచ్ఛ ఉండ దను భావముతో కామిని వారి ఆహ్వానమును అంగీకరింపక తనను క్షమింపవలసినదిగా వారిని వేడుకొనును. పైన పేర్కొన్న మాటలు ఈ సందర్భములో కామిని మహారాజుతో పలికి నట్టివి.

మొదటి ఎనిమిది పంక్తులు త్ర్యస్రగతిలోను తరువాతి పంక్తులు చతురస్ర గతిలోను సాగినవి. కామిని స్వేచ్ఛాభావమును త్ర్యస్రగతిలోని పంక్తులును, రాజాస్థానప్రాప్తిచే నేర్పడు పరిణామముల నూహించుటవలన కామినికి కలిగిన సందేహచిత్తవృత్తిని చతురస్రగతిలోని పంక్తులును ప్రకటించుచున్నవి

ఈ విధముగా ఒకొక సన్నివేశములో పాత్రల భావ పరివర్తనమునకు అను గుణముగా గతులలో కూడ మార్పు కలుగుననుటకు అనేక తార్కాణము లను తెలుగు గేయనాటికలనుండి చూపవచ్చును.

**రసానుకూలమైన అక్షర సంయోజనమునకు కొన్ని ఉదాహృతులు :**

''అనంగ, చిత్రము కనంగ కనంగ
కనుంగవంగడు కనంబడున్ కళ
ఎవండు పటాన నవాద్భుతమ్ముగ
సజీవమూర్తిని సృజించినాడో!''2

ఈ చరణములు శ్రీ శివశంకరస్వామివారి 'రాజ జామాత' లోనివి. ఖంఖుడు కాశ్మీరదేశ ముఖ్యామాత్యుడు. అతడు కాశ్మీరదేశప్రభువైన బలాదిత్యుని కుమార్తెయు, దుర్లభవర్ధనుని భార్యయు అయిన 'అనంగలేఖ'తో రహస్యముగా కామోపభోగములనుభవించుచుండును. అతడొకనాడు అనంగలేఖ యొద్దకు

1. అప్సరస - (గేయ నృత్యనాటికల సంపుటి) పుటలు 4-5. ప్రథమ ముద్రణ 1961.
2. రాజ జామాత-పుట 20.

వచ్చి, ఆమె జన్మదిన సందర్భముగా చిత్రకారుని చేత చిత్రింపబడిన అనంగరేఖ చిత్రపటమును జూచి, శృంగారాశ్చర్యభావములతో హృదయము పొంగిపోగా ఆమెతో పైన పేర్కొన్న విధముగా పలుకును

పై చరణములందలి అక్షర సంయోజనవిశేషము పాత్ర (ఖంఖుని) శృంగారచిత్తవృత్తిని చక్కగా వ్యక్తింపజేయుచున్నది. చరణములందలి చతురస్రగతి, సమగురులఘ్వక్షర సమ్మేళనముచే నేర్పడిన మధ్యలయ, సానుస్వార సుకుమార వర్ణబాహుళ్యము, నాతి దీర్ఘసమాసములు- అన్నియు కలిసి శృంగార రసాభివ్యక్తికి దోహదము చేయుచున్నవి. అనంగ, సనంగ, కనుంగ, ఎవండు పటాన, నవాద్భు, సజీవ, సృజించి వంటి జగణ పదంపరా ప్రయోగము పాత్ర అంతరంగములో ఎగిసిపడు శృంగార తరంగముల స్ఫూర్తిని వ్యంజింపజేయు చున్నది.

అట్లే శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావు గారి 'చండీదాసు'లోని—

"జీవననందినీ' జీవననందినీ
నీ, మందహాస చంద్రరేఖ
స్పందనా వికాసమందు విందుగ క్రొందళ్కులెన్నొచిందె;
జీవననందినీ, జీవననందినీ......
నీ సుందరనయనాళియుగళి
మంద్రగానరవళియందు విందుగ క్రొందేనెలెన్నొచిందె;
జీవననందినీ, జీవననందినీ......
నీ, చందన నిశ్వసనపవన
బృందమ్మృదు విలాసమందు విందుగ క్రొందావులెన్నొచిందె
జీవననందినీ, జీవననందినీ ......"[1] వంటి పంక్తులును,

డా॥ సి నారాయణరెడ్డిగారి 'వలపురేడు' లోని—

"రావే! రావే!
నా వన్నెల కలువా!
నా కన్నుల చలువా!
నీ మృదుల కపోల యుగళి

1. చండీదాసు-పుటలు 91,92 (విశ్వవీణ-సంపుటి-ప్రథమ ముద్రణ-డిసెంబర్ 1964.

నాళించితి రావే
నీ మంజుల హాస రవళి
నాలించితి రావే"[1] వంటి చరణములును.

శ్రీ దేవులపల్లి వేంకట కృష్ణశాస్త్రి గారి 'గౌతమి' లోని —

"సుందరా! పురందరా! శచీమానస మందిరా! ఏ
మందురా! మదిలోన వలపులు మరిగి తొందరలాయెరా!
అందె రవళులు విందువా! నా
అందచందాల్ కందువా? ఓ సుందరా......
మందపవనుడు తరలెరా,
మందాకినీనది తెరలెరా! మన
నందనోద్యానమ్ములో మందార మధువులు ఉరలెరా! ఏ
మందురా, మదిలోని వలపులు మరిగి
తొందరలాయెరా! ఓ సుందరా......"[2] వంటి పంక్తులును,

డాక్టరు సందూరి రామకృష్ణమాచార్యగారి 'జ్యోత్స్నాభిసారిక'లోని—

"డెందము సందలి సవాలవాతో
కెందువలందలి తళుకుళతో
ఎందుకు రాధా ఇటులీ తొందర!
అందెలసందడి చిందరవందర!"[3] వంటి చరణములును,

శృంగార రసానుకూలమైన అక్షర సంయోజనమునకు నిదర్శనములుగా పేర్కొన వచ్చును. ఈ పంక్తులందలి సానుస్వార మృదులాక్షర ప్రయోగము, సమలఘు గుర్వక్షర సముత్పాదిత మధ్యలయవిన్యాసము శృంగారరసానుకూలమైన రీతి విశేషమునకు ఊపిరి పోసినవి.

"నెలవంక సిగిపైన
విలువుకొని రానా

1. 'వలపురేడు'-పుట 12 (నవ్వని పువ్వు గేయనాటికల సంపుటి) ముద్రణ 1953.
2. గౌతమి - పుట - 142 ('శర్మిష్ఠ' - కృష్ణశాస్త్రి నాటికలు.) కవితా స్వర్ణోత్సవ సంపుటి_1975
3. జ్యోత్స్నాభిసారిక - పుట-4 ('నృత్యనాటికలు'-సంపుటి) ప్రచురణ 1986.

నిలుపు మెరపుం తీ..
నిలుపుకొని రానా
జలధి గర్జాంతరో
జ్జ్వల శక్తి ముక్తాళి
కలతారహార పం
క్తులు కానుక వెట్టనా
ఎగురనా నీతోడ
ప పతత్రిగ తస్వి
ఈ విహాయస వీథి
గంధర్వ నగరులను"

ఖండగతిలో సాగిన ఈ చరణములు శ్రీ వాపిలాల సోమయాజులుగారి 'సౌగంధిక' లోనివి. ద్రౌపది తన పాద సన్నిధిలో పడిన సౌగంధిక పుష్పమును గాంచి, అట్టి మనోజ్ఞ పుష్పములు కావలెనని భీమునితో నను. కాని భీముడు ఆలస్యము సేయగా చింతించును. అంత ఆమె దైన్యమును పోగొట్ట నెంచిన భీముడు ఆమె కోసము సౌగంధికములే కాదు, ఎటువంటి వానినైనను తేగలనని తన వీరత్వమును గూర్చి ఆమెతో నను. పై పంక్తులు ఈ సందర్భములోనివి.

పై వానిలో మొదటి నాలుగు చరణములు మృదులాక్షర సంయుతములు కాగా, తరువాతి చరణములందలి అక్షర రచనలో కొంత పారుష్యము చోటు చేసికొన్నది

"నెలవంక సిగ పైని
నిలుపు కొనిరానా" వంటి బంధ పారుష్య వర్జితములైన పంక్తులును, 'విహాయస వీథి', 'గంధర్వనగరులు' వంటి నాతి దీర్ఘ సమాసములును వైదర్భి రీతిని గర్భీకరించుకొనగా —

"జలధిగర్జాంతరో
జ్జ్వల శక్తి ముక్తాళి
కల తార హార పం
క్తులు" అను సమాసము గౌడీ రీతిని ప్రదర్శించుచున్నది. ఈ రెండు రీతుల సమ్మేళనముచే పాంచాలి రీతి ఏర్పడి వీర రస స్ఫూర్తిని కలిగించుచున్నది 'జలధి గర్జాంతరోజ్జ్వల శక్తి ముక్తాళి కల తారహార పంక్తులు'

అనుదీర్ఘ సమాసము భీముని ప్రతాపాతిశయమును, ఉత్సాహాధిక్యమును చక్కగా వ్యంజింప జేయుచున్నది. పై పంక్తులలోని రచన లఘ్వక్షర ప్రాయమైనందు వలన ద్రుతలయ ఏర్పడుచున్నది. ఈ ద్రుత లయ వీరరసాభివ్యక్తికి పరిపోషకము.

ఇదే విధముగా—

"హర హర హర హర అక్రమ మార్గమె
ప్రబలమయ్యెనే బ్రాహ్మణకులమున !
.........................
శాస్త్రంబేటికి ? సదాచారమే
వృద్ధాచారము వృద్ధాచారము" (శ్రీ శివశంకరస్వామి వారి 'దీక్షిత దుహిత'లో)

"త్వరితగతి ననిల సుతుడంత గిరివీథిన్
దరుల పెనుఝరుల ఘనతుంగతటకోటిన్" (శ్రీ వావిలాల సోమయాజులుగారి 'సౌగంధిక' లో)

"శశిరుడా ! నీ యాట
చెల్లబోదిక పైన
అగ్నిబాణాలు సం
ధించితిని హేస్తాన" (డా॥ సి నారాయణరెడ్డిగారి 'ఋతువుల రాణి' లో)

వంటి చరణములందలి అక్షర బంధము పాంచాలీ రీతిని ద్రుతలయను గర్భీకరించుకొని వీర రస స్ఫూర్తిని కలిగించు చున్నది.

"జీవితేశు నయ్యయ్యో, చేతులార చంపుకొంటి !
బ్రతికియుండి ఫలంబేమి, ప్రాణంబులు విడుతునిపుడె"[1]

"అమ్మా అమ్మా అలకా, అలకా,
ఏమిది తల్లీ ఏటికి పలుకవు ?
సుకుమారి నా తల్లి శోషిల్లెనా యేమి,
ఉపవాసమున మూర్ఛ నొందెనా నా బిడ్డ !"[2]

"ఏమున్నది నా కిలోకములో
కాని మొండినై కాయము వీడను !"[3]

1, 2, 3– 'వరపరీక్ష'–పుటలు 533–535 (శ్రీ శివశంకర కృతులు ద్వితీయ సంపుటి 1952.)

ఈ పంక్తులు (శ్రీ) శివశంకర స్వామివారి 'వరపరీక్ష' లోనివి. జ్యోతిస్సింగు తన ప్రియురాలైన అలకాదేవి నెత్తుకొని పర్వతాగ్రము చేరు పరీక్షకు అంగీకరించి పర్వత శిఖరము చేరును. అతడు తన దాహమును దీర్చుకొనుటకై అలకను నీరు తెమ్మనును. కాని ఆయాసము మిక్కుటము కాగా ఆమె వచ్చు లోపలనే మరణించును. నీరు తీసికొని వచ్చిన అలక తన భర్త మరణమును గాంచి, విలపించి, తాను కూడ కత్తితో పొడుచుకొని చనిపోవును. వీరిద్దరి మరణమును జూచిన అలకాదేవి తండ్రి గంభీరసింగు విలపించును. పై పంక్తులు క్రమముగా అలకాదేవి గంభీరసింగు విలపించు ఘట్టములోనివి.

ఈ పంక్తు లందలి సుకుమారాక్షరసంయోజనము, శబ్ద కాఠిన్య రాహిత్యము తమలో వైదర్భీరీతిని పొదుగుకొని కరుణ రసస్ఫూర్తిని కలిగించుచున్నవి. బహుళ గుర్వక్షర సంయోజనమువలన రచనలో విలంబిత లయ విడిది చేసికొన్నది ఈ విలంబిత లయ కరుణ రస సృష్టికి అనుకూలము. 'అమ్మా' 'అమ్మా' అను పదములందలి మకార ద్విత్వము కరుణ రస వాతావరణమును మరింత తీవ్రము చేయుచున్నది. ఇట్లే —

"దాసికానా ప్రాణబంధూ
నన్ను దాసింతుమే ప్రేమసింధూ;
ఆశలే సురిగి తూలేనో; ఆకాశమే విరిగి కూలేనో !!
దాసికానా;
........................
చంద్రుడే యిరులలో దాగె, జాము
తంద్రలో కనుమూసి తోగె;
బృందావనికి నీవు రావో, మధుర
మందానిలములింక లేవో;
................."

((శ్రీ) బాలాంత్రపు రజనీకాంతరావుగారి 'చండీదాసు'లో)

"అమ్మా అమ్మా అమ్మా
అని ముమ్మారనెను సీత
అమ్మలేని బిడ్డలాగు
అలమటించె మహిజాత"

((శ్రీ) జంధ్యాల పాపయ్య శాస్త్రిగారి 'సీత' లో)

పంక్తి చరణములు సుకుమారాక్షరసముపేతములై, దీర్ఘ సమాస రహితములై, బంధకాఠిన్య వర్జితములై, గుర్వక్షర ప్రాచుర్యముచే విలంబితలయకు నిలయములై కరుణరసస్ఫూర్తికి ఉదాహరణములుగా నిలుచుచున్నవి.

"తెండి నా ధనుర్బాణాల్
తేండి నాదు హలాయుధం
ముగ్ధ సుభద్ర విడిపింతు
ముచ్చగు పార్థుని వధింతు" 1

"ఒరే బంధు విద్రోహీ
నిలు నా పాదముల త్రాహి
త్రాహి పాహి పాహి యనుచు
పడరా పార్థ! అపార్థా!" 2

"హలాయుధమ్మెత్తితి నీ
తల సహస్ర భిన్నములుగ
మొత్తుదు నీ చత్తువులే
ఎత్తిన గాండీవము దింపు!" 3

ఈ చరణములు శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావుగారి 'సుభద్రా విజయము' లోనివి. కుహనా యతివేషముతో అర్జునుడు యాదవులను మోసపుచ్చి, తన చెల్లెలు సుభద్రను హరించినాడని విన్న బలరాముడు ఆగ్రహోదగ్రుడై అర్జునునితో ఆహవము సేయ నడుకట్టిన ఘట్టములో బలరాముడు పల్కిన పల్కులివి.

పై పంక్తులందలి ధ, ధు, భ భి, ధం, ధిం వంటి ఒత్తు అక్షరములును సానుస్వారవర్ణములును వీరబలరాముని రౌద్రహుంకారమును ఎత్తిచూపుచు అతని గుండెలో మ్రోగు క్రోధదుందుభిని ధ్వనింపజేయుచున్నవి. ద్రోహి, త్రాహి, పాహి, సహస్ర వంటి పదములందలి మహాప్రాణముల పునరావృత్తి హలాయుధునిలో మహోద్ధృతముగా ఫూత్కరించు ప్రకోపమును ప్రకటించుచున్నది. ముగ్ధ, సుభద్ర ముచ్చగు, పార్థుని, పార్థ, అపార్థా, ఎత్తితి,

1, 2, 3 - 'సుభద్రావిజయము' - పుటలు 15-16. ('విశ్వవీణ' - రజని గేయనాటికల సంపుటి) ముద్రణ : డిసెంబర్ 1964)

మొత్తుదు, చత్తువు ఎత్తిన వంటి శబ్దములందలి పరుషాక్షరములును, సంయుక్త ద్విత్వాక్షరములును రోహిణేయుని రౌద్రచిత్తవృత్తిని వ్యంజింపజేయుచున్నవి.

అదే విధముగా——

"ఖడ్గము ! ఖడ్గము ! ఖండఖండితములై
కాలింగవలె కలుషవర్తనుల
ఉపపతి కౌగిటనున్న పుంశ్చలిని
ఖండింగవలె ఖడ్గము ఖడ్గము !"

——శ్రీ శివశంకరస్వామివారి 'రాజజామాత' లో.

"కత్తికి సానము కట్టించినారూ
ఉత్తమాటలు చెప్పి ఉరిబెట్టినారూ
రేపు మాపని చెప్పి త్రోసిపెట్ట నేను
మగవాని చూపించి మరి కదలుడంటి"

——శ్రీ విశ్వనాథవారి 'పాముపాట' లో.

"పులిపులి పులిపులి బొబ్బిలి బెబ్బులి
కణకణమండే నిప్పుల పిడికిలి
పటపట పటపట పండ్లుకొరికెరా
ఛటఛట ఛటఛట ముందుకురికెరా"

——డా॥ సి. నారాయణ రెడ్డిగారి 'తరతరాల తెలుగు వెలుగు'లో.

"ప్రళయకాలమహోగ్ర భాను కిరణాలవలె
కల్పాంతకుపిత సాగర తరంగములవలె
సంవర్తసమయ ఝంఝా మారుతాలవలె
విలయ రౌద్రకరాళ వికటనటనాలవలె
కాకతీయ బలాలు కదిలినవి ముందునకు
ఏకశిల సైన్యాలు దూకినవి ముందునకు"

——శ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రిగారి 'రుద్రమదేవి' లో.

వంటి పంక్తులను రౌద్ర రసానుగుణమైన అక్షర సంయోజన విశేషమునకు తార్కాణములుగా పేర్కొనవచ్చును, పై చరణములందు లఘ్వక్షర సమ్మేళనముచే నేర్పడిన ద్రుతలయ రౌద్రరస పోషణకు దోహదము చేయుచున్నది.

రేఫ, టకార, ద్విత్వ, సంయుక్త, వర్గయుక్పరుషాక్షరముల సమ్మేళనమువలన, దీర్ఘసమాసముల వలన గౌడీరీతి ఏర్పడుచున్నది. తన్మూలమున ఉద్ధతమైన రౌద్రరసస్ఫూర్తి కలుగుచున్నది.

"సమరఘోష సమరఘోష
దానవతా వికటహాష
చీకటి గుండె జ్వలియిం
చే కోష్ణరుధిర పిపాస
దారుణ సామ్రాజ్యాంధుల
ఆరని మారణ దురాశ
సమరఘోష సమరఘోష" [1]

"ఖరాసి సదృశ ఘన దంష్ట్రా,
గళదనంత వహ్ని శిఖా
కరాళ మృత్యుదీప్త వదన
గహ్వరమున జనియించితి
భేరీ ఝాంకారనినద
ఘోరాహవరంగపణ
న్మానవ కంకాళ రుధిర
పానమ్మున వర్ధిల్లితి
సద్ధ్వనత్ కాలకూట
కటు కఠోర గర్జారవ
భయదభైరవోరుఫాల
నయనమ్మున శయనించితి
హాహాకారము లెసంగ
సఖిల జంతు సముదయమ్ము
నాధి వ్యాధుల నశించు
నస్మదీయ మార్గమ్మున
..................
పరస్పర ప్రపీడన

1. 'దగ్ధశాంతి'-పుట 19 ('నవ్వని పువ్వు' నాటికల సంపుటి-ప్రచురణ 1953.)

ప్రవృద్ధ వహ్ని జటిలమ్ములు
అస్థిరకం పటు ముల్లు
ధనము మన్మార్గమ్ములో
......................
ముండిన కేశులును రుధిర
మండిత సర్వాంగులు నయి
దండధరులు చరియింతురు
దండిగ మన్మార్గంబున
రటద్ధంట పటపట రవ
కుటిల ముఖమ్ములు దాల్చగ
ఘోరపిశాచీ గణములు
గేరును మన్మార్గంబున''[1]

ఈ పంక్తులు క్రమముగా డా॥ సి నారాయణ రెడ్డిగారి 'దగ్ధశాంతి', డా ॥కె. వి ఆర్. నరసింహాముగారి 'శోణితపారణ' నాటికలలోని 'దగ్ధశాంతి' లోని మాటలు శాంతిని ధ్వంసము చేయు 'దానవగ' పాత్ర ప్రవేశమును సూచించు సన్నివేశములో 'అపరిచిత కంఠాలు' పల్కగా, 'శోణితపారణ' లోని మాటలు ఘోరీ చాందుభట్టు పృథ్వీరాజుల మృత్యువును సూచించుచు 'విజయ' పాత్ర పల్కినవి

త్ర్యస్రగతిలో సాగిన పై పంక్తులందలి ఘో, ధ, ధి, ధు, ఖ, ఖి, ఖు, భా, భే, భై లో వంటి ఒత్తు అక్షరముల ప్రయోగము, 'సమర' 'రుధిర', 'దారుణ', 'అగ్ని', 'మారణ' 'దురాశ', 'ఖరాసి', 'కరాళ', భైరవ వంటి శబ్దములందలి రేఫ పునరావృత్తి. ఘోష', 'హేష', 'దురాశ', 'పిశాచ', 'కేశులు' 'సదృశ', 'నశించు'. 'శకల' వంటి పదములందలి శషవర్ణ బాహుళ్యము, విట, చీకటి, కోష్ణ, ఝాంకార, కంకాళ, కాలకూట కటు, కఠోర, జటిల, పటల శకల, కుటిల పటపట ఇత్యాది పదములలోని పరుషాక్షర సమ్మేళనము, 'ఖరాసి సదృశ మనదంష్ట్రా - గళదనంత వహ్ని శిఖాకరాళ మృత్యు దీప్త వదన గహ్వరము', 'భేరీఝాంకార నినద ఘోరాహవ వరంగ పతన్మానవ కంకాళ రుధిరపానమ్ము', 'పరస్పర ప్రపీడన ప్రవృద్ధ వహ్నిజటిలమ్ములు' వంటి పటుతర సమాస జాలము - భీకరరణ విధ్వంసమును ఘోషించుచు,

1. 'శోణిత పారణ'-పుటలు 19, 20, 21 ('ఉషోరాగము' సంపుటి-ప్రచురణ 1955.)

విలయ వాతావరణమును వ్యంజింపజేయుచు, బీభత్సరసము నావిష్కరించు చున్నవి. పై పంక్తులందలి 'కనత్', 'ధ్వనత్', 'రటత్' వంటి తకారాంత పద ప్రయోగము వలన బీభత్సమునకు మరింత కార్కశ్యము, తీవ్రత సిద్ధించు చున్నది. చరణములందు లఘ్వక్షర బాహుళ్యము వలన ద్రుతలయ చోటుచేసి కొన్నది. తత్ఫలితముగా గతిలో వేగముహెచ్చి గౌడీరీతికి మఱికొంత ప్రౌఢి సమకూడి బీభత్స రసస్ఫూర్తి కలుగుచున్నది.

ఈ విధముగా మృదుల పరుషాక్షర సంయోజన విశేషము చేతను, లఘు గుర్వక్షర ప్రయోగ వైవిధ్యము చేతను వైదర్భ్యాది రీతులను ద్రుతాదిలయ లను సాధించుచు, తన్మూలమున పాత్రల చిత్తవృత్తులను ధ్వనింపజేయుచు గేయనాటికాకర్తలు తమ నాటికలలో శృంగారాది రసములను పోషింప గల్గినారనుటకు అనేక నిదర్శనములను చూపవచ్చును.

గేయ నాటికలో ఇతివృత్తము సూటిగా అభివ్యక్తము కాదు. కేవలము కొన్ని సన్నివేశములను ఆధారముగా తీసికొని ప్రేక్షకులు కథనూహించుకొన వలయును. సురుచిరార్థములను ప్రతిపాదించు మృదులాక్షర సమాయుక్త మైన గేయములకే ప్రాముఖ్యమెక్కువ. సామాన్యులకు కూడ సులభముగా బోధపడవలయును. నిగూఢములైన శబ్దములు కాని అర్థములు కాని ఇందుండ కూడదు. మనోహరములైన నృత్యములు కూడ ఇందుండవలయును నాకు ఉప లభ్యములైన తెలుగు గేయ నాటికలను పరిశీలించిన తరువాత నాకీ లక్షణము లన్నియు గోచరించినవి. ఈ సందర్భమున భరతుడు ప్రేక్షకులకు శుభంకర మును, సుఖంకరమును అయిన నాటకమును గూర్చి చెప్పిన పంక్తులు నా మనో ముకురము పైన ప్రతి ఫలించుచున్నవి.

"మృదులలితపదాఢ్యం గూఢశబ్దార్థహీనం
జనపదసుఖబోధ్యం యుక్తిమన్నృత్యయోజ్యం
బహుకృత రసమార్గం సంధిసంధానయుక్తం
భవతిజగతి యోగ్యం నాటకం ప్రేక్షకాణామ్" 1

## గ్రాంథిక, వ్యావహారిక భాషా ప్రయోగములు :

గేయ నాటికా ప్రయోగము జరిగి దాదాపు ఐదు దశాబ్దములుకావచ్చి నది. తొలి దశనుండి గ్రాంథికభాషకు ప్రామాణికమని చెప్పబడుచున్న పరవస్తు

1. నాట్యశాస్త్రము - పదునారవ అధ్యాయము - శ్లో: 124, నిర్ణయసాగర ముద్రణ. బొంబాయి 1943.

చిన్నయసూరి బాలవ్యాకరణమునకు అత్యప్రాయమైన భాష ఈ ప్రక్రియలో అంతటను ప్రయుక్తము కాకపోవుట ఒక విశేషము. 1924లో గేయ పద్య సమ్మిశ్రితమైన గేయనాటికయును, 1930లో సంపూర్ణ గేయనాటికయును అవతరించినవని ఇదివరకే తెలిపియుంటిని. ఆ కాలమునాటికే గ్రాంథిక భాషా నియమములు కొంత సడలినవి. గిడుగు వేంకటరామమూర్తిగారి వ్యావహారిక భాషోద్యమము మహోద్ధృతముగా సాగుచున్న రోజులవి. కావ్యముల మాట ఎట్లున్నను సామాన్యాక్షరాస్యులకును, సామాజికులకును వ్యావహారిక భాషయే ఆస్వాదనీయమైనది. చిన్న కథలయందును నాటక-నాటికలయందును, వార్తా పత్రికలయందును వ్యావహారిక భాషయే ప్రయుక్తమగుచుండినది.

జనులకత్యంత సన్నిహితమైన గేయనాటికలలో వ్యావహారిక భాషా ప్రయోగము సహజముగనే అభిలషణీయమై వర్ధిల్లినది. కొందరు అగ్రేసరులైన కవులు గ్రాంథిక భాషను తమ గేయనాటికలలో సమయానుకూలముగా సడలించుటలోనే తృప్తి పడినారు. శ్రీ శివశంకరస్వామి శ్రీ నోరి నరసింహశాస్త్రి, శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావు, శ్రీ వావిలాల సోమయాజులు, శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి, శ్రీ మల్లవరపు విశ్వేశ్వరరావు డా॥ దాశరథి, డా॥ సి. నారాయణరెడ్డి, డా॥ యస్వీ జోగారావు శ్రీ వానమామలై వరదాచార్యులు, డా॥ బోయి భీమన్న, డా॥ నండూరి రామకృష్ణమాచార్య శ్రీ బాపురెడ్డి, శ్రీ నారపరెడ్డి శ్రీ సూరంపూడి భాస్కరరావు. డా॥ అరిపిరాల విశ్వం వంటి వారు శబ్దగతమైన అర్థానుస్వారమునకును, సరళాదేశ సంబంధమైన అర్థానుస్వారమునకును, శకటరేఫప్రయోగమునకును, కొన్నిచోట్ల యడాగమములకును స్వస్తిచెప్పి శ్రవణ సౌభాగ్యమునకును అవరోధమును కల్పించు తెలుగు సంధులను విసంధి చేసికొనియును, పాదాంతమునందలి శబ్దములకు రాగశ్రేణి కల్పించుటకు దీర్ఘములతికించుకొనియును గేయనాటికా రచన సాగించినారు

ప్రాయికముగా గేయనాటికలలో గేయములకే ప్రాముఖ్యము. మాత్రాబద్ధములైన గేయములలోని మాత్రలకు అనుగుణమైన శబ్దజాలము గ్రాంథికములో నమరినను, వ్యావహారికము నందమరినను శ్రవణసుభగత్వమును దృష్టి యందుంచుకొని కవులు భాషావిషయమునంతగా పట్టించుకొనలేదు. ఈ కారణము చేతనే ఒకటి, రెండు తప్ప అన్ని గేయనాటికలయందును వ్యావహారిక గ్రాంథిక భాషా ప్రయోగములు ఒక నియతికి లోబడక యథేచ్ఛగా సాగినవి.

శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి 'పాముపాట' లో భాష గ్రాంథికమే అయినను పాడుకొనువారికి సౌలభ్యము చేకూర్చుటకై వారు కొన్ని యెడల పాదాంతమున దీర్ఘములను వాడియుండిరి. ఒకటి రెండు చోటులందు మాత్రము వ్యావహారిక పదప్రయోగము కానిపించుచున్నది. డా॥ కె.వి.ఆర్. నరసింహముగారి 'ఉషోరాగము' 'శోణిత పారణ' అను రెండు గేయనాటికలలో ప్రయుక్తమైన భాష శుద్ధగ్రాంథికము. అర్ధానుస్వారమును గాని శకట రేఫమును గాని విడువనొల్లని గ్రాంథికము.

లయతాళరాగములను భావమును భాషను ఒకత్రాటిపై నడిపించుటకు ప్రయత్నించుట కష్టసాధ్యము. ఒకవేళ ఇది సాధ్యమైనను గేయనాటికా ప్రయోజనము సంపూర్ణముగ సిద్ధించుట అరుదే యగును. ఇటీవలి గేయనాటిక లన్నింటిలోను ఈవ్యావహారిక గ్రాంథిక భాషల మేళవింపు క్రొత్తపాతల మేలికలయికవలె ఇంపుసొంపులకు తావలమగుచున్నది. పరిపూర్ణముగా గ్రాంథిక భాషనాశ్రయించి గేయనాటికను రసవంతముగ రూపొందించుట ఎంత కష్టమో సంపూర్ణ వ్యావహారికభాషను ఆశ్రయించి గేయనాటికను రసవత్కృతిగా తీర్చిదిద్దుటయు అంతే కష్టము. గేయనాటికలలో సాహిత్యము లయబద్ధముగ వెలయుటయే ముఖ్యము. గ్రాంథిక వ్యావహారిక భాషలు ఛాయాచిత్రమునందు వెలుగునీడలవలె అనివార్యముగా సహజీవనము సలువుచున్నవి. ఇది ఈ ప్రక్రియకు సంబంధించిన భాషావైశిష్ట్యము. ఇచట భాషావ్యాకరణములకంటె వానికతీతమైన సంగీత మునకే అగ్రతాంబూలము. గేయనాటికలలో వ్యావహారికభాషాప్రయోగము అనివార్యమై లక్షణ నిర్వచనమునకు ఇంచుమించు ఉపస్కారకముగా ఒప్పుచున్నది.

గేయనాటికలలో వ్యావహారికాంధ్రభాష పుష్కలముగా స్థానము సంపాదించుకొన్నను, శిష్టవ్యావహారికభాషతో పాటు జానపదుల భాష, మాండలికముల యాస గోవు వెంట లేగవలె వెన్నాడుచువచ్చినవి. పాత్రోచిత భాషలుగా ఈ జానపద మాండలిక భాషలు గేయనాటికలలో ప్రయుక్తములై వానిని జీవ కళలతో అలంకరించినవి.

తెలుగు గేయనాటికలలో మాండలిక జానపద భాషాప్రయోగములను చేసినవారిలో శ్రీ దేవులపల్లి వేంకట కృష్ణశాస్త్రిగారు, శ్రీ బాలాంత్రపు

రజనీకాంతరావుగారు, శ్రీ వావిలాల సోమయాజులుగారు, డా॥ సి. నారాయణ రెడ్డిగారు, శ్రీ వానమామలై వరదాచార్యులుగారు మున్నగువారు పేర్కొనదగినవారు.

గేయనాటికలలో ప్రయుక్తములైన గ్రాంథిక, శిష్ట వ్యావహారిక, జానపద మాండలిక భాషా ప్రయోగములకు లక్ష్యములను చూపింపయత్నించుట సముద్రమునకు ఏతామెత్తుటయే. స్థాలీపులాకన్యాయముగా కొన్ని లక్ష్యములను ఇట ఉదాహరింతును.

**గ్రాంథిక భాషా ప్రయోగము :-**

(1) "పాటలీపుత్రమ్ము వారలు
పంపినారు మహోపహార
వివిధ పరిమాణాకృతుల్ గల విమలదర్పణముల్
వచ్చియున్నవి వింధ్యభూధర
వనమదస్తంబేరమమ్ముల
దివ్యదంతనిర్మితములౌ తెల్లదువ్వెనలున్."
— (శ్రీ శివశంకరస్వామివారి 'పలితకేశము'-లో)

(2) "నీవెవ్వరని నన్ను నెలతలారా! మీరు
గుమికూడియడిగెదరు గుసగుసలు పోయెదరు
..............................
వింతగా మెయినిండ వెలిబూది పూసినది
ఒక్కపాములబుట్ట నొత్తినెత్తినబెట్టి
పొరబుట్టలేకుండ తిరుగుచుండెనటంచు
నావంక గనుగొంచు నలినాక్షియొక్కర్తు"
— (శ్రీ విశ్వనాథవారి 'పాముపాట'లో)

(3) "జిలుగు బంగరు రంగులీనెడు
వలిపెమాకసమందుఁ జిందఁగఁ
దొగరువన్నెపసిండి పావడ
నిగనిగలు దెసలానఁగా
.................

తావకీన ప్రణయరేఖా
పావనస్మిత భాషణమ్ముల
వీనులారగ వినంగనెయ్యది
వెలివు తెల్పఁగదే?" —(డా॥ కె. వి. ఆర్. నరసింహము గారి 'ఉషోరాగము'-లో)

(4) "మధురానగరీ గాథ;
మరపురాని తీయనైన బాధ;
కడపగడప-యెడదయెడద తాకుచు
ప్రేమముపంచిన మాధవు గాథ
మాధవుడల మధురానగరికి చన
బృందావన గోపీజన బాధ;
చల్లగొనుచు మధురానగరికి చను
వ్రజభామిని మధురహృదయశోధ
మధురానగరీ గాథ." —(శ్రీ బాలాంత్రపు రజనీకాంత రావుగారి 'మధురానగరీగాథ'లో)

(5) "ఘల్లని గజ్జెలు క్వణనము చేయగ
కాలదన్నెనెవ స్వామీ!
నిజఘనఘంటా నిస్వనంబుతో
నింపె శ్రోత్రములు స్వామీ!
పాలుగారు యువనటుని శిరమ్మొకె
పాణిదాల్చినది స్వామీ!
కాలానలపటు కౌక్షేయధృత
కరిమటు చూపెను స్వామీ!" —(శ్రీ నోరి నరసింహశాస్త్రి గారి 'షణ్ణవతి'లో)

**వ్యావహారిక భాషా ప్రయోగము :-**

(1) "చల్లాచెయ్యో గొల్లాభామా
చట్ చట్ చట్ చట్
మొగమున మంచీ ముత్యాలంటే
ముంగురులను సరిచేసుకొంటూ

కన్నెవలపుల వంటి కమ్మని
వెన్నెముద్దలు తేరిచి తీస్తూ
......................." —(శ్రీ బాలాంత్రపు రజనీ
కాంతరావుగారి 'మధురానగరిగాథ'లో)

(2) "దశదిశా హృదయాలు
తల్లడిల్లేచోట
విషజిహ్వాకాగ్రాలు
బుసలుకొట్టేచోట
ఎవరవో నన్ను నీ
వెలుగెత్తి పిలిచేవు"

"అనాథజీవుల
మాటే మరచి
వినోదాలతో
విలాసాలతో
విహరిస్తానని
వెళుతున్నావా"

"వెర్రికేకలను వింటూ
విస్తుపోతివేల ప్రియా
ప్రణయ విలాసాలమాట
మరిచావా కళామయా" —(డా॥ సి. నారాయణరెడ్డిగారి
'దగ్ధశాంతి'లో)

(3) "ఓ ఎలకా! చిట్టెలకా!
ఊరికే చూస్తావెందుకు?
ఉలికులికి పడతావెందుకు?
వరిగింజకోసం మావాడు
వరిచేనుకెళ్ళాడు మావాడు
వలలోను సిక్కాడో - వడిసెలకు దక్కాడో
మావాడు రాలేదు'" — శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి
'ఏడాది పొడుగునా'లో

(4) "చీటిమాటి కలిగిపోయి
కాటకాలు తెస్తావు
వచ్చావో దేశమంత
వరదలు పారిస్తావు"

—శ్రీ జె. బాపురెడ్డిగారి 'ఋతురంగం' లో

(5) "పూవులన్నీ రాలిపోవునా యేని
దేవుడిని నిలదీసి పృచ్ఛచేస్తాను
చెట్టుచెట్టున తోటి పిట్టలను పిలిచి
గూటిబయటను పెద్దగుడి కట్టుతాను
గుడిలోన దేవుడిని కూర్చుండబెట్టి
గుట్టుగా మాగుండె గోడు చెబుతాను"

—డా॥ యస్వీ జోగారావుగారి 'అవిముక్తము' లో

**గ్రాంథిక వ్యవహారిక భాషా సరససమ్మేళనము :**

(1) "ఎవరికి వారే యమునా తీరే
కృష్ణుడు కృష్ణుడు దూరంపోరే
మహర్షులంతా మానినులై
వెదుకుదురట మనకోసం
తానే యిప్పుడుదొంగై వెదకును
మానినులా మనకోసం, ఎవరికి వారే
తరుల చాటునా, పొదల మాటునా
యమున కడుపులో దాగి మలుపులో
దాగుకోండి దాగుకోండి—పోండి"

— శ్రీ బాలాంత్రపు రజనీ కాంతరావుగారి 'రాసలీల' లో

(2) "మధుమాసం మధుమాసం
మృదుసుమాల పెదవులపై
నిదురలేచు దరహాసం
మధుమాసం మధుమాసం

శిశిరనగ్నలతా వళికి
ఘుసృణాంబర విన్యాసం" —డా॥ సి. నారాయణరెడ్డిగారి
'ఋతువుల రాణి' లో

(3) "పాడుదేహం పదివదేడులు
బ్రదికేందుకు ప్రయోజనం?" —డా॥ యస్వీ జోగారావు
గారి 'అమముక్తము' లో

(4) "అమచేతి ఉమచేత
మమతనై మెరిశాను
ప్రణవచేతన నుండి
ప్రణయమై విరిశాను
నీ గుండెనై యింక నినదింతురా, స్వామీ!
నీ నిండ స్వప్నాలు నిర్మింతురా?" —డా॥ బోయి భీమన్న
గారి 'మానవుని మరొక మజిలీ' లో

(5) "తియ్యగా గోదారి దినచర్య దిద్దింది
ఓరంత ప్రొద్దింత విశ్రాంతి వద్దంది
చిన్నారి పొన్నారి చిరుత కూకటినాడె
అందాల కాణాచియై అరితేరింది
తొలి ఉషస్సులలోన పులకించి లేచినది
ఇలుముందు కస్తూరి కలయంపి జల్లినది
కర్పూర ధూళికా కాంతిరించోళితో
ముత్యాల కోవతో ముగ్గుపరులల్లినది" —డా॥ నండూరి
రామకృష్ణమాచార్య గారి 'గోదావరి' లో

**జానపద - మాండలిక భాషా ప్రయోగము :**

(1) "ఏటికయా బావయా!
కోటయ మాటినరయా!
కాశీరామేశ్వరాలు
కాళ్ళీడుసు కెళ్ళటం ?... ॥ఏటి॥
సెయ్యొత్తామంటే, నీ

సెయిలం వొంగుంటె
కూకున్నా సోటికొచ్చి
కోటప్పాగుడి వుంటె,
రమ్మంటే కాళహాస్తి
గుమ్మంకాడే వుంటే ... ॥ఏటి॥

—శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి 'శివక్షేత్రయాత్ర' లో

(2) "సెప్పమంటె సెవుతుంటిని
సిత్తగించవలెను దొరా
సిన్నబాబుగారు
నిన్నసందె యేళ
రాజయీధిలోన
రదముమీద పోగ
రాజా నా బొల్లావుది
రంగైనది సిన్నపెయ్య
రాలిపోయెనండి పెబూ
రచ్చించండయ్య పెబూ"—శ్రీ వావిలాల సోమయాజులు
గారి 'ధర్మఘంటిక' లో

(3) "వొచ్చిందా తిరిగీ వొచ్చిందా
తొంగిసూసిన ముబగసిరకి పొంగిపోయే తొలిమేగం
వొచ్చిందా తిరిగీ వొచ్చిందా" ॥వొ॥

—శ్రీ బాలాంత్రపు రజనీకాంత రావుగారి 'మేఘసందేశం, లో

(4) "ఏతేలు ఏతేలు పోలేరమ్మా
ఏతేలు మమ్మేలు పోతురాజా
ఇంటికొక్క దీపమెట్టి
ఇంత సద్దిముద్దపెట్టి
......................
యాలకింత వానకురిసి
ఆడుకుంట పాడుకుంట
యేడుకుంటం యేటేటా"

—శ్రీ 'లసూనా' గారి 'లవణరాజుకల' లో

**అన్యభాషా పద ప్రయోగములు :**

ప్రపంచభాషలలో స్వతంత్రమైన భాష ఏదియునులేదు. సాంస్కృతిక చారిత్రిక కారణముల వలన భాషలన్నియును ఏదో ఒక విధముగ పరస్పరాశ్రిత ములై పరస్పర ప్రభావితములై పలు మార్పులకు లోనగుచు నిత్యనూతన ముగా భాసించుచుండునను యాథార్థ్యమును భాషాతత్త్వవేదులు ప్రకటించి యున్నారు. మన తెలుగు ద్రవిడభాష నుండి అవతరించినదే అయినను, తొలి దశలో సంస్కృత ప్రాకృతములను, కర్ణాటకాది ద్రవిడభాషలను జీర్ణించుకొని, శ్రీనాథుని కాలమునాటికి విదేశీయములైన అరబ్బీ. ఫారసీ భాషాశబ్దములను, పదునేడవ శతాబ్దము నుండి దేశీయమైన ఉర్దూ హిందీ పదజాలమును, ఇంగ్లీషు పోర్చుగీసు. ఫ్రెంచి, డచ్చి మున్నగు పాశ్చాత్య భాషాశబ్దసంతతిని విశేషముగా తనలో ఇముడ్చుకొనుచున్నది- ప్రస్తుతము మన తెలుగున వ్యవహారమునందున్న అనేక ఫారసీ ఇంగ్లీషు ఉర్దూ పదములకు సమానార్థకములైన తెలుగు పదములే అరుదైపోయినవి. అర్థమునందును, ఉచ్చారణము నందును అనేక పరివర్తనము లను పొంది అనేక ఉర్దూ ఇంగ్లీషు ఫారసీ పదములు స్వచ్ఛమైన తెలుగు పద ములేమో యను భ్రాంతిని కలిగించు స్థితి ఏర్పడినది. ముఖ్యముగా ఇటీవల మనము ఇంగ్లీషు పదములనే కాక, ఆ సారస్వతమునందలి అనేక ప్రక్రియలను కూడ రూపొందించుకొని మన సాహితీక్షేత్రమున క్రొంగ్రొత్త పంటలనెన్నిం టినో పండించుకొంటిమి.

అన్యభాషా పదములు తెలుగులో విడదీయరాని విధముగా చేరిపోయిన కారణమున అనుదినము సృష్టియగుచున్న సాహిత్యము నందును ఇవి అతి సహజ ముగా అనివార్యముగా చోటు చేసికొనగలుగుచున్నవి. నిరక్షరాస్యులను కూడ రంజింపజేయగలుగుచున్న రూపక ప్రక్రియలలో అన్యభాషా పదములు అలవోక గనే అవతరించుచుండును. ఈ గేయనాటికలలో వస్తు, పాత్ర, రస, సన్నివేశ ముల ఔచిత్యమును బట్టి అన్యభాషా పదములనేకములు ప్రయుక్తములైనవి. గురజాడ అప్పారావుగారి కన్యాశుల్కము (గేయనాటిక కాకపోయినను) లో ప్రయుక్తములైన ఇంగ్లీషు ఉర్దూ పదములు అత్యంత రసానుభూతికి కారణము లగుచున్న సత్యమును ఎవరును కాదనలేరు. వేదము వేంకటరాయ శాస్త్రిగారి ప్రతాపరుద్రీయము నందును శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారి బొబ్బిలి యుద్ధము నందును ఇంక అనేకాంధ్ర నాటకములందును అన్యభాషా పదములు

ముఖ్యముగా ఉర్దూ ఇంగ్లీషు శబ్దములు సామాజికులను విశేషముగ అలరించి నవి. గేయనాటికాకర్తలు ఈ పరిస్థితిని అవగాహనము చేసికొని మాత్రాచ్ఛందో బద్ధములైన తమ గేయములలో సైతము అన్యభాషా పదములను చొప్పించి రసానుభూతికి వీలు కల్పించినారు.

గేయనాటికలలో సాధారణముగా ఇతివృత్తములు సామాన్య ప్రజానీక మునకు సంబంధించి యుండుటచేత, జనసామాన్యమునందు విశేష ప్రాచుర్యము నందుకొని సజీవములై పెంపొందుచున్న ఈ అన్యభాషా పదములు ప్రవేశించు టలో ఆశ్చర్యమేమియును లేదు. పరిమళము నాశించు ఘ్రాణేంద్రియమునకు మల్లి ఎంతో 'లిల్లి' యు అంతే, గులాబీ గుబాళింపులెంతో సంపంగి సౌరభా లును అంతే.

గేయనాటికా ప్రక్రియలో అన్యభాషా పదప్రయోగము ఔచితీ శోభి తమే. అనివార్యాలంకరణమే. దీనికి ఉదాహృతులు అనేకములు. వానిలో కొన్నింటిని ఇట చూపింతును.

**ఉర్దూ హిందీభాషా పద ప్రయోగము :**

(1) శ్రీ శివశంకర స్వామివారి 'సహజయాన పంథీ' లో—
"పట్టుకొనుడు పట్టుకొనుడు *పాగల్* చండీదాసును"
పాగల్ శబ్దము హిందీ. ఉన్మత్తుడని అర్థము.

(2) శ్రీ దేవులపల్లి వేంకటకృష్ణశాస్త్రిగారి 'చౌరస్తా'లో

"*చౌరస్తా*
*ఆహిస్తా*
*ఏక్ సవారీ చార్ అనా*
*దో సవారీ ఛేఆనా*
*సర్దీ గర్మీ చఢావ్ ఉతార్*
రిక్షా గలగల *తొక్కేస్తా*
బీవీ బచ్చా మోజంతా ఆ
షీన్ గదిలోనే *రోజంతా*
*రాత్ మే దిన్ మే*
*షామ్ సవేరా*

అఖర్ దాకా నేన్ గుమాస్తా
చౌరస్తా
ఆహిస్తా"

(3) శ్రీ కొప్పరపు సుబ్బారావుగారి గేయనాటికకు శీర్షిక 'అల్లీముతా' ముతా శబ్దము హిందీ. ఆ నాటికలో—

(i) ఢంకా బజావో భాయీ అల్లీముతాకో
(ii) ఝూటా మాటలురా ప్రియసోదరుడా
(iii) జులుమే న్యాయమురా ప్రియసోదరుడా

(4) శ్రీ బోయి భీమన్నగారి 'పైరుపాట'లో—

(i) బాధలు బెట్టె తెలంగని నీతో
ఖాతాఖానీ నా కేలా

(ii) సాలంతా కష్టపడి
సాగుచేసుకొన్న మడి

(5) శ్రీ వావిలాల సోమయాజులుగారి 'సంక్రాంతి'లో

రేపే బస్తీకి పోదాం
రేవుల మూటలు మోద్దాం

(6) డా॥ సి. నారాయణరెడ్డిగారి 'తరతరాల తెలుగువెలుగు' లో—

'ఎక్కడరా ఓ హైదర్ నీదో
కుక్కచావురా గద్దార్

(7) శ్రీ వానమామలై వరదాచార్యుల వారి 'పెద్దలచదువు'లో—

పట్టు నింబోలి జరీబుట్టేదార్ చీరదెత్తు

(8) శ్రీ నార్ల చిరంజీవిగారి 'భాగ్యనగరం'లో—

ఖుషీ నిషా వందెంలో హమేషా
గెలిచిచూడు నా అందం హుసన్ షా
కనురెప్పలు తెరచిచూడు కొనివచ్చితి మొహబ్బత్
మనసు నీకై అంకితమై నిలిచింది ఔరత్"

(9) శ్రీ జె. బాపురెడ్డిగారి 'భావిజీవులు'లో—

(i) "బాటలరద్దీ మాన్పుచు"

(ii) పుట్టుటకై మీరందరు
పెట్టుకొనే *దరఖాస్తులు*''

(10) శ్రీ రెడ్డి చినవెంకటరెడ్డిగారి 'శాంతి'లో—
'అల్లామియ్యా చెప్పినది-అదే అక్బరు ద్వారా పలికినది'

11) శ్రీ టి. రామకృష్ణారెడ్డిగారి 'ఉమర్ ఖయామ్'లో—
"మనసే వాలెను నీపైన
సొగసే నీకు *నజరానా*"

12) శ్రీ ఎం. కె. రాముగారి 'స్వతంత్రబంగ్లా'లో—
''*సునో సైనికో గోలీ చలావో*
*బంగ్లాకో నాశ్ కరో*''

(13) శ్రీ వల్లభాపురం జనార్దన్‌గారి 'విజయక్రాంతి'లో—
''ఇంతలేసి మాటలాడు
హిమ్మత్తా మల్లయ్యకు

(14) శ్రీ బి. రాములుగారి 'స్వాతంత్ర్యం వచ్చాక'లో—
''సిఫారసుల మన్నించి''

(15) శ్రీ పటుకూరి ప్రసాద్‌గారి 'ఎర్రబాట'లో—
"భూస్వాములతొత్తు
ఈ *సర్కార్ ఫత్తు*"

**ఆంగ్లభాషా పద ప్రయోగము**

(1) శ్రీ కొప్పరపు సుబ్బారావుగారి 'అల్లీముతా'లో—
"....................హెయిర్ క
*ట్టింగు సెలూన్* పెట్టినామండి పోటీలుపడి ట్రా
*వింగు* కానికి చేసినామండి-దమ్మిడికి ఒక షే
*వింగు* చొప్పున గీకినామండి.........బాకీలు ఎగ గొ
ట్టింగు '*ఎబ్‌స్కాండింగ్*' సుమ్మండి-ఆ దెబ్బతో షే
*వింగ్* సెలూన్ ఘోరమాయెనండి-పొది చంకనిడి 'థిం

చూస్తే రయిటింగ్ - రంగ్
స్ప్రింగ్ స్ప్రింగ్ స్ప్రింగో

ii) చూడండి మేస్టారూ యీ సుకుమారు
నిక్‌నేమ్ తో పిలుస్తాడు మము పలుమారు

(5) శ్రీ మల్లవరపు విశ్వేశ్వరరావుగారి 'కృష్ణాపుష్కరం' లో

i) "ఆనకట్లు బ్యారేజీలు హైడ్రో ప్రాజెక్టులన్ని"

ii) "భూరి బ్యారేజీల డ్యాములను నిర్మించి''

(6) శ్రీ బోయి భీమన్నగారి 'మెదడులో మెరుపు లో

i) "ప్రాజెక్టు తెరిచారు - పవరు కల్పించారు"

ii) "భూమినే దున్నగల బుల్డోజరొచ్చింది"
వారి 'మానవుని మరొక వజీలీ' లో___

iii) మీ తాతలవంటివారు - మృత్తికపాలై పోయిరి
హిట్లరంత డిక్టేటరు - ఏమైనాడో తెలియదు"

(7) శ్రీ వానమామలై వరదాచార్యులవారి 'పెద్దల చదువు' లో
"ఎఫ్ యే బియేలు చదివి
ఎక్కడ నౌకరు దొరుకక"

(8) శ్రీ బాపురెడ్డిగారి 'భావిజీవులు' లో___

i) "కూటి కోసమెన్ని కూల్యాలు"

ii) "సీట్ల నిర్ణయం చేసిన
స్లీపరుకోచీ లోనికి"

శ్రీ బాపురెడ్డిగారి ఒకనాటిక శీర్షికయే 'రాకెట్టు రాయబారం' కాగా మరొక నాటిక 'యన్ జి. వో.' యన్. జీ వో' లో___

i) "ఏమి చెప్పినా సిల్లీ
ఎక్స్యూజ్ అంటారు"

ii) ఘాటుఘాటుగా నాకు
నోటీసులు ఇచ్చారు

iii) ఎన్నిసార్లు చెప్పాను
ఇంప్రూవ్ చేయ్యమని
వి. ఆర్ లు పెట్టలేదు
పెండెన్సీ తగ్గలేదు
పెట్టుకున్న రీతి నోటు
పెట్టుమంటె చేతకాదు
ఈ ఫైల్ లో మ్యాటరు
ఎక్జామిన్ చేయలేదు
జి. ఓ రెఫరెన్సేదీ ?
డి.ఓ రిమైండరేదీ ?

(9) శ్రీ జి రాములుగారి 'శాంతిపథము' లో—
"ఎం ఎల్. ఏలును - ఎం వి. లయిరి"

(10) శ్రీ లంకా సూర్యనారాయణ (లసూనా) గారి 'యుగాది' లో—
"పీరేనా సైంటిస్టులు ?"

(11) శ్రీ అందె వెంకట రాజముగారి 'భారతరాణి' లో—
"బ్లాకు మార్కెటు వ్యవహారములో
ప్రాణాల్ తీసెదవా ?"

(12) శ్రీ రెడ్డి చినవెంకటరెడ్డిగారి 'భూదేవి' లో—
"కలరాను నేను కలరాను
కాలాంతకుని దూతను నేను
టి. బి. ని నేను టి. బి. ని-
క్షయను రాజయక్ష్మను"

(13) శ్రీ వల్లభాపురము జనార్దన్ గారి 'విజయక్రాంతి' లో—
"స్టేటు బ్యాంకులు గూడ రైతుల
సేద్యమునకై ఋణములిచ్చు"

(14) శ్రీ కె. రామేశ్వరరావుగారి 'జనశ్రేణి కదిలింది' లో—

"ఉన్న ఆస్తి తెగనమ్మి - డిగ్రీలను పొందాము"

(15) శ్రీ పటుకూరి ప్రసాద్‌గారి 'ప్రబాట' లో—

(i) "కూలి రేట్లు పెంచాలి"

(ii) "సోషలిజం కొంగజపం"

(16) శ్రీ వడ్డెపల్లి కృష్ణగారి 'కన్య - కట్నం' లో—

"కాలేజీ కన్నెయనుచు

మ్యారేజీ యాడబోవ"

: —— :

# 14. గేయనాటికల భవితవ్యము

సంఘములోని వ్యక్తులందరికిని కళాభిరుచి సహజాతముగనే యుండును. కాని అందరికిని ఒకే కళపట్ల అభిమానముండుట కనివిని ఎరుగనిమాట. కొందరికి రెండు మూడు కళలపట్ల ఆసక్తి ఉండును. నాట్యమనునది భిన్నాభిరుచులు కల జనులందరికిని సమారాధనీయమను మాట ఆర్యులు చెప్పినదే. సంగీతసాహిత్యాభినయములు ఎంత కళాత్మకములో అంతశాస్త్రసమ్మతము కూడ. శాస్త్రీయాంశమును కప్పిపుచ్చి కళారూపమున ఈ కళలు బహిర్గతములైనప్పుడే ఆస్వాదనీయములగుచున్నవి. ఈ మూడును స్థూలముగా స్వతంత్రప్రతిపత్తి కలిగిన లలితకళలే. వీని మనోహర సమ్మేళనమే గేయనాటిక. ఈ మూడు కళలతో చక్కని పరిచయమున్నవారు మాత్రమే ఈ ప్రక్రియను సమాదరించగలరు. నేటి యాంత్రికమైన సమాజమునందు కళాత్మకమైన విజ్ఞానము మిక్కిలి అరుదుగానున్నదనియును గేయనాటికకు అంతగా ప్రోత్సాహము లభింపకపోవచ్చునని యును సాధారణముగా ఒక అభిప్రాయమున్నది. సాంకేతిక శాస్త్రమునందు మానవుడెంత పురోగమించినను అతని హృదయస్థితిలో ఎట్టి మార్పును కలుగలేదు. సుఖదుఃఖములు, ఆశానిరాశలు, జరామరణములు అతని జీవితమునందు ప్రాముఖ్యమును వహించుచునే ఉన్నవి. ఏ కళావిర్భావమునకైనను రాగద్వేషములకు నిలయమైన హృదయమే మూలము. సుఖదుఃఖాదిక ద్వంద్వాతీతమైన హృదయమునకును కళకును సంబంధము పొసగదు కనుకనే కొందరు శాంతమును రసము కాదనిరి.

పాశ్చాత్య దేశములలో సినీమాల విజృంభణము నాటక వికాసమునకు అవరోధము కాలేకపోయినది. యంత్రమెంత సున్నితమైన వస్తుజాలమును సృజించినను హస్తకళోద్భూతములైన వస్తువుల విలువను తగ్గింపలేకపోవుచున్నవి. యాంత్రికనాగరికతా కాంతిచ్ఛటలను భరింపలేని పశ్చిమదేశవాసులు భారతీయుల చేతిపనుల చలువవెన్నెలలకు ఉవ్విళ్లూరుచుండుట నేటి పాశ్చాత్య విపణివీథులలో కనిపించుచునే ఉన్నది. యంత్రములు మనిషిని బానిసగా మార్చుచున్నవనియును, అతని కళాత్మక హృదయము మీద తీవ్రాఘాతములు కలిగించుచున్నవనియును గాంధీ మహాత్ముని వంటివారు అభిప్రాయపడినారు. యంత్రము

లెంతగా పెరిగినను వాని దారినుండి సృజనాత్మక కళలను సంరక్షించుకొను టకు పాశ్చాత్యులు యంత్రములను పైతము వినియోగించుకొనుచున్నారు. సినీమా సాహాయ్యముతో నాటకములను పరిపుష్టము చేయుచున్నారు. విద్యుచ్ఛక్తితో అద్భుతములను రంగముపై ప్రదర్శించి కృతకృత్యులగుచున్నారు. రేడియో, టెలివిజన్, వంటి ప్రసారసాధనములు ఎంత పురోగమించినను వానికి దీటుగా నాటక ప్రదర్శనములు పాశ్చాత్య దేశములలో జయప్రదముగా నిర్వహింపబడుచున్నవి. 'ఓపెరా' లనబడు గేయనాటికలు పాశ్చాత్య దేశములలో ఇతోధికమైన అభివృద్ధిని సాధించుచున్నవి. ఆర్థికముగా కూడా అవి పలప్రద ములగుచున్నవి.

స్వాతంత్ర్యసముపార్జనానంతరము మన దేశమునందు సంగీతనృత్యకళాశాలా నిర్వహణము, సంగీతనాటక అకాడమీల సంస్థాపనము, నాటకసమాజముల వికాసము, నాటక సమాజముల వికాసము, విశ్వవిద్యాలయ స్థాయిలో నాట్యశాస్త్రాధ్యయనము (Histrionics) నాటక వికాసమును గూర్చిన పరిశోధనలు, రాష్ట్రదేశస్థాయిలో కవి నటగాయకులకు సన్మానములు ఇతోధికముగా జరుగుచున్నవి. స్వాతంత్ర్యమునకు పూర్వము నాటి పాలకులైన బ్రిటిషువారు వీని అభ్యుదయమును అంతగా పట్టించుకొనలేదు ప్రజాపరముగ సాగిన ప్రయత్నముల పట్ల తూష్ణీంభావము వహించిన సందర్భములే ఎక్కువ. అయినను దేశ ప్రజలు తమ సంస్కృతి సంరక్షణార్థము మహోత్సాహోదీక్షతో కృషిచేసిరి. ఇప్పుడు ప్రజలు స్వతంత్రములైన తమ ఆలోచనములకును తమ సంస్కృతి సంప్రదాయములకును విశేషముగా ప్రాముఖ్యమునిచ్చుచు తాము ఎన్నుకొన్న ప్రభుత్వము ద్వారా కళావికసనమునకును ప్రయత్నములు సలుపుచున్నారు.

తెలుగుదేశమున అతిప్రాచీనకాలమునుండియు నృత్యగీతాభినయములకు సముచిత సమాదరణమే లభించుచువచ్చినది. సామాన్యప్రజలును జానపదులును, ప్రభువులును ఏదో ఒక రూపమున ఈ కళలపట్ల మమతలనే పెంచుకొనిరి. యక్షగానము, జముకులకథ, జంగముకథ, కుంవంజి, హరికథ, బుర్రకథ వంటి జానపద రూపక, కళావిశేషములను గొల్లకలాపము, భామాకలాపము, క్షేత్రయ పదాభినయము వంటి విశిష్టరూపక సంప్రదాయములను తెలుగువారు ఎక్కువ మక్కువతో పోషించుకొనుచువచ్చిరి. అత్యాధునికములైన సినీమాలలో కూడ ఈ కళలిపుడు చోటుచేసికొని ప్రజాబాహుళ్యములో విజ్ఞాన వినోదములను కలి

గింప గలుగుచున్నవి. పాశ్చాత్య దేశములవలె కాక మనదేశమునందు సినీమాల వలన నాటకములకు కొన్ని అఘాతములు కలుగుచున్నవి. ప్రసిద్ధ సినీమానటుడు నటించిన నాటకమునకున్న ప్రాముఖ్యము రంగస్థలనటునికి లేదు. ఔత్సాహిక నటులు (Amateur actors) ఎన్నో పాట్లుపడి నాటకములను నాటికలను ప్రయోగింపగలుగుచున్నారు. నాటకముల స్థితి ఇట్లుండగా సంగీతరూపకములను (గేయనాటికలను) గూర్చి చెప్పవలసినదిలేదు. ఇప్పటికిని ఇవి ప్రయోగదశను దాటలేక పోవుచున్నవి. నాటక ప్రయోగము కంటెను గేయనాటికా ప్రయోగము అధిక వ్యయప్రయాసలతో కూడుకొన్నట్టిది. సంగీత నృత్యాభినయము లను చక్కగా తెలిసిన నటులు అరుదు. రచయితలును కొందరే. ఇక ఇంత విశిష్టమైన రూపక ప్రయోగమునకు సామాజికులు లభ్యమగుటయు దుర్లభమే. ఆకాశవాణి (All India Radio) కల్గించిన అవకాశమువలన, ఇచ్చిన ప్రోద్బలము వలన శ్రవ్యనాటికలు పుట్టినట్లే నృత్యగేయాభినయములయందు ఆసక్తి కలిగిన నటగాయకుల అభ్యర్థనమును పురస్కరించుకొని ఈ గేయనాటికలను కవులు రచించుటకు పూనుకొనుచున్నారు. శ్రవ్యనాటికలకు వలెనే గేయనాటికా ప్రక్రియకు కూడ తొలిదశలో ఆకాశవాణివారే సముచితావకాశములను కల్పించినారు.[1] రంగస్థలముపై ప్రయోగింపబడిన ప్రప్రథమ పద్యగేయనాటిక శ్రీ శివశంకరస్వామివారి 'పద్మావతీచరణ చారణ చక్రవర్తి'. విఖ్యాత కవులు శ్రీ దేవులపల్లి వేంకటకృష్ణశాస్త్రిగారు దీనిని విజయవంతముగా ప్రదర్శింపజేయగా శ్రీ స్వామివారు అదిచూచి తరువాత గేయనాటికలను ప్రయోగ దృక్పథముతో రచించి నారు. శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావుగారును స్వీయ

1. "కేవలము రేడియో ప్రసారమునుద్దేశించి పలువురు గేయనాటికలను రచించి యున్నారు. (కొందరు, అసలు రేడియో ప్రేరణము చేతనే నాటికా రచయితలైనారన్నను అతిశయోక్తి కాదు)" — డా॥ పి. ఎస్. ఆర్. అప్పారావుగారి 'తెలుగు నాటక వికాసము' (పుట 495)

"రేడియో అనేది పుట్టి ఉండకపోతే, అందులో మొదట తన అభిమానులూ స్నేహితులూ కార్యనిర్వాహకులుగా పనిచేస్తూ, తన చేత బలవంతాన రాయించి ఉండకపోతే తను అసలు నాటకాలు రాసి ఉండనేమో అని అంటుంటారు శాస్త్రిగారే' — కృష్ణశాస్త్రి నాటికల సంపుటి 'శర్మిష్ఠ'లో శ్రీ రజనీగారి 'ప్రశంస' పుటలు xv & xvi-శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి కవితా స్వర్ణోత్సవ సంపుటి (1975).

గేయనాటికలను కాశవాణిలో ప్రసారము చేయుటయేగాక వానిని రంగ స్థలముపై ప్రదర్శించిన ప్రయోక్తలుగా వాసికెక్కినారు. పాఠకుడు లేని పుస్తకము నిరర్థకము. ప్రయోగమునకు నోచుకోనని రూపకము దృశ్యకావ్య మనిపించుకొనదు. సామాన్య రూపక ప్రదర్శన విషయమెట్లున్నను గేయ నాటిక సాధారణముగా ప్రసార ప్రదర్శనములు చేయువారున్న నే కాని రచనా రూపమును పొందదు. ప్రయోగించుటకు అవకాశములు లభించునేమో అను ఆశతో కొన్ని గేయనాటికలు రచించినవారును, రచించుచున్న వారును లేకపోలేదు. శ్రీ శివశంకరస్వామివారు ఇవి పఠనయోగ్యములు కాకపోవని యును అభిప్రాయపడినారు.

సినీమా, రేడియో, టెలివిజన్ వంటి ప్రచార సాధనములవలన రానురాను యువతరములో సంగీతాభిలాష అధికతరమగుచున్నది. పాశ్చాత్యసంగీతమో, ప్రాచ్యసంగీతమో, ఈ రెంటి సమ్మిశ్రణమో లలిత సంగీతమో ఆదరమును పొందుచున్నవి. ప్రభుత్వమువారును స్వచ్ఛందసంస్థలవారును నిర్వహించుచున్న సంగీతనృత్య కళాశాలలో కళాభిలాషులైన విద్యార్థులందరికిని ప్రవేశము సుల భముగా లభించునంతటి పరిస్థితి ఏర్పడినది. అనతికాలములో నర్తకగాయకాభి నేతలనేకులు సుశిక్షితులై తమతమ కళావిన్యాసములతో సంఘములో ఉత్తమ కళాభిరుచులను కలిగింపకపోరు. సుశిక్షితులైనవారు అనేకులున్నప్పుడు కళల పరస్పర సమ్మేళనమునకు సంబంధించిన మాత్న ప్రయోగములును జరుగక మానవు. ప్రజాబాహుళ్యమునందును ఇప్పుడున్నంత నిరక్ష్యరాస్యత ఉండదు. నిరుద్యోగము కూడ ఉండదు. అపుడు గేయనాటిక సర్వాంగసుందరముగా వికాసమును పొందు అవకాశములు అతిమాత్రముగా కలుగగలవు. శ్రీ శివ శంకరస్వామివారు ఈ గేయనాటికా ప్రక్రియను హృదయవాదులైన కవులు సృష్టించిన ప్రక్రియగా పేర్కొన్నారు.

సంఘములో దారిద్ర్యము, నిరుద్యోగము, నిరాక్ష్యరాస్యత కొంత మేరకు నిర్మూలింపబడినచో కళావికసనము పట్ల ప్రజాబాహుళ్యమునకు అభి మానము హెచ్చుటకు అవకాశమున్నది. మిక్కిలి మనోహరమును సున్నితమును అయిన ఈ ప్రక్రియ మునుముందు తెలుగుదేశమునందే కాక యావద్భారతము

నందును హృదయవాదులైన కవుల సాహాయ్యముతో పెంపొందగలదనుటలో సందేహములేదు. నాటకములకంటెను తక్కువకాలమున ఎక్కువ ఆనందమును అందించు ఈ గేయనాటికా ప్రక్రియాభవితవ్యము సముజ్జ్వలముగా నుండు ననుట కేవలము ఊహ కాదు. యాథార్థ్యసందర్శనము.

గేయనాటికల స్వరూపస్వభావములను గూర్చియు వాని పుట్టుపూర్వోత్తరములను గూర్చియు నేను చేసిన ఈ సాహితీ ప్రయత్నము విద్వజ్జనామోదమును పొందగలదని ఆశించుచున్నాను.

''నాట్యం భిన్నరుచే ర్జనస్య బహుధా ప్యేకం సమారాధనమ్''

o — o

# అనుబంధము - 1 (క)

## శ్రీ శివశంకరస్వామివారితో గోష్ఠి

తెలుగులో గేయనాటికకు ఆద్యులైన శ్రీ శివశంకరస్వామివారిని 1974 లో ఒంగోలులో దర్శనము చేసికొన్నాను. నేనడిగిన ప్రశ్నలకు వారు దయతో సమాధానములను చెప్పినారు. ఆ గోష్ఠి వివరమును ఈ దిగువ ఉదాహరించు చున్నాను.

ప్రశ్న :- పాశ్చాత్య సాహిత్యాధ్యయనం వలననే ప్రభావితులై మీరు పద్య గేయ నాటికా రచనకు పూనుకున్నారని విమర్శకుల అభిప్రాయం. నిజమేనా ? మీపైన రవీంద్రుని నాటికల ప్రభావమేమైనా పడినదా?

సమా :- కాదు. సత్యలేశము మాత్రము లేదు. చిన్నప్పటినుంచి నాకు నాటకాలంటే ఇష్టం. పద్యభూయిష్ఠములైన సంస్కృత రూపకాలు, గీత గోవింద గీతగౌరీనాథాది గేయ కృతులు, తెలుగులోని యక్షగానాలు, రవీంద్రుని నాటికలే కాక- కొందరు పాశ్చాత్యుల రచనలు ముఖ్యముగా **Duestach land, Richard Wagner** వంటి వారి రచనలు, ఇటలీ ఓపెరాలు, ఇంగ్లాండులోని పిలిప్స్ రొడోల్ బెస్ ప్రభృతుల రచనల ప్రభావం లేకపోలేదు.

భక్తకవుల ప్రభావం ఉందంటే ఒప్పుకుంటాను. నారాయణతీర్థుల కృష్ణలీలా తరంగిణి నా గేయనాటికా రచనకు ఉపాదాన కారణమని నిశ్చయంగా చెప్పగలను పాశ్చాత్యుల రచనలు కొంత వరకు నిమిత్త కారణాలు.

1924 నుండి వాకోవాక్యములు, సంవాదములు, సల్లాపకములు రచిస్తూనే ఉన్నాను.

ప్రశ్న :- కేవలం గేయం మాత్రమే ప్రయోగించి రచించిన మీ నాటికలేవి?

సమా :- ఎనిమిది ఉన్నవి. వరపరీక్ష, యక్షరాత్రి, సహజయానసంధి, రాజజామాత, శోణకజాయ, పదాంకము, సద్వాక్యము, రత్నాకరము.

ప్రశ్న :- పద్యగేయ నాటిక లన్నప్పుడు పద్యనాటికలు, గేయనాటికలు అని వేర్వేరుగా గుర్తించాలా ? లేక పద్యాలు, గేయాలు రెండూ కలిపిన నాటిక లని గుర్తించాలా ? మీ అభిప్రాయం ?

సమా :- పద్యనాటికలు – గేయనాటికలు అని నా అభిప్రాయం. పద్యాలూ, గేయాలూ కలసిన నాటికలు అని కూడా చెప్పవచ్చు. "ఇష్టార్థ వ్యవచ్ఛిన్నా............" అన్నట్లు మీరెలా సమర్థించుకున్నా సరే సంక్షిప్తముగా శీర్షిక ఉండాలనే ఉద్దేశ్యంతో పద్యగేయనాటికలన్నాను.

ప్రశ్న :- మీరు ఏయే పద్యాలకు గేయత్వమున్నదని భావిస్తారు ? గేయత్వమున్నదనే కారణం చేతనేనా మీరు ఆ పద్యాలను గేయాలతో కలిపి ప్రయోగించినారు మీ నాటికల్లో ?

సమా :- కందం, తేటగీతి, ఆటవెలది మంజరీద్విపదలను విశేషంగా ప్రయోగించాను ఇవి పొట్టిగా ఉంటాయనే ప్రధానంగా తీసుకున్నాను వృత్తాలూ, సీసం సుదీర్ఘంగా ఉంటాయి.

ప్రశ్న :- సంస్కృతంలోని 'నాటికా' లక్షణాన్ని దృష్టిలో పెట్టుకొనే నాటికా రచనకు పూనుకొన్నారా? లేక సామాన్య రూపకంగానే వ్రాసినారా ?

సమా :- ఏ ప్రత్యేక నాటక లక్షణాన్ని దృష్టిలో పెట్టుకోలేదు. రంగములుగా చేశాను. అంతే.

ప్రశ్న :- మీరు స్వతంత్రంగా – అంటే ఎందులోనూ మూలం కొంచెం కూడా గ్రహించకుండా వ్రాసిన నాటిక లేవి ?

సమా :- రెండు పద్యావాక్యము, రత్నాకరము. ఇవి కేవలం ఉత్పాద్యములు.

ప్రశ్న :- గేయనాటికకు ప్రధానంగా ఉండవలసిన లక్షణాలేవి ?

సమా :- తత్క్షణమే హృదయంగమంగా ఉండే వస్తువుండవలె. సంస్కృత నాటకాలలో సామాన్య విషయాలు చెప్పుటకు వచనం వాడుతారు. ఉదాత్త భావము నుద్ఘాటించుటకు పద్యాలు వాడుతారు. భావావేశం కల్గినప్పుడు గేయప్రయోగం.

సుదీర్ఘంగా ఉండకూడదు. గంట-రెండు-గంటలు ఉంటే మంచిది. ఎంత మంచి విషయమైనా మూడు గంటలు దాటకూడదు. మృచ్ఛకటికం, మాలతీ మాధవం, బాలరామాయణం, మల్లికా మారుతం వంటి నాటకాలు ఒక్కొక్కటి రెండేసి రోజులు ఆడెడివారట.

ఎక్కువ పాత్రలుండకూడదు.

సుదీర్ఘ సంభాషణ పనికిరాదు.

స్వగతం, ఆకాశపంచాంగం విడువవలె.

క్రియ (**Action**) ప్రధానం కాదు. ఉన్ననూ ఉండవచ్చును. మారిస్ మేథర్ లింక్ **Static drama** ను ప్రయోగించాడు.

తొలి పదిహేను నిమిషాల్లో నాటిక రక్తికట్టాలి.

సంగీతం ఎక్కువ దీర్ఘంగా ఉండకూడదు.

ప్రశ్న :- గేయనాటికా ప్రదర్శన కృత్రిమంగా కనిపిస్తుందా ?

సమా :- కృత్రిమంగా ఏముంటుంది! ప్రదర్శించేవారి శక్తిపై ఆధారపడి ఉంటుంది. ఆమాటకొస్తే వ్యాకరణశాస్త్రం మాత్రం కృత్రిమం కాదా ? **I have done full justice to the whole art.**

ప్రశ్న :- నాటకరంగ స్థలాలే తక్కువగా ఉన్న మన తెలుగుదేశంలో గేయ నాటికల భవిష్యత్తు ఎలా ఉంటుందని మీరు భావిస్తారు ?

సమా :- ముందు ముందు వచ్చేవారి అభిరుచినిబట్టి ఉంటుంది. దానికి రంగ స్థలమెందుకు ?

సెట్టింగుల ఆర్భాటంగాని, **Scenic effect** గాని అక్కరలేదు. శబ్దంమీద, సంగీతంమీద ఆధారపడింది ఇది. వీనికై ప్రత్యేక రంగ స్థలం కట్టనక్కరలేదు అదిగో అరణ్యం అంటాడు నాటకాల్లో. ఉంటుందా అరణ్యం? అనుకోవాలె అంతే. పూలకుండిని పెద్ద అరణ్యం అంటారు. అంతే.

ప్రశ్న :- గేయనాటికా ప్రయోగ ప్రాచుర్యాలకు ప్రభుత్వం, ప్రజలు ఎలా తోడ్పడాలె ?

సమా :- ప్రజల ప్రోత్సాహం అండదండలు ఉంటూనే ఉంటాయి. కాని నాటక అకాడమీ వంటి సంస్థలు ఈ ప్రక్రియా ప్రాచుర్యానికి సముచితంగా తోడ్పడే అవకాశం ఉంది.

ప్రశ్న :- తెలుగుదేశంలో మీకంటె ముందు ఎవరైనా ఈ గేయనాటికా ప్రక్రియకు పూనుకున్నారా? లేక మీరే ఆద్యులా?

సమా :- నాకేం తెలియదు. నేనైతే ఎవరినీ చూడలేదు; అనుసరించలేదు. 1924 నుండి ఈ ప్రక్రియ నా మనసులో ఉంది. 1932లో 'పద్మావతీ చరణ చారణ చక్రవర్తి' జైల్లో వ్రాశాను. గేయనాటికా రచన ఎలా ఉన్నా - నాకు చిన్ననాటి నుండి నాటకాలంటే చాల ఇష్టం. 1899లో సత్తెనపల్లి ప్రాథమిక పాఠశాలలో చదువుతున్న రోజుల్లో నాటకాలు చూసేవాణ్ణి. **Front seat** లో కూచుంటేనే నాకు తృప్తిగా ఉండేది. 1921-22 లో తెనాలిలో రామవిలాస సభ నాట్యమండలికి **Chief director** గా ఉన్నాను. 1929లో నాటక కళాపరిషత్తు స్థాపించారు. దానికి నేను **Founder-member** గా ఉండి నాటక ప్రయోగాన్ని క్షుణ్ణంగా పరిశీలించగలిగాను. 1934 వరకు పరిషత్సభలకు హాజరవుతూ ఉండేవాణ్ణి.

'శ్రీకృష్ణ లీలాతరంగిణి' కర్తలు శ్రీ నారాయణ తీర్థుల వారు మా వంశానికి పూర్వపురుషులు.

ఈ ప్రక్రియకు నేను ఆద్యుణ్ణని పెద్దలందరూ అంటున్నారు. కావచ్చు.

ప్రశ్న :- మీ నాటికల్లో మీకు ప్రీతిపాత్రమైనదేది ?

సమా :- పద్మావతీ చరణ చారణ చక్రవర్తి.

ప్రశ్న :- గేయనాటికలు సాహిత్యంలో నిలువగలుగుతాయా ?

సమా :- తప్పకుండా. రచయిత శక్తిమీద ఆధారపడి ఉంటుంది. హృదయవాదులైన కవులు మాత్రమే ఈ ప్రక్రియను నిలబెట్టగలరు.

ప్రశ్న :- గేయనాటికా ప్రక్రియ ఎందుకు ?

సమా :- అన్నీ ఉన్నాయి ప్రపంచంలో. ఇది కూడా ఉండాలని. ఆడవలసిన అగత్యంలేదు చదువుకోనూ వచ్చు - **Closet drama** గా.

ప్రశ్న :- ప్రదర్శనను ఉద్దేశించి వ్రాసినారా ?

సమా :- మొదట ఆ ఉద్దేశం లేదు. పాఠ్యమనే అనుకున్నాను. కాని నా 'పద్మావతీ చరణ చారణ చక్రవర్తి' ని కవిసత్తములైన శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు బాగా కృషిచేసి ప్రదర్శనలు చేయించారు. అది చూచిన తరువాత ప్రదర్శన యోగ్యంగానే వ్రాస్తూ వచ్చాను. 'సహజయాన పంథి' లోని కొన్ని రంగాలను శ్రీ మొక్కపాటి వరసింహశాస్త్రిగారు ప్రదర్శన చేయించారు. నాకు బాగున్నట్లు తోచింది. ఈ ప్రదర్శనకు శ్రీ బళ్ళారి రాఘవాచార్యులవారు కూడా వచ్చారు.

ప్రశ్న :- రాగాలను మార్చడమెందుకు ?

సమా :- ఆయా ఘట్టాల్లో ఉండే భావాలను రమ్యంగా వ్యక్తీకరించడానికి

# అనుబంధము - 1 (ఖ)

## శ్రీ శివశంకరస్వామి వారికి వా లేఖ

బ్రహ్మశ్రీ శివశంకర స్వాములు దివ్యచరణసన్నిధికి
అభివాదములు.

ఈశ్వరానుగ్రహమున మీకిప్పుడు స్వస్థత చేకూరినదని నమ్ముచున్నాను. మీ ఆశీస్సుల ప్రభావమువలన క్షేమముగా నున్నాను. ఇంత దీర్ఘ కాలము తరువాత మీకు లేఖ వ్రాయుచున్నందుకు క్షంతవ్యుడను. 1974లో మీ దర్శన సంభాషణములవలన నాకు కలిగిన స్ఫూర్తితో 'తెలుగులో గేయనాటిక' లను గూర్చి పరిశోధనను కొనసాగించుచున్నాను. తెలుగు గేయనాటికా రచనకు మీరు ఆద్యులని నిర్ణయించియున్నాను. మీ రచనల పౌర్వాపర్యములను పరిశీలించిన మీవట 'పలితకేశము' పరిమాణమున చిన్నదైనను గేయనాటికా లక్షణములన్నింటిని సంతరించుకొన్న రచనగా నాకు తోచినది. ఇది ముత్యాలసరములతో మూడు పాత్రలతో సాగిన రచన. ఇది 1930లో వెలువడినట్లు మీ షష్టిపూర్తి సందర్భమున ప్రచురింపబడిన ప్రథమసంపుటిలో నున్నది. మీరు రచించిన సంపూర్ణ గేయనాటికలను పేర్కొనవలసినదిగా నేనర్థించినపుడు మీరు 'వరపరీక్ష'ను ముందుగా పేర్కొనినారు. కాని 'వరపరీక్ష' 1936లో వచ్చినట్లు డా॥ పి. ఎస్. ఆర్. అప్పారావుగారు తమ సిద్ధాంతగ్రంథమునందు ఉట్టంకించియున్నారు. అల్పజ్ఞుడనైన నాకు ఇట్టియెడ విచికిత్స ఏర్పడినది. మొదటి గేయనాటిక 'పలితకేశమా'? లేక 'వరపరీక్ష'యా? షష్టిపూర్తి సంపుటములలో ద్వితీయ సంపుటియందు రచనాకాలములు లేవు. మరి శ్రీ అప్పారావుగారేమో 'వరపరీక్ష' 1936లో వచ్చినదనిరి. వారట్లన్నను 'పలితకేశము' 1930లో వచ్చినది గదా! కనుక 'పలితకేశము' మొట్టమొదటి గేయనాటికయని నేను ఊహించుటలో విప్రతిపత్తి లేదనుకొందును. మీరు బహుకార్యనిమగ్నులు. మీరు అన్యథా తలంచక నా ఈ సందేహమును తీర్చి మీ ప్రప్రథమ సంపూర్ణ గేయనాటిక యేదో తెలుపగలరని అభ్యర్థించుచున్నాను. ఈ సందేహము వలన నా పరిశోధనలో ప్రతిష్టంభమేర్పడినది. దయయుంచి ఇందువెంట జతపరచిన 'కవరు'లో మీ సమాధానము వ్రాసి పంపగలరు.

నవ్య సాహిత్యసమితి ద్వారమున ఎందరినో ఉత్తమ రచయితలుగా తీర్చి దిద్దిన మీ మహోదారవ్యక్తిత్వమే నావంటివానికిని పథనిర్దేశియై నన్ను కృతకృత్యుని జేయునను ప్రత్యయముతోనున్నాను. ఆనాడు ఆరోగ్యము సరిగా లేకున్నను నా వంటి అపరిచితుడు వేసిన ప్రశ్నలకన్నింటికిని సమాధానములిచ్చి నన్ను ప్రోత్సహించిన తీరు తలపునకు వచ్చునపుడెల్ల గగుర్పాటు కలుగుచుండును. భవాదృశుల దర్శనమాత్రముచేతనే ప్రతిభోద్గమమగునను పరమసత్యమును నే ననుభవించియుంటిని.

మీ ఆశీరమృతప్రభావముతో తెలుగు గేయనాటికలపై నేను చేయుచున్న పరిశోధనను నిర్విఘ్నముగా పూర్తిచేసి మిమ్ము దర్శించుటకు ఉత్సాహపడుచున్నాను ఆ పుణ్యవిశేషము నాకు లభ్యమగుననియే నా దృఢవిశ్వాసము.

నమస్సుమములతో

మీ విధేయుడు,

తిరుమల శ్రీనివాసాచార్యులు.

# అనుబంధము - 1 (గ)

## శ్రీ శివశంకరస్వామివారి ప్రత్యుత్తరము

సీతారామపురము
ఒంగోలు - 1.
**PINCODE [523 001]**
**March - 10**

ఆశీః

అయిదు వారాలు పర్యటనచేసి నిన్నరాత్రి ఒంగోలు చేరినాను. హృదయం గమమైన మీ మధుర (లేఖ) చూచినాను......................

మీ **thesis** పూర్తికావచ్చినందుకు సంతోషము!

"పలితకేశము" (1930) : దీనిని మీరు గేయనాటికా లక్షణాలు ఉండడం చేత నా ప్రథ(మ) గేయనాటికగా నిర్ణయించినట్టు వ్రాసినారు. 1924లో రచించిన "శిష్యురాలు"— ఈ లక్షణాలను బట్టి గేయనాటిక అవుతుందేమో చూడండి. నేను మే నెలలో హైదరాబాద రావాలి. అపుడు మీ **thesis** పూర్తిగా వింటాను. నోరి నరసింహశాస్త్రిగారు డాక్టరు మాధవశర్మ సమ్మాన సంచికలో నా నాటికలను గూర్చి వ్యాసము వ్రాసినారు. చూడండి. కుమారి మంగళగిరి ప్రమీలారాణి గేయనాటికల మీద వ్రాసిన గ్రంథము చూచే ఉంటారు.

పి. గణపతిశాస్త్రిగారు పూర్వము (బహుశా 1942—43 కృష్ణాపత్రికలలో) నా నాటికల మీద వ్యాసములు వ్రాసినారు చూడండి.

నేను మే, జూన్ నెలలో అటువైపు వచ్చినపుడు ఎక్కడ దిగుతానో మీకు ముందుగా వ్రాస్తాను. మీరు వచ్చి **thesis** వినిపించవచ్చును. ఆరోగ్యము ఇంకా బాగుపడలేదు వైశాఖమాసానికి నేను నడవగలనని విశ్వాసము. పైన భగవత్కటాక్షము!

.................. ..........................................

మారినపుడల్లా మీ చిరునామా నాకు తెలుపుతూ ఉండండి.
శుభం భూయాత్! ఇతి శివమ్!

(సం) శ్రీ శివశంకరస్వామి

# అనుబంధము - 2

## గేయనాటికలు - రచయితలు

(సంకేతములు :- 'ర'-రచనాకాలము; 'ప్రచు' - ప్రచురణకాలము; 'ప్రసా'-ప్రసారకాలము, 'ప్రద' - ప్రదర్శనకాలము; 'బా.నా'-బాలల గేయ నాటిక.)

| | | |
|---|---|---|
| శిష్యురాలు | శ్రీ గల్లావజ్ఝల శివశంకరస్వామి | (ర) 1924 |
| పలితకేశము | ,, | ,, 1930 |
| గురుశిష్యులు | ,, | ,, 1930 |
| పద్మావతీ చరణ చారణ చక్రవర్తి | ,, | ,, 1932-33 |
| వరపరీక్ష | ,, | ,, 1935-36 |
| అశరీరవాణి | ,, | ,, 1936 |
| మృగతృష్ణ | ,, | ,, 1936 |
| అదృష్టదేవత | ,, | ,, 1936 |
| ప్రభువాక్యము | ,, | ,, 1936 |
| రత్నాకరము | , | ,, 1938-39 |
| యక్షరాత్రి | ,, | ,, 1939 |
| రాజజామాత | ,, | ,, 1939 |
| నౌకజాయ | ,, | ,, 1939 |
| సహజయానసంధి | ,, | , 1939 |
| దీక్షితదుహిత | ,, | ,, 1939 |
| కవిప్రియ | , | ,, 1940 |
| వ్రతభంగము | ,, | ,, 1942 |
| ఉజ్జీవము (అలబ్ధము) | ,, | ,, 1942 |
| పదాంకము | ,, | ,, 1950 |
| సద్వాక్యము | ,, | ,, 1950 |
| ప్రభావతి పగటి కలలు (అలబ్ధము) | ,, | ,, 1973 |

| | | |
|---|---|---|
| ఉపస్విని | శ్రీ మల్లవరపు విశ్వేశ్వరరావు | (ప్రచు) 1945 |
| వరూధిని | ,, | ,, 1945 |
| కృష్ణాపుష్కరం | ,, | (ప్రసా) 14-10-1958 |
| మహిషాసురమర్దని | ,, | ,, 15-9-1960 |
| నృత్యనాట్య చిత్రాంగద | ,, | (ప్రచు) 1961 |
| తుమ్మెద | ,, | — |
| భూమిదానం | ,, | — |
| సుగాత్రి | ,, | — |
| తపతీసంవరణము | ,, | — |
| ప్రమద్వర | ,, | (ప్రసా) 14-3-'64 |
| ముగ్గులరథం | , | — |
| గాజుల బేహారి | ,, | — |
| వధూసగ | శ్రీ వావిలాల సోమయాజులు | (ప్రచు) 1939 |
| ధర్మఘంటిక | ,, | — |
| సౌగంధిక | ,, | (ర) 1942 |
| సంక్రాంతి | ,, | (ప్రద) 17-1 1957 |
| నిర్ణేత | ,, | — |
| తోడేలు-మేకపిల్ల (బా.నా) | శ్రీ న్యాయపతి రాఘవరావు | (ర) 1942 |
| పొట్టిబావ-చిట్టిమరదలు ,, | ,, | ,, 1943 |
| వేగుచుక్క ,, | ,, | ,, 1947 |
| పూర్ణమ్మకథ ,, | ,, | ,, 1950 |
| నాన్నపులి ,, | ,, | ,, 1951 |
| పాలరాయి ,, | ,, | — |
| శ్రీరామ జననము ,, | ,, | (ర) 1956 |
| కుంటి-గ్రుడ్డి ,, | ,, | ,, 1956 |
| దోమ-దీపము ,, | ,, | — |
| మురళీ-మంత్రగాడు (పిల్లనగ్రోవి పిలిచెనదిగో) | ,, | (ర) 1956 |
| కుందేలు-తాబేలు (బా.నా) | ,, | — |

| | | | | |
|---|---|---|---|---|
| బొమ్మలపెళ్లి ('మంగాయిపెళ్ళిళ్ళు' | సంపుటి) | శ్రీ న్యాయపతి రాఘవరావు | (సంపుటి ప్రచు) | 1970 |
| చిలుకమ్మ పెళ్ళి | | ,, | ,, | ,, |
| ఎలుకమ్మ పెళ్ళి (బా నా) | | ,, | ,, | ,, |
| అల్లీముతా (నేటినటుడు వగైరా | సంపుటి) | శ్రీ కొప్పరపు సుబ్బారావు | (ప్రచు) | 1944 |
| నాగార్జునకొండ | (అలబ్ధము) | శ్రీ వేమూరి వేంకటరామనాథం | (ర) | 1945 |
| నివేదన | ,, | ,, | ,, | ,, |
| కామిని | ,, | ,, | ,, | 1953 |
| మీనకన్య | ,, | ,, | ,, | 1954 |
| మరో ప్రపంచం | | శ్రీ శ్రీరంగం శ్రీనివాసరావు (శ్రీ శ్రీ) | (ప్రసా) | — |
| భూతాల కొలిమి | | ,, | | — |
| చరిత్ర చెప్పని సందేశం | | ,, | (ప్రచు) | 1946 |
| శిరస్సు చెప్పిన రహస్యం | | ,, | (ప్రసా) | 31-8-1949 |
| సుప్తాస్థికలు | | ,, | (ప్రచు) | 1948 |
| మోహినీ రుక్మాంగద | (అలబ్ధము) | ,, | | — |
| జన్మోత్సవం | | శ్రీ విద్వాన్ ప్రయాగ కోదండ రామశాస్త్రి | (ప్రసా) | 1949 |
| పునరాగమనం | | ,, | ,, | 1953 |
| అభ్యుదయం | | ,, | (ర) | 1953 |
| సంక్రాంతి | | ,, | ,, | 1954 |
| సస్యశ్యామలం | | ,, | (ప్రసా) | 23-10-'54 |
| స్వాగతగీతి | | డా॥ నాయని కృష్ణకుమారి | (ప్రచు) | 1948 |
| రాష్ట్రరథం (అలబ్ధము) | | ,, | | — |
| చిలుక తల్లిపుట్టింది (అలబ్ధము) | | ,, | | — |
| నవ్వని పువ్వు (సంపుటి) | | డా॥ సి. నారాయణరెడ్డి | (సంపుటి ప్రచు) | 1953 |
| వలపురేకు | ,, | ,, | ,, | ,, |
| దగ్ధశాంతి | ,, | ,, | ,, | ,, |

| | | | |
|---|---|---|---|
| భిన్నస్వరాలు | డా॥ సి. నారాయణరెడ్డి | (ప్రచు) | 1953 |
| కోటకల్లి (సమతాఫలం) (శ్రా. నా.) | ,, | (ప్రచు) | 1953 |
| అజంతా సుందరి (సంపుటి) | ,, | (సంపుటి ప్రచు) | 1955 |
| సుగాత్రి | ,, | ,, | ,, |
| ఋతువుల రాణి ,, | ,, | ,, | ,, |
| వెన్నెలవాడ (సంపుటి) | | ,, (ప్రచు) | 1959 |
| దివ్వెలసంగీతం ,, | ,, | ,, | ,, |
| సంక్రాంతి ,, | ,, | ,, | ,, |
| గోకుల విహారం ,, | ,, | ,, | ,, |
| మనిషి-యంత్రం ,, | ,, | ,, | ,, |
| హరిచరణదాసి మీరా | ,, | (ప్రసా) | 15-7-59 |
| వసంతలక్ష్మి | ,, | | — |
| రామప్ప | ,, | (ప్రచు) | 1960 |
| తరతరాల తెలుగువెలుగు | ,, | (ప్రచు) | 1975 |
| నాడు-నేడు (అలభ్యము) | ,, | | — |
| 'నా దేశం భగవద్గీత' (సినిమా గేయ నాటిక) | ,, | | — |
| సారంగధర | ,, | | — |
| శాకుంతలం (సినిమా గేయ నాటిక) | ,, | | — |
| 'విద్యార్థులు నవసమాజ నిర్మాతలురా' (సినిమా గేయనాటిక) | ,, | | — |
| వాసవదత్త ,, | ,, | | — |
| వరూధిని ,, | ,, | | — |
| క్రైస్-క్రైలా ,, | ,, | | — |
| వెన్నెల మడుగులు (శ్రా. నా) (అలభ్యము) | డా॥ దాశరథి | (ప్రచు) | 1953 |
| మహాశ్వేత ,, | ,, | | 1955 |
| రాధప్రేమ ,, | ,, | (ప్రసా) | 28-9-56 |
| మహోదయం (అలభ్యము) | ,, | | — |

| | | | |
|---|---|---|---|
| సాయుజ్యము (సంపుటి) | శ్రీ దేవులపల్లి వేంకట కృష్ణశాస్త్రి | (స్వర్ణోత్సవ సంపుటి ప్రచు) | 1975 |
| గుహుడు ,, | ,, | ,, | ,, |
| శివక్షేత్రయాత్ర ,, | ,, | ,, | ,, |
| శ్రీ ఆండాళ్ళు ('తిరుప్పావు' సంపుటి) | ,, | ,, | ,, |
| శర్మిష్ఠ (సంపుటి) | ,, | ,, | ,, |
| కృష్ణాష్టమి ,, | ,, | ,, | ,, |
| యమునా విహారి ,, | ,, | ,, | ,, |
| పడాది పొడుగునా ,, | ,, | ,, | ,, |
| గౌతమి ,, | ,, | ,, | ,, |
| వేణుకుంజం ,, | ,, | ,, | ,, |
| పల్లెపట్టు (అలబ్ధము) | డా॥ బి. రామరాజు | (ప్రసా) | — |
| రాగహృదయం | ఆచారి–ఉపశ్రీ | (పచు) | 1957 |
| రైతురాజు | శ్రీ వానమామలై వరదాచార్యులు | (ప్రచు) | 1957 |
| సంక్రాంతి (అముద్రితము) | ,, | | — |
| పెద్దలచదువు ,, | ,, | | — |
| అడుగో రాములు వస్తున్నారు | శ్రీ రావూరు వెంకట సత్యనారాయణరావు | ప్రసా | 27-3-'57 |
| చందమామ వచ్చింది | ,, | (ప్రచు) | 1976 |
| శాంతిపథము | శ్రీ జి. రాములు | (ప్రచు) | 1958 |
| పద్మరాగం | శ్రీ లంకా సూర్యనారాయణరావు ('లసూనా') | (ప్రద) | 9-5-1960 |
| యుగాది | .. | (ప్రచు) | 1961 |
| లవణరాజుకల | .. | ప్రద | 8-10-'67 |
| గీతగోవిందం | .. | (ప్రచు) | 1963 |
| వరూధిని (అముద్రితము) | .. | | — |
| అల్లరిపిల్లలు (బా.నా) | శ్రీ లవణం | (ప్రచు) | 1959 |

| | | | |
|---|---|---|---|
| ఆమ్రమ (నాటికలు-సంపుటి) | శ్రీ సూరంపూడి భాస్కరరావు | (ప్రచు) | — |
| కవి | .. | .. | .. |
| శునశ్శేపుడు | .. | .. | .. |
| ప్రత్యభిజ్ఞ .. | .. | .. | . |
| మహాశ్వేత .. | .. | .. | .. |
| ఎంకి అలక (ఆల్బము) | శ్రీ పాలగుమ్మి విశ్వనాథం | (ప్రసా) | 1958 |
| కిన్నెరసాని .. | .. | ప్రసా | — |
| సంగీతపు చెట్టు | .. | (ప్రసా) | — |
| నాగార్జునసాగర్ | .. | .. | — |
| స్వేదబిందువు | . | .. | — |
| మాపల్లె కదిలింది | .. | .. | — |
| వానకారుదోర | .. | .. | — |
| పాటలశేషమ్మ | .. | .. | — |
| ప్రియదర్శి (బా నా) | శ్రీ బి. వి. నరసింహారావు | (ప్రచు) | 1960 |
| కొండమీదిఇల్లు .. | .. | .. | .. |
| గులాబీలు .. | .. | .. | 1977 |
| మిథిల | శ్రీ జంధ్యాల పాపయ్య శాస్త్రి ('కరుణశ్రీ') | (ప్రసా) | 1-4-1960 |
| అమరావతి | .. | .. | 8-4-1961 |
| మువ్వ | .. | .. | 1-9.1961 |
| సీత | .. | (ప్రచు) | 1961 |
| శైలజ | .. | (ప్రసా) | 22-12-'62 |
| రుద్రమదేవి | .. | .. | 26-5-'63 |
| కరుణామయి | . | .. | 20-4-'64 |
| ఒకే కంఠం | .. | .. | 20-10-'64 |
| పచ్చని ఆమని వచ్చింది | .. | .. | 2-4-'65 |
| గేయ సాహిత్యంలో గాంధీజీ | . | . | 1-12-'69 |
| ప్రగతి పథం | .. | .. | 15-8-1970 |

| | | | | |
|---|---|---|---|---|
| ఆవు-దూడా | | శ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రి ('కరుణశ్రీ') | (ప్రసా) | 1972 |
| లక్ష్మీగణప | | .. | | — |
| దేవుని బిడ్డలు | | . | | — |
| అప్సరస (సంపుటి) | | డా॥ యస్వీ జోగారావు | (సంపుటి ప్రచు) | 1961 |
| సుమబాణము | | . | .. | . |
| సాక్షాత్కారము | | . | .. | .. |
| అవిముక్తము | | .. | .. | .. |
| అశ్వఘోషుడు | | డా॥ అప్పిరాల విశ్వం | (ప్రచు) | 1962 |
| చుక్కలు-రెక్కలు (పాపాయి తువ్వాయి సంపుటి, బా.నా) | | శ్రీ యం ప్రభాకరరావు | (ప్రచు) | 1962 |
| తల్లి-బిడ్డ | .. | .. | . | .. |
| జాలరిబాల | .. | .. | .. | . |
| తుమ్మెదలు-తేనెటీగలు .. | | .. | .. | .. |
| బృందావనిమంజీరాలు (సంపుటి) | | శ్రీ కోలిపాక మధుసూదనరావు | (ప్రచు) | 1962 |
| సౌగంధిక | . | . | .. | .. |
| ఉమామూర్తి | .. | .. | . | .. |
| నవశక్తి | | శ్రీ కందుకూరి రామభద్రరావు | (ప్రసా) | — |
| దీపమాల (అలబ్ధము) | | .. | . | — |
| వసంతశోభ . | | .. | .. | — |
| హేమసుందరలక్ష్మి .. | | .. | .. | — |
| నరకాసురవధ . | | .. | .. | — |
| విజయాంబిక . | | .. | .. | — |
| కృష్ణా గోదావరి . | | .. | .. | — |
| పచ్చతోరణం (అలబ్ధము) | | శ్రీ ఓలేటి సుబ్బారావు ('శశాంక') | (ప్రసా) | — |
| దీపలక్ష్మి | . | .. | .. | — |
| నల్లనయ్య | .. | . | .. | — |
| వసంతశోభ | .. | .. | .. | — |

| | | | |
|---|---|---|---|
| మేనక (అముద్రితము) | శ్రీ ప్రతివాది [illegible] | | — |
| రాసలీల .. | .. | | — |
| [illegible] (అముద్రితము) | డా॥ పేటూరి [illegible] | | — |
| చైతన్యరంగం .. | . | | — |
| గోడగూచి . | .. | | — |
| అంబాపాలి .. | | (ప్రసా) | — |
| షాజీ-హాజీ .. | .. | | — |
| [illegible] | .. | (ప్రసా) | 10-4 76 |
| వేమ యోగిని | శ్రీ నముగంటి నరసింహాచార్యులు | | — |
| రాధామాధవము | శ్రీ జి. విద్యాసాగర్ | | — |
| అనార్కలి (అముద్రితము) | శ్రీమతి దర్భా భాస్కరమ్మ | | — |
| మాయలేడి .. | .. | | — |
| పారిజాతము .. | . | | — |
| శకుంతల . | .. | | — |
| దేవాలయ ప్రవేశము . | .. | | — |
| నలదౌత్యము . (అలబ్ధము) | .. | | — |
| తోడేలు-గొర్రెపిల్ల (బా.నా) | శ్రీ చింతా [illegible]రావు | (ప్రచు) | 1963 |
| తాతా-మనుమడు .. | శ్రీ వల్లభనేని కాశీవిశ్వనాథము | (ప్రచు) | 1964 |
| అమ్మా-కొడుకు .. | .. | .. | .. |
| భాగ్యనగరం . | శ్రీ నార్ల చిరంజీవి | (ర) | 1965 |
| మేఘసందేశం (అలబ్ధము) | .. | (ప్రసా) | — |
| బాలవికాసం (బా.నా) | శ్రీ [illegible]ంజమూరి శివరామారావు | (ప్రద) | 22-4-'66 |
| శ్రీ వాసవి కన్యకా పరమేశ్వరి | .. | | — |
| శ్రీ రామరాజ్యం | . | | — |
| మేనక | .. | | — |
| నాగార్జున సాగర్ (అలబ్ధము) | .. | | — |

| | | | |
|---|---|---|---|
| సాలీడు-ఈగ ('గేయకథలు' సంపుటి, బా.నా) | శ్రీ సమంతారావు | (ప్రచు) | 1967 |
| పండుగనాడు .. | .. | ,, | ,, |
| నక్కగారి అక్కసు .. | .. | ,, | ,, |
| రాముడు-చంద్రుడు . | .. | ,, | , |
| చట్టప్రకారం .. | . | ,, | ,, |
| జ్యోత్స్నాభిసారిక (నృత్యనాటికలు, సంపుటి, బా నా) | డా॥ నండూరి రామకృష్ణమాచార్య | (ప్రచు) | 1969 |
| గోదావరి .. | .. | .. | .. |
| ఉలూచి (అముద్రితము) | శ్రీ టి. రామకృష్ణారెడ్డి | (ప్రసా) | 27-9-'68 |
| ఉమర్ ఖయ్యాం .. | .. | (ర) | 1969 |
| మేనక .. | .. | .. | 1969 |
| కలువరాణి .. | .. | . | 19 9 |
| ఊర్వశి .. | .. | .. | 1970 |
| స్వప్నబాల | .. | (ప్రచు) | 1971 |
| ఏకావళి (అముద్రితము) | .. | .. | 1972 |
| రాసలీల .. | .. | | — |
| యశోద-కృష్ణుడు (బా.నా) | శ్రీమతి గంగరాజు సుశీలాదేవి | | — |
| ఋతురాగం ('బాపురెడ్డి గేయనాటికలు' సంపుటి, | శ్రీ జె. బాపురెడ్డి | (ప్రచు) | 1970 |
| సాగరసౌధం .. | . | .. | . |
| భావిజీవులు .. | .. | .. | . |
| విజయహేల .. | | .. | .. |
| కల్యాణయాత్ర .. | .. | .. | .. |
| రాకెట్టు రాయబారం .. | .. | .. | .. |
| చాచా నెహ్రూ .. | .. | .. | 1973 |

| | | | |
|---|---|---|---|
| యన్. జీ. వో. ('బాపురెడ్డి గేయ నాటికలు' సంపుటి) | శ్రీ జె. బాపురెడ్డి | (ప్రచు) | 1973 |
| విజయవీణ | . | (ప్రసా) | 14-10-'75 |
| ప్రజావిజయం | .. | (ప్రచు) | 1976 |
| భారతరాణి (సంపుటి) | శ్రీ అందె వేంకట రాజము | (ప్రచు) | 1971 |
| సమత | .. | .. | .. |
| శివరాత్రి (అముద్రితము) | శ్రీ చిట్టిమల్లె శంకరయ్య ('రుద్రశ్రీ') | — | |
| నరకం నుండి స్వర్గానికి (అముద్రితము) | .. | (ర) | 1971 |
| గొడ్డళ్ళు లేవాల | శ్రీ దేవిప్రియ | (ప్రచు) | 1972 |
| స్వతంత్ర బంగ్లా | శ్రీ ఎం. కె. రాము | (ప్రచు) | 1972 |
| సహజీవనం | . | (ప్రద) | 1973 |
| హంసదూత్యము (సంపుటి) | .. | (ప్రచు) | 1974 |
| కృష్ణభక్తి | .. | .. | .. |
| గిరికా పరిణయము | . | (ప్రద) | 1974 |
| మోహినీ భస్మాసుర | .. | .. | 1975 |
| శకుంతల | .. | .. | 1976 |
| బాలికేక | .. | .. | .. |
| తారకాసుర సంహారము | .. | .. | 1977 |
| గంగా-కావేరి (సంపుటి) | శ్రీ రెడ్డి చినవెంకటరెడ్డి | (ప్రచు) | 1973 |
| విశ్వాంతర్యామి | .. | .. | .. |
| భూదేవి | .. | .. | .. |
| శాంతి | .. | .. | .. |
| అంతా ఒకటే | .. | .. | .. |
| స్వాతంత్ర్యం వచ్చాక | శ్రీ బి. రాములు | (ప్రచు) | 1974 |
| విజయక్రాంతి | శ్రీ వల్లభాపురం జనార్దన్ | (ప్రచు) | 1974 |

# అనుబంధము - 3

## ఉపయుక్తగ్రంథములు


**సంస్కృతము**

అగ్నిపురాణము

అమరకోశము (లింగాభట్టీయసహిత బాలప్రబోధిని)

ఆంధ్ర వేదములు - అనువాదములు : బ[illegible]మల్లయ్యశాస్త్రి

కావ్యానుశాసనము - హేమచంద్రుడు.

ధనంజయుని దశరూపకము - వ్యాఖ్యాత విద్వాన్ సరిపెల్ల విశ్వనాథశాస్త్రి

నాట్యశాస్త్రము - భరతుడు (పండిత కేదారనాథ సంపాదితము)

నాట్యశాస్త్రము - శ్రీమదభినవగుప్త వృత్తిసమేతము

నృత్తరత్నావళి - జాయసేనాపతి తెలుగు అనువాదము : రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మ

భగవద్గీత

భావప్రకాశనము - శారదాతనయుడు భావాలోకము అను అనువాదము : జమ్ములమడక మాధవరామశర్మ.

శ్రీమద్రామాయణము - వాల్మీకి

సంగీతరత్నాకరము - శార్ఙ్గదేవుడు - తెలుగు అనువాదము : [illegible] శ్రీరామమూర్తి.

సాహిత్యదర్పణము - విశ్వనాథుడు - హిందీ వ్యాఖ్యానము : డా॥ సత్యవ్రత సింహ.

**తెలుగు**

అక్షరార్చన - డా॥ పాటిబండ మాధవశర్మ షష్టిపూర్తి సంచిక

అప్పకవీయము - కాకునూరి అప్పకవి.

ఆంగ్ల సాహిత్య చరిత్ర - గోపరాజు సాంబశివరావు

ఆంధ్రకేసరి ప్రకాశం శతజయంత్యుత్సవ సంచిక

ఆంధ్ర నాటక రంగచరిత్ర - మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి

ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర-డా॥ యస్వీ జోగారావు

ఆంధ్ర వాఙ్మయ చరిత్రము-డా॥ దివాకర్ల వేంకటావధాని

ఆంధ్ర వాచస్పత్యము (నిఘంటువు) కొట్ర శ్యామలకామశాస్త్రి

ఆంధ్రుల నాట్యకళ-నటరాజ రామకృష్ణ

ఆంధ్రుల సంగీతకళ-మంచాళ జగన్నాథరావు

ఆధునికాంధ్రకవిత్వము - సంప్రదాయములు - ప్రయోగములు - డా॥ సి. నారాయణరెడ్డి.

కళాపూర్ణోదయము-పింగళి సూరన

కాటమరాజు కథ-గుంగుల పినయెల్లయ

కావ్యాలంకార సంగ్రహము-భట్టుమూర్తి : వివరణ కర్త : సన్నిధానము సూర్యనారాయణ శాస్త్రి

తెలుగు ఛందోవికాసము-సంపత్కుమార.

తెలుగు జానపద గేయసాహిత్యము-డా॥ బి. రామరాజు

తెలుగు నాటకరంగం-ప్రత్యేకసంచిక.

తెలుగు నాటకవికాసము-డా॥ పోణంగి శ్రీరామ అప్పారావు

తెలుగులో పద్యగేయనాటికలు-మంగళగిరి ప్రమీలాదేవి.

నాటకోపన్యాసములు-రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ.

నాట్యశాస్త్రము. అనువాదము (గుప్తభావప్రకాశికాసహితము) పోణంగి శ్రీరామ అప్పారావు.

బాలభారతి-సంకలనం: వెలగా వెంకటప్పయ్య

బుద్ధకథలు-సదీరా

మాలతీమాల-పానుగంటి లక్ష్మీనరసింహారావు

లక్షణసారసంగ్రహము-చిత్రకవి పెద్దన

వాగ్గేయకారులు-పదకృతి సాహిత్యము-పుట్టపర్తి నారాయణాచార్యులు

విశిష్ట సభ్యుల ప్రశంస-డా॥ దివాకర్ల వేంకటావధాని

సాహిత్యశిల్ప సమీక్ష-పింగళి లక్ష్మీకాంతం

సాహితీసుగతుని స్వగతం - తిరుమల రామచంద్ర

సీతా కళ్యాణము (యక్షగాన నాటకము)- శ్రీశాహమహారాజు సంపాదకులు : డా॥ దివాకర్ల వేంకటావధాని.

సుగ్రీవ విజయము (యక్షగానము) కర్త : కందుకూరి రుద్రకవి ; పీఠికా కర్త : డా॥ జి.వి. సుబ్రహ్మణ్యం

## ఇంగ్లీషు

An English-Telugu dictionary-P. Sankaranarayana, Revised and enlarged by Gidugu Sitapati et al, V. Rama swamy Sastrulu&Sons (Madras) 1972

Chambers 20th Century Dictionary, ed-Willam Geddie Allied Publishers Pvt Ltd (New Delhi) 1970

Every man's Encyclopaedia (vol 9), ed. EF. Bozman, J.M. Dent and Sons Ltd (London) 1967

The Concise Oxford Dictionary of Current English, ed H.W. Fowler and F.G. Fowler Oxford Uulversity Press (Calcutta) 1968

The Encyclopaedia Britannica (Vol. 20) 13th edition, The Encyclopaedia Britannica Company Ltd (New York), 1926.

The Hamlyn Junior Encyclopaedia in Coloured Kenneth Bailey (Indian edition) B. Hamlyn Publishing Group Ltd (London) for Mac Millan company of India, 1972.

The Merchant of Venice-William Shakespeare, ed P. Lal, educational Publishers and Book sellers (Delhi), 1951.

The Mind and Art of Sivasankara sastri (Manuscript) - Prof. Potukuchi Subramanya Sastri

The Oxford Companian to the Theatre, ed. Phyllis Hartnoll Oxford University Press (London) 1951

The Shorter Oxford English Dictionary (Vol II) ed. vew. e. T. Onions, Oxford University Press (London) 1973

The Theatre of Hindus : H.H. Wilson, Indological Book House (Bombay), 1972

We bstersSeventh New Collegiate Dictionary (Indian edition) Scientific Book Agency (Calcutta),. 1971

**హిందీ**

హిందీ నాటక్-ఉద్భవ్ ఔర్ వికాస్ : ఆచార్య దశరథ్ ఓఝా

**ఉర్దూ**

ఉర్దూ డ్రామా-రివాయత్ ఔర్ తజ్రుబా : డా॥ అత్యానిషాత్.